శ్రీ

# భీమేశ్వర పురాణము

శ్రీనాథుడు

టీకాకారరచయిత

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# ప్రకాశకుల విజ్ఞప్తి

మన ప్రాచీనాంధ్ర గ్రంథములలో ప్రధానములైనవి కొన్ని పాఠభేదములు సరిచూసించి ప్రకటించవలెనని మాకు మిక్కిలి యభిలాష యున్నది. ఈయభిలాషకు నాందిగా శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిచే సుపరిష్కృతము చేయఁబడిన "కళాపూర్ణోదయము" ఇటీవలనే రమ్యమైన ఆకృతిలో ప్రచురించియున్నాము.

ఈ ఉద్యమములో ఇప్పటి "భీమేశ్వరపురాణ" ప్రచురణము రెండవ గ్రంథము. శ్రీనాథకవి సార్వభౌమ ప్రణీతమైన యీ మహా కావ్యమును ఇంతకుముందు ఒకరిద్దఱు ప్రకటించియుండిరి కాని, నేఁడు ఆప్రతులు వలసినవారికి ఉపలభ్యమగుటలేదు. భీమేశ్వరపురాణ ముద్ర ణావశ్యకతగూర్చి మాకు పెక్కుపండితులు చెప్పియున్నారు.

పిఠాపుర మహారాజా ప్రభుత్వ కళాశాలలో ఉపన్యాసకులు, వ్యాకరణవిద్యా ప్రవీణులు, సుప్రసిద్ధ పండితులు నగు బ్రహ్మశ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు "భీమేశ్వరపురాణము" ను పాఠభేదములు సరి చూచి, పరిష్కరించి, విపులమైన ఉపోద్ఘాతము రచించి మాకు దయచేసినారు. శ్రీ పాపయ్యశాస్త్రిగారి పరిష్కరణ విశేషమునుగూర్చి కాని, భీమేశ్వరపురాణ కవితాప్రశస్తిని గూర్చికాని మేము చెప్ప నక్కఱలేదు.

ఆంధ్ర మహాజనుల ఆదరాభిమానములున్నచో మఱికొన్ని యితర ప్రాచీన మహాకావ్యములు ప్రచురించవలెనని మాకు ఆశకలదు. పెద్దల ప్రోత్సాహము, సహృదయపాఠకుల అభిలాష మాకు అండ దండలుగా ఉండవలయునని కోరుచున్నాము.

రాజమహేంద్రవరము
24 - 9 - 58

అద్దేపల్లి నాగేశ్వరరావు
ప్రకాశకులు

# పీఠిక

శ్రీనాథుఁడు తన ప్రౌఢనిర్భరవయః పరిపాకమున భీమనాయకుని మహిమఁగొనియాడఁ దలఁచి, 'శ్రీభీమేశ్వర పురాణ' మును స్కాందాంతర్గతమైన గోదావరీఖండమున కాంధ్రానువాదరూపముగ సంతరించియున్నాఁడు. ఆనాఁటి కాతని వయఃపరిపాకముతో పాటు కవితాపరిపాకముకూడ ప్రౌఢము కాఁజొచ్చినది. శ్రీనాథుఁడు బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడు, ఈశ్వరార్చనకళాశీలుఁడు, బ్రహ్మాండాది నానాపురాణచయ తాత్పర్యార్థనిర్ధారితబ్రహ్మజ్ఞాననిధానుఁడును. ఆంధ్రభాషాయోష నమూల్యాభరణములఁ గైసేసి, తన్మూలమునఁ బరమేశ్వరార్చనము సాధించిన మేటికవి. కవితాచిత్రములో హార్దికభక్తిభావము గీలించిన మహాశిల్పి. భీమేశ్వరపురాణము రచించునాఁటి కాతఁడు పుణ్యశ్లోకుఁ డైననలుని చరిత్రమును రసవత్ప్రబంధముగ నాంధ్రీకరించి, తన్మూలమునఁ బెదకోమటి వేమారెడ్డి యాస్థానిలో స్థానము సంపాదించి, దేశ మెల్లెడలను విశదకీర్తిస్ఫూర్తులను వెదఁజల్లినాఁడు. ఈవిషయమును భీమేశ్వరపురాణ కృత్యాది నిట్లు వివరించియున్నాఁడు.

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
　　　కఖిలపురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
　　　హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
　　　విద్యాపరీక్షణవేళలందు
వెదఁజల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
　　　కర్పూరములు దిశాంగణములందుఁ
బాకనాఁటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభునిపౌత్రుఁడ వమలమతివి

నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు
కలితగుణగణ్య శ్రీనాథ కవివరేణ్య!

—భీమ. 1-23.

శ్రీనాథుఁ డీపలుకులు పలికించినది భీమేశ్వరపురాణ కృతిభర్త యైన బెండపూఁడి అన్నామాత్యుని నోట. శ్రీనాథుఁడు పెదకోమటి వేముని యాస్థానిలో విద్యాధికారియై యుండిననాఁటి విభవమును వ్యంగ్యభంగిలో వివరించినాఁడు. ఏతత్కృతిభర్తయైన అన్నమంత్రికిఁ గులదైవ మరవిందాప్తకృత ప్రతిష్ఠుఁడగు దక్షారామభీమేశ్వరుఁడు. తన్మాహాత్మ్యము నంధ్రజగతీభాషా ప్రబంధముగ విన వేడుక గలిగి యామంత్రి తనకు బాంధవుఁడైన శ్రీనాథుని బ్రేరేపించినాఁడు. అంతకు ముందు మూఁడు శతాబ్దముల వెనుక రాజమహేంద్రపుర రాజ్యమేలిన రాజరాజనరేంద్రునకు, తన వంశమున నుదయించి వంశకర్తలై నెగడిన కురు పూరు భరత పాండుప్రభుల చరితము విన వేడుక యుదయించిననాఁడు, ఆంధ్రావళి మోదముం బొరయ నన్నయభట్టారకుని యాంధ్రభారత మవతరించినది. అట్టి వేడుకయే యన్నమంత్రి కుదయించిననాఁ డీ భీమేశ్వరపురాణము రాజమహేంద్రవరమున రెండవ యాంధ్రపురాణగ్రంథముగా నావిర్భవించినది.

## శ్రీ నా థు ని కృ తు లు

ఈగ్రంథము రచించుటకు మున్ను శ్రీనాథుఁ డేయేప్రబంధములు రచించియుండెనో య విషయ మీక్రింది రెండుపద్యములవలన మనకుఁ దెలియవచ్చుచున్నది.

గీ. నవమరుత్తరచరిత్రంబు నైషధంబు
సప్తశతి పండితారాధ్యచరిత మనఁగ
గావ్యములు పెక్కుసెప్పియుఁ గాంక్ష సనక
యొండియును గావ్య మొకటి గావింపఁదలఁచి.

—భీమ. 1-18.

భీమేశ్వరపురాణమును వెలయించితి ననినాఁడు. మఱియు కాశీ ఖండప్రారంభమునందు గ్రంథరచనాక్రమము నీతీరుగ వర్ణించియున్నాఁడు.

సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాష
ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకునిమహిమ
బ్రాయ మింతకు మిగులఁ గైప్రాలకుండఁ
గాశికాఖండ మనుమహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథ భట్టసుకవి.

—కాశీ. 1—7.

ఈవివరములఁబట్టి శ్రీనాథుఁడు నైషధరచనమునకుఁ బూర్వము మరుత్తరాట్చరిత్రమును శాలివాహన సప్తశతియు రచియించి, యావెనుక, నాంధ్రనైషధకావ్యమును రచించినట్లు స్పష్టము. నైషధ రచనమునకు మున్ను పండితారాధ్యచరిత్రమును రచించి, నైషధకృతి భర్త యైన మామిడి సింగన మంత్రికి అన్నయగు ప్రెగడయ్యకుఁ గృతి యిచ్చినట్లు నైషధ కృత్యాదియం దిట్లు లుగ్గడించి యున్నాఁడు.

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు మాయనుంగుఁబెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగు నాయారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్.

—నైష. 1—14.

పై రీతిని శ్రీనాథుని కృతులుగ నిరూపింపఁబడినవానిలోఁ
గొలుతటి వగు మరుత్తరాట్చరిత్రము శాలివాహనసప్తశతి పండితా
రాధ్యచరిత మను నీమూఁడు ప్రబంధములును మన కీనాఁ డుపలబ్ధము
లగుట లేదు. ఈనాఁడు మనకుఁ జదువ లభించుచు నిర్వివాదముగ శ్రీనా
థుని రచనలే యని నిరూపింపఁబడు ప్రబంధము లయిదు. 1. ఆంధ్ర
నైషధము. 2. హరవిలాసము. 3. భీమేశ్వరపురాణము. 4. కాశీ
ఖండము. 5. శివరాత్రి మాహాత్మ్యము .అను నివి.

భీ మే శ్వ ర పు రా ణ కృ తి

శ్రీనాథుఁ డాంధ్రకవిగా నవతరించునాఁటి కాతని జన్మభూమి
యగు కాలీపట్టణమునకు సన్నిహితముగఁ గొండవీటి రెడ్డిరాజుల పాల
నము కొనసాగుచుండెను. పెదకోమటి వేమారెడ్డి మేటిపండితుఁడై
సంస్కృతకవిపోషకుఁడై సంస్కృతభాషాభివృద్ధి గావించుచుండెను.
ఆతని యాస్థానిలో స్థానము సంపాదించుటకై, యాతని మంత్రి
యగు మామిడి సింగనకు నైషధకృతి సమర్పణము చేసి, తన్మూల
మున నాతని యాస్థానిలో విద్యాధికారి పదవి లభింపఁజేసికొనినాఁడు.
పెదకోమటి వేముఁడు నెలకొల్పిన కొన్ని శాసనములకు శ్రీనాథుఁడే రచ
యిత యైనట్టులును, ఆతనికి విద్యాధికారి యైనట్టులు నాయాశాసనము
ల నుపనిబద్ధమైన యీక్రింది శ్లోకమువలనఁ దెలియవచ్చుచున్నది.

శ్లో॥ విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్.

శ్రీనాథుఁ డీశ్వరార్చన కళాశీలుఁడు. కొండవీటి రెడ్డిప్రభు
వులు పార్వతీపతి పదాబ్జారాధకులు. విశేషముగఁ దన్మంత్రియగు
మామిడి సింగన హరపాదసేవకుఁడు. కావుననే శ్రీనాథుని నైషధ
కృతి స్వీకృతికి, తన్మూలక విద్యాధికారిపదవీలబ్ధికిఁ గొండవీట ననువు
కుదిరినది. పెదకోమటి వేముని పాలన మంతరించినతరువాత, శ్రీనా
థుఁడు కాంచికిఁ బోయి, యవచి తిప్పయసెట్టికి హరవిలాసకృతి సమర్ప

ణము చేసియున్నాఁడు. తిప్పయ శ్రీనాథునకు బాల్యసఖుఁడు హరపాద పద్మసేవకుఁడు నగుటఁ దత్కృతిస్వీకృతి కాలంబ మైనాఁడు. ఈకలాప మంతయు ముగియునాఁటికి రాజమహేంద్రవరమున అల్లాడ వేమవీర భద్రారెడ్ల రాజ్యపాలనము నిరాతంకమై సుసమృద్ధమై శ్రీనాథునకుఁ గానవచ్చినది. రెడ్డిరాజులయాస్థానిలో స్థానము సంపాదించు మార్గ మాతని కీవఱకే క్షుణ్ణమై యుండెను. పెదకోమటి వేముని యాస్థానిలో స్థానము సంపాదింపఁ దలపెట్టిననాఁ డాతనిమంత్రియగు సింగనను గృతి భర్తగాఁ జేసి, యాకృతిలోఁ గోమటివేమునిమహిమను బరోక్షముగ స్తుతించి రాజాస్థానిలో స్థానము సంపాదించినాఁడు. మరల నిపుడు రాజమహేంద్రవరమున వేమవీరభద్రారెడ్ల యాస్థానిలో స్థానము నార్జింపఁ దలపెట్టినపుడుకూడ, వారిమంత్రియగు బెండపూఁడి అన్నమం త్రికి భీమేశ్వరపురాణమును గృతిగా నర్పింపసమకట్టి ఆమంత్రికి నేలిక యయిన వేమారెడ్డి మహత్త్వమును విశేషముగ వివరించి, పిమ్మట వీరభద్రారెడ్డికి విద్వాంసుఁడు కాఁ దలఁచి యీకృతి నిర్వహణమున కుపక్రమించినాఁడు.

### భీమేశ్వరపురాణ రచనా కాలము.

భీమేశ్వరపురాణమునఁ బ్రధానముగ వర్ణింపవలసినది కృతిపతి యైన బెండపూఁడి యన్నామాత్యుని వంశావతారమై యున్నను నొడుపు చూచి, భావిపదోపలబ్ధిసౌలభ్యమపేక్షించుచు "అమ్మహా ప్రారంభమునకు మంగళాలంకారంబుగా నమ్మహామంత్రీశ్వరు నేలిన వీర భద్రేశ్వర వేమభూపాలుర వంశావతారం బభివర్ణించెద" నని యుపక్ర మించి, మంత్రి వంశావతారముకంటె ప్రభువంశమును ముం దవతరింపఁ జేసినాఁడు. రాజమహేంద్రవర రాజ్యమును కాటయవేమారెడ్డి పరి పాలనముతరువాత అల్లాడ వేమవీరభద్రారెడ్లు క్రీ. శ. 1423 మొదలు క్రీ. శ. 1434 వఱకుఁ బాలించినట్టులు ఆనాఁటిశాసనములవలనఁ దెలియ వచ్చుచున్నది. ఈరాజ్యము కుమారగిరిరెడ్డివలన కాటయవేమారెడ్డి

ని, తదనంతరమున నాతనియల్లుఁడగుటచే వీరభద్రారెడ్డికిని సంక్రమించి నది. ఈ వీరభద్రారెడ్డి అల్లాడరెడ్డి కుమారులలో రెండవవాఁడు. కాటయవేముని కూఁతురగు అనితల్లి కీతఁడు భర్తయగుటచే రాజ్యమునం తతఁడే పట్టాభిషిక్తుఁడైనను, ఆతనియన్నయగు వేమారెడ్డియే కార్య దక్షధురీణుఁడై రాజ్యభార మంతయు నిర్వహించుచుండెడివాఁడు. కొండ వీట కుమారగిరి పాలకుఁడైననాఁడు కాటయవేముఁడే మహామాత్యుఁడు మహామంత్రియు నై రాజ్యభార మంతయు నాతఁడే నిర్వహించుచుండెడి వాఁడు. కాటయవేముని తరువాత నాక్రమమే యేర్పడినట్లు లీక్రిందిపద్య మున శ్రీనాథుఁడు వివరించియున్నాఁడు.

ఉ. తమ్ముని వీరభద్రవసుధాధిపు విక్రమవీరభద్రునిన్
సమ్మదలీల రాజ్యభరణస్థితిఁ బట్టముగట్టి బాహుద
ర్పమ్మున వేమభూవరుఁడు వ్రాసెను దిగ్విజయప్రశస్తివ
ర్ణమ్ములు దిగ్ధురంధర సురద్విపకుంభవిషాణమండలిన్.

—భీమ. 1—34.

ఈవిధముగ వేమవీరభద్రారెడ్లు రాజమహేంద్రవర రాజ్యపాలకు లైననాఁడు, అన్నమంత్రికి భీమేశ్వరపురాణ కృతిసమర్పణము గావింపఁ బడుటచే, ఏతత్పురాణరచనము క్రీ. శ. 1425 ప్రాంతమున రచింపఁబడి యుండునని నిర్ణయింపవచ్చును.

ఈప్రబంధమున శ్రీనాథుఁడు తనకు 'కవిసార్వభౌమ పదము' ఉండినట్లు వ్రాసికొనియుండలేదు. కాశీఖండరచనములో నాబిరుదము పలుతావులందుఁ బేర్కొనఁబడినది. కావున ప్రౌఢదేవరాయల యాస్థా నికిఁ బోయి, యచట నుద్భటవివాదప్రౌఢిచే గౌడడిండిమభట్టు కంచు ఢక్క పగులఁగొట్టించి కనకాభిషేకముతోఁగూడ కవిసార్వభౌమబిరుద మార్జించినది భీమేశ్వరపురాణ రచనానంతరము గాశీఖండరచనకుఁ బూర్వము నని తెలియవచ్చుచున్నది.

శ్రీనాథుని కవిసార్వభౌమబిరుదము కాశీఖండమునం దాశ్వా

సాంతగద్యములందును, కనకాభిషేకవిషయము సప్తమాశ్వాసాంత పద్యమునందును వాకొనఁ బడియున్నవి.

శా. కర్ణాటక్షితిపాల మౌక్తిక సభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర !

— కాశీ. 7-263.

ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజన విధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన కాశీఖండంబునందు.

—సప్తమాశ్వాసము

శ్రీనాథుఁ డొకయాస్థానిలో స్థానము నార్జింపవలయు ననినఁ దత్సంబద్ధులతోఁ గృతిసంబంధము నేర్పఱుచుకొనుట యొకపరిపాటి యయినది. ప్రౌఢదేవరాయలయాస్థానిలోఁ బ్రవేశము లభింపఁజేసికొనుటకు ముందాతని భాండాగారాధ్యక్షుని సోదరుఁడగు వినుకొండ వల్లభామాత్యుఁడు రచియించి యుంచిన క్రీడాభిరామమునకు సముచిత సంస్కారంబులు కూర్పులు మార్పులు గావించి, క్రమముగ నాస్థానీ ప్రవేశమును సాధించి, స్వర్ణాభిషేక కవిసార్వభౌమ బిరుదలబ్ధినిఁ జేకూర్చుకొనినాఁడు. శ్రీనాథున కీస్వర్ణాభిషేక కవిసార్వభౌమపదోపలబ్ధి విషయము లాతఁడు నెఱపిన యీశారదాస్తుతిలో వ్యక్తమగుచున్నవి.

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునను
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రశేఖరక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద

మెట్లు మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సకలసద్గుణనికురుంబ! శారదాంబ!

ఈనాఁడు రాజమహేంద్రవర రెడ్డిరాజుల యాస్థానిలో స్థానము నార్జింపఁ దలఁ పూనినపుడు తన్మంత్రియగు బెండపూఁడి యన్నామాత్యునితో నీభీమేశ్వరపురాణకృతిసంబంధము నార్జింపఁ దలపెట్టినాఁడు. అభిమతఫలసిద్ధి కాతని కీకృతిసమర్పణమే ప్రధానసాధనమైనట్టులు పైని నిరూపించిన నిదర్శనములవలనఁ దెలియవచ్చుచున్నది.

## శ్రీ నా థు ని పాం డి త్య ము

శ్రీనాథునకు శాస్త్రసమ్మతమైన సంస్కృతభాషాపాండిత్య మధికముగఁ గలదు. దానితోపాటు ఆంధ్రభాషాపాటవ మత్యధికముగఁ గలదు. ఈవిషయమును శ్రీనాథుని బావమఱఁదియగు దగ్గుపల్లి దుగ్గన తాను రచించిన నాచికేతూపాఖ్యానమునం దిట్లుపేర్కొనినాఁడు.

సీ. సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య
భాషాపరిజ్ఞానపాటవంబు
పన్నగపతిసార్వభౌమ భాషితమహా
భాష్యవిద్యాసమభ్యాసబలము
నక్షపాద కణాద పక్షిలోదీరిత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతి సాంఖ్యసిద్ధాంత
కబళన వ్యుత్పత్తిగౌరవంబు
పూర్వకవిముఖ్యవిరచితా పూర్వకావ్య
భావరససుధాచర్వణ ప్రౌఢిమయును
గందళింపఁగఁ గాశికాఖండనైష
ధ ప్రముఖ వివిధప్రబంధము లొనర్చి,

నమేటి శ్రీనాథుఁ డనినాఁడు. ఆతనికిఁ గలపాండిత్యమును నైషధమునందుఁ గొంతవఱకు వెల్లడించుట కవకాశమేర్పడినది. కాని తనకుఁ గల శాస్త్రపాండిత్యము నంతయు వెల్లడించుట కనువుపడెడి కాశీ ఖండరచనము గావింపఁ దలఁచి, తగిన రాజాశ్రయమునకై పర్యవేక్షణము సేయుసమయ మది. రాజమంహేంద్రవరమున రాజాశ్రయమునకై కా లూనినంతనే యచటిపండితులతోఁ గొంత వైమనస్య మేర్పడినది గాఁబోలు భీమేశ్వరపురాణ ప్రారంభమున సుకవిబృందమునకుఁ గై మోడ్పు లిడి, కుకవినిరాకరణము గావించి యొక ప్రౌఢోక్తి నిటు విసరినాఁడు.

ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు
పలుకునుడికారమున నాంధ్రభాషయందు
రెవ్వ రేమన్న నండ్రుగా కేమి కొఱఁత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.

—భీమ. 1—45

సంస్కృత భాషాప్రౌఢిమ తెలుఁగు పలుకునుడికారపుఠీవియు జతఁ గూడఁగ, వినువారి చెవులలో కవితా ఝుళంఝుళనాదములు మార్మ్రోఁగు నట్టులు కవిత చెప్పఁ గలదిట్ట శ్రీనాథుఁడు. ఆతని కట్టి కవితాభినివేశ మేర్పడియున్న దనుటకు నీకావ్యమున నన్నయభట్టారకున కాతఁడు కైమోడ్పు లిడిన యీక్రింది పద్యమే తార్కాణము.

క. నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయసార్వభౌముని గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠ గాఢప్రతిభున్.

అక్షరరమ్యత నాదరించి, సుసంస్కృతభాషాప్రాచుర్యముగ నాంధ్రకవిత నారాధించిన నన్నయభట్టారకు నాంధ్రకవికాసామ్రాజ్య

పట్టాభిషిక్తుని జేయుటయే యాతని యడుగుజాడలలో నీతఁడు నడచె ననుటకు నిదర్శనము.

ఆనాఁడు రాజమహేంద్రవరము గీర్వాణవాగ్విలాసమునకు, కళాపోషణమునకు విడిదిపట్టయి, విద్యలకు నికషస్థానమై యున్నట్టులు అన్నమంత్రి కొలువు దీర్చనతీరును వర్ణించుటనుబట్టి విదితమగుచున్నది.

సీ. భాట్టప్రభాకరప్రస్థాన సంవేద్యు
 లుద్దండపండితు లొకక్కవంక
 ఫణిపభాషితభాష్యఫక్కికాభావజ్ఞు
 లుత్తమప్రాగల్భ్యు లొకక్కవంకఁ
 గణభుజ్మతగ్రంథ గాఢార్థవిదులు బా
 హుశ్రుత్యసంపన్ను లొకక్కవంక
 వేదాంతవాసనావిశ్రాంతహృదయజ్ఞు
 లుపనిషత్త్వత్త్వజ్ఞు లొకక్కవంక
 నుభయభాషాకవీశ్వరు లొకక్కవంక
 వేశ్య లొకవంక నొకవంక వీరభటులు
 బలసి కొలువంగఁ గొలువుండి పిలువఁ బంపె
 బెండపూఁ డన్నమంత్రీశ్వరుండు నన్ను.

—భీమ. 1-21

రాజరాజనరేంద్రుని పాలనమునాఁటనుగూడ రాజమంహేంద్ర వరసత్సభాంతరము కృతిపండితప్రకాండులతో నిండియుండినట్లు నన్నయ భట్టారక భారతావతరణప్రకారవర్ణనమున విదితమైనది. వేమవీరభద్రా రెడ్లప్రాభవమునాఁటనుగూడ నానగరము నిఖిలశాస్త్రనివహామునకు నిలయమై యుండినట్లు తెలియవచ్చును. అట్టిరాజమహేంద్రవర రాజాస్థానిలో స్థానము సంపాదించి, సంస్కృతవిద్వాంసు లాంధ్రకవితావిలా సములు మెచ్చుకొనునట్లు చేయ సమకట్టిన శ్రీనాథుని గీర్వాణవాగ్వి

లాస మెట్టిదియో వేఱ చెప్పనక్కఱలేదు. ఆతనికిఁగల సంస్కృత సాహితీ ప్రౌఢిమ యాతని రచనలలో నడుగడుగునఁ గానవచ్చెడి సమాసములకూర్పునందును, పదప్రయోగమునందును, దెలియవచ్చు చునే యుండును. ఇంతియగాక యద నెటిఁగి సంస్కృతగ్రంథములకు స్వేచ్ఛానువాదము గావించుచు, నన్యగ్రంథములందు మేల్తరములయిన భావములను సంతరించుటీవిలోఁ గూడ నాతనికిఁ గల గీర్వాణవాణీవిలా సము, పదప్రయోగస్వాతంత్ర్యము మనకు గోచరించును.

మూ లా ను స ర ణ ము

శ్రీనాథునిరచన లన్నిటికి సంస్కృతమున నేదియో యొక గ్రంథము మూల మగుచునే యున్నది. ప్రత్యేకకావ్యము గాని, కావ్య ఖండములు గాని యే వయినను సంస్కృతమూలానుసారులే. ఈభీమేశ్వ రపురాణమునకు స్కాందార్గతమైన గోదావరీఖండము మూలమని తెలిపి యున్నాఁడు. ముద్రితాముద్రితములైన స్కాందపురాణఖండములలో 'గోదావరీఖండ' మనునది ప్రత్యేకముగ నేదియుఁ గానవచ్చుట లేదు. కాని తెలుఁగులిపి వ్రాఁతప్రతులందును, ఈభీమమండలిలో ముద్రితమైన అచ్చుప్రతులందును, 'భీమఖండము' అను పేర సంస్కృతగ్రంథ మొకటి ముప్పదిరెండధ్యాయములుగలది గానవచ్చుచున్నది. శ్రీనాథుని యీ రచన సర్వథా తదనుసారియై యున్నది. ఈయనువాదసరణియు నైషధ కాశీఖండాదిరచనములవలె స్వేచ్ఛానువాదరూపమై యున్నది. కొన్ని పట్టులం దీయనువాదమున మూలవిషయమునకు సంక్షేపము కొన్నిపట్టు లందు విక్షేపమును గానవచ్చుచునే యున్నది. కాని మూలానుసరణము విశేషముగఁ గానవచ్చుటచే, "శ్రీనాథుని రచన ననుసరించి, యాతని కర్వాచీనులెవరో సంస్కృతీకరించిరి" అని భీమఖండమున కొకప్రవా దము బయలుదేఱినది. కాని సవిమర్శముగ నీరెండుగ్రంథములను బరి కించినచో నట్టి ప్రవాదము నిరాధారమని స్పష్టముగ నిరూపింపనగును.

శ్రీనాథుఁ డేరచన చేఁబట్టినను మూలమునకు యథాతథాను
వాదము సేయక, యాచితిని బాటించి సరసమైన యన్యగ్రంథస్థభావముల
నెడ నెడ సంతరించుచునేయుండును. అట్టికూర్పు భీమేశ్వరపురాణము
నందును గానవచ్చుచునే యున్నది. ఒండురెండు తార్కాణములు
నిరూపించెదను.

త్రిపురాసుర సంహారఘట్టమున పాల్కడలియల్లుఁడు (శ్రీమహా
విష్ణువు) మేరుధనుర్ధారికి (పరమేశ్వరునకు) బాణమై సమకూడి, త్రిపురా
సురసంహారముగావించి, త్రిపురదాహమైనవెనుక, ఆబాణము త్రిపురాసు
రాంతఃపురాంగనలయందు వింతచేష్టలు నెఱపినట్లు చిత్రించియున్నాఁడు.

సీ. కరపల్లవంబులు గబళించుఁ; కబళించి
ప్రబలనితంభ భారముల వ్రాలుఁ
జెక్కుటద్దములపైఁ జెరలాడుఁ; జెరలాడి
శ్రవణావతంస మంజరులు ముట్టు
వలిచన్నుఁగవలపైఁ బొలపాడుఁ; బొలపాడి
నాభిరంధ్రములపై నటనసేయు
వేణీభరములపై విహరించు; విహరించి
బింబాధరములపై బిత్తరించు
నభవకరముక్త నారాయణాస్త్రవహ్ని
కాముకునికోమలాంతసంగంబుపగిదిఁ
దెగువ మీఱంగఁ ద్రిపురదైత్యేయరాజ
సదనశుద్ధాంతభామినీ జనములందు.

—భీమ. 4—140

ఈపద్యమునకు సంస్కృతభీమఖండమున మూల మేమియుఁ గాన
రాదు. అమరుకావ్యమునందలి యీక్రిందిశ్లోక మీ పద్యమునకు
మూలము.

శ్లో॥ క్షిప్తో హస్తావలగ్నః ప్రసభ మభిహతోఽప్యాదదానోఽంశుకాంతం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షిత స్సంభ్రమేణ
ఆలింగ న్యోఽవధూత స్త్రిపురయువతిభి స్సాశ్రునేత్రోత్పలాభిః
కామీ వార్ద్రాపరాధ స్సదహతు దురితం శాంభవో వశ్శరాగ్నిః.

ఇటులనే వసంతోత్సవప్రకరణమున విబుధగంధర్వులు సహకారభూరుహములకు సపర్య గావించి రని తెలిపిన యీక్రిందిపద్యమునకును సంస్కృతమూలము గానరాదు.

సీ. కర్పూరకస్తూరికలఁ గోట నిర్మించి
కుంకుమద్రవమునఁ గొమ్మ దీర్చి
యగురు జంబాలంబునందు నడ్వలిచేసి
పన్నీటివెల్లువఁ బరిఖ దాల్చి
పవడంపుఁజివురుల గవను లుత్పాదించి
తమ్మిరేకుల బోరుతలుపులెత్తి
రత్నాంకురంబుల రంగవల్లి రచించి
పట్టుఁబుట్టంబులఁ బడగ లెత్తి
లలితశృంగారరచన నలంకరించి
విబుధగంధర్వు లామనివేళలందు
భీమనాథునినగరియారామ శేఖఁ
బూజచేసిరి సహకారభూరుహముల.

—భీమ. 5—100

ఈసహకార భూరుహపూజ శ్రీనాథునినాఁడు జరిగెడి వసంతోత్సవములందలి యొకపరిపాటి. ఈపద్యములకు వెనుకముందుండెడి పద్యములకు సంస్కృత మూలము గానవచ్చుచునేయున్నది. వీనికి మూల మేల లేకుండవలయును. శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృత భీమఖండము పరివర్తనరూపమే యైనచో ఆసంస్కృతీకరించిన

వ్యక్తి యీరెండుపద్యముల నేలసంస్కృతీకరింపలేదు. ఇట్టియుదాహృతు లెన్నియేని చూపింపవచ్చును. కావున శ్రీనాథుని రచనకు సంస్కృతభీమఖండమే సర్వథా మూలమని నిర్ణయింపనగును. మూలానుసరణ మన నెట్టిదో యీక్రిందిపద్యము తార్కాణించును.

క. కిసలయరసజిఘ్రహిపా
వ్యసనాకులపికకుహూభవత్పంచమమై
కుసుమసమయావతారము
త్రసమింగము జగముముంచె రాగాంబునిధిన్.

—భీమ. 5—101

సంస్కృతమూల శ్లోకము:—

చరాచరాత్మకం విశ్వం రాగాబ్ధౌ మధువాసరః
న్యమజ్జయ జ్జయప్రీత హృజ్జాతోజ్జృంభణోజ్జ్వలః

కలపుంస్కోకిలికంఠ కోమలకుహూకారం బేయారామమునందైనను వినిపించు నలవాటుగలవాఁడు గావున పైపద్యమున మొదటి రెండుపాదములం దది కూర్చి తరువాతి రెండుచరణములను మూలములోనియర్థము యథాతథముగ వచ్చునట్లు అనువదించియున్నాఁడు. మూలమును వీడకుండ చమత్కారమధికమగుటకు, నొక్కొక్క శ్లోకభావమును మున్ముందునకుఁ బోవునట్లు చేయుట యాతని రచనలోని విశిష్టత. అది యడుగడుగున నీయనువాదమునఁ గానవచ్చును.

## రచనాక్రమము

ఈప్రబంధమునందు ద్వివిధమయిన యుపక్రమము గానవచ్చుచున్నది. అందు మొదటిది—

షష్ఠ్యంతములతుదిని

క. శ్రీవీరభద్రవేమ
క్ష్మావరరాజ్యాభివృద్ధి కారణమునకున్

లావణ్యరూపసందఁ
బూవిలుకానికిని బెండపూడన్ననికిన్.

—భీమ 1-86

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పఁబూనిన యిమ్మహాప్ర
బంధఁబునకుఁ గథానాయకుండైన భీమేశ్వరమహాదేవునకుఁ బ్రియ
ధామంబైన దక్షారామపురం బెట్టి దనిన — యనునది.

ఇట్లుపక్రమించి, సంస్కృతభీమఖండసంబంధ మేపాటియు పాటిం
పక యే, దక్షారామపురమహత్త్వమును, ఆనాఁటి యాపట్టణవిభవ
మును, ఆలయప్రాకార గోపురాదులసౌందర్యము, పరిసరారామాదిప్ర
కృతివిలాసము, సస్యసమృద్ధి, కళాసౌష్ఠవము మున్నగువిషయములను
సమకూర్చి యొకయాశ్వాసముగ సంతరించియున్నాఁడు. ఈయాశ్వా
సముతుదిని, భీమేశ్వరపురాణ కథాప్రారంభము సేయుచు—

క. ఏతాదృశప్రభావో
పేతుం డగుదక్షవాటిభీమేశ్వరు వి
ఖ్యాతకథ చెప్పెదను శుక
తాతకృతపురాణసరణి తప్పకయుండన్.

—భీమ. 1-119

వ. ఇమ్మహాపురాణంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన—

అని రెండవయుపక్రమము. ఇచటనుండియే సంస్కృతమూలాను
సరణమునఁ బ్రబంధరచన కారంభ మయినది.

దీనిని బట్టి శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమును నాంధ్రభాషా
మయ కావ్యముగ నంతకు ముందే సంతరించి, అయిదాశ్వాసముల ప్రబంధ
ముగఁ గూర్చిపెట్టియున్నాడు. ఆవెనుక రాజమహేంద్రవర రెడ్డి ప్రభు
వుల యాస్థానిలో స్థానము నార్జించుటకై కృత్యాది గద్యపద్యములను,
ప్రథమాశ్వాసవిషయమును దాని కతికించి యున్నాఁడు. దీనితోఁ

దొలుతటి ప్రబంధ మయిదాశ్వాసములే యయినను, నాటాశ్వాసముల ప్రబంధ మయినది. ఏతన్మూలకముగ మొదటి యాశ్వాసము తనకాశ్రయ మీయఁదగిన ప్రభుమంత్రుల త్యాగభోగవైభవ సామగ్రీసముదయ తోడను వారియభిరుచుల కనువైన కళాసామగ్రీసమున్మేషతోడను ముగిసినది. ఈద్వివిధోపక్రమమువలన శ్రీనాథునకు ద్వివిధప్రయోజనములు ఫలించినవి. అందు మొదటిది, దానాశ్రయింపఁ దలఁచిన వేమ వీరభద్రారెడ్ల ప్రాభవము నభివర్ణించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁడగుట మొదటిది. ఆరెడ్డిప్రభువుల యాస్థానిలోఁ దనకు స్థానము సంపాదించి పెట్టుటకు నడుముగట్టుకొనిన బెండపూఁడి అన్నామాత్యుని యభిరుచులఁ బరిపోషించుచు, నాతఁడు నెఱపిన మహత్తర కృత్యముల నుగ్గడించుట రెండవది.

చరిత్రాంశములు

శ్రీనాథుని కృతులలో నేనిలో నైనను ఆనాటి దేశచరిత్రకు సంబంధించిన విషయము లెన్నియో జతగూడి యుండును. అవి క్రమబద్ధములై చరిత్రకారుల కెంతయు నుపయోగకారులై యుండును. మంధ్యాంధ్రదేశమున రెడ్డిరాజుల ప్రభుత్వము సుమారు నూటయేఁబది వత్సరములు కొనసాగినది. ఆయా ప్రభువుల ప్రాభవము నేదియో యొకవిధముగ నీతఁడు తన ప్రబంధములలోఁ బ్రసక్తముచేసియున్నాఁడు. నైషధకావ్యమున అన్నవేమపెదకోమటి వేమారెడ్ల మహత్త్వమును, హారవిలాసమున ప్రోలయవేమకుమారగిరుల ప్రాభవమును, ప్రస్తావానుప్రసక్తిగఁ బ్రసంగించియున్నాఁడు. ఈభీమేశ్వరపురాణమునఁ బ్రధానముగఁ గృతిభర్తయైన అన్నమంత్రి వంశావతారమును, వారివారి యపదానములనే వర్ణింపవలసియున్నను, నొక యెడుపున రెడ్డిప్రభువులలో విఖ్యాతుల నందఱను సంస్మరించి వదలినాఁడు. ఆక్రమమిది:-

"కాలచక్రం బతిక్రమించుచుండఁ జతుర్థకులమౌళిమండనంబైనకీర్తివిహారఘంటాపథంబైన పంటమహాన్వయంబు పాకనాటిదేశంబు

భద్రపీఠంబు నధివసించి, సింహవిక్రమనగర దువ్వూరు గండవరాది పట్టణంబులు నిజనివాసంబులుగా భూలతాదిష్టాష్టాదశ ద్వీపాంత రాళులగు భూపాలగ్రామణులం ద్రిలింగభూమండలాఖండలురను బ్రోలయవేమాన్నపోతాన్నవేమ కుమారగిరీశ్వరాదులం బూజ్యసామ్రాజ్యపీఠస్థులం గాంచె.”

—భీమ. 1.31.

ఇందుఁ బేర్కొనఁబడిన ప్రోలయవేము అన్నపోత అన్నవేము కుమారగిరి భూపాలురు అద్దంకి కొండవీడు రాజధానులుగా నాంధ్రదేశమును సుభిక్షముగను ధర్మోత్తరముగను బాలించిన పాకనాటి ప్రభువులు. వీ రందఱు నేకవంశసంజాతులయి క్రమముగ రాజ్యపాలకులైన మహావీరులు. వాఙ్మయపోషకులు పరమధార్మికు లని పేరుమ్రోసిన వారు. ఈ పేర్కొనినవారిలోఁ దుదివాఁడైన కుమారగిరి తరువాత కొండవీటి పరిసరరాజ్యమును పెదకోమటి వేమారెడ్డియును, రాజమహేంద్రవరమాదిగ వీరఘొట్టము వఱకు నుండెడి రాజ్యసీమలను కుమారగిరికి బావమఱఁది (సోదరీభర్త) యయిన కాటయవేమారెడ్డియును బాలించుచుండిరి. వీ రిరువురును మహావీరులు పరమధార్మికులును. కాని యీ యిరువుర నిట స్మరించుట మానివేసినాఁడు. దీనికిఁ గారణ మంతకుమున్ను తాను కొండవీటి నేలిన పెదకోమటివేముని యాస్థానిలో విద్యాధికారిగ నుండి వచ్చియున్నాఁడు. పెదకోమటి వేమునకుఁ గాటయవేమునకుఁ బ్రబలమైన వైరము. కాటయవేముని పక్షమువారు తా నిపు డాశ్రయింపవలసిన అల్లయవేము వీరభద్రారెడ్లు. అందుచే నిచట నొక మండూకప్లుతి గావించి, తత్సంబంధబాంధవంబున వసుంధరాభారధౌరంధర్యంబు వహించిన యల్లాడభూవల్లభుని గైకొనినాఁడు.

అల్లాడరెడ్డి యానాఁడు రాజమహేంద్రవర రాజ్యపాలకులైన వేమవీరభద్రారెడ్లకు జనకుఁడు. కాటయవేముఁడు కుమారగిరిపనుపున ప్రాగ్దేశమును జయింప వచ్చినపుడు, అల్లాడరెడ్డి యాతనికి దండనాథుఁడై

విజయములను సాధించిన మహావీరుఁడు. కాటయవేముఁడు రాజమహేం ద్రవరరాజ్యమునకుఁ బ్రభువై వెనుక నాతని కూఁతురగు ననితల్లిని గోడలుగా స్వీకరించి వియ్యంకుఁడైనాఁడు. ఈవిధముగాఁ గొండవీటి రాజన్యులతో నల్లాడరెడ్డికి సంబంధ బాంధవం బేర్పడె నని తెలుపుచు, నాయల్లాడ భూవల్లభుఁడు రాజమహేంద్రవరంబు రాజధానిగా సింహాద్రి పర్యంతం బుత్కళ కళింగ యవన కర్ణాటాంతర్దీపంబైన ప్రతాపంబున విశ్వవిశ్వంభరా భువనమండలంబుఁ బరిపాలించెఁ; నని తెలిపి, "తద నంతరం బాతనిసుతులు వేమవీరభద్రారెడ్లు ఇంద్రోపేంద్రులవలె ధాత్రిఁ బాలించి" రనినాఁడు.

అల్లాఁడరెడ్డి పెద్దకుమారుఁడు వేమారెడ్డి. రెండవకుమారుఁడు వీరభద్రారెడ్డి. కాటయవేముని కూఁతురగు అనితల్లికి వీరభద్రారెడ్డి భర్తయగుటచే ననితల్లిమూలమున వీరభద్రారెడ్డి రాజమహేంద్రవర సింహాసనాధికారి యయ్యెను. ఆతని యన్నయగు వేమారెడ్డి కార్యఖడ్గ ధురీణుఁడై రాజకీయ వ్యవహారము లన్నియుఁ దానే నిర్వహించు చుండెడివాఁడు. శ్రీనాథుఁ డీవిషయము నీక్రిందిపద్యమున సూచించియే యున్నాఁడు.

ఉ. తమ్ముని వీరభద్రవసుధాధిపు విక్రమవీరభద్రునిన్
సమ్మదలీల రాజ్యభరణస్థితిఁ బట్టము గట్టి బాహుద
ర్పమ్మున వేమభూవరుఁడు వ్రాసెను దిగ్విజయప్రశస్తి వ
ర్ణమ్ములు దిగ్గురఁ ధరసురద్విపకుంభవిషాణమండలిన్.

దీనినిబట్టి వీరభద్రారెడ్డి రాజమహేంద్రవర రాజ్యమునకు మూర్ధాభిషిక్తుఁడై యుండుట, బాహుపరాక్రమము నెఱపి దిగ్విజయ ములు వేముఁడే సాధించుట యను విషయము స్పష్టముగఁ దెలియవచ్చు చునేయున్నది. తరువాతి పద్యములలో వేమవీరభద్రారెడ్ల నిరువురను వర్ణించెడి పద్యములలో శ్రీనాథుఁడు చేబట్టిన క్రమ మీవిషయము

మహాస్రగ్ధర :—

ఫణిరాజ స్తబ్ధరోమ ప్రకట కమఠరా ట్పర్వతశ్రేణి దిగ్వా
రణ ధౌరంధర్యధారారభటి సమధిక ప్రౌఢ బాహాప్రతాప
ప్రణతప్రత్యర్థి పృథ్వీపతి మకుటమణీభాసమానాంఘ్రిపీఠున్
బ్రణుతింతున్ వీరభద్రున్ బ్రతిభట ధరణీపాలకాలాగ్ని రుద్రున్.

—భీమ. 1–36.

ఈవర్ణనము విశేషముగఁ గొనియాడఁదగిన యపదానములు లేని ప్రభువును వర్ణించెడి క్రమమున నారభటీవృత్తి భూషితమై కొనసాగినది. ఆవెనుకనే వేమారెడ్డిని వర్ణించుట కుపక్రమించిన ప్రతాపక్రమమును దన్కాలమున లభించిన విభవము నెట్లు చిత్రించెనో కనుఁగొందము.

సీ. పండువాసురధాణి పావడం బిచ్చిన
భద్రేభములు వీథిఁ బాఱె ముందు
నోడ్డెధాత్రీనాథుఁ డుపద పుత్తెంచిన
బింబాధరోష్ఠి సంబెళ వహించుఁ
గర్ణాటభూపతి కానుక యనిచిన
ముక్తాతపత్త్రంబు మ్రోల మెఱయు
యవనాధిపతి యుపాయనముగా నిచ్చిన
పాగాహయంబులు వాగె వచ్చు
దూర మంతంత బారుహదొంతి మన్నె
సప్తమాడియ రాజన్యసమితి మ్రొక్కు
రాయవేశ్యాభుజంగ సంగ్రామపార్థ
గాయగోవాళ వేమనక్ష్మాధవునకు.

—భీమ. 1–37.

ఈపద్యమున వేమారెడ్డికి వశవర్తులై యుండెడి భూనాథు లందఱు క్రమముగఁ బేర్కొనఁబడి యున్నారు. కాటయవేముని పాలనమునాఁడు రాజమహేంద్రవరరాజ్యము ప్రాగుత్తరముగ వీరఘో

ట్టమువఱకే వ్యాపించియుండెను. అట్టి రాజ్యసీమల నల్లాడరెడ్డి యాతని సుతుఁడు వేముఁడును గటకమువఱకును విపులీకరించిరి. ఈ రాజ్యసీమావిస్తరణమున కాటయవేముని తరువాత బాహుశౌర్యమును నెఱపి విశేషవిజయములను సాధించినవాఁడు అల్లాడవేమారెడ్డియే.

ఈవిషయము నాతనినాఁటిశాసనములు శ్రీనాథునిరచనలును విశదము చేయుచు నేయున్నవి. కాశీఖండకృత్యాదిలో వేమవీరభద్రా రెడ్లమహత్వమును పదిపదిపద్యములలో వర్ణించు ప్రకరణములోఁగూడ శ్రీనాథుఁ డీవిధమైన శైలినే యంగీకరించినాఁడు.

కుమారగిరి కొండవీటిరాజ్యమునకుఁ బాలకుఁడైననాఁడు ఆతని బావమఱఁదియగు కాటయవేముఁడు ఆతనికి మహామాత్యుఁడు ప్రధాన సేనాధిపతియునై కార్యఖడ్గభర మంతయుఁ దానై యెట్లు నిర్వహించి యుండెనో, యట్లే యనితల్లిమూలమున సంక్రమించిన రాజ్యమున తద్భర్తయగుటచే వీరభద్రారెడ్డి సింహాసనాధ్యాసీనుఁ డైననాఁడు తద గ్రజుఁడైన వేమారెడ్డియు రాజ్యభరమంతయుఁ దానే నిర్వహించుచుం డెడివాఁడు. ఈవిషయము అనితల్లి కలువచేరుశాసనమం దిట్లు నిరూ పితమైయున్నది.

శ్లో॥ అనితల్లీ పతిందేవా ఘనసచివీభూతభావుకా భువ మవతి.

అనితల్లి భర్తనుదైవముగ భావించుచు, తనకుబావగారగు వేమారెడ్డిని మహామాత్యునిగఁ జేసికొని భూమిని బాలించె నని భావము. ఆనాఁడు రాజమహేంద్రవర రాజ్యపాలకప్రశస్తి వేమునకే విశేషముగఁ గల దను విషయమును శ్రీనాథుఁ డీకావ్యమునఁ బలుతావులఁ జేర్కొని యున్నాఁడు.

శా. దేవబ్రాహ్మణభక్తి వర్ధితధరిత్రీ చక్రసామ్రాజ్య ల
క్ష్మీసౌవాస్తోష్పతి సంస్తుతింపఁగఁదగున్ శ్రీవేమపృథ్వీశ్వరున్.

—భీమ. 1-3.

రాజమహేంద్రవరమును వర్ణించుప్రకరణములో—

వేమభూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము.

—1-42.

అన్నామాత్యుని విభవమును బేర్కొనునపుడు—

వేమధాత్రీకళత్రు గారాబుమంత్రి

—1-80.

వేమక్షమా, వరసామ్రాజ్యరమాధురంధర జగద్వ్యాప్త ప్రతాపో
దయా!

—1-121.

........................................వీరభద్రేశ్వర
క్ష్మాకాంతాగ్రజ వేమభూపతి కృపాసంవర్ధితప్రాభవా!

ఇత్యాదిగాఁ బలుమాఱులు వేమభూపాలుని యశస్సునే యఃగ్గించినాఁడు.

శ్రీనాథునకు రాజమహేంద్రవర రాజ్యమున స్థానము నీయఁదగిన ప్రభువు వేమభూపాలుఁడు. కావున నాతని దాతృత్వమును ప్రత్యేకముగ నొకసీసపద్యమున వర్ణించియున్నాఁడు. ఈపద్యమే కాశీఖండకృత్యాది యందును మార్పేమియు లేకుండఁ గూర్పఁబడినది.

సీ. ధరియింపనేర్చిరి దర్భ వెట్టెడువ్రేళ్ళ
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింపనేర్చిరి గంగమట్టియుమీఁద
కస్తూరికాపుండ్రకములు నొసల
సవరింపనేర్చిరి జన్నిదంబుల ప్రోలఁ
దారహారములు ముత్యాలసరులు
చెరువంగనేర్చిరి శిఖలనెన్నడుములఁ
గమ్మని క్రొత్తచెంగల్వ విరులు

ధామముల నెండియును బైఁడి దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములలోన
వేమభూపాలుఁ డనుజన్మ వీరభద్రు
ధాత్రి యేలింప గౌతమీతటమునందు.

—భీమ. 1–41

వేమారెడ్డి, తమ్మునిచే రాజ్యమును బాలింపఁ జేయునాఁడు గౌతమీతటమునం దగ్రహార దానములు చేయఁగా నందలిబ్రాహ్మణులు వివిధవిభవములతోఁ దులతూఁగుచుండి రని, యానాఁటి బ్రాహ్మణుల స్వరూపమును మనయెదుటఁ బెట్టినాఁడు. వేముఁ డట్టి యగ్రహారప్రదాత యనుటను నాతని వేమవరశాసనము చాటుచున్నది.* అల్లయవేముఁడు తుల్యభాగానదీతీరము నంటియున్న మహేంద్రవాడ వెదురుపాక యను గ్రామములు రెండిటి నేకగ్రామము చేసి 'వేమవరాగ్రహారము' అని నామకరణముచేసి, సుమారు నూరు వృత్తులుగ విభాగించి, వేద వేదాంగ వేత్తలయిన బ్రాహ్మణులకు ధారవోసెను. వెదురుపాక నంటియున్న కొంకుదురుగ్రామమునకు 'వేమసానక్క దొడ్డవరము'అని నామకరణము చేసి, దానినిగూడ విప్రులకు ధారాదత్తము చేసినట్టు లా వేమవర శాసనమే నిరూపించుచున్నది. గౌతమీనదీ శాఖాతీరములం దెల్ల బహుసారవంతమైన దీభూమి. ఈశాసనమునందే అల్లాడభూపతి పెద కోమటివేముని సైన్యమును రామేశ్వరమునొద్ద హతమార్చి రాజ మహేంద్రవరరాజ్యమును బాలించె ననువిషయమును దెలుయుచున్నది.

వేమవీరభద్రారెడ్ల విభవమును వర్ణించుటతోపాటు వారికి శైవగురువును రాజ్యస్థాపనాచార్యుఁడును ఘోడెరాయబిరుదాంచి తుఁడు నగు భీమయగురువరేణ్యుని స్మరించినాఁడు. ఈఘోడెరాయ భీమేశ్వరస్వామి 'రాయగురుపరమేశ్వర సాధుజనవిధేయ ఘోడెరాయ

---

* See. Epi. Ind. Vol XIII PP. 237 to – 259. Vemavaram grant of Allaya Vema Reddi. Saka ౧౩౫౬. A. D. 1434.

సకలకళాధామాది' బిరుదభాస్వరుఁడైనవాఁడు. ఈభీమయగురువరేణ్యుని పూర్వవంశజు లగు శైవగురువులు ఘోడెరాయబిరుదాంకితులు శ్రీశైలవాస్తవ్యులై యుండి కొండవీటిరెడ్డి రాజులకు రాజ్యస్థాపనాచార్యులుగ నుండెడివారు. కొండవీట నుండెడి విభవమునంతను రాజమహేంద్రవరమున సమకూర్చువాఁడై కాటయవేమారెడ్డియే కావలయును, నీత్రిపురారీంద్రతనూజుఁడగు భీమయగురువరేణ్యుని రాజ్యస్థాపనాచార్యునిగ రాజమహేంద్రవరమునకుఁ గొనివచ్చియుండును. ఈ భీమయగురువు కృష్ణాతీరమునందలి శ్రీశైలమున కీడయిన వీరభద్రశిఖరిపైఁ దప మాచరించుచు, రాజమహేంద్రవర రెడ్డిరాజుల కభ్యుదయము గూర్చుచుండెడివాఁ డని, వీరభద్రారెడ్డి యనుజుఁ డగు దొడ్డారెడ్డికిఁ గృతిగా నర్పించిన శివలీలావిలాసమునందు నిశ్శంకకొమ్మనామాత్యుఁ డిట్లు తెలిపియున్నాఁడు.

నిపుణత్వంబునఁ బ్రస్తుతింపవలయున్ శ్రీవీరభద్రాచలా
గ్రపుదివ్యాతతభర్మహర్మ్యతలజాగ్రద్వీరభద్రాఖిలే
శపదాంభోరుహభక్తిసుస్థిరరమాసంపూర్ణభీమేశ్వరుం
ద్రిపురారీంద్ర గురూత్తమాత్మభవునిం దేవేంద్రకోలాహలున్.

వీరభద్రశిఖరి యనగాఁ రాజమహేంద్రవరమున కుత్తరముగ నాలుక్రోశముల దూరములో గౌతమీనదీమధ్యమునఁ బట్టిస శ్రీవీరభద్రేశ్వరస్వామి నెలకొనిన పర్వతము. భారతదేశమునందలి పంచకాశీక్షేత్రములలో నిది యొక కాశీక్షేత్రముగ గణుతి కెక్కినది. కావున నట భీమయగురువు తప మాచరించుచుండెడివాఁడు. ఈభీమయ గురువరేణ్యుని పదసమారాధనము కాశీఖండరచనకుఁ గారణసామగ్రి యైనట్టులు కాశీఖండమునం దుగ్గడించియున్నాఁడు.

ఘోడెరాయాంక సద్గురురాజభీమేశ్వ
రస్వామి పదసమారాధనంబు.

—కాశీ. 1 ఆ.

భీమేశ్వరపురాణ రచనారంభమునకు మంగళాలంకారముగా వేమవీరభద్రారెడ్ల ప్రభావము నభివర్ణించిన తరువాత, కృతిభర్తయైన బెండపూఁడి అన్నమంత్రి వంశావతార మభివర్ణించుచు, తద్వంశస్థుల కార్యఖడ్గనిపుణతను సాహసౌదార్యములను ధర్మనిరతిని బేర్కొని యున్నాఁడు. వారిలో అన్నమంత్రియన్నయైన లింగనమంత్రి, అల్లాడ రెడ్డికిఁ జేదోడువాదోడుగ నుండి యాతని సాంగ్రామికకార్యములను సరిదిద్దు చుండెడివాఁ డని నిరూపించినాఁడు.

సీ. ఝాడేశవన సప్తమాడెం బాహుహచ్చౌంతి
వంతునాదిక్షితీశ్వరుల గెలిచి
యొడ్డాది మత్స్యవంశోదయార్జునుచేతఁ
బల్లవాధిపుచేతఁ బలచ మంది
దండకారణ్యమధ్యపుళింద రాజ రం
భాహివంశజులకు నభయ మొసఁగి
భానుమత్కుల వీరభద్రాన్న దేవేంద్ర
గర్వసంరంభంబు గట్టిపెట్టి
యవన కర్ణాట కటక భూధవులతోడ
బలిమి వాదించి యేలించెఁ దెలుఁగుభూమిఁ
దన నిజస్వామి నల్లాడ ధరణినాథు
బళిరె యరియేటిలింగనమంత్రివరుఁడు.

—1-67.

అల్లాడభూవల్లభుఁడు జయించిన ప్రాంతముల నీపద్యము వివరించుచుఁ దజ్జయమున లింగనమంత్రి తోడ్పాటును దెలుపుచున్నది. మఱియు లింగనమంత్రిని నవీనరుక్మాంగదుని జేసి, యాతఁడు ద్వాదశీ పుణ్యవేళ బ్రాహ్మణులకు సమృద్ధమైన భోజనములు పెట్టెడి తీరును వర్ణించి, నాఁటి విశిష్టభోజన పరిపాటి నిట్లు తెలిపియున్నాఁడు.

సీ. ఖండశర్కర జున్ను కండచక్కెరలు దో
సెలు వడ లేవెపాసెములతోడఁ
గమ్మఁగాఁ గాచిన కఱియాలనేతితోఁ
గమనీయ పంచభక్ష్యములతోడ
సంబారములతోడి శాకపాకములతోఁ
బక్వమైన పెసరపప్పుతోడఁ
దేనియధారతోఁ బానకంబులతోడ
శిఖరపాడబరసశ్రేణితోడ

నచ్ఛలవణాదికముతోడ నమృతఖండ
పాండరంబైన దధితోడ బ్రాహ్మణులకు
భోజనము వెట్టు ద్వాదశీపుణ్యవేళ
లింగమంత్రి నవీనరుక్మాంగదుండు.

—1–60.

ఈవంశమునఁ బూర్వజులకు అరేటివారను పేరేర్పడెను. దానికిఁ గారణము, ఏతత్పూర్వుఁడగు పోలయ అన్నమంత్రి యనునాతఁడు 'అరియేఁడు, లేక అరేఁడు' అను గ్రామము నగ్రహారముగాఁ బడసెను. తన్మూలకముగ వీరి యింటిపేరు అరేటి యయినది. ఆవిషయము నిట్లు వివరించినాఁడు.

కొలనుప్రతాపరుద్ర నృపకుంజరుచేత నరేఁడు సారణీ
సలిలవివర్ధమానబహుసస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకరగ్రహణవేళఁ దగంగఁ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరి యెట్లు ప్రధాను లెవ్వరున్.

—1_49.

లింగనమంత్రి యనుజుఁడగు అన్నమంత్రి, వివిధభాషలను జదువ వ్రాయ నేర్చినవాఁడై, వేమవీరభద్రారెడ్లకు మహామాత్యుఁడై కార్య

ఖడ్గధురీణుఁడై నెగడినవాఁడు. ఆతని శివభక్తితత్పరతకు నిదాన మైన ధార్మికకృత్యములను శ్రీనాథుఁ డిట్లు పేర్కొనినాఁడు.

సీ. రాజమహేంద్రదుర్గమునఁ గావించె శ్రీ
వీరభద్రునకుఁ బ్రాకారరేఖ
నిలిపె మార్కండేయ నీలకంఠుని మ్రోల
రామేశుఁ దమతల్లి నామకముగ
సంగమేశ్వర దివ్య శంభులింగమునకుఁ
గల్పించెఁ గల్యాణగర్భగృహము
దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి
మొగలివాకిట ధామమును రచించెఁ
బ్రాగ్దిశావప్రగోపుర ప్రాంగణమున
సప్తమునిసింధు సోపానసరణికెలనఁ
దీర్చె భవనంబు భీమయదేవునగర
మంత్రిదేవయ యన్నయామాత్యవరుఁడు.

—1—76.

రాజమహేంద్రవర దుర్గములోనుండిన వీరభద్రేశ్వరునకుఁ బ్రాకారమును గట్టించె ననినాఁడు. అట్టి వీరభద్రేశ్వరాలయ మేదేని యానాఁ డుండెనేమో? కాని యట్టియాలయ ముండినట్లు నిదర్శన మేదియుఁ గానరాదు. ఆనాఁటి రాజమహేంద్రవరమునకుఁ బంచగిరి దుర్గమని ప్రసిద్ధి. 1. హేమగిరి (నేఁటి వేమగిరి. ధవళేశ్వరమున కొకమైలు క్రిందనున్నది.) 2. ధవళగిరి. (ధవళేశ్వరము) 3. పద్మగిరి. (రాజమహేంద్రవరము. గోదావరిస్టేషను సమీపప్రదేశము) 4. భద్రగిరి. (పట్టిస శ్రీ వీరభద్రేశ్వరుఁడు నెలకొనిన కొండ.) 5. రామగిరి (రాజమహేంద్రవరమున కుత్తరముగ పదిక్రోసులదూరమునందున్న రామగిరి దుర్గము.) గౌతమీనదీతీరము నంటియున్న పంచగిరులతోఁ గూడి రాజమహేంద్రదుర్గము శత్రుదుర్భేద్యమై యుండెడిది. కావున రాజ

మహేంద్ర దుర్గమునందలి శ్రీ వీరభద్రేశుఁ డనఁగా పట్టిస శ్రీవీర
భద్రేశుఁడే కావలయును. అతని యాలయమునకుఁ బ్రాకారమును
నిర్మింపఁజేసె ననిన సంపదను.

మార్కండేయశివుని కెదురుగ తమ తల్లిపేర రామేశుని నిలిపె
నఁట. అన్నమంత్రి తల్లిపేరు రామమాంబయగుటచేఁ దన్నామకముగ
రామేశుని నిలిపియేయుండును. కాని యానాఁటి మార్కండేయాల
యము గాని, లింగము గాని, ప్రాకారగోపురాదులు గాని యీనాఁ
డేవియుఁ గానరావు. విధ్వస్తములై నిలీనము లగుటచే నీ రామేశుఁడు
నేఁడు గానరాఁడు.

సంగమేశ్వరదివ్యశంభులింగ మనఁగా, నేఁటి రామచంద్రపు
రము తాలూకాలోని తాపేశ్వరము ఏడిది మండపేట యను గ్రామము
లకు నడుమ నుండిన సంగమేశ్వరుఁడు. ఈ యీశ్వరాలయమునకుఁ
గల్యాణమండపము గట్టించెను. తుల్యభాగాతీరము నంటియున్న శంభు
లింగములలో నిది ప్రాథమ్యము వహించిన యీశ్వరలింగము. శాసన
మేదియు నున్నట్టులు గానరాదు.

దక్షారామ భీమేశ్వరాలయమున భీమేశ్వరున కెదురుగ తిరు
చుట్టుమాలెకు మీఁదుభాగమున విశాలమయిన మండపమును నిర్మింపఁ
జేసినాఁడు. ఈమండపమునందే యేటేట భీమేశ్వరుని కల్యాణ
మహోత్సవములు, సానికూఁతుల యభినయప్రదర్శనములు జరుగు
చుండును. ఈవిషయమును శ్రీనాథుఁడు దక్షారామమును వర్ణించు
ఘట్టమునం దిట్టు లుగ్గడించియున్నాఁడు.

"వెండియు భీమేశ్వరుఁడు పండువుపండువు నఖండవిభవంబున...
నిలింపగంధర్వాప్సరోజాతులగు సానికూఁతులు గొలువ, జగనొబ్బగండ
జగదగోపాల పల్లనాదీశ్వర పల్లవత్రినేత్ర కేళాదిరాయ, రాయవేశ్యా
భుజంగ బిరుద భాస్వరాల్లయ వేమభూపాల రాజ్యభారధురంధరుం డా
బెండపూఁ డన్నయామాత్యుఁడు గట్టించిన మొగసాల వాకిటి మహో

త్సవ మండపమునందుఁ బేరోలగంబుండి...కుండలీ దండలాసక ప్రేరణీ ప్రేంఖణ సింధుకందుక ఘుమాళిచేల మతల్లీ హల్లీసకాది నృత్యంబు లవలోకించుచు నుండు" ననినాఁడు.

ఆమహోత్సవ మండప మీపద్యమునఁ బేర్కొనఁబడినదియే.

మఱియుఁ దనకుఁగులదైవతమైన దక్షారామభీమేశ్వరాలయమునందలి తూర్పుదిక్కున నిర్మింపఁబడిన ప్రాకారగోపురమునకు సప్తగోదావరము మెట్లకు నడుమ నొక పండ్రెండు స్తంభములు గలమండపమును నిర్మించి, యొక స్తంభమునం దీక్రిందిశాసనమును వెలయించియున్నాఁడు

శ్లో॥ అస్తిప్రశస్తమతి రల్లయ వేమభూపో
రాజ్యోన్నతో జగతి రాజమహేంద్రపుర్యామ్।
మంత్రీ హితో ఽస్య మతినిర్జిత దేవమంత్రి
ది[గ్ ]వ్యశ్రియా జయతి దేవయ అన్నమంత్రీ॥ ౧
శాకే పుష్కరబాణవిశ్వగణితే సంవత్సరే కీలకే
కార్తిక్యాం శనివాసరే సుకృతధీః శ్రీయన్నమంత్రీశ్వరః।
దాక్షారామజ భీమలింగపురతః శ్రీసప్తగోదాతటే
ప్రాచీగోపురమణ్డపం సమకరో ద్రమ్యం శిలానిర్మితం॥ ౨
ద్వాదశసంఖ్యాస్తంభే, సదా బహిర్ద్వారమణ్డపే విహరన్।
రక్షతు భీమేశో ఽయం, శ్రీదేవయయన్నమంత్రి మాకల్పమ్॥* ౩

అన్నామాత్యుఁడు విశేషముగ నీశ్వరభక్తుఁడగుటచేఁ దాను నెఱపెడి ధర్మము లన్నియు నీశ్వరాలయములకే గావించె ననుట కీపద్యము నిదర్శనము. శ్రీనాథుఁడు కృతికర్తమనస్తత్త్వమును గుర్తించి, యన్నమాతని కభిమతమైన విషయమును గ్రంథస్థము గావించును. అన్నమంత్రిని లావణ్యారూపసంపదఁ బూవిలుకానినిఁ జేసి, పంచారామవధూటీపంచాస్త్రవిహారకేళిపాంచాలుని గావించియున్నాఁడు. తనన్నాళ్ల లముగ దక్షారామ వేశ్యావిభవమును విశేషముగ వర్ణించి, వారిచే

* చూ. దక్షిణ హిందూస్థాన శాసనసంపుటము IV No. 1381

నన్నమంత్రి గట్టించిన మొగసాలవాకిటిమహోత్సవమండపమున నాట్య భంగిమలు ప్రదర్శింపఁజేసినాఁడు. ఇంతియగాక యాతనిరూపసంపద విశిష్టమయిన దని తెలుపుట క్రిందిపద్యమును గూర్చినాఁడు.

శా. కాంచీకంకణతారహార కటకగ్రైవేయభూషావళుల్
లంచంబిత్తురు దూతికాతతికి లీలన్ బెండపూఁడన్ననిన్
బంచాస్త్రోపముఁ దారుతార కవయం బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బల్వలపురిం బ్రౌఢేందుబింబాననల్
—1—78.

పంచారామములు

ఆంధ్రదేశమునఁ జాలకాలమునుండి చారిత్రకప్రసిద్ధి గలిగి, భారతదేశీయు లందఱకు, ముఖ్యముగ నాంధ్రులకుఁ బ్రసిద్ధపుణ్యక్షేత్రములై నెగడినవి పంచారామములు. వానిలో నాలుగారామములు గోదావరీ తీరభూమినంటియు, నొకటి కృష్ణానదీతీరభూమినంటియు నెలకొని యున్నవి. ఇవి వరుసగా 1. కుమారారామము 2. దక్షారామము 3. క్షీరారామము 4. సోమారామము 5. అమరారామము — అనునవి. ఇవన్నియును ప్రఖ్యాతములైన ఈశ్వరక్షేత్రములు. ఈయారామముల యుత్పత్తి భీమేశ్వరపురాణమునం దిట్లునిరూపింపఁబడినది.

"అనంతరం బాయంబికావల్లభుండు...కృతకృత్యుండై త్రిపురదైతేయుల కులదైవతంబైన యద్దివ్యలింగమును పంచఖండంబులుగ ఖండించి, కృష్ణవేణీమహానదీతీరంబున ధరణాలకోట యనుగ్రామంబున నమరేశ్వరుని చేతంబ్రతిష్ఠితుఁడగుటంజేసి యమరలింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీతీరంబున దక్షిణకూలంబున గునుపూండి యనుగ్రామంబున సోమునిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి సోమలింగంబనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును, పాలకొల్లనను గ్రామంబున శ్రీరామచంద్రునిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి రామలింగంబనాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును, చాళుక్యవంశరాజధాని యగు

చాళుక్య భీమవర నామగ్రామంబునఁ గుమారరత్నంబైన కుమార
స్వామిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి కుమారభీమలింగం బనఁ బ్రఖ్యాతి
నొందిన భీమారామంబును, మొదలిమామయగు దక్షప్రజాపతియునికి
పట్టైన యారామంబగుట దక్షారామంబున శివసన్నిధానంబై తా
నుండునట్టుగా నీప్రకారంబున భోగమోక్షప్రదంబులైన పంచారామ
ములను బ్రతిష్ఠనొందించి తానును దక్షవాటంబున శ్రీ భీమేశ్వరలిం
గంబునం దధివసించె.”

త్రిపురాసుర సంహారానంతరము తదుపాస్యమైనలింగమును పంచ
ఖండములుగాఁ బరమేశ్వరుఁడు ఖండింపఁగా, నాఖండములు ప్రతిష్ఠి
తములైనచోటులు పంచారామములైనట్లును, ఆలింగములను బ్రతిష్ఠచే
సినవారిపేరఁ గొన్నిటికిఁ దత్తదారామనామము లేర్పడినట్లును దీనిని
బట్టి తెలియుచున్నది. ఈనాఁ డీయారామము లీక్రిందివిధముగ వ్యవహ
రింపఁబడుచున్నవి.

1. అమరారామము — అమరావతి. ధరణాలకోట — ధరణి
కోట. అచటియీశ్వరుఁ డమరేశ్వరుఁడు. అమరావతీ శాసనములలో
అమరారామము, ధాన్యవాటి, ధాన్యకటకము, ధరణికోట, దరణ
కోట, ధన్నలకోట యనునివి పర్యాయపదములుగాఁ బేర్కొనఁబడి
నవి. * కృష్ణవేణీ నదీతీరమునందలి శివక్షేత్రములలో శ్రీశైలము
తరువాతఁ బ్రఖ్యాతమైన శివక్షేత్ర మిదియే. ఇది శైవక్షేత్రమగుటయే
కాక బౌద్ధక్షేత్రము కూడను. కావుననే యమరేశ్వరాలయసమీప
మున బౌద్ధస్తూపములు తత్సంబద్ధమైన శాసనములు నెలకొనియున్నవి.

2. సోమారామము — నేఁ డిది గునుపూఁడి భీమవరము.
ఇది గౌతమీనదికి దక్షిణతీరము నంటియున్నది. ఇచటి సోమేశ్వరుఁడు
గునుపూఁడి గ్రామమును జేరియున్నాఁడు. ఆతావున దానికి సోమా
రామ మను ప్రసిద్ధి యేపాటియుఁ గానరాదు. ఆప్రదేశమునకు గోస్త

* See S.i.i. Vol. VI No 226, 27, 28, 31, 248.

సీనది సంబద్ధమైయున్నది. కొన్ని ప్రాచీన శాసనములలో నీప్రాంత మునకు 'పాగునార, పావునార, పానారసీమ' యనుపేరులు గానవచ్చు చున్నది.

3. క్షీరారామము — ఈనాఁడు దీనిపేరు పాలకొల్లు. అచటిశా సనములలో 'పాలుకొలను క్షీరారామము' అనునామములు గలవు. అచటియీశ్వరుఁడు రామేశ్వరుఁడు.

4. కుమారారామము. దీని కీనాఁడు సామర్లకోట భీమవరము అని వ్యవహారము. చాళుక్యభీమున కిది రాజధాని యగుటచేఁ దొలుత దీనికి భీమవరము, చాళుక్యభీమవరము అనుపేరులు శాసన నిబద్ధ ములై యున్నవి.[1] దీనికి కుమారారామము, స్కందారామము అను నామములు గొన్ని శాసనములలోఁ గానవచ్చుచున్నవి.[2] ఇచట యీశ్వరునకు 'చాళుక్యభీమేశ్వరుఁడు' అను నామముకూడఁ గొన్ని శాసనములందుఁ గాననగును. శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమునందే మఱియొకచోట —

సీ. అదె కుమారారామ మాహాత్మ్య రేఖయ
చాళుక్యభీమేశు సదనవాటి

—భీమ. 3—55

మ సరిసామంతుఁడు శ్రీకుమారవనికా చాళుక్యభీమేశ్వరే
శ్వర దేవుండు ... ... ...

—భీమ. 5-89

అనియు వాకొనియున్నాఁడు. 'చాళుక్యభీమనగరీ విహితాస్ప దాయ' అనియొక శాసనశ్లోకమునం దుదాహృతమై యున్నది. దీనిని బట్టి కుమారారామము చాళుక్యభీమవర మనియు, అచట నెలకొనిన యీశ్వరునకు, కుమారారామ భీమేశ్వరుఁడు, చాళుక్య భీమేశ్వరుఁడు

1. See. S.i.i. Vol. V No. 49, 68, 2(, 8?, 90
2. See. S.i.i. Vol. V No. 36

చాళుక్యభీమేశ్వరేశ్వరుఁడు, అను నామములు గ్రంథస్థములు, శాసనస్థములు నై గానవచ్చుచున్నవి. చాళుక్యభీమునకుఁ గుమారారామ భీమేశ్వరుఁ డుపాస్యదైవతము. ఆతఁ డాస్వామి కాలయప్రాకార గోపురాదికమును నిర్మించి మహావిభవము గల్పించినాఁడు. తన్మూలముగ నా భీమేశ్వరునకు చాళుక్యభీమేశ్వరుఁడు, చాళుక్యభీమేశ్వరేశ్వరుఁడు అనునామము లేర్పడినవి.

ఇది యిటుండఁ జరిత్రపరిశోధకులు కొందఱు, చాళుక్యభీముఁడు, తన రాజధానియగు భీమవరమునఁ దనపేర భీమేశ్వరలింగమును స్థాపించెననియుఁ, దన్మూలమున నచటియీశ్వరునకు చాళుక్యభీమేశ్వరుఁ డను నామ మేర్పడె ననియు వాక్రొనుచున్నారు. ఈవిషయమును సరిపెట్టుట కీక్రిందిశాసన శ్లోకములను ప్రమాణముగా నుదాహరించుచున్నారు.

శ్లో. తద్భ్రాతు ర్విక్రమాదిత్యస్య తనయ శ్చాళుక్యభీమః
షష్ట్యుత్తరం య స్త్రిశతం రణానాం
జిత్వా స్వనామ్నా ప్రథితం విధాయ
చాళుక్యభీమేశ్వరదేవహర్మ్యం
త్రింశ త్సమా భూతల మన్వరక్షత్

మల్లపదేవుని పిఠాపురశాసనము.1

శ్లో. ఆసీ దిందుకులాగ్రణీ ర్జనపతిః చాళుక్యభీమేశ్వరః
తస్య క్షాత్రపవిత్రశైవపదవీవృత్తం విచిత్రం భువి
తేనైవార్పితవైభవా క్షితలు సదా చాళుక్యభీమేశ ఇ
త్యాఖ్యా మాప దపూర్వికామిహ కుమారారామభీమేశ్వరః

చాళుక్యవిశ్వేశ్వరుని ధర్మలింగశాసనము. 2

ఈశాసన శ్లోకములను బట్టి చూచినను, కుమారారామభీమేశ్వరునకు చాళుక్యభీముఁడు హర్మ్య నిర్మాణము చేయించి, వైభవ

1. See Epi. Ind. Vol IV PP. 226
2. See Epi. Ind. Vol IV PP. 164

సముపేతునిగఁ జేయుటచే నాతనికి చాళుక్యభీమేశ్వరుఁ డను పేరేర్పడి నట్లులే తెలియుచున్నది. శ్రీనాథుని వచనములు కూడ నీవిషయమునే విశదము చేయుచున్నవి. కావున చాళుక్యభీముఁడు తనపేర లింగమును స్థాపించుటచే నచటి యీశ్వరునకు చాళుక్యభీమేశుఁ డను పేరేర్పడె ననుట యుక్తిసహముగఁ గన్పట్టదు.

"చాళుక్య భీమునికోట ధ్వంసమైన కొంతకాలమునకు, కాటయ వేమారెడ్డి తూర్పునాఁడును జయించి, యీప్రాంతమంతయు వశము చేసికొనినపుడు, అంతకుముందు కోట యుండిన ప్రదేశమును త్రవ్వింపగా చాళుక్యుల కుపాస్యమైన మహిషాసురమర్దని శక్తి యచటఁ గాన వచ్చినది. ఆవిగ్రహమునకు కాటయవేముఁడు 'శ్యామలాదేవి' యని నామముంచి, దేవళము గట్టించి, దానికి దక్షిణముగ గ్రామము నిర్మింపఁ జేసి, దానికి శ్యామలాదుర్గ మని పేరుపెట్టినాఁడు. ఇదియే క్రమముగ సామర్లకోట యయినది" అని సామర్లకోట కైఫియతులోఁ జేర్పఁ బడియున్నది. ఆమహిషాసురమర్దని విగ్రహము నేఁడు తిరిగి భీమేశ్వరాలయమునకుఁ జేరి యచటఁ దలదాఁచుకొని నిలిచియున్నది. భీమవరము సామర్లకోట యీనాఁడు కలిసియుండుటచే సామర్లకోటభీమవర మయినది.

5. దక్షారామము — దీనిని సంస్కృతపదముగా వాడినపుడు శాసనములలో దక్షారామము, లేక దాక్షారామము అని వ్యవహరించియున్నారు. తెలుఁగు పదముగా వ్యవహృతమయినపుడు, పెద్దడకరేమి, పెద్దడాకరేమి, డాకరేమి యనుపదములు పర్యాయపదములుగాఁ గానవచ్చుచున్నవి. చాళుక్యభీముఁడే దక్షారామ భీమేశ్వరాలయమును గూడ నిర్మింపఁజేసినట్లు ప్రాంతీయులు చెప్పుకొందురు. కుమారారామ దక్షారామ భీమేశ్వరాలయముల ప్రాకారగోపురాదులు, లింగములు, తత్సన్నిధానమున కుపయోగించిన శిలలు శిల్పములు అన్నియును భేదమేమి లేక యేకరీతిగఁ గన్పట్టును. కావుననే యీయాల

యములు రెండును చాళుక్యభీమ వినిర్మితము లనుట పొసగియున్నది. ఈయూహను బట్టియే కాఁబోలు శ్రీనాథుఁడు కుమారారామ భీమే శ్వరుని దక్షారామభీమేశ్వరునకు సరిసామంతునిగాఁ జిత్రించియున్నాఁడు.

"దక్షుని సవనాగారము, దక్షారామంబు" అను శ్రీనాథుని నిర్వచనమునుబట్టి, దక్షునివాసమైన యారామ మగుటచేతను ఈ యారామమునకు దక్షారామ మనునామ మేర్పడినట్టులు సాంప్రదాయి కముగఁ దెలియవచ్చుచున్నది. ఇచటఁ బరమేశ్వరుఁడు స్వయముగ సంప్రతిష్ఠితుఁడగుటచే నిచట శివసన్నిధాన మేర్పడి యుండెనని శ్రీనా థుని నిర్వచనము. ఇంతియగాక యాంధ్రదేశమునకుఁ 'త్రిలింగదేశము' అని ప్రాచీన వ్యవహారము. ఆత్రిలింగములలో దక్షారామభీమేశ్వర లింగ మొకటి. ఆంధ్రదేశమును పాలించిన ప్రభువు లెవరయినను వారి వారి భక్త్యుత్సాహముల ననుసరించి దక్షారామభీమేశ్వరున కుపాయ నము లర్పించి శాసనములు వెలయించియున్నారు. అట్టిశాసనము లీ దక్షారామదేవాలయమునందు సుమారు 380 గలవు. ఈశాసనములు చాలవఱకు నన్నియు వెనుకటి శతాబ్దులకు సంబంధించినవియే. ఈ శాసనము లాయాప్రభువుల పాలన సమయమును దెలుపుచు, నానాఁటి ప్రభువుల కాస్వామిపై నెంతటి భక్తిభావ ముండెడిదియో తార్కా ణించుచున్నవి.

ఈ విషయమును వ్యంగ్యముగ స్ఫురింపఁజేయుచు భీమనాథుని మహిమమును శ్రీనాథుఁ డిట్లు పేర్కొనియున్నాఁడు.

సీ. గజచర్మ మెన్నఁడో కాని నిచ్చలుఁ గట్టు
పసిఁడికమ్ముల పట్టుపచ్చడంబు
భసిత మెన్నఁడో కాని ప్రతిదినంబు నలందు
మలయజంబు కురంగమదము గూర్చి

నిడుదపాములరాజుతోడవు లెన్నఁడో కాని
తారహారములు నిత్యము ధరించు
నృకరండరుండ మాలిక లెన్నఁడో కాని
ధరియించుఁ గల్హారదామ మెపుడు
గాటి నడుచక్కినెన్నఁడో కాని యుండు
దక్షవాటి సువర్ణసౌధములమీఁద
నెన్నఁడో పిశాచులనుగాని యిందుముఖుల
నెల్లకాలంబు దలఁచు భీమేశ్వరుండు.

— 1—16.

శ్రీనాథుని నాఁటి దక్షారామభీమేశ్వరవిభవ మీ పద్యమున పరిస్ఫుట మగుచున్నది.

సీ. ఒకవేళ ధరియించు యవనాశ్వుఁ డిచ్చిన
కట్టాణిముత్యాల కంఠమాల
మాంధాతృఁ డిచ్చిన మాణిక్యఖచితకే
యూరంబు ధరియించు నొక్కవేళ
నిక్ష్వాకుఁ డిచ్చిన హీరాంకురంబుల
యుంగరంబు ధరించు నొక్కవేళ
ఘనచక్రవర్తి యిచ్చిన ప్రవాళంబుల
యొడ్డాణము ధరించు నొక్కవేళ
వేడ్క ధరియించు నొక్కొకవేళయందు
భరతమువ్యంతరంతినాభాగనహుష
నలభగీరథ నృగమహీనాథదత్త
హేమ మణిభూషణముల భీమేశ్వరుండు.

—భీమ. 1—117.

భీమేశ్వరుఁడు పదునాలుగుయుగముల ముదుకఁ డనువిషయము నీపద్యము దృఢముచేయుచున్నది.

## కథావస్తువు

ఈ భీమేశ్వరపురాణమునందలి కథావస్తువు కేవలము భీమ మండలమునందలి తీర్థక్షేత్రమహత్త్వము నుగ్గడించునది. పరమేశ్వర భక్తిభావావిష్టచిత్తుల కది కొంత యుత్సుకత నాపాదించునదియైనను కావ్యరసాస్వాదలోలుపుల కది యంత తృప్తిని గొల్పునది కాఁజాలదు. అట్టి యితివృత్తము ప్రధానముగాఁ గల భీమఖండమును మూలముగాఁ బెట్టుకొని, ఈశ్వరార్చనకళాశీలుఁడగు శ్రీనాథుఁ డొక రసవత్ప్రబంధ ముగా భీమేశ్వరపురాణము నాంధ్రమున సంతరించియున్నాఁడు. ఈ రచనలో భీమమండలమున కంతటికి నొక భౌగోళిక రేఖాచిత్రమును తీర్చి దిద్దినాఁడు. మూలములో నుండి విసుగు జనించెడి వర్ణనవిషయము లను సంక్షేపించుచు, సంక్షిప్తములైనవానిని గొంతకొంత విపులీకరిం చుచుఁ బ్రబంధముద్ర నతికించి పెట్టినాఁడు. తత్తదాశ్వాసములలోని యితివృత్త మీక్రమమున విభాగింపఁబడినది.

ప్రథమాశ్వాసము—ఈ యాశ్వాసములోని విషయ మంతయు స్వకపోలకల్పితము. కృత్యాదికృత్యమును నిర్వర్తింపఁజేసిన తరువాత ఈమహాప్రబంధమునకుఁ గథానాయకుండైన భీమేశ్వరస్వామికిఁ బ్రియ ధామమైన దక్షారామ పురవర్ణనముతోఁ బ్రబంధప్రారంభము గావించి నాఁడు. ప్రబంధలక్షణము సిద్ధించుటకు పురవర్ణనము ప్రారంభము కావింపఁబడినది. కాని యాపురవర్ణనము కథానాయకునకుఁ బ్రియ మైన వస్తుసామగ్రికి సమున్మేషరూపమయినది. దక్షారామ విలాసినీ వతుల సౌందర్యము తదుత్తమకులజాతి సంభూతియు విశేషముగ నిరూ పింపఁబడినది. క్రమముగ నచటియారామములు, సరోవరసంపద, మందమారుతప్రసారము చిత్రింపఁబడినవి. ఆవెనుక, మాణిక్యాంబికా దేవి, సానికూఁతుల నాట్యభంగిమలు, సప్తగోదావరము అనువీని వైభవ మును వర్ణించినాఁడు. పిమ్మట నొక గద్యమున దక్షారామమునందలి వివిధవిభవములు, తీర్థకుండములు గోదావరీనదీశాఖలు పురోపవనములు

నాల్గుజాతులజనులు వారివారివర్తనములు మున్నగునవి వర్ణింపఁబడి నవి. తుదిని కృతిభర్తయగు బెండపూఁడి అన్నమంత్రి భీమేశ్వరస్వామి నాలయమునఁ గట్టించినమహోత్సవమండపమున నెఱపెడి యుత్సవ క్రమము, అభినయకళాప్రదర్శనమును గలవు. ఈయాశ్వాస మంతయు జాలవఱకుఁ గృతిభర్త యభిరుచులను వివరించుచు, నాతనికిని దనకును దక్షారామభీమేశ్వరునెడఁ గలభక్తిభావమును వివరించునదియైయున్నది.

ద్వితీయాశ్వాసము — ప్రథమాశ్వాసముతుదిని సంస్కృతమూల మునందలి కథావస్తు వుపక్రమింపఁబడును. ప్రబంధమునకుఁ బ్రధాన మయిన యితివృత్తవిస్తృతి యీయాశ్వాసమునందేఁ గానవచ్చును. మొదటిది దక్షాధ్వరధ్వంసము. అది దక్షారామము భోగమోక్ష నివాస మగుటకుఁ గలకారణమును తెలుపును. ఆవెనుక వ్యాసుఁడు కాశిని బాసి దక్షారామమునకు వచ్చుటకుఁ గలప్రధానకారణమును వివరింపఁ దలఁచి, కాశీవిభవమును గొంత వర్ణించి, సూర్యాస్తమయ చంద్రోదయ సూర్యోదయ వర్ణనములను గావించియున్నాఁడు. ఈవర్ణ నము మూలములో లేని దయినను, ప్రబంధముద్ర నాపాదించుటకై కూర్పఁబడినది. ఇది స్వకపోలకల్పితమై కవికిఁ గల కల్పనాపాటవమును వ్యక్తీకరించునదిగా నున్నది. ఆవెనుక కాశినుండి బయలుదేఱినవ్యా సుఁడు శిష్యసహితుఁడై నడుమనుండెడి జగన్నాథము శ్రీకూర్మము సింహాచలము దర్శించుచుఁ బిఠాపురము చేరును. అటనుండి కుమారా రామ సర్పవగముల దర్శించి, తుల్యభాగాతీరమున ముక్తీశ్వరు దర్శించి, దక్షారామమునకుఁ బయనించుచుండఁగా నచట లోపాముద్రాసహితుఁ డయిన యగస్త్యుని గాంచును. పీఠికాపుర సర్పవర వర్ణనములు నడుమ విశిష్టముగఁ జేయఁబడినవి. అగస్త్యుఁడు, కుశలప్రశ్నానంతరము వ్యాసునిఁ గాశి వదలి వచ్చుటకుఁ గారణ మేమని యడుగును. ఆతఁడు కాశిలోఁ దానుబడిన భంగపాటును దెల్పి, విశ్వేశ్వరుని యాగ్రహము నకు అన్నపూర్ణ యనుగ్రహమునకుఁ బాత్రుఁ డెట్లయ్యెనో యగస్త్య

నితోఁ దెలుపును. వివిధరసభావభరితమైన కథావస్తుసన్నివేశ మీ యాశ్వాసముననే మనకుఁ గానవచ్చును.

తృతీయాశ్వాసము — వ్యాసుఁడు లోపాముద్రాసహితుఁడైన యగస్త్యుఁడును నంబరమున నిలిచి, భీమమండలిఁ బరికించుట. కుంభసంభవుఁడు వ్యాసునకు నీమండలమునందలి ప్రసిద్ధతీర్థక్షేత్రముల నెఱిఁగించుట, దక్షారామతీర్థక్షేత్రమాహాత్మ్యవిశేషము తెలుపుట, వ్యాసుఁడు పంచతీర్థము లాడి భీమేశ్వరుని దర్శించి స్తుతించుట, యను నీవిషయములు గలవు. ఈ యాశ్వాసమున భీమమండలిలోని ప్రసిద్ధ శివక్షేత్రములు పవిత్రతీర్థములు తత్తన్మహాత్త్వములు పేర్కొనఁబడినవి. వీనిని వర్ణించునప్పుడు శ్రీనాథుఁడు తాను ప్రత్యక్షముగఁ గన్గొనిన విశేషములలోఁ దననాఁట నిలిచియున్న వానిని బాఠకులయెదుటఁ బెట్టి నాఁడు. ప్రధానముగ నీయాశ్వాసమున భీమమండలీభీమనాథుల ప్రశస్తి వర్ణింపఁబడినది.

చతుర్థాశ్వాసము — పరమేశ్వర భక్తులు శివుని మహిమలు వర్ణించునపుడు కాలకూటభక్షణమును త్రిపురాసురసంహారమును ప్రధానముగ వర్ణింతురు. ఈమహాత్తరకృత్యములు రెండును సకలలోక రక్షణార్థము, ప్రధానముగ దేవతాసముద్ధరణమునకై పరమేశ్వరుఁడు గావించియున్నాఁడు. ఈ రెంటిడికిఁ గార్యకారణభావము గల్పించి, పరమేశ్వరవిరచితములైన నీయపదానములు రెండిటిని విపులముగ వర్ణించి, త్రిపురాసురసంహారానంతరము పరమేశ్వరుఁడు దక్షారామభీమేశ్వర లింగమునుఁ బ్రతిష్ఠితుఁడైనవిధము తెలిపినాఁడు. భీమనాథు నభిషేకించుటకు సప్తర్షులు గోదావరీనదిని గొనితెచ్చుట, సప్తగోదావరావతరణము తుల్యభాగోత్పత్తి ప్రకారము, సప్తర్షులు భీమేశ్వరుని స్తుతించుట యనునివి యిందు వర్ణితములు. వీనిలో కాలకూటకబళనము దక్షారామ వాసికి భీమేశ్వరనామధేయ ప్రాదుర్భావమునకు మూలమైనది. త్రిపురాసుర సంహారము పంచారామప్రాదుర్భావమునకు నిదానమైనది. సప్త

గోదావరావిర్భావము గోదావరీనదీవిభవవర్ణమునకు, శ్రీనాథునకు గోదావరిపైఁ గల భక్తిభావమును వ్యక్తీకరించుటకు మూలమైనది. సప్తర్షికృత భీమనాథస్తోత్రము తన్మహత్త్వప్రతిపాదకమైనది.

పంచమాశ్వాసము — శంకరుఁడు పార్వతితోఁ గూడి, తన పరివారమునంతయు వెంటఁ బెట్టుకొని, కైలాసమునుండి దక్షారామమునకు వచ్చి, భీమలింగమునం దైక్యత నొందుట, బృహస్పతిప్రేరణమున దేవేంద్రుఁడు భీమనాథునకు భీమమండలి ధారవోసి, దానశాసనమును ప్రకటించుట, వసంతాగమము, పరమేశ్వరుఁడు, సకలదేవతావర్గము, దేవతాజాతులకుఁ జెందిన స్త్రీపురుషులు, ఆయుత్సవమునఁ బాల్గొని వినోదించుట, పరమేశ్వరుని పార్వతి ప్రశ్నింపఁగా నీశ్వరుఁడు గౌరికి భక్తిజ్ఞానవైరాగ్యముల నుపదేశించుట యనునవి యీ యాశ్వాసమునందలి విషయములు. వీనిలో వసంతోదయ వసంతోత్సవ వర్ణములలో శ్రీనాథునినాఁటి వసంతోత్సవచ్ఛాయలు చాలవఱకుఁ బ్రతిఫలించినవి. ఈ యాశ్వాసమునందు వసంతర్తువర్ణనము ప్రబంధరచనమునకెంతయు నుపకారిగా జతఁగూడినది. ఈయాశ్వాసము తుదినిఁగూర్చిన ప్రకరణము శివభక్తిస్వరూప సమున్మేషకము.

షష్ఠాశ్వాసము — ఇది దక్షారామ మహత్త్వమును, భీమనాథుని మాహాత్మ్యమును ప్రత్యేకముగఁ బేర్కొనుట కుపక్రాంతమైనది. దక్షాధ్వరధ్వంసమున సుదర్శనాయుధుఁడు గోలుపోయిన చక్రమును మరలఁ బడయఁగోరి, అనుదినము సహస్రకమలములతో శివుని బూజించుట ఒకనాఁ డొకకమలము కొఱవడఁగాఁ దననేత్రమును గొనగోరఁ దీసి యర్పించుట, పరమేశ్వరుఁ డాతనిభక్తికి సంతసించి తిరిగి చక్రమును నిచ్చుటయు చిత్రితమైనది. ఇది యిందలి ప్రధానకథావస్తువు. వెనుకటి యాశ్వాసములలోఁ వర్ణింపఁబడని మఱికొన్ని దక్షారామ తీర్థదైవతముల ప్రశస్తి యుగ్గడింపఁబడినది.

ఇట్లీయాఱాశ్వాసములు సముచితకథావస్తు సముపేతములై

సంస్కృతమూలము ననుసరించుచు, నెడనెడ మధురభావసంభారసము పేతములై, ప్రబంధలక్షణ లక్షితములై, కవితాప్రౌఢతకుఁ దార్కాణములై యొసలారినవి.

దృశ్యసాక్షాత్కారము

శ్రీనాథుఁ డేవస్తువును వర్ణించినను, ఆవస్తువు లేక తత్తన్మూర్తి లేక యావ్యక్తి మనకన్నులయెదుటఁ గానవచ్చునట్లు చిత్రించును. ఇట్టి దృశ్యసాక్షాత్కృతి పద్ధతి యీప్రబంధమునందుఁ బలుతావులఁ గానవచ్చును.

1. దక్షారామమున సాని యీశానివేషము దాల్చి భిక్షాటన నృత్యము నెఱపెడితీరు పరికింపుఁడు.

సీ. విరులదండలఁ గోడి వేణికాభారంబు
　　　　పొంకంబు పిఱుఁదులఁ బొరలి యాడ
మణితులాకోటికోమలఝుణత్కారంబు
　　　　రవలిమట్టెలమ్రోఁతఁ దవఘళింపఁ
గుదురునిండిన చిన్నిగుబ్బచన్నులమీఁద
　　　　ముత్యాలత్రిసరంబు మురువు చూప
వలమానతాటంకవజ్రాంకురచ్ఛాయ
　　　　లేఁతవెన్నెలఁ బుక్కిలించి యుమియ
సాని యీశానియై మహోత్సవమునందుఁ
గేల నవచంద్రకాంతంపుఁగిన్నె పూని
వీథి భిక్షాటన మొనర్చు వేళఁ జేయు
మరులనృత్యంబు జగముల మరులుగొలుపు.

— భీమ. 1–104.

ఈశానివేషము దాల్చినసాని యానాఁడు శిరస్సు మొదలు పాదములవఱకు నలంకరించుకొనినతీరు, తత్స్వరూపము భావనచేసినఁ బ్రత్యక్ష మగురీతిని జిత్రించియున్నాఁడు. సమగ్రరూప చిత్రణము

చేయునపుడు సాధారణముగా నొకసీసపద్యమును గూర్చుట శ్రీనాథుని కొకపరిపాటి. ఇటులనే సమగ్రస్వరూపమును వర్ణింపవలసివచ్చినపుడు పెద్దగద్యము నంగీకరించుటయు నాతని కొకయలవాటు. భీమేశ్వరుని గ్రోల వివిధాభినయములు నెఱపుచు, నాస్వామిని గొలిచెడిసాని కూతుఁల సర్వాంగసౌష్ఠవమును నొక గద్యమున విపులముగ వర్ణించి యున్నాఁడు. ఈ గద్యమునం దాయంగనల శరీరసౌష్ఠవము, వార లలఁదుకొను సుగంధద్రవ్యములు, వారు దాల్చెడి వలిపెములు, వారు ప్రదర్శించెడి అభినయవిశేషములు, వాద్యములు మున్నగుసామగ్రి యంతయు మనయెదుటఁ బ్రత్యక్షమగును.

— భీమ. 1–117.

కాశినుండి తరలివచ్చు వ్యాసుని ఓంకారపురి సమీపమున నగ స్త్యుఁడు గాంచినపుడు, వ్యాసునియాకృతి కొక రేఖాచిత్రమును రచించినాఁడు.

సీ. భస్మత్రిపుండ్రాంక ఫాలప్రదేశుని

రుద్రాక్షమాలికారూఢవక్షు

నుపవీతకృష్ణాజినోత్తరాంగుని బల్ల

వారుణాంచితజటాపటలధారుఁ

దామ్రమహస్తాంగుళీదర్భమూలపవిత్రుఁ

దరుణకింశుకలతాదండధారుఁ

బ్రావృషేణ్యవినీల పాథోధరశ్యాము

సాలవృక్షప్రాంశుఁ జారుదేహుఁ

బరమభాగవతోత్తమప్రథమగణ్యు

విమలమాహేశ్వరాచార వీథిపథికు

నఖిలనీవారముష్టింపచాగ్రవరుని

బులినసంభవుఁ బొడగాంచెఁ గలశజుండు.

— భీమ. 2–83

ఈపద్యములో నూహాకల్పితమైన వ్యాసునిస్వరూపమును సాక్షాత్కరింపఁజేసినాఁడు. మాహేశ్వరవ్రతుని స్వరూపముకూడ దీనిలో మనకు గోచరించును. ఈ మహేశ్వరభక్తునిలో శ్రీనాథుని మూర్తి కూడఁగన్పట్టును.

వ్యాసుఁడు కాశిపై శపింపఁబూని శాపజలముఁ గేల నందుకొనఁబోయినపుడు, కాశికానగరసోమవీథికాభవనవాటికా మధ్యంబునుండి వచ్చిన యొకయింటి మచ్చెకంటిరూపమును జిత్రించినతీరు అన్నపూర్ణాదేవిని మహావిభవముతో మనయెదుట సాక్షాత్కరింపఁ జేయును. ఆమె, పంచాశద్వర్షదేశీయయై పలితసారంబైన వేణికాభారంబు కైవడ ముదుసలిచక్రవాకంబులతో నెకసక్కెంబాడు వీఁగుచన్నుల వ్రేఁగుఁదనంబునఁ దనూవల్లి జలదరింపఁ గంకణఝుణఝుణత్కారంబు తోరంబుగా గ్రక్కున గోపురద్వారంబు బోరుతలుపు వాయం దట్టి, యంది యల రవళితోడఁ గూడిన మట్టెలమ్రోఁత త్రిభువనంబుల నుదిలఁగొనఁ దేకుగడపయోలం జరణపల్లవంబు జంగఁజాచి, యనంగధ్వజపటకఠోరపాఠీనచ్ఛాయాదాయాదంబులైన వెడఁదకన్నులు తలచుట్టును బలిసిపొలయ కలమధురవీణాక్వాణపాణింధమంబైన యెలుంగెత్తి శాపముపసంహరించి యిటు రమ్మనినంతనే యా జగజ్జననిసౌందర్యము మన కన్నులయెదుటఁ దాండవించును.

— భీమ. 2–110.

ఈదృశ్యము కాశీఖండమునందు రెండుపద్యములలోఁ జిత్రింపఁబడినది.

ఉ. వేనలి పాటపాట సరవెండ్రుకతోఁ దిలతండులాన్వయ
శ్రీ నటియింపఁ గైసడలి వ్రేఁకని చన్నులు పాలవంకలై
కా నసియార్ప వాలుఁ దెలికన్నులఁ గల్కితనంబు వీడ్కొనన్
మానినిహస్తమూఁది యొకమంజులభాషిణి వచ్చె వీథికిన్.

ఉ. వేదపురాణశాస్త్రపదవీనదవీయసి యైనపెద్దము
త్తైదువ కాశికానగరహాటకపీఠశిఖాధిరూఢ య
య్యాదిమశక్తి సంయమివరా! యిటు రమ్మని పిల్చె హస్త సం
జ్ఞాదరలీల రత్నకటకాభరణంబులు ఘల్లు ఘల్లనన్.

— కాశీ. 7–159,160.

ఇటులనే అన్నపూర్ణాదేవి వ్యాసునకు శిష్యులకు భోజనములు పెట్టుటకై వేయించిన యరటాకులు మనయెదుటఁ గన్పట్టును.

క. మొగి విరిసి కఱకు గూడక
పగులక వెడలుపును నిడుపుఁ బసిమియుఁ గల లేఁ
జిగురరటాకులు వెట్టిరి
దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్.

— భీమ. 2–128.

వ్యాసునకుఁ గాశిపై శపింపవలయునంతటి క్రోధావేశము గలుగుటకుఁ గారణమును దెలుపుచు, తదావేశవశమున ఱాతిమీఁద భిక్షాపాత్రమును బగులగొట్టినతీరుకూడ రౌద్రరసానుగుణమైన శైలిలో నారభటీవృత్తిలో సహజముగఁ జిత్రింపఁబడినది.

శా. కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధిత దుస్క్రోధాంధకారంబునం
జక్షుల్ రెండును జిమ్మచీకటులుగా సరంభశుభద్గతిన్
ప్రేక్షచ్ఛాత్రులు భీతినొందఁ గడు నుద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రము ఱాతిమీఁద శతధా భిన్నంబుగా వైచితిన్.

— 2–102.

ఇటులనే యీక్రిందిసీసపద్యము గోదావరికి (సప్తశాఖావిభిన్నమైన గౌతమికి) భౌగోళికమైన రేఖాచిత్రము. త్ర్యంబకాచలము మొదలు గౌతమీసాగరసంగమస్థానమువఱకు నుండెడి తీర్థక్షేత్రముల దిగ్దర్శనముతోఁ గూడిన నదీప్రవాహము మనకు దృగ్గోచరమగుతీరు నిందు చిత్రింపఁబడినది

సీ. త్ర్యంబకాచలశిఖాగ్రంబునం దుదయించి
పొదలి యార్యావర్తభూమి దటిసి
మలఁగి దండకవనీమధ్యభాగమున నా
ప్రస్రవణాచలప్రస్థ మొఱసి
పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథుమందిరము డాసి
యేచి యనంతభోగేశ్వరస్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవ గాఁగఁ
గోటిపల్లీశుకోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖతీర్థంబు గుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టికొనుచు
గౌతమీగంగ లవణాబ్ధి గౌఁగిలించె.

— భీమ. 3–21.

ఈ పద్యమునందు పేర్కొనఁబడిన ప్రస్రవణాచలము, (పాపిడికొండ) పట్టిసము, తిలసోమనాథుఁడు, అనంతభోగేశ్వరుఁడు రుద్రపాదములు కోటిపల్లి కుండలాముఖము అనునివి, గౌతమీనదికి తచ్ఛాఖలకు నిరుపార్శ్వముల నంటియున్న క్షేత్రములు. ఇందలి రేఖాచిత్రము ఉద్భవస్థానమునుండి నదీసాగరసంగమస్థానము వఱకు మలుపులు గీయ నక్కఱలేని చిత్రము. గౌతమీనది నొకమాఱు పరికించి భావనచేసిన దృశ్యము మనకన్నులకుఁ గట్టినట్టు లెదురుగఁ గానవచ్చును.

ఇటులనే ఆంధ్రభూమధ్యస్థమైన భీమమండలము నొకపద్మముగా నిరూపింపవలసినపుడు దానిని సకలావయవసమృద్ధముగఁ జిత్రించి యున్నాఁడు.

సీ. ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు
సప్తగోదావరజలము తేనె
బ్రహ్మసంవేద్యాదిబహుతీర్థములు రేకు
లకరులు చారుదివ్యస్థలములు

నాళంబు లవణాబ్ధివేలావిభాగంబు
కల్యాణభోగమోక్షములు తావి
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు
గౌతమీసింధుకాంతేయకణ్వనదులు
తుల్యభాగయు నేలేరుఁ దుమ్మికొనలు
భువనసంభావ్యమైన యీపుణ్యభూమి
యనఘసంసారతాపశాంత్యౌషధంబు.

— భీమ. 3—50

భువనసంభావ్యమైన యీభీమమండలిలోఁ బద్మావయవస్థానీయములుగ నన్నియు జతఁగూడుట మఱింత చిత్రము. ఎత్తుగీతిలోని మొదటి రెండుపాదములకు మూలమగు సంస్కృతశ్లోక మిట్లున్నది.

శ్లో. గౌతమీసింధు కాంతేయ కణ్వనద్యో జగన్నుతాః
ఏలాచ తుల్యభాగాచ మంజులారసముచ్చయః.

'మంజుల' శబ్దమునకు 'పాచి' యను నర్థమును, 'ఆర' అను శబ్దమునకు 'అగ్రము' అను నర్థమును గలవు. దీనినిబట్టి 'దుమ్మికొనలు' అనుశబ్దమునకు పాచికొనలు అనునర్థమును జెప్పుకొనవలయును. పద్మమునకు జుట్టును నాచు తూటుకాడ మున్నగునవి కొనలుదేరి యలముకొని యొక వింతశోభను గలిగించును. ఈ భీమమండలి కన్నివైపులను గౌతమీశాఖలు కాంతేయి కణ్వనది తుల్యభాగ యేలేరు నను నివి యలముకొనియున్నవి. దానినిబట్టి యీచిత్రణమంతయు సహజముగ సరిపడినది.

ఈక్రిందిపద్యములో శివతాండవదృశ్యము సాక్షాత్కరింపఁజేయఁబడినది. త్రిపురాసుర సంహారానంతరమున విజయలక్ష్మీసమేతుఁడయిన పరమేశ్వరుఁ డానందాతిరేకమున గావించిన తాండవ మిది.

శా. ఆడెం దాండవ మార్భటీపటహలీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాటకరోటికోటరకుటీకోటీలుఠచ్ఛిందువీ
చీడోలాపటలీపరిస్ఫుటతరస్ఫీతధ్వనిప్రౌఢిమన్.

— భీమ. 4—148

ప్ర కృ తి చి త్ర ణ ము

శ్రీనాథుఁ డీ భీమేశ్వరపురాణమున భీమమండలము గోదావరీ నదీశాఖామాతృకాయమానమై, యానాఁ డేసస్యసంపదలతో నిండి యుండెనో, యేయే పుష్పఫలసంపదలతోఁ దులతూగుచుండెనో, యా విషయమును సమగ్రముగఁ జిత్రించియున్నాఁడు. ఏవిషయము నారంభించి నను దానిని సమగ్రముగ వర్ణించుటయే గాని యేకదేశమును వర్ణించు నలవాటాతనికి లేదు. పీఠికాపురమును దక్షారామమును, గోదావరీనదీ శాఖలను వర్ణించుపట్టులలో నానాఁటిసమృద్ధిని నిరూపించియున్నాఁడు. ఇట్టివర్ణనములలోఁజాలవఱకుస్వాభావికతయేగోచరించును.

పీఠికాపుర పురోపకంఠమున నేలేటిమేటికాలువలవలన నదీమాతృ కాయమానంబు లగు పంటవలంతి కేదారక్షేత్రంబులఁ గలమ శాలి శారదాముఖాది వ్రీహిసస్యంబులు పండుచుండెడి వఁట. ఆరామంబులు నిరంతర నారికేళ చ్ఛదచ్ఛాయాచ్ఛన్నహరిదంతరంబులై భుజంగవల్లీ సమాలింగిత క్రముకకంఠోపకంఠబులై చంపకద్రుమసమేతములై, తిలక తిలకితంబులు, కోరకితమదనకంబులు, నిబిడకేసరంబులు నై నఖిల భువనాభిరామంబులై యుండెనఁట. ఈ సస్యారామశోభ నిట్లు సీస ములోఁ జిత్రించినాఁడు.

సీ. ఏఱేట విడినీట నిరుగారునుం బండుఁ
బ్రాసంగువరిచేలు పసిఁడిచాయఁ
బరిపాకమున వేరుపనసపండులతావి
యిందిందిరములకు విందుసేయు

వేఁబోఁకఁ బొలుపారు వింధ్యాద్రిపవనంబు
పోఁకపువ్వులతావిఁ బుక్కిలించు
వేశ్యవాటికలందు విహరించు వలరాజు
ననయంబుఁ జెఱుకువిల్లును ధరించు
నారదంబులవలపు పొన్నలఁ బెనంగి
విచికిలామోదములతోడ వియ్యమందుఁ
బాటలీపుష్ప కేతకీపరిళములు
పొదల విలసిల్లుఁ బీఠికాపురమునందు.

— భీమ. 2—54.

ఏలేటిమేటికాలువలనీటితో నిరుగారును బసంగివరిచేలు పండి బంగారుచాయలను వెదఁజల్లుచుండునఁట. శ్రీనాథునినాఁ డితరసీమలలోకంటె నీసీమలో వరిపంట హెచ్చుగఁ బండుచుండె ననియు, పండిన వరిచేలసొబగు దృష్టిప్రియమై యుండెడిదనియు నిందు సూచితము. అందునఁ నేకాఁబోలు నీవరిపంటసౌభాగ్యము నీపద్యమునను తరువాత గద్యములో నంకురావస్థ మొదలు పదియారువన్నె కుందనపుఁదగడు దెగడుచుఁ బండునంతవఱకుఁ గలవరిచేలతీరును వర్ణించియున్నాఁడు. వేరుపనసలు పండఁబాఱి కమ్మఁదావులచే నిందిందిరములకు విందుచేయునఁట. పీఠికాపురోపకంఠమునం దీనాఁడు వేరుపనసలు గానరావు గాని, సదాపనసలు గలవు. అవి పండఁబాఱి మధురసౌరభము వెదఁజల్లుచుండును. తెల్లవారుజామున నడయాడు వింధ్యపర్వతపవనము పోఁకపువ్వులతావిని బుక్కిలించునఁట. భీమమండలిలోనెచటఁ గాని ప్రత్యూషపవనము వీచిన నది పోఁకపువ్వులతావిని బుక్కిలింపక మానదు. దక్షారామపురవర్ణనప్రకరణమునం దోకమాఱును, వసంతోదయమునందు వేఱొకమాఱును మందమారుతముచే నాతావిని బుక్కిలింపఁజేసినాఁడు.

క. పూఁబోణులకును విటులకు
వేఁబోకలఁ దలరుసొంపు వీడ్కొలుపుఁ బురిన్

వేఁబోఁకఁ బోఁకతోఁటల
పూఁబాళలకమ్మతావిఁబొదలినగాడ్పుల్.

— భీమ. 1-95.

వ.....పోఁకమోకఁల పూవుబాళలనెత్తావికిఁ దావలంబులై కేవ లంబు పొలయు సప్తగోదావరసమీరణంబులు.

— 3-57.

వ. ...గంధసారగిరిగరిధవాహప్రవాహలహరికావిహార బహళీ భూతనూతనక్రముకకుహళీగర్భనిర్భరామోదమేదురంబు నగుచు..

— భీమ. 5-99.

పీఠికాపురవేశ్యవాటమునందు వలరాజెల్లపుడు చెఱుకు విల్లును ధరించునఁట. ఇది యొక సరసమధురమైన కల్పన. ఇతరలక్ష్యములు సాధింపఁదలఁచిన పుష్పచాపుఁడు పెఱచోటఁ బుష్పధన్వుఁడైనను నిట నిక్షుధన్వుఁ డగుట విశేషము. ఇది ఏలేటిప్రాంతమునఁ జెఱుకు విస్తారముగఁ బండు ననుటను వ్యక్తముచేయుచున్నది. పిఠాపురోపకంఠమునఁ బ్రవహించు నొకయేలేటి కాలువకు 'చెఱుకులకాలువ' యను సార్థకనామము నేఁటికిని గలదు. పీఠికాపుర భూములం దానాఁడు లభించు కాయగూరలవిభవము నిట్లువర్ణించినాఁడు. ఈకూరలు కాయలు నాఁడును నేఁడునుగూడ పిఠాపురమున మనకు లభించుచునే యున్నవి.

సీ. త్రపుసపుష్పలతామతల్లీ పటోలికా
  కారవేల్ల కుడుంగకములతోడఁ
కూశ్మాండ వృంతాక కోలక చించికా
  కాయమానకదంబకములతోడ
శాకినీ మూలక చ్ఛత్రాక సారణీ
  ధాన్యాక మేఘనాదములతోడ
పిప్ప ల్యుపోదకీ పీతపలాండుక
  వాస్తుశాఖాకోటివాటితోడ

రాజనముతోడ శృంగబేరంబుతోడఁ
జిఱుగడపుఁబెండలముతోడఁ జేమతోడఁ
నొప్పు నాలుగుపొలములం దుపవనములు
భువనసారము పీఠికాపురివరమున.

— భీమ. ౧—50.

ఈపద్యమునఁ బేర్కొనిన కాయగూరలు, పొట్ల కాకర గుమ్మడి వంగ చింత వెలఁగకాయలు, ములుగి అల్లము బచ్చలి నీరుల్లి చిఱుగడదుంపలు పెండలము చేమ కంద మున్నగున వన్నియు నేఁడును సమృద్ధములే. ఇటులనే దక్షారామమునందలి ప్రకృతిరామణీయక మును జిత్రించునపుడుగూడ మరునిచే నిక్షుచాపమునే పట్టించినాఁడు.

మ. మొరయించు స్మరుఁ డిక్షుచాప మనిశంబున్ దక్షవాటీమహాపుర
మధ్యంబున.

— 1. 89.

దక్షారామ పరిసరప్రదేశముకూడ చెఱుకు పండుటకుఁ బ్రసిద్ధ మైన నెలవే. దక్షారామమును వర్ణించునపుడు తత్పరిసరమునందలి తీర్థసరోవరాదిశోభావిశేషంబును, ఉద్యానవనరామణీయకంబును జిత్రించినాఁడు. (1—109) ఈగద్యమున వర్ణితములైనవి గొన్ని లోపించినవి. కొన్ని నామావశిష్టములై యున్నవి. సప్తగోదావరసలిలప్రవాహము ఏనుఁగులు జలకేళి సలుపఁజాలినదిగా నుండె నని తెలిపినాఁడు. నేఁ డొకప్పుడు మోకాలుబంటినీరుకూడ నం దుండదు. హాటకపద్మమండిత మఁట నేఁడు నామమాత్రమునకైన తామర లేనేలేదు. నాచు గలదు. పరిసరతీర్థకుండములు కమలకువలయకుముదషండమండితము లనినాఁడు. కొన్నిటఁ గమలకువలయములు గన్పట్టుచున్నవి. దక్షారామసమీపభూమిని తుల్యభాగాకణ్వానదీగౌతమీశాఖల పాఱుదల వలన నిరుగారును బండెడి కేదారక్షేత్రంబులు సస్యసమృద్ధములు నాఁడును నేఁడును గూడఁ గలవు. పయోధిగన్నబిడ్డలువోని యొడ్డు

చెఱువులును గలవు. సరసశాఖాశిఖామూఢకోకిలకుటుంబినీకంఠకోమల కుహూకారకోలాహలకలితములు వివిధఫలవృక్షభరితములు నైన యారామంబులచే నాపరిసర మంతయు మనోహరముగనే యుండును.

మఱియొకచోట దక్షారామమునందలి సస్యసంపద నిట్లభివర్ణించియున్నాఁడు. చెఱుకు మురకటంబును, ప్రాసంగుమిసిమియుఁ, జెంగల్వ తావిఠేవయుఁ, గుసుమవాటిమెసకంబును, నుభయపార్శ్వములం గల ఘంటామార్గంబునుగా నెడనెడం గుసుమభారారంభసంభార కుసుమ గుచ్ఛచ్ఛాయావిభాతసంధ్యారాగరభసంబును, కందియందంబును, బెస రసిరియును, మినువునలువును, గోధూమశ్యామాకవరగయును, మాష పర్ణిసమున్మేషంబును, నేసియేపును, సనంతిసనకేతనంబును, నువ్వుమవ్వంబును, గుళుత్థశుద్ధార్ధమానవృద్ధియుఁ, బత్తిసంపత్తియును, బొబ్బర యుబ్బరంబును, నందసందర్భంబును, యవ యావనాళ ప్రియంగు గుళుజ తిల పరిస్ఫూర్తియు ద్రవ్వొందల సంకడియును, గంటె కొఱ్ఱ తెఱచును, గసగసలివయును, జెంగలించు జాంగలక్షేత్రంబుల నేత్రంబులకు సొంపు నింపు సంపాదించుచుండెనఁట. (3–57) ఆనాఁడు దక్షారామభూములు కొంతవఱకు మెట్టభూములుగా నుండినపు డాసస్యము లన్నియు ఫలించి యుండును. నేఁడును గంటి కొఱ్ఱ వరగ గసగస మున్నగునవి కొన్ని గాక మిగిలిన వన్నియుఁ బండుచునేయున్నవి. శ్రీనాథుఁడు వర్ణించినటు ల్లాప్రదేశము లన్నియు నాఁటివలెనే నేఁడును బహుళారామ భరితములే.

### దక్షారామము — సానికూఁతులు

దక్షారామమునఁ గలవిశేషవిభవములలో నొకటిగ నీప్రబంధమునం దాద్యంతములందు సమగ్రముగ వర్ణింపఁబడినది, విబుధగంధర్వాప్సరోజాతిసంభూతలయిన విలాసవతుల సౌందర్యము. వారు భీమనాథుని సేవించెడి సేవాక్రమమును భీమేశ్వరునకు జరిగెడు యుత్సవములందన్నిటను బాల్గొని, యాస్వామికి వివిధోపచారములు నెఱపుట నిన్న

మొన్నటివఱకు దక్షారామమున సాగుచునేయుండినది. ఈనడుమ సేవాక్రమము లోపించినది. అచట సానికూఁతుల యుపస్థితి హెచ్చుగు టకుఁ గారణము, కైలాసవాసి పరమేశ్వరుఁడు దక్షారామ భీమేశ్వరలింగ మునఁ బ్రతిష్ఠితుఁడైనపుడు దేవేంద్రుఁ డుపస్థితుఁడై బృహస్పతియుప దేశమున భీమమండలికాపుణ్యభూమి నాస్వామికి ధారవోయుచు, వార వధూత్రిశతీద్వయంబును (ఆఱువందల వేశ్యలను) సమర్పించెనఁట.

చ. సురపతి మార్గశీర్షమున శుద్ధచతుర్దశినాఁడు రోహిణిం
బొరసిన సిద్ధయోగమున భూతల మిచ్చెఁ బయోధిగోత్రముల్
గరుసుగఁ దుల్యభాగయును గంౘెడు లోనుగ దక్షవాటికా
వరునకు భీమనాథునకు వారవధూత్రిశతీద్వయంబుతోన్.

— భీమ. 5-83.

పరమేశ్వరుని భోగవైభవములకై యర్పించిన భూమితోపాటు ఆవిభునిసేవావసరములకే యాఱువందల వారవధువుల నర్పించె నను విషయ మిట్లు వివరింపఁబడెను.

గీ. గీతవాద్యత్రనృత్యంబు కేవలంబు
శంభునకు సార్వకాలంబు సంభవింప
నప్సరస్త్రీసమ్మిల నర్పించె నాఱునూఱు
బాలలను యువతుల జంభభంజనుండు

— భీమ. 6--76.

దివ్యాప్సరసలయిన వారందఱు నెటనుండి యుద్భవమందిరో తజ్జాతికిఁ జెందినవా రనియును వివరించియున్నాఁడు.

శా. ఆవంశంబున సానికూఁతు లనుదివ్యస్త్రీలు దుగ్ధాబ్ధిమ
ధ్యావిర్భూతలు మీనకేతనుని పుష్పాస్త్రంబు లెక్కాలముస్
సేవాదక్షతఁ గొల్తు రిందుధరునిన్ శ్రీదక్షవాటీశ్వరున్
గైవల్యాధిపు భీమనాథుని లసత్కారుణ్యపాథోనిధిన్.

— భీమ. 6—78.

ఈతరువాతిగద్యములో వారలసౌందర్యమును వర్ణించి, వారు భీమనాథుని కొనర్చెడిసేవల నిట్లుగ్గడించియున్నాడు.

"ఉత్తమనాయికానాయక గర్భసంజాతలయిన యీసానులు, సానురాగంబున నీశానుని భీమేశ్వరుని ఘుసృణముకుళితాపాంగంబులు కుంచితాకుంచితభ్రూలతంబులు, విస్మయోత్పాదనతానకంబులు, ప్రసన్నంబులు ప్రేమరసపూర్ణత్రపావృతారంభంబులు, నవలలితంబులు, పులకావళికావరణంబులు, భావజగర్భితంబులు, విస్మృతనిమేషంబులు నైనవీక్షణంబులఁ దదీయాలావణ్యపూరం బాస్వాదించువిధంబున, నభిలషించుట దెల్పుచందంబున, హృదయంబు నాకర్షించుచాడ్పునఁ, జామరవ్యజనపీటికాకరండపాదుకా ముకురదీపికాసంగీతనాట్యాద్యుపచార విశేషంబులఁ బ్రతిసంధ్యంబును బల్యంకికాసేవాబహిర్విజయాదిభోగావసరసమయంబుల సేవించుచుందురు.

— భీమ. 6–79.

ఈదక్షారామమునందలి సానికూఁతుల సౌందర్యమును గ్రంథారంభమున తుదిని విశేషముగ వర్ణించుటకుఁ బూనుకొనినశ్రీనాథునకు, వారిపై సౌందర్యకళాపురస్కృతమైన యభిమాన ముండుటకూడ నొక ప్రత్యేక కారణ మయియుండవచ్చును. పిఠాపురమునందలి వరిచేలసౌరు వర్ణించుచు 'దక్షారామ రామాజనంబుల చిఱుపిక్కలచక్కదనంబు నెకసక్కెంబాడు బిగువుపొట్టలం గనుపట్టునవియు' నని యుపమించినాఁడు. మఱియు శివరాత్రిమాహాత్మ్యమున సుకుమారజననోత్సవసమయమున సైతము పంచారామవిలాసినీవతులఁ బ్రొగ్గొనఁ జేసియున్నాఁడు.

కృతిభర్తయగు బెండపూఁడిఅన్నమంత్రి అవశ్యాయధరాధరోద్భవాధిపభక్తుఁడు, వేశ్యాకటాక్షదీక్షావశ్యవిహారాపహసిత వాసవతనయుఁడు, పంచారామవధూటీ పంచాస్త్రవిహారకేళీ పాంచాలుఁడును, భీమనాథుఁడు పండువుపండువునకుఁ గొలువుదీర్చి దక్షారామ వేశ్యాజనముల సేవలఁ బరికించుటకు మహోత్సవమండపమును నిర్మింపఁజేసినాఁడు.

అన్నమంత్రిని దక్షారామవధూటీ వక్షోరుహమృగమదాది వాసితవిలస ద్వక్షఃకవాటునిగఁ జేసినాఁడు. కావునఁ గృతికర్తయభిమతిని బూరించు టకుఁగూడ దక్షారామవిలాసినీవతుల సౌందర్యమును మఱింత విశిష్ట ముగ వర్ణింపవలసివచ్చిన దై యుండును. కావుననే గ్రంథారంభమున దాక్షారామపురవర్ణనమున కుపక్రమించి, 88వ పద్యము మొదలు 94వ పద్యమువఱకు ఆపురమునందలి గంధర్వాప్సరో భామినీ విశిష్టతను వర్ణించియున్నాఁడు.

"కాంతిసంపద నేల కైవార మొసరింప" నిత్యాదిగా నుపక్ర మించి, "భీమేశ్వరుని గొల్తు రప్పురమున సానులనుపేరి యప్సరశ్చంద్ర ముఖులు" అని, వారి సేవాపద్ధతిని వివరించియున్నాఁడు. వారి సౌంద ర్యమును వర్ణించుపరిపాటిలో

దక్షారామవిలాసినీవతుల సౌందర్యంబు వర్ణింపఁగాఁ
జక్షుఃశ్రోత్రకులాధినాయకునకున్ శక్యంబె?"

యని యబ్బురపాటును దెలిపినాఁడు. మన్మథుఁ డావారయువ తుల నూఁతఁగాఁగొని ముజ్జగంబును గెలుచుటకై యిక్షుచాపము నన యము సంధించి, టంకారముగావించుచు, తన్నూపురస్వనముల జంకిం చుచుండె ననినాఁడు.

మ. మొరయించు స్మరుఁ డిక్షుచాప మనిశంబుం దక్షవాటీమహా
పురమధ్యంబున ముజ్జగంబు గెలువం బుత్తెంచులీలం బురం
దరవిశ్రాణిత దేవతాభువనగంధర్వాప్సరోభామినీ
చరణాంభోరుహనూపురస్వనముల న్జంకించు ఝుంకారముల్.

— భీమ. 1–90.

శ్రీనాథుఁ డీప్రబంధమున నేరసభావమును బోషించినను దానిని బరమేశ్వరాలంబనముగనే నిర్వహించినాఁడు. కావుననే విలాసినీవతుల సౌందర్యమునుగాని హావభావములనుగాని భీమనాథసేవాపరతంత్రముల గనే చిత్రించియున్నాఁడు. భిక్షావతీనృత్యవర్ణనమందులకు నిదర్శనము.

సాని యీశానిమై మహోత్సవమునందుఁ
గేల నవచంద్రకాంతంపుగిన్నెఁ బూని
వీథి భిక్షాటన మొనర్చువేళఁ జేయు
మరులనృత్యంబు జగముల మరులుగొలుపు.

— 1-104.

దక్షారామవిలాసినీవతులను భీమేశ్వర సేవకే సముపలబ్ధశరీర లనుగా వివరించుటకే, వారలసౌందర్యమును వర్ణించుచు,

"వలపింపనేర్తురు వల్లరాజు గెలిచిన
పెద్దకాలము వేల్పు భీమనాథు"

నని తెలిపి, భీమనాథుని ధూర్తప్రకారముగ సానివాడల కనిపినాఁడు శ్రీనాథుఁడు. పరమేశ్వరుఁడు రసికావతంసుఁ డనుటకు దారుకావనవిహార మొకనిదర్శనము. శ్రీనాథునకు భీమయదేవునెడఁ గల చన వునఁగూడ నాతనంతటివానిని ధూర్తునిగఁ జేసియుండును.

మ. ఎనయం గల్గినకూర్మి భృంగిరిటిఁ గానీ తండుఁ గానీ నికుం
భునిఁ గానీ కయిదండ పట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం
గనలం గన్నుమొఱంగి యప్పురమునం గన్నెఱుకాఁదారిఁబ్రొ
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబునన్.

— భీమ. 1-111.

పరమేశ్వరుఁడు సానివాడ కరుగుట గూడ దక్షారామమహిమయే యని సమర్థించియున్నాఁడు. దక్షవాటిభోగమోక్షనిధాన మగుటయు నేతత్సమర్థకమే.

క. పదునాల్గుమహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాటై యుం
డదు సానిపెండ్లి యెప్పుడు
నది దక్షారామమహిమ మగునో కాదో?

— భీమ. 1-112.

భీమేశ్వరపురాణము వ్రాతప్రతిలో నీపద్య మొకటి యధికముగఁ గన్పట్టుచున్నది.

గీ. వేశ్య యనుమాట కొక్కింత వెలితిలేదు
భార్య యనుమాట కేమియుఁ బరపులేదు
శక్తి యనుమాట కైవారసరణిఁ బొందు
వామదేవునియెడ దక్షవాటియందు.

—భీమ. 3.88.

దీనిబట్టి దక్షవాటిలో భీమేశ్వరునకు వేశ్యయు భార్యయు శక్తియు నైన పరమేశ్వరీస్వరూప మొండుండె నని, తెలియుచున్నది. అట్టి పరదేవతాస్వరూపిణియే మాణిక్యాంబిక. ఈవిషయమును శ్రీనాథుఁడు వేఱొకపద్యమునం దిట్లు వివరించియున్నాఁడు.

గీ. పృథివిఁ బదునెనిమిది యోగపీఠశక్తి
గణములో నెంచ సర్వశృంగార యగుచు
భీమనాథునిసన్నిధిఁ బ్రేమ వెలయు
మాణికాదేవి సకలకల్యాణమూర్తి.

—భీమ. 1-102.

అష్టాదశ మహాశక్తిపీఠములలో దక్షారామమున మాణిక్యాంబికాశక్తిపీఠ మొకటి. ఈమాణిక్యాంబిక సర్వశృంగారయై సకలకల్యాణస్వరూపిణియై భీమేశ్వరస్వామిసన్నిధిని ప్రేమతో వెలసియుండె నని నాఁడు. మాణిక్యాంబిక వేశ్యబాలికయై శక్తిస్వరూపిణియై వెలసె నని దక్షారామపురవాసులం దొకయైతిహ్యము పరంపరాగతముగ వచ్చుచున్నది. 'భీమేశ్వరదండకము' అనుపేర నిలిచియున్న యొకదండకములో మాణిక్యాంబికా ప్రాదుర్భావక్రమమును వర్ణించు ప్రకరణములో "వేశ్యబాలిక యొక్కతె ఉత్సవసమయములో నూరేఁగవచ్చిన భీమనాథుని వలచి, యాస్వామివెంట వచ్చి యాలయమున మాణి

క్యాంబిక యైనట్టులు" తెలుపుచున్నది. ఆ దండకము నిటఁ బొందు
పఱచు చున్నాను.

శ్రీమన్మహాదేవ శ్రీ భీమనాథుండు శ్రీ దక్షవాటీమహాపట్నముం
జూడగా నాత్మలో సంధించి బారు వేంచేయగా, భేరియు మ్రుంజుయున్,
కంచుమద్దెర్ళునన్, కంచుతప్పెట్లలున్ శంఖజేఘంటలున్ ఢంకాఢమా
మీలు బాకసన్నాయిలున్ భడభద్రకాళీలు గుమ్ముమని గుమ్మటుల్
వారాంగనామణుల్ కరకంకణధ్వనుల్ ఘల్ ఘల్లుఘల్లులా పాదాల
సజ్జులా ఇలుకులా గిలుకులా చూపులా సోకులా వన్నెలా చిన్నెలా
గంపులా జంపులా ఓయమ్మ ఆవచ్చువారెవ్వరే? యని కాంచి
మోహించి ఆరాజు దేవ్వారు? ఎన్నంగ పేరేమి? ఓముగ్ధ! ఓబాల!
శివువే, దేవాధిదేవుఁడే, నిత్యకళ్యాణుఁడే, శ్రీభీమలింగఁడే అనివారు
చెప్పంగ ఆత్మలో మోహించి తమహత్యతప్పించి తమచెంత నున్నట్టె
నవసుందరుని జూచి యీరాత్రికాలంబు నే తాళలేనమ్మ. ఓసఖీ నీవేగి
విన్నపించగా విందుగా ముందుగా సందుగా పొందుగా వానిమతి కరి
గించి చిత్తంబు పొంగించి వేవేగ వస్తునే నాహస్త మిస్తునే. నాయింట
నుంటివే యిలాటి మాటలే చెప్పగా చూతుగా, వారమ్మ తా వచ్చి
ఓసోసి యిది యేమె, ఓ వెఱ్ఱివెంగలీ! ఓహంసగామినీ! ఓపల్లవాధరీ!
ఇట్లాడ నీకేల? కోకముడి వీడగా, కురులు ఇటు జారగా, ఓరత్న
బింబోష్ఠి జాగేల గొబ్బుల నైక్కు జేసెనమ్మ అని అడిగె నాబాలిక
న్మైఱపుపూబాణముల జొచ్చిమోహాంబుల న్జొచ్చి మూర్ఛిల్లె. ఓయ
మ్మ ఆమాయలావాఁడు నీకేలనే బాల? పాములే సొమ్ములే, పాషాణ
రాగమే, బ్రహ్మాండరూపమే, లేజన్నధారుడే, గజచర్మధారుడే, పార్వ
తికినాథుడే, వద్దుమాయమ్మ నీయీదుప్రాయంబులో పేరుప్రఖ్యాతికై
దొరల చేబడితిని. కాశ్మీర కర్ణాట సౌరాష్ట్ర మహారాష్ట్ర బంగాళ
పాంచాల మహాదేశాధీశులున్ ఎప్పొద్దు నావెంట కట్టుబడియుందురు.
ఎక్కుగుట్టంబులున్ జాకట్లు జలతారు. జల్తారుపోగులా మిద్దె లమ్మి

స్తునే. బుద్ధి చెప్పిస్తునే. ఆపోయె నాకాల మాలేవె సరోజాక్షి ! అని పిలిచి చెయిబట్టి తా లేవదీయగా, ఛీ యనుచు పో ద్రోసి, నీయమ్మ లక్కాకు నీతనువు మండను. నీరూపు నీమాయ నిర్మూల మైపోను. స్వామి భీమేశ్వరా ! త్రిపురపురసంహారా ! నన్నేలు నాస్వామి. నన్నేలకుంటేను, చత్తునో నోత్తునో పడుతునో దేహంబు విడుతునో ప్రాణంబు. తనపాల భీమజనపాలకా తనపాలనుండి చెయ్యిచ్చి రమ్మని, చెక్కిళ్ళు నొక్కుచూ, జాకాయి జాపత్రి సయ్యాట లాడించి, ఓనీలకుంతలా ? ఓహంసగామినీ ! ఓపల్లవాధరా ! నిత్యం నమస్తే నమస్తే నమః ”

శ్రీభీమేశ్వరదండకము సంపూర్ణము.

ఈదండకము భాషావిషయకముగఁ బ్రామాణికము కాకున్నను మాణిక్యాంబిక వేశ్యయై యుద్భవించి, భీమనాథుని వలచి, యాతని దేవేరి యైనట్లు దీదండకములోని యితివృత్తము తార్కాణించుచున్నది. దక్షారామమునను తత్పరిసరములందును నిన్న మొన్నటివఱకు వేశ్యలు చాలమంది మాణిక్యాంబ నామధారిణులై అభినయప్రదర్శనమున వన్నెకెక్కినవా రుండెడివారు. వేశ్యల కామె కులదేవత యని యామె నారాధించుపరిపాటిగూడ నుండెడిది. భీమేశ్వరుని లింగసన్నిధిని పార్వతీదేవియు, క్రొంచె మెడముగ సతీదేవియు సౌధతలమువఁ గలరు. ఈమాణిక్యాంబిక యచటనుండక తిరుచుట్టుమాలెలో నుత్తర దిక్కున ప్రత్యేకముగ నెలకొనియున్నది. భీమేశ్వరు నూరేగించునపుడు పార్వతీపరమేశ్వరులతోఁ గాక ప్రత్యేకముగ పల్లకీలో నీమె నూరేగింతురు. కావున నీవిషయము లన్నియు మాణిక్యాంబిక వేశ్యబాలికయై పరాశక్తిగాఁ బ్రాదుర్భవించిన దను నైతిహ్యమును బలపఱుచుచున్నవి.

మధురానిలయ యగు మీనాక్షీపరాశక్తి పాండ్యరాజదుహితయై పరమేశ్వరుని వలచి పరమేశ్వరీస్వరూపిణియై అష్టాదశమహాపీఠము లందలి మధురాపీఠాధిష్ఠాత్రి యగుటయు నేతద్విషయసమాకక్షమై వెలయుచున్నది.

మఱియు భీమేశ్వరునకుఁ బ్రతియేకాదశికి మాణిక్యాంబ నికట మున ఏకాంతసేవ జరుపుదురు. భీమేశ్వరుఁడు హర్మ్యమునుండి క్రిందికి దిగివచ్చినది మొదలు, మాణిక్యాంబ యాలయమునొద్దకు గుడిచుట్టు తిరిగి వెళ్ళునప్పటికి నెనిమిది యష్టకములు పఠింతురు. పిమ్మట స్వామి నామాణిక్యాంబసన్నిధిని పల్యంకికపైఁ బరుండబెట్టి పాటలు మున్నగు నవి పాడి సేవ నెఱపుదురు. ఆయష్టకములలోనివిషయ మంతయు భోగపురంధ్రికి సంబంధించినదిగనే గానవచ్చును. ఈయష్టకము లిపుడు ముద్రితమైన తెలుఁగుటీకతోఁ గూడిన సంస్కృతభీమఖండముతుది నను బంధముగఁ జేర్పబడియున్నవి. ఈయష్టకములలో నుద్దిష్టమైన మాణి క్యాంబిక పార్వతీదేవికంటె భిన్నయని తెలియుచున్నది. మాణి క్యాంబాసన్నిధిని భీమేశ్వరుని సేవించుట వేశ్యలకుఁ గులవృత్తియగుట గూడ దక్షారామమున వేశ్య లధికముగ నుండుటకు మూల మగును.

శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమున వేశ్యావర్ణన మతిమాత్ర ముగ సేయుటచే నాతఁడు వేశ్యాలోలుఁ డని కొంద ఱూహించి యున్నరు. దక్షారామక్షేత్రమాహాత్మ్యమునుబట్టియు, కృతిపతియైన బెండపూడియన్నమంత్రి యభిరుచినిబట్టియు, విశేషముగ సానికూఁతుల సౌందర్యమును వర్ణించినాఁడేగాని వేశ్యాలోలతమూలమునమాత్రము గాదు. అట్లనుటకుఁ దగినయుపపత్తు లేమాత్రమును గానరావు. వాఙ్మ యోపహారముల నీశ్వరార్చనకళాశీలుఁడైన శ్రీనాథునకు భీమనాథుని యెడ, భీమమండలిఁ గలతీర్థదైవతములయెడఁ గలభక్తిభావమే తలము ల్కలుగ నీకావ్యమునందుఁ గానవచ్చును గాని, పరమేశ్వరాలంబనము గాని యశ్లీలాకరమైన భావ మేపాటియు నీకావ్యమునం దెచ్చటను గానరాదు. ఈకావ్యమునుబట్టి యాతనిశీలమును వర్ణింపసమకట్టినచో నకుంఠితపరమేశ్వరభక్తుఁడుగనే గన్పట్టును.

భీమేశ్వరపురాణము – స్థలవిశేషములు.

ఆంధ్రభూభువనమధ్యమునఁ గలవివిధక్షేత్రములను పౌరాణిక [illegible] వర్ణించుచు, గోదావరీతీరప్రదేశమున కీ ప్రబంధమున

భౌగోళికచిత్రమును నిర్మించియున్నాఁడు. శ్రీనాథునినాఁ డాయాప్రదేశములలోఁ గానవచ్చెడివిశేషములను స్వయముగఁ గనుఁగొని, తాను చూచినవానిని కళామయములుగా నొనర్చి, యానాఁటివిషయముల నన్నిటిని బాఠకులయెదుటఁ బెట్టినాఁడు. గోదావరీతీరభూముల నన్నిటిని బర్యటించి, పరిపాటి నెఱిఁగినవారికిఁగాని యాయాప్రదేశము లెఱుఁగరానివి వీనిలోఁ గొన్ని గలవు. ఈభీమమండలిలో జన్మించి, పలుతావులఁ బ్రత్యక్షముగఁ జూచి, పలువురు పెద్దలతో సంప్రతించి, నేఁ దెలిసికొనినవిషయముల నప్పటప్పట వివరించుచు వచ్చితిని. భీమేశ్వరపురాణపాఠకుల సౌలభ్యమునకై నాయెఱిఁగినవిషయము నిట వివరించుచుంటిని.

### రాజమహేంద్రవరము

సీ. కమలాచలాగ్రమార్కండేయశివశిర
  శ్శశిచంద్రికాధౌతసౌధవీధి
గోదావరీపుణ్యకూలంకషాజల
  స్ఫారిత శ్రీరుద్రపాదయుగళి

.................

సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము.

భీమ — 1-42.

రాజమహేంద్రవరము నంటిప్రవహించు గోదావరినదికి, అచ్చటివఱకు నఖండగౌతమి యనిపేరు. గౌతమమహర్షిసమానీతయగుటచే గౌతమియై రాజమహేంద్రవరము వఱకు నఖండరూపమై ప్రవహించుటచే నఖండగౌతమి యైనది. రాజమహేంద్రవరమునకు రెండు క్రోశములు క్రింద గౌతమి వసిష్ఠ యను రెండుశాఖములుగఁ జీలి, క్రమముగ సప్తశాఖారూపమై సముద్రమునఁ గలిసినది. గోదావరీతీరమండలి ప్రసిద్ధక్షేత్రము లన్నియుఁ జాలవఱకు శివమూర్తులు ప్రధానముగాఁ గలవియే. గోదావరి గంగాస్వరూపిణియే గావున,

తత్తీరభూములందు శంకరమూర్తులు నెలకొనుటయు సహజము. కావు
ననే రాజమహేంద్రవరమునఁ బద్మాద్రిపై మార్కండేయస్వామి నెల
కొనినాఁడు.

పద్మగిరి కే కమలాచలము పద్మాద్రి పుష్పగిరి పుష్కరగిరి యను
నవి పర్యాయములు. ఈనాఁటి గోదావరిమీఁది రైలువంతెన ప్రారంభము
నకు సమీపమునందున్న యెత్తైనప్రదేశము ఆనాఁడు కమలాచలము.
ఇపుడు పట్టణము పెరుగుటచే ఆనాఁటిపర్వతాకృతి యేమియుఁ గాన
రాదు. రైలువంతెన దగ్గఱ నుండిన గోదావరీఘట్టమును (రేవును)
పుష్పగిరి రేవు పుష్కరగిరి రేవు, పుష్కరాల రేవు అని జనులు వాకొను
చునేయుందురు. ఈసర్వజనప్రసిద్ధమైన వ్యవహారమునుబట్టి తత్సమీప
భూమియే పుష్పగిరి, లేక పద్మాద్రి, లేక కమలాచలము, అనుటలో
విప్రతిపత్తి యేమియుఁ లేదు. ఈపద్మగిరిశిఖరమున శ్రీనాథునినాఁడు
మార్కండేయస్వామి నెలకొనియుండెడివాఁడు. ఆనాఁటి మార్కండేయ
స్వామివిగ్రహముగాని, ఆలయముగాని యీనాఁడు గానరావు.
పూర్వము మార్కండేయస్వామియాలయము, ఈనాఁడు జలనాళీ
యంత్రగృహములు (Water works Buildings) నిర్మించినచోట
నుండెడిది. ఈనడుమ నా జలనాళీ యంత్రగృహములు నిర్మించుటకై
యచట్టిప్రదేశమును త్రవ్వించినపుడు, ఆలయశిథిలములు, పూజోపకర
ణములు, ఆలయ స్తంభములు చాళుక్యకాకతీయశాసనములు, చాళు
క్యుల కుపాస్యుఁడైన షణ్ముఖునివిగ్రహమును బయటఁబడినవి. వీనిని
బట్టి శ్రీనాథునినాఁడు మార్కండేయస్వామి యాపద్మగిరిశిఖరముపై
నెలకొనియుండెడివాఁ డని తెలియవచ్చుచున్నది. అట్టి మార్కండేయ
శివుని శిరసుమీఁదిచంద్రచంద్రికచే సౌధవీథి ధవళిత మగుచుండెనఁట.

ఆపట్టణమునకుఁ గలమఱియొక వైభవము, గోదావరీ పుణ్య
ప్రవాహము తటముల నొరయుచు, బ్రవహించునపు డీపద్మగిరి నంటి
యున్న రుద్రపాదముల జంట విస్ఫారిత మగుట. ఈరుద్రపాదములను

గుర్తించుట శ్రమసాధ్య మైనపని యైనది. చాలకాలమునుండి రాజ మహేంద్రవరమున రుద్రపాదముల వ్యవహార మంతరించినది. దీని కెదురుగ నున్న కొవ్వూరునకు గోపాదక్షేత్రమనియు, క్రిందనున్న ధవ ళేశ్వరమునకు రామపాదక్షేత్రమనియు వ్యవహార మున్నది. ఈరుద్ర పాదములనుగూర్చి భీమేశ్వరపురాణమునందే మఱి రెండు తావులందుఁ బ్రసక్తి తెచ్చియున్నాఁడు.

ఏచి యనంతభోగేశ్వరస్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవ గాఁగ

— 3–21.

దక్షారామమునందలి రామేశ్వరతీర్థమాహాత్మ్యమును దెలుపుచు

క. శ్రీరుద్రపాదయుగళీ
శ్రీరామేశ్వరసమీపసీమలఁ బితృయ
జ్ఞారంభం బొనరింప న
పారఫలప్రాప్తి చెందుఁ బంచజనులకున్.

— 3–156.

మఱియు కాశీఖండమునం దగస్త్యునిచే గోదావరీతీరసంస్థిత క్షేత్రముల దర్శింపఁజేయుచు.

పద్మాద్రిపై రుద్రపాదంబు లర్చించి
చేరి మార్కండేయశివుని గొలిచి

అనినాఁడు. వీరభద్రారెడ్డిభార్య అనితల్లి పలివెల కొప్పులింగే శ్వరస్వామి యాలయమున నెలకొల్పినశాసనములో

"గౌతమీమహానదీతీరమందునుమార్కండేశమృకండేశ్వరు రుద్రపాదాలపన్నిధిని*..." అని పేర్కొనఁ బడియున్నది.

వీనినిబట్టి మార్కండేయస్వామిసమీపముననే రుద్రపాదము లుండవలయు నని యనుకొంటిని. ఆయూహతోఁ జిరకాలమునుండి యెందఱనో కనుగొనినను రుద్రపాదములు గుర్తింపఁబడలేదు.

* చూ. S. i. i vol V No 114

ఒకప్పుడు పట్టిస శ్రీవీరభద్రునిదర్శించుటకుఁబోయివచ్చుచుండఁగ నొకయూహ పొడమినది. "పాదాః ప్రత్యంతపర్వతాః" అను నమర కోశశ్లోకపాదము గుర్తునకు వచ్చి, పాదశబ్దమునకు పర్వతసమీపభూమి యనునర్థమున నీవిషయము సరిపడు నేమో యనుకొంటిని. ఇట పాద మనఁగాపర్వతమునంటి పాదమువలెఁ గ్రిందికి సాగిన తాతిప్రదేశము. అట్టి పర్వతపాద మొకటి రైలువంతెనకు దక్షిణమున నేటి మ్యునిసిపలు హైస్కూలుభవనముక్రిందఁ గానవచ్చుచునేయున్నది. ఉత్తరమునఁ గూడ నట్టిపర్వతపాద మొకటి యుండిన సరిపడవచ్చు నని, యీనాడు స్టేటుబ్యాంకియున్న భవనమునకు వెనుకతట్టునకుఁ బోయిచూడఁగా, అచ్చటఁగూడ పర్వతపాదమువలె నాభవనముక్రింద తాతిప్రదేశము గానవచ్చినది. ఈరెండిటిని గలిపి శ్రీనాథుఁడు 'రుద్రపాదయుగళి' యని పేర్కొనె నని నిశ్చయించుకొంటిని. ఈపద్యమున 'యుగళి' యని తెలుపుట, ఆజంట గోదావరీప్రవాహము మిక్కుటమైనపుడు విస్ఫారితమగుటయు, పర్వతపాదము లని యనుకొనినపుడే సరిపడును. పుష్కరప్రవేశాదిపుణ్యసమయములలో యాత్రికులుగా వచ్చిన జను లందఱు నాప్రదేశము రుద్రపాదములని యనుకొనకుండినను ఆరెండు పర్వతపాదములనడుమనే స్నానదానము లాచరింతురు. పితృదేవతలకు పిండదానాదితీర్థవిధులు నిర్వర్తింతురు. పరంపరాప్రాప్తమైన యీపరి పాటినిబట్టి రాజమహేంద్రవరమున రుద్రపాదక్షేత్ర మదియే యను టలో సంశయ మేమియు లేదు. శ్రీనాథునినాఁడు ఈరుద్రపాదముల నంటియే మార్కండేయశశివమౌళి యుండెడివాఁడు. ఈనాఁడు గాన రానివాఁడైనాఁడు.

వ్యాసుఁడు శిష్యసమేతుఁడై కాశిని వీడి, దక్షిణకాశియగు దక్షారామమునకుఁ దరలివచ్చుచు, పిఠాపురముఁ జేరునప్పటికి నడుమ నుండెడి దివ్యస్థలములలోని దివ్యస్వరూపులైన పరమేశ్వరమూర్తుల దర్శింపఁగా కాశీవిప్రయోగతాపశాంతి కొంతయాతనికిఁ గలిగె నని

తెలుపుచు, నానాఁడు ప్రసిద్ధమైనతూర్పునాఁటి దివ్యక్షేత్రముల నిట్లు వర్ణించియున్నాఁడు..

సీ. గంగానదీప్రవాహకణము మాధవదేవు
దోరంతరంబు శ్రీతులసిచిగురుఁ
బురుషోత్తమమునందుఁ బుండరీకాక్షుని
దివ్యపాదాంభోజతీర్థజలము
శ్రీకూర్మమునయందు శేషాహిపర్యంకు
కంఠబుక్రొత్తచెంగల్వదండ
సింహాద్రియందు లక్ష్మీశనృకంఠీరవ
సార్వభౌముప్రసాదచందనంబుఁ
గాశికావిప్రయోగోరుగాఢతాప
శాంతి కొదవెను శిశిరోపచార మగుచుఁ
జాయ తెరువున శ్రీబాదరాయణునకు
హరిహరధ్యానపూజాపరాయణునకు.

—భీమ. 2-51.

మూలమునందు లేకయే బాదరాయణుని హరి హరధ్యానపరాయణునిగఁ జేసినట్టి శ్రీనాథుని హరిహరధ్యానపరాయణత యీకావ్యమున బహుళముగ వ్యక్తమగుచున్నది. వ్యాసుని కాశీవిప్రయోగ సంజాతతాపశాంతికి, గంగానదీప్రవాహజలకణము, అచటి మాధవ స్వామివక్షమునందలి తులసిదళము, పురుషోత్తమక్షేత్రమునందలి జగన్నాథస్వామి పాదతీర్థోదకము, శ్రీకూర్మమునందలి కూర్మనాథస్వామి కంఠమునందలి చెంగల్వదండయు, సింహాచలనృసింహస్వామి ప్రసాద చందనమును సమకూడి శిశిరోపచారము లైనవి. ఇవన్నియు విష్ణువునకు సంబంధించిన తీర్థక్షేత్రములు. విష్ణుపాదోద్భవ గంగ, తద్వారి కణము హిమవత్సంబంధమున శిశిరము. తత్తత్క్షేత్రములలో నొక్కొక్కటి యాయాస్వామిప్రసాదముగా గ్రహింపఁదగినవి. కాశీలో

మాధవస్వామిబాహ్వాంతరమునందలితులసిదళము, పురీజగన్నాథము లో జగన్నాథస్వామిపాదతీర్థజలము, శ్రీకూర్మమున కూర్మనాథ స్వామికంఠమందలి చెంగల్వదండ, సింహాచలమున నృసింహస్వామి మేనిచందనమును.

ఈక్షేత్రములలో శ్రీకూర్మము సింహాచలమును ఆంధ్రదేశము నకు సంబంధించినవి. శ్రీకూర్మము శ్రీకాకుళముజిల్లాలోనిది. ఇచటివిగ్రహము తొలుత గుప్తేశ్వరుఁడుగా నుండి తరువాత రామాను జాచార్యులవారిప్రభావమున శ్రీకూర్మనాథుఁ డైనాడు. ఇట్లే సిం హాచలమున వారాహీశక్తియు రామానుజానుగ్రహమున వరాహాప్పల నృసింహస్వామి యైనాఁడు. ఈసింహాచలము నేఁటి విశాఖపట్టణమునకు సమీపమునం దున్నది. అచటిపర్వత మొకక్షేత్రము. పరశురా ముఁడు తపస్సుచేసినచో టది. ఆతని కుపాస్యదేవత వారాహి. రామానుజప్రభావమున నృసింహస్వామి యైనప్పటినుండియు నావిగ్రహ మెల్లప్పుడు దళసరియైన చందనముతోఁ బూయఁబడియుండును. ప్రతివత్సరము వైశాఖబహుళఅమావాస్యనాఁ డంతకు ముందున్న చందనమును దీసి, స్వామికి సహస్రఘటాభిషేకము గావించి, మరలఁ జందనపుఁ బూఁతతో నింపెదరు. ఆసమయమున వైష్ణవేతరుల కచట ప్రవేశ ముండదు. ఆవిడఁదీసినచందనమును బ్రసాదముగ నిచ్చెదరు. ఆవారాహీదేవత ప్రాచీనకాలమునుండియు తత్సమీపస్థు లగుగజపతుల కుపాస్యదేవత. నేఁటికి తద్దేవాలయాధికారము విజయనగరగజపతుల యదియే. శ్రీనాథునినాఁడే గాక నేడును నృసింహస్వామి ప్రసాదము చందనమే.

## పి ఠా పు ర ము

సింహాచలము గడచివచ్చినపిదప నాతనికి హుంకారిణీ శక్తిపీఠ మగుపీఠికాపురము (నేఁటి పిఠాపురము) ప్రసక్తమైనది.

సీ. ఏపట్టణముఁ బ్రోల నేలేరు ప్రవహించు
పృథివికి ముత్యాలపేరువోలె
మున్నూటయఱువది మూర్తిభేదములతో
విహరించు నేవీట వేల్పుపిండు
పీఠాంబచెలి యోగపీఠి హుంకృతిదుర్గ
ననిచి కాపుండు నేనగరికెలనఁ
గుంతీమహాదేవికూర్మి మేనల్లుఁడు
మాధవుం డేవీట మరగినాఁడు
పెద్దగవఁకుల నేపుటభేదనమున
నెలమి నిలుచుండు వ్రీడావిహీనజఘనుఁ
డట్టిపీఠాపురముఁ జేర నరుగుదెంచెఁ
బరమశైవుండు శ్రీపరాశరసుతుండు.

— భీమ. 2.

పీఠికాపురసమీపమునఁ బ్రవహించెడి యేలేటికాలువలనీటిసౌరు ముత్యాలహారపుఁబేటలఁ బోలియే యుండును. ఆయేలేటిప్రవాహము భావనచేసిన భూదేవిముత్యాలహార మనిపించును. అచట పలు విధములయిన దేవతామూర్తులు గలవు. అది హుంకారిణీశక్తిపీఠము. ఆశక్తివిగ్రహ మీనాఁడు గానరాదు. పూర్వ మొకప్పు డాశక్తి విగ్రహ ముండెడి దనియు, కొంతకాలమువెనుక భూస్థాపిత మైనదనియు నచటివారు వాకొందురు. ఆపట్టణమునందలి యీశ్వరుఁడు కుక్కుటే శ్వరుఁడు. ఆయీశ్వరుని సన్నిధియం దుండినతీర్థమును పాదగయా తీర్థ మని యందురు. గయాసురుని శిరస్సు గంగానదీతీరమునందలి గయయం దుండుటచే దానికి 'గయాశీర్ష' మనియు, పాదములు పిఠాపురమునం దుండుటచే దీనికి 'పాదగయ' యనియు నామము లేర్పడినట్టులు తెల్పుదురు. అచటి విష్ణువు కుంతీమాధవస్వామి. కుక్కుటేశ్వరాలయప్రాకారమందలి కాలభైరవస్వామి విగ్రహము

ఇతరస్థలములందలి కాలభైరవ విగ్రహములకంటె దిగంబరవేషమున విలక్షణముగఁ గన్పట్టును. అచటి కాలభైరవుఁడు వ్రీడావిహీన జఘనుఁడై ప్రత్యక్షముగఁ గన్పట్టును. ఆతఁడు సిగ్గు వీడియున్నను జూచువారికి సిగ్గునొదవించును. ఈవిషయమును శ్రీనాథుఁడు పరికించి పాఠకులయెదుటఁ బెట్టుటమాత్రము మిక్కిలి వింతయైన విషయము.

ఈపట్టణమునకుఁ 'బీఠాపురము' అను పేరు వచ్చుటకుఁ గారణము, అది పీఠాంబికకు నెలవగుట. ఆపీఠాంబిక నిట్లు చిత్రించియున్నాఁడు.

ఉ. హాటకపానపాత్రయును నారఁగఁ బండిన మాతులుంగమున్
ఖేటము లోహదండము నొగిం ధరియించి పురోపకంఠశృం
గాటకభూమిభాగమునఁ గాపుర ముండెడిపీఠికాంబకున్
గైటభదైత్యవైరిప్రియకాంతకు మ్రొక్కె నతండు భక్తితోన్.

—2-57.

ఈపీఠాంబికకు నాల్గు హస్తములు. ఆనాల్గింటిలోఁ గ్రమముగా బంగారు పానపాత్ర, పండిన మాదీఫలము, త్రిశూలము, లోహదండమును గలిగి, యూరిపొలిమేరలో నాలుగుత్రోవలు గలుగుచోట శ్రీనాథుని నాఁడు కాపురము చేయుచుండెడిదఁట. కైటభాంతకుని ప్రియకాంతయైన యీశక్తియునికిని గనుఁగొనుటకూడఁ గొంత శ్రమసాధ్యమే యైనది. ఈశక్తివిగ్రహము పైపద్యములోఁ దెలిపిన నాల్గుహస్తములు అందుఁ బేర్కొనిన నాలుగువస్తువులు గలిగి, ఏలానదీతీరమున నుండుట మాని, ఈనాఁటి క్రొత్తపేటలోని కుమారస్వామియాలయమున కెదురుగ నుండిన చెఱువులోఁ జిరకాలముండి, ఒకప్పుడు బయటకు వచ్చి, యచటి కుమారస్వామి యాలయములోఁ దలదాఁచుకొనినది. నేఁటికిఁ బదియేండ్ల క్రిందటిసంగతి. ఆవిగ్రహమును గుర్తింపఁబోయినపు డాయాలయాధికారులు నాతో నిట్లు తెలిపిరి. "ఇది యేదియో శక్తివిగ్రహము; కావున నిది యీయాలయమున నుండరా దని మాంత్రికులు

దెలిపిరి. వేఱొక పార్వతీవిగ్రహమును స్థాపింపనై యుంటిమి." అని విని వారితో నే నిట్లంటిని. "ఇది యీగ్రామమున నుండెడి పురాతనమైన శక్తివిగ్రహము. గ్రామమున కనర్థదాయకము గాదు. మఱియొక విగ్రహమును స్థాపించినను దీని నెచటనైనను భద్రముచేయుఁడు" పిమ్మట నాకుమారస్వామి యాలయమునందే యావిగ్రహము ప్రాకారములో నస్తిత్వమును గోల్పోక యుండెనని వినుచుంటిని.

పిఠాపురమునకుఁ గలవిశిష్టతను మఱియొకగద్యమునం దిట్లు వివరించియున్నాఁడు.

"అఖిలభువనాభిరామంబులైన యారామంబులవలనఁ గన్నులపండువై కుంతీమాధవదేవునకు విశ్రాంతి ప్రదేశంబును, పురుహూతిణీమహాదేవికి విహారసంకేతభవనంబును, పీఠాంబికాలక్ష్మికి క్రీడాకూటంబును, హేలాసానికి లీలాపానగోష్ఠీమండపంబు ననం దగి, భూతభేతాళ డాకినీప్రేతరంకభైరవ వ్రాతనిర్మితప్రాకార వప్రహట్టకుట్టిమం బగు పీఠాపట్టణంబు." అని.

ఇందుఁ బేర్కొనఁబడిన హేలాసాని మాత్రము గుర్తింపరాదు.

## కుమారారామము

పిఠాపురముతరువాత నాలుగు క్రోశములదూరములో కుమారారామము. అచటి ప్రధానదైవతము కుమారారామభీమేశ్వరుఁడు. విష్ణువు రాజనారాయణస్వామి. ఇచటి యీయాలయములు రెండును బురాతనములు. ఇచట వీచిన వాయువులుకూడ వింతయైనవియే.

సీ. క్రొమ్మరేటి కల్యాణకమలషండంబుల
సౌరభ భారంబు సవదరించి
నారికేళాటవీ నవపుష్పకుహళికా
వితతి కన్నెరికంబు వీడుకొలిపి

యప్సరఃకాంతావిహార హాటకహర్మ్య
            శశికాంతమణి గవాక్షముల దూఱి
భీమనాయక దేవు పేరురంబునఁ గ్రాలు
            భుజగహారములకు భుక్తి వెట్టి
రాజనారాయణస్వామి రమ్యభవన
తార్క్ష్యకేతనపతికి నర్తనము గఱపి
పొలసె నధ్వపరిశ్రాంతిపోడ వడంగ
మానివరుపైఁ గుమారవనానిలములు.

— 2.62.

ఈకుమారారామము చేరుసరికి వ్యాసునిపై వీచిన కుమారా రామవాతములు ఆతనిమార్గాయాసముపోడవు నడఁచివైచినవి. అచటి యాపవనము లెందఱికో యుపకృతు లొనర్చినవి. కొమరేటిలో మొగుడఁబాఱియున్న కమలములకుఁ బరిమళభారమును గూర్చినవఁట. అచటి కొబ్బరితోఁటలలోఁ గ్రొత్తగ విచ్చిన కొబ్బరికచ్చులకు వికాసము నొదవించినవఁట. అచటి యప్సరఃకాంతల విహారభవనముల లోనికి శశికాంతమణిగవాక్షములద్వారా ప్రవేశించి యచటివారి శ్రమ నపనయించినవి. భీమేశ్వరస్వామి వక్షమునందలి యాభరణములైనభుజంగహారములకు భుక్తి వెట్టినవి. సర్పములు వాయుభక్షకములు గావున వాని కాహారము నొసఁగిన వనుట. పిమ్మట నచటి రాజనారాయణస్వామిభవనముమీఁదిగరుత్మంతునకు నాట్యము నేర్పినవఁట. శ్రీనాథునినాఁడాగరుడవిగ్రహము రాజనారాయణస్వామి దేవాలయశిఖరముపైనుండి గాలికిఁ గదలాడుచుండెడిది. నేఁడాతావు నందది యుండక, క్రిందికి దిగి వచ్చినది. శ్రీనాథునికంటఁ బడినది గావున గంటమున కెక్కి గ్రంథస్థము గావింపఁబడినది. ఇట్టి మాఱుమూలలందలిసూక్ష్మవిషయములను జిత్రించుటలో నాకవివరుని సూక్ష్మదర్శిత్వము మన కబ్బురపాటు గొల్పును. ఈపద్యములో 'నారికేళా

టపీనవపుష్పకుహాళికావితతి కన్నెరికంబు వీడుకొలిపి' యనుటలో ధ్వని యనురణితమై నగుచున్నది.

సర్పవరము

కుమారారామమునకు రెండుక్రోసుల దూరములో సర్పవరము గలదు. అది కేవలము విష్ణుక్షేత్రము. అచటి దేవత భావనారాయణస్వామి. తీర్థము నారదకుండము దానిని త్రిలింగభూమివైకుంఠము ను జేసి వర్ణించియున్నాఁడు.

> కాంచెన్సర్పవరాభిధానముఁ ద్రిలింగక్షోణివైకుంఠమున్
> ముంచెన్నారదకుండికాజలముల న్మోదంబుతో దేహమున్
> జించెం గాశివియోగదుఃఖము మహాక్షేత్రంబు వీక్షించి ద
> ర్శించె న్సన్మని లోచనోత్సవముగా శ్రీభావనారాయణున్.
>
> — 2-65.

ఈసర్పవరముకూడ సీమండలిలో పురాతనమైన యొక విష్ణుక్షేత్రము. ప్రాచీనకాలమునుండియు నాంధ్రదేశము బాలించిన ప్రభువు లెందఱో యీస్వామిని దర్శించి దానములు చేసియున్నారు. ఆయాలయమున నాయాకాలములకుఁ జెందిన శాసనములు గానవచ్చుచునేయున్నవి. శ్రీనాథునికాలమునాఁడు కాటయవేమారెడ్డి యీస్వామికి 'కొమరగిరిపురము' అను పేరు పెట్టి యొకగ్రామమును ధారపోసెను. ఆనాఁడాగ్రామమునకు భావయ్య కొమరగిరిపుర మని పేరు. ఆలయములో నేఁడు భావనారాయణస్వామివిగ్రహములు మూఁడు గలవు. వానిలో నొక చిన్నగుహవంటిచోట నున్న విగ్రహమునకు పాతాళభావనారాయణస్వామి యని పేరు. ఆవిగ్రహము మిక్కిలి ఓజోవంతముగాఁ గన్పట్టును. ఆయాలయసమీపమున రెండు జలకుండములు గలవు. ఆలయమున కెదురుగ నుండినకుండమునకు ముక్తికుండ మనియు, కొంచెము వ్యవహితముగా నుండిన దానికి నారద

కుండ మఱియు నామములు. నారదునకుఁ దటస్థించిన స్త్రీత్వము, ముక్తికుండమున స్నానముచేయుటచే విముక్త మయ్యె నని యైతిహ్యము. ఏతత్క్షేత్రమాహాత్మ్యప్రతిపాదకగ్రంథము లొండు రెండుగలవు. వ్యాసుఁ డానారదకుండజలములో తనువును ముంచి కాశీవియోగజనిత మైన క్లేశమును విడనాఁడెనఁట.

వ్యాసుఁ డాస్వామికి వివిధభక్ష్యభోజ్యములతో శనివారోత్సవము నెఱపెనఁట. వ్యాసుఁ డట్టియుత్సవమును జేసెనో లేదో కాని, శ్రీనాథునినాఁ డట్టియుత్సవము జరుగుచుండె నని మనకుఁ దెలియవచ్చుచున్నది.

మ. శనివారోత్సవ మాచరించె ముని శిష్యవ్రాతముం దానుఁ గ
మ్మని పణ్యారముతోడఁ బూరగముతో మండెంగతండంబుతో
ననుకుంబాసెముతోడఁ బాండుకలమాహారంబుతో నేతితో
ఘనరంభాఫలఖండశర్కరలతోఁ గారుణ్యపాథోధికిన్.

ఈపద్యమునందుఁ బేర్కొనిన పణ్యారములు మండెఁగలు పాయసము మున్నగుభక్ష్యములు నాఁటి వైష్ణవభోగములలో నాస్వామికి నివేదింపఁబడుచుండెడి వని తెలియవచ్చుచున్నది. అచటి వైష్ణవోత్తముల రూపరేఖావిలాసములను జిత్రముగఁ జిత్రించియున్నాఁడు.

తుల్యభాగానదీతీరదేవతలు

ఈదైవతముల విశేషము నిట్లు వివరించియున్నాఁడు.

శా. చేతోమోద మెలర్పఁ గట్టెదుటఁ గాంచె న్భారతామ్నాయవి
ద్యాతంత్రగ్రథనాబ్జసంభవుఁడు వేదవ్యాసుఁ డభ్యర్హిత
జ్యోతిర్లింగమయస్వరూపుల జటాజూటాసనార్థేందులన్
వాతాపీల్వలవైరి గౌతమనదీవాః సంగమేశానులన్.

— 2—70.

సర్పవరమునుండి బయలుదేఱిన వ్యాసుఁడు తుల్యభాగాతీర సంస్థితులై జ్యోతిర్లింగస్వరూపు లయిన, వాతాపీశ్వరుని ఇల్వలేశ్వరుని సంగమేశ్వరుని గాంచెనఁట. తుల్యభాగానదీశాఖ ధవళేశ్వరముదగ్గఱ గౌతమిలోనుండి విడువడి వేమగిరి కడియము జేగురుపాడు తాపేశ్వరము అత్తమూరు పొలమూరు మహేంద్రవాడ వెదురుపాక పందలపాక మావిడాడ సంపర మీఁదుగా ముక్తీశ్వరమువఱకు వచ్చి, అచటి నుండి మరలి చొల్లంగి దగ్గఱ సముద్రగామి యగుచున్నది. తాపేశ్వరమునందలి శివలింగము వాతాపీశ్వరుఁడు. ఇప్పనపాడు(ఇల్వలపురము) నందలి శివుఁడు ఇల్వలేశ్వరుఁడు. తత్సమీపమున అత్తమూరు గలదు. అర్థమూరు అత్తమూ రయినది. వాతాపీల్వలు లను రాక్షసులు దారులుగొట్టి మనుజులను హత్యచేసి, దోచుకొనిన సొమ్ము దాఁచిన యూరు గావున నది అత్తమూ రయిన దని యైతిహ్యము. అగస్త్యుఁడు ధనార్థియై వాతాపీల్వలులు ధనము నిలువఁ జేసియుండి రని తెలిసి, వారి నడుగఁబోయెను. వారిలో వాతాపి యాహారపశువై యిల్వలుఁడు అతిథిపూజాపరుఁడై వాతాపిని జంపి మాంసము వండి పెట్టెను. భోజనానంతరమున ఇల్వలుఁడు అగస్త్యుని జంపఁ బూని యథాపూర్వముగ, వాతాపీ! యని కేకవెట్టఁగా, మాంసాహారరూపముననుండిన 'వాతాపి' యగస్త్యునికుక్షిలోఁ గదల మొదలువెట్టెను. అది గుర్తించిన యగస్త్యుఁడు పొట్ట నిమురుకొనుచు 'వాతాపి జీర్ణము' అనెను. దానితో వాతాపి కుక్షిలోనే నశించెను. పిమ్మట నిల్వలుఁడుకూడ నశింపఁగా, నగస్త్యుఁ డచట రెండు లింగములను ప్రతిష్ఠఁజేసెను. వారిరువురు వాతాపీల్వలేశ్వరులు.

ఈతాపేశ్వరమునకు మండపేట ఏడిది యను గ్రామములకు నడుమ నుండినవాఁడు సంగమేశ్వరుఁడు. ఈతని 'గౌతమనదీ వాస్సంగమేశానుఁడు' అనినాఁడు. గౌతమనదియు తుల్యభాగానదియు సంగమించిన చోట నెలకొనినవాఁడు గావున సంగమేశ్వరుఁడు అయినాఁడు.

తుల్యభాగ యుత్పత్తిక్రమమును దెలుపు ప్రకరణములో నిట్లు వివరింపఁ బడినది. భీమేశ్వరుఁడు దక్షారామమునఁ బ్రతిష్ఠితుఁడైనపు డాతని యభిషేకాదివిధులకై సప్తర్షులు గోదావరీనదిని దక్షారామమునకుఁ గొనితెచ్చుటకు నిశ్చయించుకొని, ఆయమ్మను బ్రార్థించి, వెనుకముందుల నావేశించి గౌతమిని గొనితెచ్చుచుండిరి. సప్తర్షిసమానీతయగునది, తాపేశ్వరసమీపప్రదేశమునకు వచ్చుసరికి, అంతకుమున్నే గౌతమినుండి గొనితెచ్చిన యొకనదీశాఖాతీరమున రాక్షసులు తపములు సేయుచు సత్కర్మ లాచరించుచుండిరి. వారి యజ్ఞయాగాదిక్రియాసాధనములు ఈవెల్లువను బడి కొట్టుకొనిపోయినవి. దానికి రాక్షసఋషులు కోపించి, సప్తర్షులు గొనితెచ్చు గౌతమి నదృశ్యనుగ శపించిరి. మహర్షులు రాక్షసనదిని శుష్కతోయనుగా శపించిరి. అపుడు తుల్యభాగుఁడను దానవఋషి, ఆమహర్షులకోపమును వారించి, యిరుపక్షముల మాధ్యస్థ్యము వహించి, సప్తర్షిసమానీత యగునది నంతఃప్రవాహరూపనుగఁ గొనిపోవుటకును, రాక్షసనదిని పర్వదినములందు స్నానదానాదికము చేసినఫలము నిచ్చుదానినిగఁ జేయుటకును సంధి గావించెను. నాఁటినుండియు రాక్షసనదికి తుల్యభాగానామ మేర్పడినది. ఈరెండునదుల సంగమక్షేత్రమున నెలకొనిన యీశ్వరుడగుటచే నతడు గౌతమనదీవాస్సంగమేశానుఁ డయినాఁడు.

మఱియు నీతుల్యభాగాతీరమునందలి సాంపరాయగ్రామమునకుఁ జేరువను బిల్వాటవీవాటిఁ గపటభిల్లుండైన చలిగొండతేని యల్లుని ముక్తీశ్వరు దర్శించినాఁడు వ్యాసుఁడు. సాంపరాయగ్రామ మనఁగా నేఁటి సంపర. తత్సమీపమున తుల్యభాగాతీరమున ముక్తీశ్వరుఁడు గలఁడు. అచట బిల్వాటవీవాటి (మారేడుచెట్లగుంపు) యేపాటియు నేఁడు గానరాదు. అచటి యీశ్వరుని కపటభిల్లుండైన చలిగొండ తేనియల్లునిగాఁ జిత్రించియున్నాఁడు. పురాతనమైన పార్వతీవిగ్రహము మాత్రము గలదు. ప్రాచీనమైన యీశ్వరలింగముమాత్రము నేఁడు

లేదు. అది శిథిలముకాఁగా దానిస్థానమున మఱియొక క్రొత్తలింగ మును ప్రతిష్ఠ చేసి, ప్రాచీనలింగమును సముద్రజలమధ్యమునం దుంచి నారు. అందుచే ప్రాచీనలింగమును కపటభిల్లుఁ డనుటకుఁ దగిననిదర్శ నములేవి యుండెనో, యీనాఁడు దెలియరాదు. ప్రాచీనలింగము జలప్రవిష్టమై నేఁటికి నిరువది వత్సరములు గడచెనఁట. వేదవ్యాసుఁ డాముక్తీశ్వరుని బిల్వదళములతోడను తేలపూవులతోడను పద్మదళ ములతోడను బూజించె నని మూఁడుపద్యములందుఁ దెలుపుటచేఁ దన్మ హాత్త్వ మానాఁ డధిక మని తెలియవచ్చుచున్నది. శ్రీనాథుఁ డామూర్తి నీవిధముగఁ జిత్రించియున్నాఁడు.

ఉ. వేదవిభాగముం బరిఢవించినపుణ్యుఁడు వేడ్కఁ బూన్చె బి
ల్వీదళపూజనంబు గడు లెస్సగఁ గూరిమిశిష్యపంక్తితో
నాదిమభిల్లు నిత్యకరుణామృతపూరముఁ జల్లు పుండరీ
కోదరభల్లు నృత్తకరియూథపుమల్లుని గొండయల్లునిన్.

ఈపద్యములో వర్ణించినతీరును బట్టి, ముక్తీశ్వరుఁడు కిరాత వేషధారియై ధనుర్బాణపాణియై, గజచర్మధారియై యుండిన సంకేతము లాలింగమునం దుండియుండవలె నని తెలియుచున్నది.

ఈతుల్యభాగాతీరసమీపమునందే ఓంక్రియానగరపర్యంతార్థ మార్గంబునందు (ఓంక్రియానగర మనఁగా నేఁటి ఓదూరు. తత్సమీప మార్గమునందు) నిత్యయాత్రావిధానక్రమమున దక్షారామమునుండి పిఠాపురమునకుఁ బోవుచున్న లోపాముద్రాసమేతుఁడైన యగస్త్యుని వ్యాసుఁడు దర్శించెనఁట.

ఉ. తేపులు భీమలింగముగుఱించి జపం బొనరించి నిచ్చలున్
మాపటిదాఁకఁ దీర్థముల మజ్జన మాడుచు నుండువానిఁ బీ
ఠాపురిఁ గుక్కుటేశ్వరుని డాయఁగఁ బోవుచువానిఁ దుల్యభా
గాపగచెంత శంకరగృహాంగణబిల్వవనాంతరంబునన్.

ఈతుల్యభాగాతీరబిల్వవనాంతరమునందే శశికాంతశీతలశిలాతల మునం దాసీనులై వ్యాసాగస్త్యు లిరువురును బరస్పరకుశలప్రసంగ ములు సెఱపిరి. వ్యాసుఁ డగస్త్యునకుఁ దాను కాశిఁ బాసి దక్షిణకాశికి రావలసిన యక్కఱనుగూర్చి యీప్రదేశమునందే వివరించెను.

భీమమండలము–సీమావిభాగము

త్రిపురాసురసంహారానంతమునఁ బరమేశ్వరుఁడు, త్రిపురాసురోపాస్యమైన లింగమును పంచఖండములుగా ఖండించెను. అవి పంచారామములందు నెలకొల్పఁబడినపుడు దక్షారామభీమేశ్వరలింగమునఁ దా నైక్యతఁ బొంది ప్రతిష్ఠింపఁబడినపు డుపస్థితుఁడైన దేవేంద్రుఁడు బృహస్పతియుపదేశమున భీమమండలిని భీమనాథునకు ధారవోసి శాసనమును వెలయించుప్రకరణములోఁ దత్సీమావిభాగ మిట్లు నిరూపింపఁబడినది.

ఉ. అంబుధి మేర తూర్పునకు నబ్ధియ సీ మటు యామ్యదిగ్విభా
గంబునకుం బ్రతీచికిని గౌతమి సీమ యుదీచికిం బ్రమా
ణంబు త్రియోజనంబు సురనాథుఁడు దక్షిణకాశి భీమలిం
గంబున కేకభోగముగఁ గట్టడఁజేసె వసుంధరాస్థలిన్.

— 5-76.

దక్షిణకాశి యగు దక్షారామమున కన్నిదిక్కులందును మూఁడు యోజనంబులమేరలో నుండిన భూమి భీమమండలము. దీనికి తూర్పుసరిహద్దు సముద్రము. ఇది గౌతమీనది సముద్రమునఁ గలిసిన సంగమప్రదేశము. దీనిని భైరవపాలెముసముద్ర మందురు. అచటి యీశ్వరుఁడు భైరవేశ్వరుఁడు. దక్షిణమునకును సముద్రమే సీమ. అది వసిష్ఠాసాగరసంగమస్థల మైన అంతర్వేదిక్షేత్రము. అచటి తీర్థాధిదైవతములు నీలకంఠేశ్వరుఁడు నృసింహస్వామియును. పశ్చిమమునకు అఖండగౌతమి (రాజమహేంద్రవరము) సీమ. మార్కండేయస్వామి తదధిదైవతము. ఉత్తరదిక్కునకు మేర మూఁడు

యోజనములు. ఈమేర పిఠాపురమునకుఁ జేరును. నడుమ నుం డెడి కుమారారామభీమేశ్వరుఁడును నీయవధిలోఁ జేరును. ఈవిషయ మీక్రిందిపద్యమున వివరింపఁబడినది.

మ. సరిసామంతుఁడు శ్రీకుమారవనికాచాళుక్యభీమేశ్వరే
 శ్వరదేవుం డుపకంఠబాంధవుఁడు శ్రీసంవేద్యరాడ్భైరవుం
 డిరవంబొప్పఁగఁ గొప్పులింగము మృకండేశుండుగా నేలె ని
 ద్ధరణీమండలి భీమనాథుఁడు నిరాతంకప్రతాపోన్నతిన్.

— 5-91.

దక్షిణసీమాదిగ్విభాగములో నడుమ నుండినవాఁడు పలివెలకొప్పులింగేశ్వరుఁడు. ఈతఁడును రాజమహేంద్రవర మార్కండేయస్వామియును ఇరుగుపొరుగులలో నుండినవా రనుటచే వా రిరువురును సమానులు. లింగములయుచ్ఛ్రాయము ప్రతిపత్తియు సమానము లని దీని భావము. దీనిఁబట్టి మార్కండేయస్వామిలింగమును కొప్పులింగమువలె పీఠముమీఁద రెండడుగులయెత్తుండవలయు నని తోఁచును. భైరవేశ్వరుఁడును పీఠముమీఁద రెండడుగులయెత్తుగలవాఁడే. కావున నేఁటి మార్కండేయేశునిలింగము అర్వాచీన మనుట నిశ్చయము. దక్షారామ భీమేశ్వరచాళుక్యభీమేశ్వరలింగములు రెండును ఉచ్ఛ్రాయమున ఆలయ ప్రాకారగోపురాదులందును తుల్యమై యుండుటచే కుమారారామభీమేశ్వరుని సరిసామంతుఁ డనినాఁడు. మఱియొకచోట నీసీమావిభాగ మిట్లు నిరూపింపఁబడినది.

గీ. జంభరిపుదిక్కునకు సీమ సలిలరాశి
 పశ్చిమమునకు సీమ త్ర్యంబకతనూజ
 ద్యుమ్నపతిదిక్కునకు సీమ సలిలరాశి
 దక్షిణమునకు వృద్ధగౌతమియె సీమ.

— 3-33.

ఈపద్యమునఁ జేర్కొనిన ప్రాక్పశ్చిమదిక్సీమలగు సలిలరాశియు

గౌతమియు సమానములే. ఉత్తరమున తుల్యభాగ సీమ యనుటచే, తుల్యభాగాతీరమునకు సమీపమునందున్న కుమారారామభీమేశ్వరుఁ డనుకొనిన సరిపడును. దక్షిణమునకు వృద్ధగౌతమి సీమయనుటయం తగ సరిపడునట్లు గానరాదు. వృద్ధగౌతమీసాగరసంగమము తూర్పు దిక్కునకే చేరిన దగును. ఇఁక వృద్ధగౌతమీశాఖా ప్రారంభము మాత్రము దక్షిణదిక్కునకుఁ జెందిన దయియుండుటచే సరిపెట్టుకొన వలెను.

భీ మ మ ం డ ల ప్రా శ స్త్య ము

ఉ. ఎక్కడఁ జూచిన న్సరసి యెక్కడ జూచిన దేవమందిరం
బెక్కడఁ జూచినం దటిని యెక్కడ జూచినఁ బుష్పవాటికం
బెక్కడఁ జూచిన న్నది మహీవలయంబున భీమమండలం
బెక్కడ యన్యమండలము లెక్కడ భావనచేసి చూచినన్.

— 3—23.

శ్రీనాథునినాఁడును నేఁడునుగూడ భీమమండలిలో నెచటఁ జూచినను సరస్సులు దేవాలయములు నదులు ఆరామములు కన్నుల పండువుగాఁ గానవచ్చుచుండును.

భీమమండలిలోని నదీశాఖావిభవమును తత్పరిసరారామసంపదను సవివేషముగ నిట్లు చిత్రించియున్నాఁడు.

సీ. ఒకచోటఁ గోటిపల్ల్యుడురాజకోటీర
విభ్రాజితోత్సంగ వృద్ధగంగ
యొకచోటఁ బీఠాంబికోన్నతస్తనభరా
స్ఫాలజర్ఝరితకల్లోల యేల
యొకచోటఁ జటులనక్రకుళీరపాఠీన
తోయగర్భాభోగ తుల్యభాగ
యొకచోట నప్సరోనికరసంసేవితాం
తరము శ్రీసప్తగోదావరంబు

నమరు నాగరఖండసిద్ధాంతజాతి
నాగవల్లీసమాక్రాంతపూగఖండ
మండితోద్యానవాటికాఖండవిభవ
పాత్రమగు భీమమండలీక్షేత్రమునకు

— 3—20.

దక్షారామభీమేశ్వరునకు దక్షిణసీమలో నామడదూరమున కోటిఫలి యనుగ్రామమున సోమేశ్వరుఁడును కోటీశ్వరుఁడును గలరు. ఆసోమేశ్వరుని యాలయసమీపమున గౌతమీనదీశాఖ ప్రవహించును. తత్ప్రభావమున నచటిగౌతమీగంగ విభ్రాజితోత్సంగ మై వెలయుచుండును. కోటిఫలి దక్షారామము తరువాత భీమమండలిలోఁ బ్రసిద్ధమైన పుణ్యక్షేత్రము. నేఁటికిని ఏఁటేట శివరాత్రికి భీమమండలిలోని జను లందఱు నాస్వామిని దర్శింతురు.

ఈమండలమున కుత్తరదిక్సీమలో ఏలానది. దీనిని శ్రీనాథుఁడు చిత్రముగఁ జిత్రించియున్నాఁడు. పిఠాపురమునందు నెలకొనిన పీఠాంబికా స్తనభారాస్ఫాలనముచే ఏలానదీప్రవాహము జర్జరితమై తరంగములు లేచెడివఁట. పీఠాంబికవిగ్రహము నంతటికి స్తనభారము విశిష్టముగఁ గన్పట్టును. ఆవిషయ మిందు ప్రతిబింబిత మైనది. ఏలానదీపరిసరప్రదేశ మీకాలువలనీటిచే బహుసస్యారామభరితమై యొసలారుచుండును.

శ్రీనాథునినాఁడు తుల్యభాగానదీజలము చెరలాడెడి చేపలతో మొసళ్ళలతో కుళీరాదిజలజంతువులతోఁ దులతూఁగుచుండెడిదఁట. ఈనాఁడది యటనట మురుగుకాల్వరూపమున నస్తిత్వమును నిలువఁబెట్టుకొనినది. చాలవఱకు విచ్ఛిన్నప్రాయమైనది. కాని తత్తీరభూమి యంతయు బహుసారవంతమైనది. వివిధసస్యారామఫలసంపత్సమన్విత మైనది. ఈతీరభూమి నాఁడును నేఁడును గూడ భీమమండలికంతటికి సారవంతమైనది. శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమునకుఁ

జేరుటకుముందు కాటయవేమారెడ్డి కుమారగిరియాదేశమున తూర్పు నాఁడును జయింపఁ దలపెట్టి, రాజమహేంద్రవరవాసియైన గోపాల స్వామికి "ఈయాత్రలో నేను దిగ్విజయమును సంపాదింపఁ గలిగిన మహావిభవముగల యొకగ్రామమును నీకర్పించెద" నని మ్రొక్కుకొని, దిగ్విజయము లభించినతరువాత, కుమారగిరిరెడ్డి కుమారుఁడైన అనపోతారెడ్డిచే తుల్యభాగాతీరమున అనుపతితిగ్రామమును గోపాల స్వామికి ధారపోయించెను. * దీనినిబట్టి యానాఁడు తుల్యభాగాతీర భూమి యెంతటిమహత్తరసారవంతమైనదో తెలియవచ్చును. ఏతత్తీరమునందే అల్లయవేమారెడ్డి వేమవరదొడ్డవరాగ్రహారదానములు నెలవుటయు దీనిని ధ్రువము చేయును.

సప్తగోదావరము, భీమనాథసంప్రతిష్ఠకై సప్తర్షులచే నంతఃప్రవాహరూపముగా సముపస్థితమై, యీనాఁ డొకచిన్నకొలనుగా భీమేశ్వరుని యెదుట నున్నది. ఆనాఁ డందు అప్సరసలు జలకమాడుచుండెడివారఁట. దానిలో నీనాఁడు తైర్థికులు పుణ్యమార్జింపఁ దలఁచి స్నానము చేయవలయునట్టి పరిమితజలము జతగూడియున్నది. ఇఁక నచటితోఁటల విషయము. భీమమండలిలో బలుతావుల ఫల పుష్పభరితములైన తోఁటలు పెక్కులు గలవు. దక్షారామపరిసర భూము లన్నియు రుచికరమైన తములపాకులతోఁటలతోడను, మామిడి తోఁటలతోడను నిండియున్నవి. తత్సమీపమున పోఁకతోఁటలు పూర్వ ముండెడివేమో గాని యీనాఁడు గానరావు. ఈభీమమండలి సౌభాగ్య మంతయు నొక గద్యమున నిట్లు వర్ణింపఁబడియున్నది.

"భీమేశ్వరుండు భోగమోక్షదీక్షాధురంధరుండై యందు వసించియుండు; నమ్మహాదేవుచేత నప్పుణ్యక్షేత్రంబు భీమమండలం బనఁ బండ్రెండు యోజనంబులమేరఁ గైవల్యకల్యాణ మండపంబును, భోగలక్ష్మీవిలాసభవనపుండరీకంబును నై, కుండలాముఖ సంవేద్య శార్ధూ

* మా. ఆంధ్రేతిహాసపరిశోధకమండలి — రెడ్డిసంచిక. అనుపతితిశాసనము.

లతీర్థంబులు మొదలుగాఁ గలశాఖోపశాఖాతీర్థంబులుం గలిగి, దక్షిణ జలధివేలావనోపకంఠంబున, వేదండవదనశుండాకాండచుళుకితోన్ముక్త సప్తగోదావరసలిలఝుణఝుణాత్కారబృంహితబ్రహ్మాండగోళంబును, తుల్యభాగాప్రవాహలహరికాఘోషఘుమఘుమాయమానదిగ్విభాగంబును, నేలానదీమాతృకాయమానకేదారక్షేత్రసంవర్ధితానేక వ్రీహిభేదసంపత్సమన్వితంబును, ఫలభరిత నారికేళషండమండిత పీఠాపురోపకంఠసీమాబహిర్భాగంబును, మాతృకాయమానగోదావరీతీర పుణ్యాగ్రహారపరంపరాభూనిలింపసంసత్సంపాదితాధ్వరక్రియా సమాహూత పురుహూతాదిదేవతాకదంబసంబాధసంచరితంబును, గాంతేయవాహినీప్రాంత సంతన్యమానసహకారకాంతార ఫలరసాస్వాదమోదమాన పుంస్కోకిలకుటుంబక కంఠనాళకోమల కుహూకారప్రపంచంబును నై : ...... యొప్పు.

— భీమ. 3–18

పైపద్యములందుఁ బేర్కొనఁబడనివి, ఈగద్యమునఁ బ్రత్యేకముగఁ బేర్కొనఁబడినవి కొన్ని విశేషములు గలవు. గోదావరీతీర పుణ్యాగ్రహారములలో నాఁడును నేఁడును గూడ పలువురు భూనిలింపులు వివిధశ్రౌతయాగములు నెఱపుచు, ఇంద్రాదిదేవతాకదంబంబు నాహ్వానించుచుందురు. భారతదేశమందలి యన్నిప్రాంతములకంటెను విశేషముగ శ్రౌతక్రియల నాచరించుటలోను, వేదవేదాంగముల నభ్యసించుటలోను, శ్రౌతకర్మముల నాచరింపఁజేయుటలోను భీమమండల మొకప్రత్యేకత వహించియేయున్నది. కాంతేయవాహిని యనఁగా నీనాఁడుకోనసీమ నంతటను వ్యాపించియున్న కౌశికీనది. ఆనాఁటిశాసనములందును భీమేశ్వరపురాణమునందును నీనదికి 'కాంతేయి' యనియే పేరు గానవచ్చుచున్నది. తన్నదీతీరభూమి తుల్యభాగానదీతీరభూమివలె బహుసారవంతమై, వివిధారామబహుళమై సస్యఫల సంపదలతో నాఁడును నేఁడును గూడఁ దులతూగుచుండును. కాంతేయవాహినీ

ప్రాంతమున హతశేషములయిన మామిడితోఁటలు మధురరసఫలభరితములైనవి నేఁడును గొన్ని నిలిచియున్నవి. వసంతమాసమున నా కోనలో నేమూలకుఁ బోయినను కలపుంస్కోకిలకంఠకోమలకుహూకారము వినిపించుచునేయుండును. మఱియు పనసతోఁటలు అరఁటి చెఱుకుతోఁటలు నారికేళవనములు నత్యధికములు. పిఠాపురప్రాంతములందంతగ నారికేళవనములు నేఁడు గానరావు గాని, యీకోనమండలమం దంతటను నవి బహుసమృద్ధములు.

ఈభీమమండలమును భోగమోక్షనిలయమును జేసినది మంగళోత్తుంగ యగు గౌతమీగంగ. ఆనదీప్రవాహప్రసారము నీప్రబంధమునం దిట్లు చిత్రించియున్నాఁడు.

సీ. త్ర్యంబకాచలశిఖాగ్రంబునం దుదయించి
పొదలి యార్యావర్తభూమి దరిశి
మలఁగి దండకవనీమధ్యభాగమున నా
ప్రస్రవణాచలప్రస్థ మొరసి
పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథుమందిరము డాసి
యేచి యనంతభోగేశ్వరస్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవ గాఁగఁ
గోటిపల్లీశుకోమలాంఘ్రులకు మ్రొక్కి-
కుండలాముఖతీర్థంబు గుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టుకొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె.

— 3—21.

గోదావరి నాసికసమీపమునందలి త్ర్యంబకాచలశిఖరమునం దుద్భవించి, సరాసరిగాఁ బ్రవహించుచు వచ్చి, నడుమ నుండెడి యార్యావర్తభూమిని సమీపించి, దండకారణ్యమున సంచరించి, ప్రస

వణాచలము నొరసికొనుచు క్రిందికి వచ్చినది. 'ప్రస్రవణాచలము అనఁగా పాపిడికొండ. గోదావరీనదీప్రవాహవేగమున నాకొండ పాపిడి పెట్టుగాఁ జీలుటచే పాపిడికొండయై యీనాఁడు వర్ణచ్యుతిచే పాపి కొండ యైనది. దీనితరువాతది పట్టిసక్షేత్రము. ఇచటి యీశ్వరుఁడు వీరభద్రేశ్వరుఁడు.

'పట్టిస' మనఁగా యుద్ధమునకు సాధనమయిన వెడల్పయిన కత్తి. దక్షిణకాశియగు దక్షారామమున దక్షుఁడు నెఱపిన యజ్ఞమును ధ్వంసము సేయుటకు వీరభద్రుఁ డుద్భవించి పట్టిసమును జేఁబట్టి దేవతలను సఱుకుచు వచ్చి, గోదావరీమధ్యమునందు నేఁటివీరభద్రేశ్వరనిలయ మైన పర్వతమును వెన్ను దన్ని గౌతమీప్రవాహమునఁ బట్టిసమును గడిగినచో టగుటచేఁ దత్సమీపభూమికి పట్టిసము అను పే రేర్పడి నది. ఈవిషయమును శ్రీనాథుఁడు కాశీఖండమునం దిట్లు వివరించి యున్నాఁడు.

గీ. దక్షిణానందవిపినమధ్యంబునందు
క్రతువిధిధ్వంసవేళ దేవతల నఱికి
వీరభద్రేశుఁ డీయద్రి వెన్ను దన్ని
గౌతమీవారిఁ దరవారిఁ గడిగినాఁడు

— కాశీ. 3.

దక్షిణానందవిపినము=దక్షిణకాశియగు దక్షారామము. తర వారి=కత్తి. ఈపట్టిసమున వీరభద్రేశ్వరుఁడు గోదావరీనదీమధ్యమున నొకచిన్నపర్వతముపై నెలకొనియున్నాఁడు. ఆపర్వతమునం దొకయాల యము; తన్మధ్యమున భద్రకాళీసహితుఁడైన వీరభద్రేశ్వరుఁడు వెలసి యున్నాఁడు. దక్షాధ్వరధ్వంసము జరిగినపుడు దక్షారామమున వీర భద్రుఁడు దేవతల కెట్టిపరాభవ మొనర్చెనో యావిషయ మీకావ్య మునం దిట్లు వర్ణింపఁబడినది.

సీ. ఎచ్చోటఁ దాఁ బొత్తె నిట్టిరూపముఁ దాల్చి
యతిసాధ్వసంబుతో నధ్వరంబు
పాటిల్లె నెచ్చోట భాషావధూటికి
నతిజుగుప్సిత మైన యంగవికృతి
యెచ్చోట ముచ్చిచ్చు నేడేసినాల్కలు
కొండనాల్కలుదాఁకఁ గోఁత వడియె
నెచ్చోట నులివేఁడిమెండఁ బండులు రాలి
పూషార్కవదనంబు బోసివడియె
దక్షుఁ డెచ్చోటఁ బొట్టేలితల ధరించెఁ
జిందువందయ్యె నెచ్చోట నిందుఁ డనుచుఁ
జెప్పుదురు వీరభద్రవిజృంభణంబు
భీమమండలి నందు ప్రాఁబెద్దమునులు.

— భీమ. 3—37.

వీరభద్రవిజృంభణసమయమున యజ్ఞపూరుషుఁ డిట్టిరూపముఁ దాల్చెను. భాషాదేవినాసాగ్రము చిదుమఁబడినది. అగ్నిహోత్రుని నాలుక లేడును గోఁతవడినవి. పూషార్కనిముఖము పండులు రాలి బోసివడినది. దక్షుండు భయభీతుఁడై పొట్టేలితల ధరించెను. చంద్రుని పొట్టగుజ్జు బయటఁబడినది. వీనిలో పొట్టేలితల ధరించినదక్షుఁకు దక్ష పత్నియు నాయాలయసింహద్వారపార్శ్వములందు నిలిచి దక్షాధ్వర ధ్వంసము నెఱపినవీరభద్రుఁ డీతఁడే యనుటకుఁ దార్కాణములుగా నున్నారు. అట్టి వీరభద్రేశుని సేవించిన దీ గోదావరీనది.

ఈవీరభద్రశిఖరి గోదావరీమధ్యమునం దుండి, పరమపవిత్రమైన పరమేశ్వరావాసమై వెలయుచున్నది. పంచకాశీక్షేత్రములలో నిది యొకకాశీక్షేత్ర మని ప్రానుడి. ఇది ప్రప్రస్రవణాచలమునకు (పాపికొండ లకు) పదిక్రోశములు క్రిందను, రాజమహేంద్రవరమున కాఱు క్రోశ [illegible] ఈయాలయమున కెదురుగ రెండుక్రోశముల

దూరములోఁ బైన మహానందీశ్వరాలయము గలదు. అదియును గోదావరీమధ్యమునందే యున్నది. ఈయిరువురు దేవతలు నన్న దమ్ములని యచటివారు వాకొందురు. శివరాత్రినాఁడు పట్టిసమునకుఁ దైర్థికులు విశేషముగ వత్తురు. నలుజాములు నాస్వామికి వేదములు వినిపింతురు. శివరాత్రినాఁడు దక్కఁ గడమదివసములలో రాత్రి వేళయందు వీరభద్రాలయమున నెవ్వరు నిలువఁ జాల రని ప్రతీతి. ఆస్వామి నర్చించుపూజరు లాకొండమీఁద నివసించుచుండినను, రాత్రి సమయమునం దాయాలయమునఁ బ్రవేశింప రని యచటి పూజరులే తెలిపిరి.

ఆయాలయప్రాకారములోని తిరుచుట్టుమాలెలో నొకవైపున భద్రకాళి రుద్రకాళులును, ఇంకొకవైపున దుర్గామహిషాసురమర్ద నులును గలరు. నడుమ నందీశ్వరుఁడు భాస్కరుఁడు లక్ష్మీగణపతి సప్తమాతృకలు వీరభద్రుఁడు కుమారస్వామి శక్తి విష్ణువు చండీశ్వ రుఁడు కాలభైరవుఁడు సుబ్రహ్మణ్యేశ్వరుఁడు బాణాసురుఁడు భృంగి మహాకాళాది ప్రమథగణములవిగ్రహములు గలవు. ఈవిగ్రహము లలో భద్రకాళీవీరభద్రులవిగ్రహములు గాక యితరవిగ్రహము లర్వా చీనములుగఁ గన్పట్టును. ఆలయములో గర్భమండపమున స్తంభము లందు తాండవవీరభద్రుఁడు శరభశక్తివిగ్రహములు చెక్కఁబడియున్నవి. అచటి క్షేత్రపాలకుఁడగు విష్ణువు భావనారాయణస్వామి. ఆస్వామి యాలయముకూడ వీరభద్రేశ్వరుని యాలయముతో పాటు ప్రాచీనమై నదియే. ఈరెండాలయములకు నడుమ సీతారాములకు, వారికెదు రుగ ఆంజనేయస్వామివిగ్రహమునకు రెండు చిన్నచిన్న దేవళములు నిర్మింపఁబడియున్నవి. ఈయాలయములు 19వ శతాబ్దిలో మన్నెము మహాలక్ష్మమ్మ యను జమీందారిణి నిర్మించినట్టు లొక రాతిపై శాసన మున్నది. అచటిపురాతనాలయములు రెండిటికి నడుమ నీరామాలయ మేల వెలసెనా? యను సంశయముతోఁ బరిశీలింపఁగా, చల్లా పేరయ్య

కవి రచించినభద్రగిరిశతకములోఁ గొంత యాధారము కానవచ్చినది. 'ఇబ్రహీంఖాను' అను మహమ్మదీయుఁడు తన పరివారముతోఁ గూడి, భద్రాచలమునందలి రామాలయమును గొల్లఁగొట్టుటకుఁ దలపెట్టఁగా, సీతారామలక్ష్మణుల విగ్రహములను బడవమీఁదఁ బెట్టి యప్పటివారు ముందుగ పట్టిసమునకుఁ గ్రోశముమీఁద నున్న రెడ్డిపోలవరమునకుఁ గొని తెచ్చిరి. అచటినుండి ఆఱుమాసములతరు వాత పట్టిసమునందలి వీరభద్రశిఖరిపై అయిదువత్సరము లుంచి పిమ్మట భద్రాచలమునకుఁ గొనిపోయిరి. భద్రాచలసీతారాములు కొంతకాల మచట నుండినకారణమున నీయాలయము లావిషయమును గుర్తింపఁజేయుటకై నూత్నముగ నిర్మింపఁబడిన వని తెలియవచ్చినది

ఈపట్టిసమునకు మూఁడుక్రోసులు క్రింద గోదావరీపశ్చిమతీర మున తాళ్ళపూడి యను గ్రామము గలదు. అచటియీశ్వరుఁడు సోమ నాథుఁడు. అచటి గోదావరీతీర్థమునకు తిలతీర్థమనుపేరు శాసనములలోఁ గానవచ్చుచున్నది. తన్మూలమునఁ దత్తీరవాసి యీశ్వరుఁడు తిలసోమ నాథుఁడు. ఈతిలసోమనాథుని మందిరమునకు క్రింద క్రోసుదూరములో అనంతభోగేశ్వరుఁడు. పూర్వము గోదావరీతీరమునం దుండిన యాల యము నదీపతితము గాఁగా, నీనాఁ డాయనంతభోగేశ్వరుఁడు తత్సమీ పగ్రామమైన కుమారదేవమునకుఁ గొని పోఁబడి యచట స్థిరపడినాఁడు. రుద్రపాదము లనఁగా రాజమహేంద్రవరమునందలిపుష్పగిరిపాదములు. వీనిపైఁ ద్రోవచేసికొనుచుఁ బోఁగా పదిక్రోసులు క్రింద కోటిపల్లీశుఁ డయిన సోమేశ్వరుఁడు. కోటిఫలి కెనిమిదిక్రోసులక్రింద వృద్ధగౌతమీ శాఖాతీరమున కుండలాముఖతీర్థము. అచటి యీశ్వరుఁడు కుండలే శ్వరుఁడు. ఈయిరువురనుగూర్చి కాశీఖండమునందు శ్రీనాథుఁ డిట్లు వాకొనియున్నాఁడు.

కోటీపల్లీతీర్థ కుండలాముఖముల
నర్ధేందుధరు విరూపాక్షుఁ గొలిచి

— కాశీ. 3-అ

కోటిపల్లితీర్థమున అర్ధచంద్రధారియైన సోమేశ్వరుని, కుండలాముఖతీర్థమున విరూపాక్షుని అగస్త్యుఁడు దర్శించె నని శ్రీనాథుఁడు తెలిపియున్నాఁడు. కోటిపల్లీతీర్థవాసి యర్ధేందుధరుఁ డను విషయమును దెలుపుట కాస్వామి రజతకిరీటము నెల్లపుడు దాల్చియుండును. కుండలాముఖతీర్థము వృద్ధగౌతమీసాగరసంగమక్షేత్రమునకుఁ గొలది గ నీవల నుండును. అచటియీశ్వరుఁడు కుండలేశ్వరుఁడు. లింగాగ్రము మకరకుండలాకారమును దాల్చియుండును. ఆయీశ్వరుఁడు విరూపాక్షుఁ డనుటకు గుర్తుగా లలాటప్రదేశమున నేత్రాకృతి గలదు. ఆఫాలనేత్రమును ప్రత్యక్షముగఁ జూచి గ్రంథస్థముచేసిన యాతనిసూక్ష్మదృష్టి నాకెంతయు నబ్బురపాటును గొల్పినది. ఈవిధముగఁ బరికించిన శ్రీనాథుఁడు వాడిన విశేషణము లన్నియుసార్థకములే యగునుగాని నిరర్థకము లేవియుఁ గానరా వని నాయూహ. తత్తద్విశేషముల నెఱుఁగుటకై యాయాస్థలములకుఁ బోయి ప్రత్యక్షముగఁ జూచుట మాత్రము కావలయును.

గౌతమీగంగ కుండలాముఖతీర్థమును సమీపించుచు భీమమండలిని డాపలఁ బెట్టుకొనుచు లవణాబ్ధిని కౌఁగిలించినది. దక్షారామ భీమేశ్వరాలయము తత్పరిసరప్రదేశము గౌతమీశాఖ కెడమవైపుననే నుండుటచే శ్రీనాథుఁ డట్లు వాకొనినాఁడు.

గోదావరీనది నితరనదు లన్నిటికంటెఁ గడు మిన్నగాఁ జిత్రించినాఁడు.

గీ. నీరుకడఁ గోళ్ళఁ గూడి మున్నీటిఁ గవయు
మొగులుబడివాహినుల కెట్లు మురియవచ్చు
వార్ధి లేడింటికి వలపువనిత యైన
మంగళోత్సంగ గౌతమీగంగ యెదుర.

— భీమ. 3. 22.

ఈపద్యమునకు మూలమయిన భీమఖండశ్లోక మిది.

అన్యా స్తటిన్య శ్శ్రీభీమమండలీభాసమానయా
గౌతమీగంగయా లోకే గౌరవేణ కథం సమాః.

భీమమండలిలో విరాజిల్లుచున్న గౌతమీగంగతో గౌరవమున నితరనదు లెట్లు సమానము కాఁగల వని శ్లోకభావము. ఈభావము నూఁతగఁ గొని గౌతమీగంగను మంగళోత్సంగను గావించి, వార్ధు లేడింటికిని వలపువనితను గావించినాఁడు. అట్టివిభవముతోఁ గూడిన గౌతమియెదుట నితరనదు లన్నియు వర్షోదకము ప్రవహింపఁగా నేర్ప డిన కోళ్ళై, 'నదీనాం సాగరో గతిః' యనున్యాయమున సముద్రమునఁ గలియు మొగులుబడివాహిను లైనవి. మేఘుఁడు వర్షించినపుడే యది వాహిని, లేకున్న నేమియు లే దనుట. ఒక్క గౌతమీగంగనే సము ద్రము లేడింటికి వలపువనితను జేయుటలోఁ దన్మాంగళ్యము మఱింత విశిష్ట మొనర్పఁబడినది. గౌతమీనది సప్తశాఖలు గలదియై సముద్ర గామి యైన దనువిషయము నుత్ప్రేక్షింపఁజేయుట కై యాయమ్మను వార్ధు లేడింటికిని వలపువనితనుగాఁ జేసినాఁడు శ్రీనాథుడు.

గౌతమీనదీసప్తశాఖలు —

శ్లో. తుల్యాత్రేయీ భరద్వాజీ గౌతమీ వృద్ధగౌతమీ
కౌశికీ చ వసిష్ఠాచ సప్తశాఖాః ప్రకీర్తితాః

గౌతమమహర్షి గోహత్యాదోషనివృత్తికై త్ర్యంబకాచలశిఖా గ్రమునుండి గోదావరీనదిని కొన్నావువఱకుఁ గొనిరాఁగా, నచటినుండి సప్తర్షులు సప్తశాఖలుగాఁ గొని గౌతమిని సముద్రగామిని జేసియు న్నారు. వీనిలో ప్రాక్పశ్చిమములో గౌతమి వసిష్ఠ యనునవి ప్రధానశాఖలు. ఈగౌతమీశాఖనుండియే మరల నేడుశాఖ లేర్ప డినవి—

1. తుల్య— ఈశాఖధవళేశ్వరము దగ్గఱప్రారంభమై వేమగిరి కడి యము జేగురుపాడు అనపర్తి మీఁదుగా రామచంద్రపురము తాలూకా

లోని పెక్కుగ్రామములను జుట్టుచు కాకినాడసమీపమున చొల్లంగిదగ్గఱ సాగరసంగత యగుచున్నది. ఈనదీసాగరసంగమస్థలములం దన్నిటను నొక్కొక్క యీశ్వరలింగము గలదు. చొల్లంగిదగ్గఱ తీర్థాధిదైవతము సోమేశ్వరుఁడు.

2. ఆత్రేయి— గౌతమీశాఖ కీవలియొడ్డున రాజమహేంద్రవరమున కెనిమిదిక్రోసులు క్రింద నున్న కపిలేశ్వరపురముదగ్గఱ కణ్వనదీశాఖ ప్రారంభమై అంగర ఱేకి పామఱ్ఱు మున్నగు రామచంద్రపురము తాలూకాగ్రామములమీఁదుగాఁ బ్రవహించి దంగేరుగ్రామమునొద్దం దిరిగి గౌతమీశాఖలోఁ గలియుచున్నది. తత్సంగమస్థలమున మఱియొకశాఖ ఆత్రేయి ప్రారంభమై కాకినాడతాలూకాకుఁ జెందిన మసకపల్లి కోలంక దుగ్గుదుఱ్ఱు కాజులూరు మున్నగు గ్రామములను జుట్టి కోరంగి దగ్గఱ సముద్రగామి యగుచున్నది. అచటి యీశ్వరుఁడు కురంగేశ్వరుఁడు. శ్రీరాముఁడు మాయాకురంగ మగు మారీచుని టఁ జంపి కురంగేశ్వరుని బ్రతిష్ఠించె నని యైతిహ్యము. శ్రీనాథుఁడు శివరాత్రిమాహాత్మ్యమున భీమనాథుని మాఘమాసవాసరములలో నీకోరంగికి వాహ్యాళి రప్పించినాఁడు, "భువనరక్షాదాక్షిణ్యుఁడు దాక్షారామభీమేశ్వరుండు దక్షిణజలధివేలావలయితేంబులగు నేలాలవంగలవలీమతల్లికాకుడుంగక్రోడంబులఁ గ్రీడించుటకునై సారంగలోచనలుఁ దానును గోరంగి దండువెడలె. (శివరా. ౪.౫౧)

3. 4. భరద్వాజి, గౌతమి: గౌతమీనదీశాఖ కోటిపల్లియొద్ద మాతృగమనాఘహారిణిగాఁ బేర్కొనఁబడుచున్నది. అచటి కయిదుక్రోసులు క్రింద ఇంజరము మొదలుగ, సముద్రసంగతయగునంతవరకు భరద్వాజ్యంతర్భూతగౌతమి యని వ్యవహరింపఁబడుచున్నది. ఈసంగమస్థలమునం దయిదు తీర్థములు గల వందురు 1. గౌతమి. 2. భరద్వాజి. 3. రేవ. 4. ఇంద్ర. 5. అహల్యా. ఈయయిదుతీర్థములు సంగమించి

న్ప్రదేశమును. 'తీర్థాలమొండి' యందురు. దీనికే సంవేద్య ఘని వ్యవహారము. ఇచటి సముద్రతరంగాడంబరము కడు మనోహరము. దానిని శ్రీనాథుఁడిట్లు చిత్రించియున్నాఁడు.

సీ. జనమేజయారబ్ధ సర్పాధ్వరాహూత
　　　చక్షుశ్శ్రవస్సహస్రములఁ బోరి
బ్రహ్మాండమండలప్రాసాదసంభార
　　　హరిమణిస్తంభసంహతు లనంగ
జంభారిదోస్తంభదంభోళిఖండితా
　　　జనశైలశిఖరశృంగములఁ బెనఁగి
సంహారసమయజంఝామారుతోద్ధూత
　　　కాలాంబువాహసంఘముల గెలిచి
యాడుచున్నవి తీండ్రిల్లి యంబరమునఁ
జేయుచున్నవి త్రిభువనాశ్లేషకంబు
నబ్జనాభుని తూఁగుటుయ్యాలలు గంటె
వేనవేలు పయోరాశివీచిఘటలు.

— 3-52.

ఈసంవేద్యస్థలమునందలి సముద్రతరంగాడంబరము శ్రీనాథుఁడు వర్ణించిన క్రమమునకే యొప్పుచుండును. మఱియు నీగౌతమీసాగరసంగమస్థలము గంగాతీరస్థమైన కాశీక్షేత్రముకంటెను విశిష్టముగ మోక్షదాయక మనువిషయము నిట్లు వివరించియున్నాఁడు.

శా. కాశిం జచ్చినయంతఁగాని పడయంగా రాని కైవల్యమ
క్లేశంబై సమవేద్యనాయకునిచే లీలాగతిం జేరు రా
రో శీఘ్రంబున మర్త్యులార! యను నారూపంబున న్మ్రోయు నా
కాశాస్ఫాలనగౌతమీజలధిసంగస్థానకల్లోలముల్.

— 3-53.

5. వృద్ధగౌతమి — ఈశాఖ కోటిఫలి కావలియొడ్డునం దున్న ముక్తీశ్వరముసమీపమునుండి ప్రారంభమై తొత్తరమూడి శాన పల్లంక గాడేలంక కొత్తలంక కుండలేశ్వరము మీదుగా ప్రవహించి సముద్రగామి యగుచున్నది. కాటయవేమునిభార్య మల్లాంబిక తొత్తర మూడి సమీపమున 'మల్లవరము' అనుగ్రామమును రాజమహేంద్ర వరస్థిత మార్కండేయస్వామికి దానముసేయునపు డాగ్రామము వృద్ధ గౌతమీనదీతీరస్థమని వాకొనఁబడియున్నది. ఈవృద్ధగౌతమీశాఖ అమలాపురము తాలూకాలో మురుగుకాలవ రూపమున నేఁడును గొంత యస్తిత్వమును నిలుపుకొనియున్నది. ఏతన్నదీసంగమ స్థలము నకు 'బ్రహ్మసంవేద్యము' అనిపేరు. అచట బ్రహ్మేశ్వరుఁడు వృద్ధేశ్వ రుఁడు సంతానగోపాలస్వామియును గలరు. సంతానార్థులై సప్తసాగర యాత్ర సెలుపు సౌభాగ్యవతు లిచట నిద్రించి, స్వప్నానురూపమైన ఫలమును బడయుదు రని లోకోక్తి.

6. కౌశికి — ఈశాఖ కపిలేశ్వరపురమున కెదురుగ నావలి యొడ్డు నుండి విడువడి అమలాపురము తాలూకాలోని పెక్కు గ్రామ ములను జుట్టుచు బెండమూరులంకదగ్గఱ సముద్రగామి యగుచున్నది. ఈసంగమస్థలమును విష్ణుసంవేద్యము అని యందురు. ఇచట రామలింగే శ్వరస్వామియు లక్ష్మణేశ్వరస్వామియును గలరు. ఈకౌశికీనదీ ప్రారంభ మున మందేశ్వరుఁడు గలఁడు. అతఁ డగస్త్యప్రతిష్ఠితుఁడు. ఈఁత డీమండలమున విశేషప్రసిద్ధుఁడు. కృష్ణపక్షత్రయోదశి శనివారమైన నాఁడు పెక్కురు తైర్థికులాస్వామికి తైలాభిషేకములు సెలుపుదురు. తత్సమీపమున గౌతమియందలి తీర్థమును సూర్యకుండము అని యందురు. తత్సమీపమునుండియే కౌశికీనది ప్రాదుర్భవించినది.

7. వసిష్ఠ — ఈశాఖ ధవళేశ్వరమునకు రెండుక్రోసులు క్రింది విఘ్నేశ్వరమునొద్ద గౌతమీపశ్చిమతీరము నుండి విడువడి సరాసరిగాఁ బోవుచు నేచోట సముద్రగామి యగుచున్నదో దానినే యంతర్వేది

యందురు. అచట నీలకంఠేశ్వరుఁడు క్షేత్రాధిదైవతము. నృసింహ స్వామియు నచటఁ గలఁడు.

పుష్యబహుళ అమావాస్యనాఁడు చొల్లంగి దగ్గఱ తుల్యా సాగరసంగమమున స్నాన మారంభించి, గోదావరీ సప్తశాఖా సంగమములలో స్నానదానాదికము నెఱపుచు సప్తసాగరయాత్ర నెఱపు త్రైర్థికులు మాఘశుద్ధదశమినాఁటికి అంతర్వేది చేరుదురు. ఆయేకాదశి కచట నృసింహస్వామికి కల్యాణమహోత్సవము జరుగును. తద్దర్శనముతో నాయాత్ర సమాప్తమగును. ఈవిధముగ గౌతమి సప్తర్షిసమానీతయై, సప్తశాఖాస్వరూపిణియై, సప్తస్థలముల సాగరసంగత యగుటచే వార్ధు లేడింటికిని వలపువనిత యైనది. ఈసప్తగోదావరీశాఖా మధ్యప్రదేశ మెల్లపుడు సకలకల్యాణ సమృద్ధమై వెలయుచుండును.

అగస్త్యుఁడు వ్యాసునకు భీమమండలిలోని ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రములను ఆకాశమునుండి కాన్పింపఁజేయు ప్రకరణములో తత్తన్మహత్త్వము నిట్లు తెలిపినాఁడు.

సీ. అదె పట్టిసస్థాన మందుండు వీరభ
 ద్రేశ్వరస్వామి యర్ధేందుమౌళి
యదె పుండరీకాద్రి యచట మార్కండేయు
 నిలువేల్పుముక్కంటి వెలసెఁ దొల్లి
యదె కుమారారామ మాహర్మ్యరేఖయ
 చాళుక్యభీమేశు సదనవాటి
యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతముమేడ
 హుంకారిణీదేవి యోలగంబు
వాఁడె మాయింటివేల్పు పల్వాలపురమునఁ
గొప్పులింగంబు ఫణిరాజకుండలుండు
సప్తమునిసింధుసంగమేశ్వరుఁడు వాఁడె
కుండలాముఖ మదె మౌనికులవరేణ్య !

— భీమ. 3.55.

మ. అదె సంవేద్యము కోటిపల్లి యదె దక్షారామ మన్పట్టణం
బదె యభ్రంకష సౌధకూటఘన హేలావాస ముచ్చాయసం
పద సొంపారెడి భీమలింగముమహాప్రాసాదభూమీధరం
బిదె సప్తర్షి నదీప్రవాహ మిదె సంవీక్షింపు మేకాగ్రతన్.

— భీమ. 3.

1. పట్టిసస్థానము — వీరభద్రుఁడు దక్షాధ్వరధ్వంసము గావించి నపుడు దేవతల నఱికిన పట్టిసమును గడిగినచోటు వీరభద్రగిరి. అచటి యీశ్వరుఁడు అర్ధేందుమౌళియైన వీరభద్రేశ్వరుఁ డఁట. ఇచటి యీ 'అర్ధేందుమౌళి' యను విశేషణము సార్థకము. ఆస్వామిలింగము పీఠముపై రెండడుగుల యెత్తు మూఁడడుగుల కైవారము గలిగి యున్నది. ఫాలదేశమున సూర్యచంద్రులు నేత్రము లయినట్లు గుర్తు లున్నవి. శిరోభాగమున నితరలింగములకువలెఁ గాక ఎత్తుగ బొణిపి వలె నున్నది. అచటివా రాయెత్తయినప్రదేశమును జటాజూట మనిరి. దానిపై రజతకిరీట మొకటి యమరియున్నది. నాగాభరణమును బయ టికిఁ దీయుటకు ముం దీరజతకిరీటమును దీయవలసియుండును. వీరభద్రే శ్వరుఁడు అర్ధేందుమౌళి యనుటకు నిదర్శనమే లింగమీఁదిభాగము ఎత్తుగా నుండుట, రజతకిరీటము దాల్చియుండుటయును.

2. పుండరీకాద్రి — పుష్పగిరి లేక పద్మగిరి. రాజమహేంద్ర వరమున గౌతమీనదీతీరమున మార్కండేయస్వామికి నిలయమైనది.

3. కుమారారామము — సామర్లకోటభీమవరము. అచట చాళుక్యభీముఁడు నిర్మించిన భీమేశ్వరావాస మయిన హర్మ్యము దూర మునకే గనపట్టుచుండును.

4. కుక్కుటేశ్వరము — కుక్కుటేశ్వరుఁడు నెలకొనినస్థానము పిఠాపురము. కుక్కుటేశ్వరుఁడు యథాతథముగనే యున్నాఁడు. పురుహూతికాశక్తిపీఠము. పురుహూతికాశక్తి గాని యామెసభాభవనము గాని నేఁడు గానరాదు. శ్రీనాథునినాఁటికి కవి యుండియుండును. పిఠా

పురము హుంకారిణీశక్తినిలయ మగుటచే నాఁడు పంచారామములతో సమానప్రతిపత్తి గలిగియుండెడి దని ఈక్రిందిపద్యశాసనమువలన వ్యక్తమగుచున్నది.

సీ. భీమాపురము డాకిరేమి వాలొ్ఙలను ద
చ్చారామపురి శ్రీమదమరడాలు
య [న] ను నంధ్రధరణి పంచారామముల మహా
దేవరలకు బుద్ధదేవరలకుం
జేంబ్రోల నమ్మహాసేనున కుం బిద
పురము హుంకారిశంకరికిం గరము
రూఢి కెక్కిన బెజవాడ మల్లేశ్వర
దేవరకు నఖండదీపతతులు, వెట్టి....*

5. పలివెలపురవాసి యీశ్వరుఁడు తొలుత నగస్త్యేశ్వరుఁడు తరువాత కొప్పులింగ మైనాఁడు. అట్లగుటకుఁ గారణము నాగాభరణము. ఆవిషయమును గుర్తింపఁజేయుటకే 'ఫణిరాజకుండలుండు' అను విశేషణము. దానినిగూర్చిన యైతిహ్యమిది.

పలివెల దేవాలయనిర్మాణము దక్షారామకుమారారామాలయ నిర్మాణశేషముతో నిర్మింపఁబడినట్టులు చెప్పుకొందురు. దానిఁ బట్టి చాళుక్యభీముని పాలనమునాఁడు అగస్త్యేశ్వరుఁడు కొప్పులింగేశ్వరుఁడై యుండె నని నాయూహ. ఆనాఁడాస్వామికి పూజనెఱపు పూజరి యువకుఁడొకఁడు పరమేశ్వరభక్తిభావభరితుఁ డయ్యును వేశ్యాలోలుఁడై యుండెను. పలివెలపురవాసుల కావిషయము దుస్సహము కాఁగా రాజున కావిషయము నెఱుకపఱచిరి. అందలిసత్యమును బరికించుటకు రాజొకనాఁ డాకస్మికముగఁ బలివెలకు వచ్చెను. అది మధ్యాహ్న సమయము. పూజరి యప్పటికి ఈశ్వరునకు మాధ్యాహ్నికపూజ నిర్వర్తించి, వేశ్యయింటిలో నిష్టాగోష్ఠి నెఱపుచుండెను. పల్వాలేశ్వరుని

*చూ. శాసనపద్యమంజరి. No. 20. పుట. ౨౬. S. i. i. Vol. IV No. 742.

దర్శించుటకై రాజు పురమునకు వచ్చెనను వార్త వేశ్యయింటిలో నుండిన యాపూజరికిఁ దెలియవచ్చెను. ఆనాఁటిపరిపాటినిబట్టి, ప్రభు వీశ్వరదర్శనమునకు వచ్చిన, ఈశ్వరనిర్మాల్యమగు మాలిక నీయవలసి యుండెను. దేవాలయమున నట్టిమాలిక యేదియు లేదని యెంచి, పూజరి తనపరిపాటిని నిర్వర్తింపఁజేయుటకు వేశ్యజడలోని పూదండను గైకొని, యెవ్వరికిఁ గానరాకుండ నాలయమునకుఁ గొనిపోయి, రాజునకు శిరముపై పరమేశ్వరునిపాదుక లుంచి, దోసిట నాదండను నిర్మాల్యముగ నుంచెను. ఆదండలో వేశ్యశిరోజ మొకటి యంటుకొని యుండెను. పూజరి దానిని గుర్తింపలేదు.

పూజరి వేశ్యాలోలతను రాజునకు నివేదించి, యాకస్మికముగ నాతని రావించిన పురజను లది పరికించి, "పూజరి మీకు ఈశ్వరనిర్మాల్యముగా నిచ్చిన పూదండ వేశ్యజడలోనిదే గాని, ఈశ్వరునకు వైచినది గాదు. అట్టు లయిన దీనిలోఁ దలవెండ్రుక యేల యుండు" ననిరి. "ఇట్టు లేల చేసితివి?" అని రాజడుగఁగా, "అది వేశ్యజడలోనివెండ్రుక కాదు. మాస్వామికిఁ గొప్పు గలదు. ఆకొప్పులోని వెండ్రుకయే దీని కంటెను." అని బదులు చెప్పెను. సన్నిహితులయిన పురవాసు లామాటలు అసత్యము లనిరి. పూజరి సత్యమే యనెను. కొప్పుండినటులు నీవు చూపించెదవా? యనిన, తప్పక చూపించెద ననెను. అట్లయిన వెంటనే కనఁబఱుపు మనఁగా "నేఁడు మాస్వామి కభిషేకముచేసి, గంధపుష్పాదులచేఁ బూజ నిర్వర్తించి, నాగాభరణభూషితుని జేసి యుంటిని. తిరిగి రేపుప్రాతఃకాలమునఁగాని నాగాభరణముఁ దొలఁగించి, నిర్మాల్యముఁ దీసి స్వామి నిజస్వరూపమును గాన్పింపఁజేయుటకు వీలుపడ" దని బదులుచెప్పెను. రేపటి యుదయమువఱకుఁ దమ రుండినఁ దప్పక కాన్పింపఁజేసెద ననెను. దాని కాప్రభువును సరియే యనెను.

పిమ్మట రాత్రియంతయు నాపూజరి శివలింగముసన్నిధిని నిలిచి, కొప్పు రప్పింపకున్నఁ బ్రాణములు గోలుపోయెద నని భక్త్యావేశ

మునఁ బ్రార్థించెను. పరమేశ్వరుఁ డాతని భక్తికి మెచ్చి, లింగమునకుఁ గొప్పు నావిర్భవింపఁజేసెను. నేఁటికిని నాలింగమునకుఁ గొప్పుండినట్లు శిలకు నొకబొణిపెవలె నెత్తుగఁ గానవచ్చును. ఉదయము ప్రభు వీశ్వ రుని దర్శింపవచ్చుసరికి లింగమునఁ గొప్పు గానవచ్చెను. ఆకేశములు కూడ రాత్రివేళ పూజరియే లింగమున కంటించె నని పురజనులు తెలు పఁగా, రాజు కేశములను గొన్నిటి నూడఁబెఱికించెను. అట్లు చేసి నంతనే లింగమునుండి రక్తము చిందె రాజుకన్నులు మసగగొనెను. పిమ్మట రాజు తనయపరాధము సైఁపు మని పరమేశ్వరుని బ్రార్థించి, మరల సుస్థితికి వచ్చెను. పూజరి తనభక్తిభావముచే అగస్త్యేశ్వరుని కొప్పులింగేశ్వరుని జేసినందులకు సంతసించి వసిష్ఠానదీతీరమున ముప్పది పుట్లభూమి దానముచేసెను. ఆభూమికి నేఁడును 'జుత్తిగపాడు' అను పేరు గలదు. పలివెలలోని యీశ్వరునకు జుట్టు రావించినందుల కిచ్చినభూమి యగుటచే నది జుత్తిగపాడైనది. నిన్న మొన్నటివఱకు నాభూమి పలి వెల పూజరులకే సర్వాధికారములతోఁ గూడి చెల్లుచుండెడిది. దీనిని బట్టి యీకథ సత్యమే యనుటకు సందియము లేదు.

ఈతీరుగ పలివెలలో అగస్త్యుని కింటివేల్పయిన యీశ్వరుని కొప్పులింగేశ్వరుని జేయుటకు నాగాభరణమే మూలకారణము.

6. సప్తమునిసింధుసంగమేశ్వరుఁడు — తుల్యభాగానదీతీరము నంటి ఏడిదసమీపమునఁ గలసంగమేశ్వరుఁడు. సప్తమునులు గొని తెచ్చిన గౌతమీతుల్యభాగల సంగమక్షేత్రవాసి యైనయీశ్వరుఁడు.

7. సంవేద్యము — గౌతమీ, వృద్ధగౌతమీ, కౌశికీనదీసాగర సంగమస్థలము. బ్రహ్మసంవేద్య విష్ణుసంవేద్యములు.

8. కోటిపల్లి — గౌతమీనదీతీరమందలి సోమేశ్వరావాసము.

## ద క్షా రా మ ము

9. దక్షారామము తద్వాసిభీమేశ్వరుఁడు నీపురాణమునఁ బ్రధాన పాత్రలైనవారి కందఱకు నుపాస్యులు. అగస్త్యునకు వ్యాసునకు, కృతి

కర్త కృతిభర్తలైన శ్రీనాథ అన్న మంత్రులకును భోగమోక్ష ప్రదాతలు. అరవిందాప్తకృతప్రతిష్ఠుఁడగు దక్షారామభీమేశ్వర మహిమాభివర్ణనమే యీకావ్యమునకుఁ బ్రధానమగు ప్రయోజనము. కావున నీకావ్యము నందన్నియాశ్వాసములందును దక్షారామభీమేశ్వరులమహిమాభి వర్ణనము విడువకుండ వచ్చినది. అందును బ్రథమాశ్వాసప్రారంభము దక్షారామ పురవర్ణనముతో నారంభింపఁబడి, తన్మాహాత్మ్యక్రోడీకరణముతో ముగింపఁబడినది. ఆప్రకరణములో తత్ప్రశస్తి యిట్లుగ్గడింపఁబడినది.

ఉ. ఏదెసఁ జూచిన న్విబుధు లేదెసఁ జూచిన మౌనిమండలం
బేదెసఁ జూచిన న్సురదధీశ్వరవర్గము వాసవాది యం
దేదెసఁ జూచిన న్నవమహేశ్వరమూర్తులు శ్రీనికుంభ కుం
భోదర తండు భృంగిరిటి హాహుక హూహులు దక్షవాటికన్.

— భీమ. 1-103.

దక్షారామమునందు నేఁడుగూడ నెచటఁ జూచిన నీశ్వరలింగములు వివిధ దేవతామూర్తులును గానవచ్చుచునేయుండును. ఈదక్షారామనామమును గూర్చియుఁ దన్మహాత్త్వమును గూర్చియు మఱియొకచో నిట్లు వివరింపఁబడినది.

క. దక్షుని సవనాగారము
దక్షారామంబు శివుఁడు తన్మధ్యమునన్
సాక్షాత్కరించియుండుట
భోగము మోక్షంబు బ్రాఁతె ముజ్జగములకున్.

— 2-16.

దక్షారామభీమేశ్వరునిసన్నిధిని వెలయునట్టి తీర్థము సప్తగోదావరము. త్రిపురాసురసంహారానంతరము పరమేశ్వరుఁడు దక్షారామమున శివసన్నిధానము సేయుటచే భీమేశ్వరుఁ డుత్తమదైవతముగను తత్సన్నిధిచే సప్తగోదావర ముత్తమతీర్థరాజముగను వన్నె కెక్కినవి.

ఈరెండిటిచే దక్షారామము దక్షిణకాశి యైనది. ఈవిషయ మీవిధ
ముగ నిరూపింపఁబడినది.

గీ. భీమనాథేశ్వరునికన్నఁ బెద్దవేల్పు
దక్షవాటంబుకంటె నుత్తమపదంబు
సప్తగోదావరముకంటె సకలతీర్థ
సారమగు తీర్థరాజంబు జగతి లేదు.

—2-18.

గీ. భీమలింగంబు త్రిభువనస్వామి యెప్పుడు
సన్నిధానంబు గైకొనియున్నకతనఁ
దీర్థములలోన నుత్తమతీర్థ మయ్యె
దక్షిణానందవనవాటి దక్షవాటి.

శివుఁ డెల్లపుడు దక్షారామమున నివసించియుండుటకుఁ గారణ
మిట్లు నిరూపింపఁబడినది. పరమేశ్వరుఁడు తొలుత దక్షసుతయైన
సతీదేవిని పెండ్లాడెను. దక్షునకు నెలవైన యారామము గావున దక్షా
రామము పరమేశ్వరున కత్తవారిల్లు. తన్మూలముగనే నెల్లపుడు
దక్షారామమున నివసింతు నని పరమేశ్వరుఁడు పార్వతితోఁ దెలిపినాఁడు.

గీ. ఎల్లకాలంబు నుండెద నిచట నేను
మొదలిమామామ యారామపదమునందు
వెండిగుబ్బలిపై వేడ్క వీడుకొలిపి
మేరునగరాజుపైఁ జాల మెచ్చు వదలి.

పరమప్రేమాస్పదమైన భార్యకు పుట్టినిల్లగు శ్వశురగృహ
మనిన పరమేశ్వరునంతటివానికిఁ గూడ పరమప్రీతి యుదయించు నను
విషయ మిందు ధ్వనించుచున్నది. అదియునుగాక కాశివలె దక్షిణ
కాశియగు దక్షారామముగూడ నీశ్వరున కొకరాణివాసము. పరమే
శ్వరునకు దక్షారామముకూడ ప్రేమాస్పద మగుట కిది యొక కారణము.

గీ. గౌరి యొక్కతె యాకాశగంగ యొకతె
కాశి యొక్కతె దక్షిణకాశి యొకతె

నలుగురును శంభునకు లోకనాయకునకు
రాణివాసంబు లనురాగరసము పేర్మి.

— భీమ. 3-95.

కాశిలోఁ గల నుత్తమతీర్థదైవతములు దక్షారామమునం దుపస్థితము లగుటచేతను, సర్వవిషయములందును గాశిని బోలియుండుటచే దక్షారామమునకు దక్షిణకాశి యనునామ మేర్పడినది. కాశీసామ్యమిట్లు జతఁగూడినది.

సీ. భీమేశ్వరేశ్వర శ్రీమహాదేవుండు
హిమధామమౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావరసలిలప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరుచుట్టుమాలెలోఁ దిరమైనగణపతి
యేకాంతఢుంఠివిఘ్నేశ్వరుండు
దక్షిణంబున నున్న దండపాణీశ్వరుం
డూహింప దండపాణీశ్వరుండు
భైరవస్వామి శ్రీకాలభైరవుండు
నంది నందీశ్వరుం డేమి సందియంబు
దక్షవాటంబు కాశికాస్థలము గాదె
తీవ్రకర తేజ! సత్యవతీతనూజ.

— 3-31.

కాశీవిప్రయోగతప్తుఁడై, దక్షిణకాశీసందర్శనమున శాంతుడైన అగస్త్యుఁడు విశ్వేశ్వరాగ్రహపాత్రుఁడై కాశినుండి వెడలఁగొట్టఁబడినవ్యాసునకు దక్షారామము దక్షిణకాశియేయని తెలుపుచున్నాఁడు. కాశిలో విశ్వేశ్వరుఁ డెట్లు భోగమోక్షప్రదాతయో, దక్షారామమున భీమేశ్వరుఁ డట్టివాఁడు. సప్తగోదావరతీర్థము దక్షిణకాశిలో సాక్షాత్కారము నొందిన జాహ్నవీనది. తిరుచుట్టుమాలెలో నుండిన

గణపతి కాశిలోని ఢుంఠివిఘ్నేశ్వరునకుఁ బ్రతినిధి. ఇతరస్థలములలోని విఘ్నేశ్వరునకు తుండము ఎడమచేతిమీఁది కుండును. కాశిలో ఢుంఠి విఘ్నేశ్వరునకు, దక్షారామమునందలి యీవిఘ్నేశ్వరునకు, తుండము కుడిచేతిమీఁది కుండును. కావున నీతఁడు ఢుంఠివిఘ్నేశ్వరుఁడే. అచటఁ గాలభైరవుఁడు గలఁడు. ఇచట సప్తభైరవులు గలరు. ఇచటి నందీశ్వరుఁడు కాశిలో నందీశ్వరునకు సాటి. ఈవిధముగఁ గాశిలోని ప్రధాన దేవతామూర్తు లందఱును దక్షారామమున వెలసియుండుటచే నిది దక్షిణకాశి యనుటలో సందియము లేదు.

వారణాశికి దక్షారామమునకు సర్వవిధముల సామ్యము సమకూడియుండుటచేఁ దారతమ్యము చర్చింప నక్కఱలే దని మఱియొక పద్యమునఁ దెలుపఁబడినది.

సీ. జహ్నుకన్యాతీర్థసన్నివేశమునకు
దక్షిణాంభోరాశితటము సాటి
కమనీయమణికర్ణికాప్రవాహమునకు
సప్తగోదావరజలము సాటి
కటకరక్షకుఁడైనఁ కాలభైరవునకుఁ
బ్రకటపాతాళభైరవుఁడు సాటి
విశ్వాధిపతియైన విశ్వనాయకునకు
భీమనాథేశ్వరస్వామి సాటి
మోక్షవిభవంబునకు సాటి మోక్షలక్ష్మి
భోగవిభవంబునకు సాటి భోగలక్ష్మి
వారణాశికి శ్రీదక్షవాటమునకుఁ
దారతమ్యంబు చర్చింప ధర్మ్మ వగునె?

మఱియొకచోటఁ దీర్థక్షేత్రమాహాత్మ్యం బీవిధముగఁ జిత్రింపఁబడినది.

గీ. ద్వాదశక్షేత్ర వికచపత్త్రములతోడి
దక్షవాటిక యనెడికెందమ్మివిరికి
సప్తగోదావరాంబునిర్ఝరము తేనె
సడుమ రాయంచ శ్రీభీమనాయకుండు.

దక్షారామము వికసించిన కెందామరపువ్వు. పంౘారెండుక్షేత్రములు తామర రేకులు. సప్తగోదావరజలప్రవాహము తేనె. తన్మధ్యమున శుద్ధస్ఫటికసంకాశమూర్తియగు భీమనాయకుఁడు రాజహంసయై విహరించుచుండును. దక్షారామము భీమేశ్వరనివాస మయి, నలుదిక్కులందును విదిక్కులందును పంౘారెండుతీర్థములు, తన్నికటమునఁ బంౘారెండు లింగమయమూర్తులు గలిగియుండి ద్వాదశక్షేత్రసముపేత మయినది. ఆతీర్థక్షేత్రములు తృతీయాశ్వాసమున నిట్లుపేర్కొనఁబడినవి.

1. ఇంద్రేశతీర్థము — ఇది భీమేశ్వరాలయమున కెదురుగ నున్న సప్తగోదావరముతోఁ గలిసియున్నది. తత్తీరమునం దింద్రేశ్వరుఁడు నెలవుకొనియున్నాఁడు.

2. సిద్ధేశ్వరతీర్థము— ఈతీర్థమును సప్తగోదావరాంతర్భూతము. తీర్థాధిదేవత సిద్ధేశ్వరుఁడు. దక్షుఁడు యజ్ఞము నెఱపునపు డిది ప్రాగ్వంశమున్న చోటు.

3. యోగీశ్వరతీర్థము — ఈశ్వరుఁడు యోగీశ్వరుఁడు.

4 యమేశ్వరతీర్థము — ఇచటిలింగము యమేశ్వరలింగము. ఇది దక్షిణదిక్కునం దున్నది. లింగము తీర్థము రెండును గలవు. దీనికే యజ్ఞకుండము అనిపేరు.

5. కాళేశ్వరతీర్థము — ఇచటి యీశ్వరుఁడు కాళేశ్వరుఁడు.

6. వీరభద్రేశతీర్థము — ఈశ్వరుఁడు వీరభద్రుఁడు.

7. బ్రహ్మేశతీర్థము — ఈశ్వరుఁడు బ్రహ్మేశ్వరుఁడు.

8. కుక్కుటేశతీర్థము — లింగము కుక్కుటేశ్వరము.

9. కపాలేశ్వరతీర్థము — కపాలేశ్వరుఁ డధిదేవత.

10. సోమనాథేశ్వరతీర్థము — ఈశ్వరుఁడు సోమనాథుఁడు.

11. మాహేశ్వరతీర్థము — ఈశ్వరుఁడు మహేశ్వరుఁడు.

12. రామేశ్వరతీర్థము — లింగము రామేశ్వరలింగము.

ఈతీర్థములు కొన్ని సాగుబడిభూములుగ మాఱినవి. లింగములు మాత్ర మన్నియు నిలిచియున్నవి. తీర్థములు నిలిచియున్నవయినను నామమాత్రావశిష్టములై యున్నవి. పేరు మాయకుండ నాఁటివిభవము లేకుండినను నిలిచియున్నది, సప్తగోదావరతీర్థ మొకట్టియే. ఈతీర్థము లన్నియు జలసమృద్ధమై యుఁడిన నాఁటివిభవ మిట్లుండెనఁట.

ఉ. వీటికి నాల్గువంకలను వెన్నెలతోఁటలఁ బోలునీళ్ళతో
హాటకపద్మమండితములైన కొలంకులు చూడ నొప్పగున్
జీటికి మాటికి స్మరుఁడు జృంభితలీల నటింప మాళిమి
న్నేటికృపీట నిర్ఝరము లింతట సంతటఁ జిందెనో యనన్.

— 1.96.

నేఁటికిని దక్షారామము నలువంకలను గొన్నికొలంకులు గలవు. వానిచే నాపురము చూడ నందముగనే గన్పట్టును. సప్తగోదావరమున మాత్రము శ్రీనాథునినాఁటిడంబర మేమియుఁ గానరాదు.

సీ. వేదండవదనశుండాదండ చుళుకిత
ప్రోక్షితాంభశ్ఛటాప్లుతనభంబు
దేవగంధర్వాప్సరోవధూటీస్తన
స్థాసక శ్రీగంధధవళితంబు
కనకసౌగంధికగంధోత్తమాగంధ
సారనిష్పందపుష్పంధయంబు
చటులవీచీఘటాఝూటడోలాకూఢ
హంససంసన్నినాదాలసంబు

భూరితీరావనీ ఘనీభూతచూత
జాతివకుళవనీసమాచ్ఛాద్యమాన
బహుళసింధుధునీవనబకమరాళి
దక్షపురియొద్ద సప్తగోదావరంబు.

— 1-105.

ఆనాఁడు సప్తగోదావర మేనుఁగీఁతనీరు గలిగి యుండవచ్చును. జలపక్షుల కోలాహలముతోఁ గూడియు నుండవచ్చును. పద్మషండమండితమును గావచ్చును. కాని నేఁ డావిభవ మేమియుఁ గానరాదు.

ఈసప్తగోదావరము తీర్థప్రభావమున గంగానదికంటె మిన్నయని తెలుపుచుఁ, గొంతప్రౌఢముగఁ జిత్రించియున్నాఁడు. ఈతావున మూల మిట్లున్నది.

శ్లో॥ ఏకేన రాజ్ఞా నీతా సా వియత్కల్లోలినీ కథమ్
సప్తర్షిరాడ్బలప్రాప్తసప్తగోదావరోపమా.

— భీమఖండము. అ. 8. శ్లో. 8.

ఒకరాజుచేఁ గొనిరాఁబడిన యాకాశగంగ సప్తఋషిరాజుల బలముచే లభించిన సప్తగోదావరముతో సమాన మెట్లగు నని దీనిభావము. దీనిని శ్రీనాథుఁ డిట్లు వివరించియున్నాఁడు.

గీ. రాజవంశజుఁడగు భగీరథునివెనుకఁ
బాఱుదెంచిన చదలేరు పాటి యగునె?
సప్తమునిరాట్ప్రతాపసంప్రాప్తమైన
సప్తగోదావరంబుతో సారమహిమ.

— భీమ. 3-16.

రాజవంశమున జన్మించిన భగీరథునివెనుకఁబడి పఱుగెత్తివచ్చిన యాకాశగంగ, సప్తర్షులతపఃప్రతాపముచే సంప్రాప్తమైన సప్తగోదావరముతో సారమహిమలో సమానమగునా? యనినాఁడు. ఈప్రౌఢోక్తిలో శ్రీనాథునకు సప్తగోదావరతీర్థమునెడఁ గలభక్తిభావము

వ్యక్తమగుచున్నది. సప్తర్షులు భీమనాథసంప్రతిష్ఠకై గౌతమి నాహ్వా నించి, గొనివచ్చునప్పటిసంప్రార్థనములో భక్తిభావమును మఱింత తుల కింపఁజేసినాఁడు. అచటి యాసీసపునడకలో గోదావరిని గంగమ్మను గావించి నడిపించినతీరు మధురముగ ధ్వనించుచున్నది.

సీ. విచ్చేయుమమ్మ శ్రీవృషభవాహనశిర
స్స్నానుజమదకటాసారధార
పయనంబుగావమ్మ భర్గజటాటవీ
కుటజశాఖాశిఖాకోరకంబ
రావమ్మ యాదిమబ్రహ్మదోః పల్లవ
స్థితకమండులుపుణ్యతీర్థజలమ
లేవమ్మ విశ్వంభరావధూటీకంఠ
తారమౌక్తికహారదామకంబ
తెరలతో వీచికలతోడ తరులతోడ
విమలడిండీరఖండతండములతోడ
మురువు లీవియు నామోదమును జవంబు
వడువు నొప్పంగ గంగమ్మ నడువవమ్మ

మ. అదె మాస్వామి సుధారసోద్భవుఁడు దక్షారామభీమేశుఁ డ
భ్యుదయం బంది ప్రతిష్ఠ గైకొనెడు నంభోరాశితీరంబునన్
బదమా షట్పదమాలికాపరిలసత్పాథోధునీసంపదా
స్పదనానాసలిలప్రవాహలహరీసంభార గోదావరీ.

— భీమ—4—175. 176.

దక్షారామమున భీమేశ్వరస్వామిని బ్రతిష్ఠచేయుటకుఁ బుణ్య గౌతమీ ప్రవాహమును గొనితేర సప్తర్షులు గౌతమీతీరమునకు వెడ లిరి. ఇంతలో ముహూర్త మాసన్నమగుటచే భీమేశ్వరుఁడు స్వయం ప్రతిష్ఠితుఁ డగుచుండుట గాంచి, సూర్యుఁ డాకసమునుండి యది కన్గొని తా నాస్వామిని బ్రతిష్ఠచేసెను. ఈతీరుగ భీమనాథుఁ డర

విందాప్తకృతప్రతిష్ఠుఁడై నాఁడు. పిమ్మట సప్తర్షులు సప్తగోదావర మును గొనితెచ్చి, తత్పుణ్యసలిలములచేఁ బరమేశ్వరుని బునఃప్రతిష్ఠితు నొనర్చినారు. సూర్యప్రతిష్ఠితమైన లింగమునకుఁ జుట్టును నలుదిక్కు లను సోమప్రతిష్ఠితలింగములు నెలకొనియుండుట యొకపరిపాటి. ఇచట భీమేశ్వరలింగమునకు దిక్కులయందేగాక విదిక్కులందుసైతము సోమే శ్వరలింగములు వెలసియున్నవి.

1. దక్షారామమునకు తూర్పున — కోలంకగ్రామమున సోమేశ్వ రుఁడు. ఈగ్రామ మాత్రేయీనదీతీరము నంటియున్నది.

2. ఆగ్నేయమున — దంగేరుగ్రామమున — కణ్వానదీతీరమున.

3. దక్షిణమున — కోటిపల్లిసోమేశ్వరుఁడు — గౌతమీతీరమున.

4. నైరృతిని — కోరుమిల్లిసోమేశ్వరుఁడు. గౌతమీతీరమున.

5. పశ్చిమమున — సోమేశ్వరము సోమేశ్వరుఁడు. ఈతఁడే పులుగుర్తసోమేశ్వరుఁడు. తుల్యభాగాసమీపమున.

6. వాయవ్యమున — వెల్లగ్రామమున సోమేశ్వరుఁడు.

7. ఉత్తరమున — చొల్లంగి సోమేశ్వరుఁడు. తుల్యాసాగర సంగ మస్థలమున.

8. ఈశాన్యమున — పటవలసోమేశ్వరుఁడు. ఆత్రేయీసాగర సంగమస్థలసమీపమున.

ఈసోమేశ్వరలింగము లన్నియు దక్షారామమున కొకయోజన ముమేరలో నున్నవి.

దక్షారామపురమునకు నాల్గుదిక్కులందు నలుగురు గ్రామదేవ తలు శ్రీనాథునినాఁడును నేఁడును గూడఁగలరు.

1. తూర్పున — నూకాంబిక. 2. దక్షిణమున ఘట్టాంబిక. 3. పశ్చిమమున గోగులాంబ. 4. ఉత్తరమున మండతల్లి. ఈనలుగురు గ్రామదేవతలను శ్రీనాథుఁడు నాలుగుపద్యములలో వర్ణించియున్నాఁడు.

— భీమ—1—98, 101.

భారతదేశమునందలి అష్టాదశయోగశక్తిపీఠములలో దక్షా రామమునందలి మాణిక్యాంబికాశక్తిపీఠ మొక్కటి. దక్షారామమున మాణిక్యాంబికాసమన్వితుఁడైన భీమేశ్వరుని గొలుతురు. మాణిక్యాంబిక భీమేశ్వరున కుత్తరదిక్కునం దున్నతిరుచుట్టుమాలెలో వెలసి యున్నది. భీమేశ్వరలింగసన్నిధి నీనాఁడు పార్వతీదేవివిగ్రహము, కొంచె మీవల సతీవిగ్రహమును గలవు. కల్యాణముమాత్రము మాణిక్యాంబికాసమేతుఁడైన భీమేశ్వరునకే జరుగుచుండును. భీమేశ్వరుని దర్శించుక్రమ మీవిధముగ వివరింపఁబడినది.

సీ. నేదిష్ఠమున సప్తగోదావరంబున
నఘమర్షణస్నాన మాచరించి
త్ర్యాయుషమంత్రాక్షరాభిమంత్రితమైన
విమలభూతి త్రిపుండ్రముగ ధరించి
మొగలివాకిలి దాఁటి దిగువ శాక్వరరాజు
నగరిపై వెన్నునినను వుఁ జూచి
మణిశిలాసోపానమధ్యమార్గంబుగా
నభ్రంకషంబైన హర్మ్య మెక్కి
సప్తపాతాళభువనవిష్కంభములను
దెఱచి వెడలిన జ్యోతిఃప్రదీప్తమూర్తి
శంభు భీమేశ్వరేశ్వరస్వామిఁ గొలుచు
పరమమాహేశ్వరున కేమి బ్రాఁతి ముక్తి.

— భీమ. 1—113.

మహేశ్వరభక్తుఁడైనవాఁడు భీమనాథుఁ గొలువఁ దలఁచినపుడు సప్తగోదావరమున స్నానముచేసి, విభూతితోఁద్రిపుండ్రధారణము గావించి, ప్రాక్ప్రాకారములోనికి వచ్చి, నందీశ్వరు దర్శించి, క్షేత్రపాలకుఁడైన విష్ణుమూర్తి నీక్షించి, లోనికిఁ బోయి సోపానమార్గము మీఁదుగా నభ్రంకషమైన భీమేశ్వరునిదేవలము నెక్కి, సప్తపాతా

శములను భేదించి వెడలివచ్చిన జ్యోతిర్లింగస్వరూపుఁడైన భీమేశ్వరుని గొలువవలయును. అట్టివానికి ముక్తికి లోప ముండదు.

భీమేశ్వరస్వామిని దర్శించుటకుఁగాని, పూజాభిషేకాదులు నెఱపుటకుఁగాని, ఆతని కావాసమగు ప్రాసాదము నధిష్ఠింపవలయును భీమేశ్వరలింగము మూలపీఠమునకు మీఁద నెనిమిది అడుగులయెత్తు కలిగియుండును. లింగాగ్రము చుట్టుకైవారము మూఁడడుగు లుండును. స్ఫటికమయకాంతితోఁ గానవచ్చు నాలింగమునం దంతటను నల్లని చాఱలవంటివి గానవచ్చును. అది పరమేశ్వరునివ్యాఘ్రాజినధారిత్వమునకు నిదర్శన మందురు. లింగాగ్రమునందు రెండు గోతులవంటివి గలవు. వానిలో ముందున్నది పార్థప్రహారమునకును, రెండవది మీఁదికిఁ బెరిగిపోకుండుటకు నాఁటిన చీలకును నిదర్శనము లని వాకొందురు. ప్రాసాదము క్రింద లింగప్రారంభమునఁ బీఠస్థాన మంధకారబంధురమై యుండును. దీనిని చీకటికోణ మందురు. అచట మూఁడు ప్రాకారము లున్నవి. అచటఁబూర్వము మణిదీపము లుండెడి వందురు. వానిస్థానమున నిపుడు జాతిబొమికెలుమాత్ర మున్నవి. ప్రాసాదమునం దొక స్తంభమున వ్యాసుని విగ్రహ మొకటిగలదు. భక్తు లావిగ్రహమునకుఁ బ్రదక్షిణ నమస్కారము లాచరింతురు.

భీమేశ్వరస్వామిని తత్పరివార దేవతలను దర్శించుక్రమము మఱియొక ప్రకరణమునం దిట్లు వివరింపఁబడినది.

సీ. వణఁకుగుబ్బలరాచవారికూరిమికన్య
    భీమయ్యశుద్ధాంతభామఁ గొలిచి
కంధరంబుననుండి గంధసింధురమైన
    గుజ్జువేల్పు కుమారగురుని గొలిచి
కైవల్యనిధికి దుర్గామహాదేవికి
    సర్వమంగళకు నంజలి ఘటించి
యాశాతటీపటలీశాటికాకటు
    వటుకభైరవు నిష్టవరదుఁ గొలిచి

నలువ సేవించి యిందిరానాథుఁ గొలిచి
యితరపరివారదేవతావితతి కెల్ల
నేటికోళ్ళిచ్చి యెక్కి రమ్మేటిమునులు
మృడునిహాటకశైలంబుమీఁదినెలవు.

ఈపద్యమున క్రిందిభాగమున రెండవప్రాకారములోపల నెలకొని యున్న పరివారదేవతాసమర్చనక్రమము — తొలుత భీమయదేవుని యంతఃపురాంగన యగుగిరిరాజనందన కభివాదనము, పిమ్మట డుంఠివిఘ్నేశ్వరునకు, దుర్గామహాదేవికి, వటుకభైరవునకు, చతుర్ముఖబ్రహ్మకు లక్ష్మీనారాయణునకు ఇతరదేవతాసమితికి నమస్కృతులర్పించి, పిదప భీమనాథనిలయప్రాసాదము నధిరోహింపవలె ననుట.

తూర్పుద్వారమునుండి తొలుతటిప్రాకారమునఁ బ్రవేశించినపుడు నుత్తరమునఁ గొంతమేరలోఁ గాలభైరవునాలయము గలదు. దానికివెనుక నొకకూపము గలదు. దీనికి రుద్రగంగ యని పేరు. అటులనె దక్షిణమునఁ గూడ నొకకూపముండవలయును. అది కొంత కాలము లోపించినది. దానికి శివగంగ యని పేరు. దీనిని తరువాతి కాలమునఁ బునరుద్ఘాటనము చేసినట్టు లైతిహ్యము గలదు. వాని మాహాత్మ్య మీతీరుగ వర్ణింపఁబడినది.

గీ. ఘనత శివగంగయును రుద్రగంగ యనఁగఁ
గూపములు రెండు దక్షవాటీపురమున
మొదలియది పాపముల నెల్ల నుడుకఁజాలు
నొకటి పితృదేవతలఁ దృప్తి మనుపనోపు.

— భీమ. 6—17.

శివగంగ పూడిపోయినపుడు పునరుద్ఘాటించుటకై పరిశోధన సలుపుచు, తత్ప్రదేశసమీపమున మేఁకలమందను నిలిపి, అవి మూత్రపురీషోత్సర్గము చేయుట మానిన ప్రదేశము నాస్థలముగ నిర్దే

శించి కూపము తిరిగి త్రవ్వింపఁబడె నని యప్పటి వృత్తాంత మెఱిఁగిన వారు తెలిపిరి.

## ద్రాక్షారామ మహోత్సవములు

ప్రధానోత్సవములలో మొదటిది భీమేశ్వరకల్యాణము. రెండవది జ్వాలాతోరణమును. ఈయుత్సవములు రెండును నాఁటికి నేఁటికి నేఁటేట జరుగునవి. భీమేశ్వరుఁడు దక్షారామమున నావిర్భవించినది మార్గశిరశుద్ధత్రయోదశి యయినను కల్యాణోత్సవము మాత్రము మాఘశుద్ధఏకాదశికి జరుగును. ఆపూర్ణిమనాఁడు రథోత్సవము నెఱపుదురు. కార్తికశుద్ధపూర్ణిమకు జ్వాలాతోరణమహోత్సవము జరుగును. ఈయుత్సవములు రెండును సకలకలుషహరములుగా లెక్కింపఁబడునవి, నాఁడును నేఁడునుగూడఁ బ్రేక్షకులకు. ఆవిషయమును శ్రీనాథుఁ డిట్లు వివరించియున్నాడు.

గీ. బ్రహ్మహత్యాదులగు మహాపాతకములు
ధాత్రి జనులకు నిమిషమాత్రమునఁ బాయు
భీమనాథమహాదేవుపెండ్లినాఁటి
దక్షిణాముఖకల్యాణదర్శమున.

గీ. కార్తికీకవేళ భీమశంకరునినగరఁ
దూఱు నెవ్వాఁడు చిచ్చుఱతోరణంబు
అతఁడు దూఱఁడు ప్రాణనిర్యాణవేళ
ఘోరయమపట్టణద్వారతోరణంబు

—భీమ. 3—24. 25

వసంతోత్సవము — భీమనాథుఁడు దక్షారామమునఁ బ్రతిష్ఠితుఁడైననాఁడు తొలుత నవతరించిన వసంతసమయమున వసంతోత్సవము మహావిభవముతో జరిగినట్లు లీకావ్యమున వర్ణింపఁబడినది. ఆవసంతోత్సవములో శ్రీనాథునినాఁడు రెడ్డిరాజులు మహావిభవముతో

నెఱపెడి వసంతోత్సవముల పరిపాటులు, వానితోపాటు కవితాపరి పాకమును వ్యక్తములైనవి. ఆవసంతోత్సవ మిట్లు కొనసాగినది.

ఋతుచక్రవర్తి వసంతుఁడు దక్షిణకాశీవిభుఁ డగుభీమనాథుని దర్శింప వచ్చి కుసుమవిసరమును గానుకగాఁ దెచ్చియిచ్చెనఁట.

వసంతోదయ మైనంతనే వికసించిన పుష్పసంపద యిట్లు చిత్రింపఁ బడినది.

గీ. కమిచె సురపొన్న వనలక్ష్మికబరిమీఁద
సంతరించిన ముత్యాలజల్లివోలెఁ
బూచె సంపెంగ లారామభూమియందుఁ
బ్రసవనారాచు చిచ్చుఱకోలవోలె.

— 5–93.

దక్షారామ పరిసరారామములలో సురపొన్నలు సంపెఁగలు పూచినవి. వానికి దృశ్యసాక్షాత్కృతిని గల్పించినాఁడు కవి. సుర పొన్నవనలక్ష్మికొప్పునఁ దాల్చిన ముత్యాలరాగిడివలె నుండెనఁట. సురపొన్నలు వసంతములోఁ దొలుతఁ బుష్పించినపుడు ఆకు లేపాటియు లేక తెల్లనిపూలగుత్తులతోఁ గూడి యుండును. అట్టిగుత్తులతోఁ గూడిన యొక్కొకపొన్నచెట్టు ముత్యాలరాగిడివలె నుండును. సంపెఁగలు పూచినవి. అవి మన్మథుని మంటలుచిమ్మెడి ఆగ్నేయాస్త్రములవలె నుండెనఁట. ఈదృశ్యములు రెండు నుపమానిబద్ధములై సహజ చిత్రములై వెలసినవి.

వసంతోదయమై తరుగుల్మలతాదులు చిగిర్చి పుష్పించినపుడు మందమారుతములు కొనసాగినవి. వానిప్రసారము కడుమనోహరము.

శా. హేమంతావధిసంప్రబోధగురువుల్ హృజ్జాతతేజోగ్నిధా
య్యామంత్రాక్షరము ల్పటీరగిరివన్యామందవాతూలముల్
వేమాఱుం గలశీతనూభవవధూవేణీభరాంతఃప్రసూ
నామోదగ్రహయాళువుల్ పొలసె దక్షారామమధ్యంబునన్.

— భీమ. 5–94

అట్టివసంతోదయమున దక్షారామమధ్యమున మలయమారుతములు వీచినవి. సామాన్యముగా వాయువునకుఁ బ్రాశస్త్య మొదవించునవి శైత్యసౌరభమాంద్యము లను నీమూఁడును. ఆగుణము లీమలయపవనములకు జతఁగూడినవి. అవి హేమంతావధి నుపదేశించు గురువులై, గురుత్వముతో పాటు శైత్యమును వహించినవి. వాయువులు హేమంతకాలావధిలో బయలు దేఱినవి గావున హేమంతసంబంధమున శైత్యము లభించినది. అట్టివి మన్మథాగ్నిజ్వాలాసందీపనమున సామిధేనీబుఋఙ్మంత్రాక్షరము లైనవి. సోమయాగాదులందు 'ఘర్మము' అనుపాత్రలో నేయి మఱుగుచుండఁగ మఱియొక 'పాత్రతో నార్రాగెడి నేతిలో పాలు చిలుకుచుందురు. అప్పుడు రేకెత్తినమంటలను చేటలతో నణఁచుచుందురు. ఈజ్వాలాసంధుక్షణసమయమున పఠించుబుఋఙ్మంత్రములను సామిధేనీమంత్రములు లేక ధాయ్యామంత్రములు అనియందురు. యాగస్వరూప మెఱిఁగినవారి కిది తెలియును. ఈవాయువులకు మన్మథాగ్నిజ్వాలా సంధుక్షణ మొక విశేషగుణము.

ఈవాతములకు మలయపర్వతమునందలి వనములనుదట్టి వచ్చుటచే మాంద్య మేర్పడి మందమారుతములైనవి. పటీరగిరివనసంపర్కముచేఁ గొంత పరిమళము సహజముగ లభించినను, పరిమళవిశేషమునకై మఱియొకగుణాధానము గైకొనఁబడినది. ఈశీతలమందమారుతములు మాటిమాటికి కలశజమానినియిల్లాలగు లోపాముద్ర కొప్పులో ముడుచుకొనిన పూవులపరిమళమును గొనివచ్చుచున్నవఁట. ఈమారుతములు దక్షిణదిక్పవనము లని తెలుపుటకై లోపాముద్ర జడముడిలో నలంకరించుకొనిన పూవులపరిమళమును వానిచే గ్రహింపఁజేయుట. ఇంతియగాక లోపాముద్రకు పూవు లనిన ప్రీతి యధికము. కావుననే యగస్త్యుఁడు కాశినుండి మరలివచ్చినవెనుక, తుల్యభాగాతీరమునఁ దనకుఁగానవచ్చినవ్యాసుని గాశీపట్టణమునందలివిశేషములను గూర్చి ప్రసంగము సేయుప్రకరణములో.

క. కాళీనందనకంఠే
కాలురశిరములకు విరులు కల్పించునొకో
లీలావనాంతరమునన్
మాలోపాముద్ర యిడిన మల్లీవల్లుల్.

—2 - 29.

అని కాశిలో లోపాముద్ర తన యుద్యానమున నాఁటిన మల్లి తీఁగల పుష్పసమృద్ధినిగూర్చి ప్రత్యేకముగఁ బ్రశ్నించినాఁడు. ఈప్రశ్నమే లోపాముద్రకుఁ గలప్రసూనప్రీతిని దెలియఁజేయును. ఈవిషయమును వ్యక్తముచేయుటకు నీమందమారుతములచే నారాజకన్యక వేణీభరాంతఃప్రసూనసౌరభమును గొనితెచ్చువానిఁగఁ జేసినాఁడు కవి. ఇట్టిమందమారుతము లానాఁడు దక్షారామమున వీచెనఁట.

ఆసమయమున నుత్తమగంధర్వవంశోద్భవలైన యచ్చరలు మందారద్రుమవాటిలో పుష్పాసవములు (మద్యద్రవ్యములు) గ్రోలుచు హిందోళమునఁ బాటలు పాడిరి. తుమ్మెదలగొదలు చిలుకలపలుకులు కోకిలలకుహూకారములు నారామములలోఁ జెలరేఁగ, మన్మథుని మూలబలము దాడికి బయలువెడలినతీరును దలపించెను. వసంతోత్సవమున కారంభము సేయఁదలపెట్టి విబుధగంధర్వు లారామములలో సహకారభూరుహములకు విధివిధానమునఁ బూజలు గావించిరి. అచ్చరలు వీణెలు మీఁటుచు భీమనాథు నుద్దేశించి చర్చరగీతులు పాడిరి. కొండఱు వనితలు చెఱుకువిం డ్లెక్కు-వెట్టి, తేనెలు చిందుపుష్పబాణములతో భీమనాథు నేసిరి. అట్టితెరుణమున భీమనాథుఁడు వసంతోత్సవము నెఱప నాజ్ఞవాటించి, దేవతాప్రధానులకు గంధకర్పూరకస్తూరికాది సుగంధ ద్రవ్యముల నవారిగ నొసఁగెను. ఈక్రమ మంతయు నాఁటి రెడ్డిరాజులు నెఱపు వసంతోత్సవపరిపాటిని దలపింపఁజేయుచున్నది.

భీమేశ్వరునియాజ్ఞచే నెఱపెడి యుత్సవము గావున దీనిలో నీశ్వరునిపరివారవర్గము లన్నియును, బ్రహ్మాది ప్రధానదేవతలు, ఇంద్రాది

దిక్పాలురు, బ్రాహ్మ్యాది సప్తమాతృకలు సకలదేవతాగణములలోని స్త్రీ పురుషులందఱును వాల్గొని యొకరిపై నొకరు సుగంధద్రవ్యములను గంధోదకములను జల్లుకొనఁదొడఁగిరి. ఆజల్లులాట కడు తీవిగ నడిచినది.

సీ. హేరాళముగఁ జల్లె నెలనాఁగ యొక్కర్తు
కుంభోదరునిమీఁదఁ గుసుమరజము
కుటిలకుంతల భృంగిరిటిమోమునం దొర్తు
తాఁకించె నోలగందంపుఁ బసుపు
వక్షంబు లక్షించి వైచె గందపుటుండ
వీరభద్రుని నొక్క నీరజాక్షి
చెవిలోనఁ బాఱంగఁ జిమ్మె గొజ్జఁగనీటఁ
గాలభైరవు నొక్క కలువకంటి
కొమ్మ యొక్కతె యందందుఁ గొమరుసామి
యాదలలయందు జవ్వాదియసలు గలిపెఁ
బునుఁగు మణికుంభమున నించి పోసె నొక్క
పొలఁతి విఘ్నేశ్వరునికుండబొజ్జమీఁద.

— 5–113.

ఈచల్లులాటలో నాఁడును నేఁడు నుపయోగించు ప్రత్యేక వస్తువులు.

ఉ. నేతుల నూనెలం బసుపునీరునఁ గుంకుమచెందిరంబులన్
నూతనగంధసారములనుం బొనరించిరి కేళితంత్రముల్
కౌతుక మొప్ప దక్షవనికాపురవీథుల భూతకోటితో
మాతృక గోఁగు నూకసతి మండమదేవియు ఘట్టతల్లియున్.

— 5–114.

ఈచల్లులాట వావివరుసలు పాటించియే నడచినది.

సీ. అచ్యుతునిమీఁదఁ జల్లె దుగ్ధాబ్ధికన్య
భారతీదేవి పద్మజుపైనఁ జల్లె

శచి మహేంద్రుని జల్లె వసంతకేలి
గంధకర్పూరకస్తూరికాజలంబు.

— 5–118.

దక్షారామపరిసరగ్రామములందు నేఁడును నిట్టియుత్సవములు జరుగుచుండును. గ్రామదేవతలయుత్సవములలో స్త్రీపురుషులు పాల్గొని పసుపు కుంకుమము మున్నగుమంగళద్రవ్యములు నూనె నీరు మున్నగు వానితో మేళవించి, వావివరుసలు పాటించి చల్లుకొనుపరిపాటి నడచుచునేయున్నది. దేవతాకళ్యాణములలో వసంతోత్సవములు జరుగుచునేయున్నవి. నేటియుత్సవములు నాటిపరిపాటికిఁ దార్కాణములు.

తుదికిఁ బోయి దక్షారామ భీమేశ్వరుని మహత్త్వము నంతయు నొక్కవిపులమయిన గద్యమున శ్రీనాథుఁ డిట్లు వెలువరించియున్నాఁడు.

వ. కరుణాసామ్రాజ్యపట్టాభిషిక్తుండైన నాజగజెట్టి వేల్పు బ్రహ్మాండ గోళంబునకు మిక్కుటంబుగాఁ బెరిగిన దేహంబుఁ బొట్టిచేసి తిరుచుట్టు మాలికలోన గౌరీ జనార్దన రుద్ర కేశవ వినాయక దుర్గాతాండవేశ్వర నృత్యభైరవు లను దేవతాసప్తకంబు పరివేష్టింప సకలలోకానందకర పరదారగమన పాపహరేశ్వరులు నైరృతిభాగంబున నధివసింప నంతర్గర్భగృహంబులోపల మాణిక్యాదేవిసహితుండై, సలిలనిధి వృద్ధగంగా ంకౌంతేయసరి త్తుల్యభాగా హేలానదీ సప్తగోదావర నూత్పృకా పరివృతమండలంబున మధ్యమలోక భాగధేయంబును, విబుధగంధర్వ పతాకావేదియుఁ,బరిసరోద్యానవాటికాసరసకాసారకకోరకుహళీపాళికా కుసుమధూళీమధూళికాసారభాసారసంవాసితదశదిశాముఖంబును, మఖకుండి తటాక సముద్దండపుండరీకషండమకరందబిందుగండూషావ్యగ్ర సముదగ్రమధుపమండలాహంకారఝుంకార కోలాహలకదంబిత మకరధ్వజభుజాదండమండలీకృతకుసుమకోదండశింజినీ టంకారంబును, నాఖండలాదిదిక్పాలకభరితకలితగోపురప్రాంగణంబును, బాదుకాఖడ్గఘుటికారసరసాయనమూలికాంజనాకర్షణాదృశ్యాదివిద్యాసిద్ధిక్షేత్రంబును, నత్ర్యాశ్

-త్రేయాగస్త్యహారీతాంబరీషాత్రిభార్గవ పరాశరపారాశర్య మాండవ్య
మార్కండేయ మౌద్గల్యమంకణశౌనకశాండిల్యమందపాల వత్సవసిష్ఠ
వాధూలసవాలఖిల్యాద్యష్టాశీతిసహస్రసంయమిసమాకీర్ణంబును, గర్జికా
రాంబికా కరకమలపుటఘటితకనత్కనకమణిమయ డమరుకఢమఢమ
ధ్వాన పర్జన్యగర్జాసముజ్జృంభితగుహశిఖండితాండవంబును మార్కండే
శ్వరకుండలాముఖ సంవేద్యాంతర్వేదిచాళుక్యభీమేశ్వరప్రధాన నానా
విధశాఖోపశాఖా తీర్థసంబాంధసంధరితంబును నైయఖిలభువనభవనాభి
రామంబైన దక్షారామంబును కైలాసమేరుమందరంబులకంటెను గాంచీ
చిదంబర కాళహస్తికాశీశ్రీశైలాదిమహాస్థానంబులకంటెను సేతుకేదా
రంబులకంటె నతిశయంబుగాఁ జేసి నాక్షేత్రంబున మరగి, భీమలింగంబు
సర్వమంగళాదేవియుం దానును లోకరక్షణార్థంబుగా సప్రతిష్ఠించియుండు.

— భీమ. 6—75.

## పాఠవిశేషములు

శ్రీనాథుఁడు సంస్కృతవాఙ్మయమునం దసాధారణమైన పాండి
త్యము గలవాఁడు. సంస్కృతపదజాలము నిచ్చవచ్చినట్లు మలచి
తెలుఁగుకవితలో నతికించునైపుణి యాతని కపారము. శ్రుతిమధుర
మైన పదసమష్టి యాతనిరసనారంగమున నర్తనము చేయుచుండును.
కఠినతరమైన శాస్త్రీయసంప్రదాయములనుసైతము ననాయాసముగఁ
దెలుఁగుకరువులోఁ బోఁతపోయుట యాతనికి నైషధానువాదమునఁ
జేఁజిక్కిన పని. తాను రచించినగ్రంథములన్నిటను ప్రకరణానుసారముగ
నెన్నియో సంస్కృతసంప్రదాయములను జతఁగూర్చిపెట్టియున్నాఁడు.
కావుననే శ్రీనాథునిరచనలను బఠించువారికి విషయావగాహన
మునఁ గొంత క్లేశము తప్పదు. సావధానమతితోఁ బరికించినఁగాని
కొన్నితావులందు పాఠనిర్ణయము చేయుట శ్రమసాధ్యమైన విషయము.

కడచిన 1940 సంవత్సరమున ఆంధ్రసాహిత్యపరిషత్కార్యా
లయమున నేను బనిచేయుచుండినపుడు, పిఠాపురమున శ్రీసూర్యరాయ

విద్యానందగ్రంథాలయములో నుండిన తాటియాకుప్రతి భీమేశ్వర పురాణమునందలి పాఠభేదముల నెత్తివ్రాసికొని యచ్చుప్రతితో సంప్ర తించి చూడఁగా నం దెన్నియో యుత్తమపాఠములు గోచరించినవి. వానినిగూర్చి యప్పటినుండియుఁ జర్చించుచు, ఆపాఠములవలన గోచ రించెడి నూతనాంశములను గూర్చి యప్పటప్పటఁ బత్రికలలోఁ బ్రక టించుచు వచ్చితిని. అట్టిపాఠములలోఁ గొన్నిటి విశిష్టతనుగూర్చి యిచట వ్రాసెదను.

1. తే. రాజరఘురాము లల్లాడరమణసుతులు
 ధాత్రిఁ బాలింతు రాచంద్రతారకముగ
 వేమభూవల్లభుండును వీరవిభుఁడు
 నన్నదమ్ములు హరియును హరియుఁ బోలె.

— 1–33.

ఈపద్యమునందలి నాల్గవపాదమున 'హరియును హరుఁడుఁబోలె' అనునది పూర్వముద్రితపాఠము. దీనినిబట్టి అల్లాడ రెడ్డికుమారులయిన వేమవీరభద్రారెడ్లు హరిహరులవలె రాజ్యమును బాలింతు రను నర్థము వచ్చుచున్నది. నూత్న పాఠమున అల్లాడభూనాథసుతులు ఇంద్రోపేం ద్రులవలె రాజ్యముఁ బాలింతు రనునర్థము వచ్చుచున్నది. ఇంద్రో పేంద్రు లన్నదమ్ములు గాని హరిహరు లన్నదమ్ములు గారు. రాజ్య పాలనవిషయమున ఇంద్రోపేంద్రులసాహచర్యము ప్రసిద్ధము గాని హరిహరులసాహచర్యము ప్రసిద్ధము గాదు. మఱియు వేమభూపాలుని 'ఆంధ్రక్ష్మామండలాఖండలుఁ' డని పలుమాఱు లుగ్గడించుటయు నీవిషయమునకు సమర్థకము. కావున నూతనపాఠమే యిట సముచితము.

2. సీ. త్ర్యాయుషమంత్రాక్షరాభిమంత్రితమైన
 విమలభూతి త్రిపుండ్రము ధరించి

— 1-114.

'త్ర్యాయుతమంత్రాక్షతాభిమంత్రితమైన' అనునది వెనుకటి పాఠము. ఈపాఠమునం దర్థము సరిగాఁ బొసగదు. విభూతిధారణ

మునకు 'త్ర్యాయుత' ఆదిగాగల మంత్ర మేదియు లేదు. మఱియు నక్షతల నభిమంత్రించి త్రిపుండ్రముగ ధరించుటయుఁ బొసగదు. ఇది యునుగాక 'త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమ్. యద్దేవానాం త్ర్యాయుషమ్. తన్మే అస్తు త్ర్యాయుషమ్.' అనునది భస్మాభిమంత్రణమంత్రము సంప్రదాయసిద్ధము. ఈమంత్రముతో విభూతి నభిమంత్రించి, లలాటమున మూఁడు రేకలు తీరునట్లు ధరించుట యాచారప్రసిద్ధము. కావున నీపాఠమే పరిగ్రాహ్యము.

3. చ. వెలవెలఁ బాఱెఁ జంద్రుఁడును; విన్ననఁ దారకచక్రవాళముల్
పలపలనయ్యె; దీర్ఘికలఁ బద్మవనంబుల షట్పదాంగనా
కిలకలము ల్చెలంగె; వెడకన్ను మొగిడ్చె లలిం గుముద్వతుల్
తెలతెలవాఱె జంభరిపుదిక్కునఁ ద్రోఁచె ననూనరాగముల్.

సూర్యోదయవర్ణనప్రకరణములోని దీపద్యము. నాల్గవపాదము తుదిని 'అనూరురాగముల్' అనునది పూర్వముద్రితపాఠము. తూర్పు దిక్కున సంధ్యారాగములు తెల్లవాఱినంతనే గానవచ్చును గాని అరుణోదయసమయమునఁ గానరావు. చంద్రుఁడు వెలవెలఁబాఱుట, నక్షత్రములు పలపలనగుట, భృంగీకలకలములు రేఁగుట, కలువలు ముకుళించుట మున్నగువిషయము లన్నియు సూర్యోదయాసన్నసమయ ద్యోతకములు. సాయంప్రాతస్సమయములందు సూర్యుని యెఱ్ఱని కాంతులు మేఘఖండముల సలుముకొనినపుడు సంధ్యారాగ మేర్పడును. ఇచట — అనూనరాగముల్ = హెచ్చయిన యెఱ్ఱనికాంతులు — అను నర్థమే ప్రకరణోచితము. ఇచట నొకయక్షరముమార్పు అర్థమునం దెంతయో వ్యత్యాసమును గొనివచ్చినది. దీనితరువాతి పద్యమున సూర్యోదయవర్ణనమును 'గావించుటఁ'గూడ నీపాఠమున కుపోద్బలకము.

4. ఏలా విచారింప నిందు రేఖామౌళి
విమలమోక్షవిధాత విశ్వనాథు

వ్యాసునిపశ్చాత్తాపఘట్టములోని దీపద్యము. 'విమలమౌక్తిక ధాతు విశ్వనాథు' అనునది పూర్వపాఠము. స్వచ్ఛమైన ముత్యమువంటి యాకారముగలవాఁ డనునర్థము నీపాఠమునం దతికించుకొనవలయును. నూతనపాఠమునం దక్రమముగ నర్థము సరిపడును. విశ్వేశ్వరుఁడు మోక్షప్రదానమునకుఁ బ్రసిద్ధుఁడు గావున సమన్వయక్లేశము లేదు. మఱియుఁ బాఠము సరసము.

5. వండినచొప్పనుం బోగఫువాసనయుం బోగపాఱుచందమున్.

— 2-133.

'పోగయు వాసనయున్ బోగపాఱు చందమున్' అనునది వెనుకటి పాఠము. దీనిలో పొగ, పొగపాఱు అనునవుడు పునరుక్తి. వండినతీరుగాని పోఫువాసనగాని లేదనుటలో పునరుక్తి లేదు. మఱియుఁ దాలింపువాసన దూరప్రసృతమై వంట జరుగుచున్న విషయమును సుగమము చేయును. అట్టివిధాన మేని లేదనుటలో నర్థ మౌచితీభరితము.

6. సీ. పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథుమందిరము డాసి.

— 3-21.

'తీరసోమేశు మందిరము డాసి' అనునది పూర్వపుఁబాఠము. గోదావరీప్రవాహమునకు పట్టిసము దాఁటినతరువాత మూఁడుక్రోసుల క్రింద తాళ్ళ పూఁడి యనుగ్రామము. అచటి యీశ్వరుఁడు తిలసోమనాథుఁడు. ఆప్రదేశమున గౌతమీనదికి 'తిలతీర్థ' మని పేరు, తాళ్ళపూఁడికి క్రోశము మేర క్రిందనున్న కుమారదేవఅనంతభోగేశ్వరస్వామి మాలయమునందలి శాసనములలోఁ గానవచ్చుచున్నది. కాశీఖండము నందును 'పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి తిలసోమనాథు నంఘ్రులకు నెఱఁగి' యనియే గలదు. కావున నిచట 'తిలసోమనాథు' అనుపాఠమే గ్రాహ్యము. సంస్కృతమూలమున 'తీరసోమేశ్వరమ్' అని యుండుటచే వెనుకటిపాఠమున 'తీరసోమేశుమందిరము' అనియున్నను నది గ్రాహ్యము గాదు. కోటిఫలిలోఁ బ్రసిద్ధుఁడైన సోమేశ్వరుఁడును

తీరసోమేశ్వరుఁడే యగును. ప్రకరణమునుబట్టి తాళ్ళపూఁడిలోని 'తిల సోమనాథుని' గ్రహించుట యీపాఠముననే పొసఁగును.

7. సీ. శతరుద్రియశ్రుతిస్వాధ్యాయపాఠంబుఁ
బఠియించుఁ గిశోరబంభరములు.

— 3–28.

దక్షారామమునందలి బాలబంభరములు (పిల్లతుమ్మెదలు) శతరుద్రియ మను వేదపాఠమును బఠించునఁట. యజుర్వేదము నందలి 'నమకము' అనుప్రశ్నమునకు 'శతరుద్రియము' అనిపేరు. అది పరమేశ్వర స్తుతినమస్కారరూపము. 'శతరుద్రసచ్ఛ్రుతి' అను పూర్వపాఠమునం దర్థసౌలభ్య మంతగఁ గానరాదు. మఱియు శ్రీనాథుఁ డేపరిపాటిలో నేపదము నుపయోగించినను సంప్రదాయ విరుద్ధముగఁ బ్రయోగించువాఁడు గాఁడు.

8. కాశిం జచ్చినయంతఁగాని పడయంగారాని కైవల్య మ
క్లేశంబై సమవేద్యనాయకునిచే లీలాగతిం జేరు...

— 3-53.

'అక్లేశం బౌనటు వేద్యనాయకునిచే' అనునది ప్రాచీనముద్రిత పాఠము. ఈపద్యము గౌతమీనది సముద్రమున సంగమించెడిచోట వినవచ్చెడితరంగ ఘోషమున కుత్ప్రేక్షకము. ఈగౌతమీసాగరసంగమ స్థలమును 'బ్రహ్మసంవేద్యము' అనియందురు. 'సమవేద్యము' అనుపాఠమును గ్రహించినపుడే యాయర్థము స్ఫురించును. తత్తీర్థక్షేత్రాధిపతి భైరవస్వామి. 'కాశ్యాంతు మరణాన్ముక్తిః' అనుసూక్తిచే, కాశిలో మరణించినఁగాని లభింపనట్టి మోక్షము, సంవేద్యనాయకుని యనుగ్రహమున ననాయాసముగ లభించును. కావున మర్త్యులారా? శ్రీఘ్రమ్ముగ రారో! యని యాతరంగము లాక్రోశించు చున్నట్లుండె నను నుత్ప్రేక్ష సక్రమముగ సరిపడును. 'వేద్యనాయకునిచే' అనుపాఠమున నర్థము సులభవేద్యము గానేరదు.

9. అధివాసనము సేయు యమునిశుద్ధాంతంబు
ధూమోర్ణ మహిసాక్షిధూమఘుటిక.
— 3–62.

'ధూపార్తిమహిసాక్షిధూమఘుటిక' అనునది పూర్వముద్రిత పాఠము. మహిసాక్షి యనఁగా గుగ్గిలము. అది ముద్దగట్టి యుండును. కావున ధూమఘుటిక యనినాఁడు. దానితో యమునిభార్య దక్షారామమును బరిమళభరితఁ మొనర్చు నని భావము. ఈప్రకరణములో 'ధూపార్తి' యనుశబ్ద మనన్వితము. పరిష్కర్తల కది అగురు వత్తిగా స్ఫురించియుండును. అగురువత్తిని ధూపార్తిశబ్దమున కర్థము చేసిననపుడు ధూమఘుటిక యను శబ్దమున కర్థము పొసఁగదు. ఇంతకు యముని భార్యపేరు ధూమోర్ణ. ఆమె వచ్చి దక్షిణకాశిని మహిసాక్షి ధూపముచే సుగంధభరితము సేయుచుకై వారము సేయుచుండె నను విషయమును శ్రీనాథుఁడు మన కిట నెఱిఁగింపఁ దలఁచి యున్నాఁడు. ఈవిషయము సంస్కృతసంప్రదాయజ్ఞులకు మాత్రమే విదితము. యమునిశుద్ధాంతకాంత 'ధూమోర్ణ' యైనట్టులు శ్రీనాథుఁడు కాశీఖండమునం దిట్లు వాకొనియున్నాడు.

మ. పనిలేదేఁటికి బాధ పెట్టనను? నబ్రహ్మణ్య మైతో మొఱో!
యని యుచ్చైర్ధ్వనిఁ గూఁతవెట్ట మఖశాలాంతంబునన్ శ్రాద్ధదే
వుని గట్టించెను వీరభద్రుఁడు భటవ్యూహంబుచే నాగ్రహం
బున ధూమోర్ణపయోధరద్వితయము న్మద్దాడుహస్తాబ్జముల్.
— కాశీ. 7–60.

దక్షాధ్వరధ్వంసము గావించినపుడు వీరభద్రుఁ డత్యాగ్రహముతో, 'తనప్రేయసియగు ధూమోర్ణస్తనయుగమును ముద్దాడు యమునిచేతులు రెంటిని దనభటులచేఁ గట్టించె' నని భావము. దీనిని బట్టి యమునియిల్లాలిపేరు 'ధూమోర్ణ' యనుట స్పష్టము. కావున పైసీసపాదమున 'ధూమోర్ణ' యనుపాఠమే గ్రాహ్యము.

10. క. కిసలయరసజిఘ్రహిషా
వ్యసనాకులపికకుహూభవత్పంచమమై

కుసుమసమయావతారము
త్రసమింగము జగము ముంచె రాగాంబునిధిన్.

—5-102.

'రస ముంచెను జగము లంగరాగాంబునిధిన్' అనునది పూర్వ ముద్రితపాఠము. ఈపాఠము సర్వథా అన్వయము కుదరనిది. రసన్=భూమిని, అని యర్థము చెప్పినచో జగములు అనునది పునరుక్తి ప్రాయము. వసంతోదయము జగమును రాగసముద్రమున ముంచె నను విషయమిట ప్రస్తుతము. ఆపద్ధతిని అంగరాగాంబునిధి నను కొనుట నర్థరహితము. 'జగ మనంగరాగాంబునిధిన్' అని మార్చు కొనినను పునరుక్తిదోషము తప్పనిదియే యగును. దీనికి మూలమగు సంస్కృతశ్లోక మిట్లున్నది.

శ్లో. చరా చరాత్మకం విశ్వం రాగాబ్ధౌ మధువాసరః
  న్యమజ్జయ జ్జయప్రీతహృజ్జాతోజ్జృంభణోజ్జ్వలః.

వసంతసమయము విజయప్రీతుఁడైన మన్మథుని యుజ్జృంభణ మున నుజ్జ్వలమై, చరాచరాత్మకమైన జగము ననురాగసముద్రమున ముంచె నని యీశ్లోకభావము. 'త్రసమింగమ్ చరాచరమ్' అనునమర కోశోదాహృతినిబట్టి 'చరాచరము' అనుదానికిఁ బర్యాయపదము 'త్రసమింగము' అనుపదము. జిహ్వాగ్రనృత్యత్సంస్కృతపదజాలుఁడైన శ్రీనాథుఁడు మూలానుగుణానువాదమునకై 'త్రసమింగము జగము ముంచె రాగాంబునిధిన్' అనుపాఠమును గ్రహించె ననుట నిర్వివాదమైన తథ్యము. కావున నీపాఠమే యిట గ్రహింపఁదగియున్నది. ఇట్టి యుక్త తరపాఠము లెన్నియో గలవు. గ్రంథవిస్తర విస్తరభీతిచే వానివాని వివరణము నింతటితో విరమించుచుంటిని.

ఈవిధమైన పాఠముల స్వారస్యమునుగూర్చి పలువురు మిత్రు లతోఁ బలుమాఱులు ముచ్చటించుట నాకొక పరిపాటి యైనది. నాకుఁ బ్రియమిత్రులు శ్రీనాథునికవితయందు విశేషాదరము గలిగి శ్రీనాథుని జయంత్యుత్సవములు పలుమాఱులు నెఱపిన బ్రహ్మశ్రీ శ్రీపాద

సుబ్రహ్మణ్యశాస్త్రిగారితోఁ గూడ నీవిషయము లప్పటప్పట ముచ్చటించుచు వచ్చితిని. ఇట్టియుక్తతరపాఠములతోఁ గూడిన భీమేశ్వర పురాణము తిరిగి వెలువడుట భావ్య మని వారికిఁ దోఁచినది. అదియును గాక సుమారు పదునేనువత్సరములనుండి భీమేశ్వరపురాణము పాఠకులకు లభించుభాగ్యము లేనిదే యయినది. శ్రీ శాస్త్రిగారు తమకుఁ బరమమిత్త్రులు, ఆంధ్రవాఙ్మయమునందలి యుత్తమగ్రంథములఁ బ్రచురించి భాషాసేవఁజేయ స్థిరసంకల్పులు నగు శ్రీ అద్దేపల్లి నాగేశ్వర రావుగారిని ఏతద్గ్రంథపునర్ముద్రణమునకుఁ బ్రోత్సహించి, నాకు వారితోఁ బరిచయము గలిగించిరి. శ్రీ నాగేశ్వరరావుగారితో "ఈభీమేశ్వరపురాణము శ్రీనాథునినాఁడు రాజమహేంద్రవరనగరము ననే వెలువడినది గావున, తిరిగి యచటనే వెలువడుట యుక్తతరము. గావున మీరీప్రబంధమును ముద్రించుట భావ" మని వాకొంటిని. వారు నామాట నంగీకరించి, నన్నీకృతికి పీఠిక వ్రాయు మని కోరిరి. ఈభీమేశ్వరపురాణము పునర్ముద్రితమగుట యెంతయు భావ్య మని భావించు నేను, శ్రీశాస్త్రిగారిప్రోత్సాహమునను శ్రీ నాగేశ్వరరావు గారి ప్రోద్బలమునను ఈపీఠిక వ్రాయ నంగీకరించితిని. శ్రీనాథుని మీఁదిప్రత్యయముచేతను, శ్రీ నాగేశ్వరరావుగారి యనురోధమునను నాకుఁ దోఁచినవిషయములను నిందుఁ బొందుపఱిచితిని. నాకీపీఠిక వ్రాయు నవకాశమును గలిగించినందులకు శ్రీ నాగేశ్వరరావుగారికి నాకృతజ్ఞతను దెలుపుచు, నిట్టియుత్సాహాభినివేశములతో శ్రీనాథుని రాజమహేంద్రవరరచనలలో రెండవదియైన 'కాశీఖండము' గూడ నాంధ్రపాఠకలోకమునకు వా రచిరకాలమున నందిచ్చెదరుగాక యని యాశాసించుచున్నాఁడను.

విలంబి
విజయదశమి
కాకినాడ

ఇట్లు
సహృదయవిధేయుఁడు
చిలుకూరి పాపయ్యశాస్త్రి



దక్షారామ భీమేశ్వర దేవాలయ పూర్తి దృశ్యము



సప్తగోదావరి పశ్చిమ తీరముననున్న పాకశాసనాలయము

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినే నమః

# శ్రీ భీ మే శ్వ ర పు రా ణ ము

## ప్ర థ మా శ్వా స ము

శ్రీ స్తనగంధసారపరిషేకసమంచిత సాయకప్రయో
గాస్తమహాపురత్రయుఁ డహార్యధనుర్ధరుఁ డర్కకోటిదీ
ప్తిస్తవనీయవిగ్రహుఁడు భీమయదేవుఁడు దక్షవాటికా
వాస్తుఁడు ప్రోచుఁగావుత ధ్రువంబుగ దేవయయన్నధీమణిన్. 1

### ఇ ష్ట దే వ తా ప్రా ర్థ న ము

ఉ. ఏనికమోముతా ల్పె[1]లుక నెక్కినరావుతు రాచవారు[2] సే
నానియనుంగుఁబెద్దన వినాయకదేవుఁడు కర్ణతాళఝం
ఝానిలతాండవంబున నిరంతరమున్ బ్రజలాంతరాయసం
తానమహాఘనాఘనకదంబములన్ విదళించుఁగావుతన్. 2

ఉ. వాలికమోము మత్తవనబర్హికిశోరకలాస్యలీలఁ బై
వాలిచి పచ్చకప్పురపువాసనతోడి ముఖారవిందతాం
బూలపుమోవి మోవిపయి మోపుచు రాధకు నిచ్చుధూర్తగో
పాలుఁడు ప్రోచుఁగావుత సపారకృపామతి మంత్రియన్ననిన్. 3

సీ. రాజీవభవుని గారాపుఁబట్టపుదేవి
యంచబాబా నెక్కు నలరుఁబోణి
పసిఁడికిన్నెరవీణెఁ బలికించునెలనాఁగ
పదునాల్గువిద్యల పట్టుఁగొమ్మ

---

1. జెల్లెలుక. 2. రాజసౌర. 3. సంపద.

యీరేడుభువనంబు లేలుసంపతి[1]చేడె
మొలకచందురుఁ దాల్చుముద్దరాలు
వెలిచాయకోదమరాచిలుక నెచ్చెలికత్తె
ప్రణవపీఠిక నుండుపద్మగంధి

తే. మందరాచలకందరామథ్యమాన
దుగ్ధపాథోధిలహరికాధూర్తమైన
లలితసాహిత్యసౌహిత్యలక్ష్మి నొసఁగు
వరదమై మాకు వినతగీర్వాణి వాణి. 4

పురాతనకవీంద్ర గుణకీర్తనము

శా. శ్లోకంబు ల్శతకోటికాండములుగా సూత్రించి రామాయణం
బేకైకాక్షర మెల్లపాపముల మాయింపంగ నిర్మించి సు
శ్లోకుండైన పురాణసంయమివరున్ జూతు న్మనోవీథి వా
ల్మీకిన్ బ్రహ్మపదావతీర్ణకవితాలీలావతీవల్లభున్. 5

మ. తలఁతున్ భారతసంహితాధ్యయనవిద్యానిర్మితిప్రక్రియా
నలినప్రోద్భవునిన్ గళిందతనయాంతర్వేదిపుణ్యస్థలీ
పులినాభోగకృతావతారు సపరాంభోజాక్షు నక్షీణని
ర్మలసాహిత్యకళాభివృద్ధికయి పారాశర్యమానీశ్వరున్. 6

సీ. ప్రణుతింతు రసభావభావనామహనీయ
కవితాసముల్లాసుఁ గాళిదాసు
గణుతింతు నిరవద్యగద్యపద్యనిబంధ
పరితోషితస్థాణు భట్టబాణు

1. సంపద.

భజియింతు సాహిత్యపదవీమహారాజ్య
భద్రాసనాసీనుఁ బ్రవరసేను
వర్ణింతు సంభోధనార్వీచిగంభీర
[1]తాసారవాక్సముత్కర్షు హర్షు

తే. భాస శివభద్ర సౌమిల్ల [2]భల్లటులకు
మాఘ భారవి బిల్హణ మల్హణులకు
భట్టి చిత్తప కవిదండి పండితులకుఁ
గీలుకొలుపుదు నొసలిపైఁ గేలుదోయి. 7

క. నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయసార్వభౌముని గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభున్. 8

ఉ. పంచమవేదమై పరగుభారతసంహిత నాంధ్రభాషఁ గా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్. 9

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీకాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణసంగ్రహకళాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు మా
యనుగుం దాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్. 10

మ. హరచూడాహరిణాంకవక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటీపర్యంతకాఠిన్యమున్

1. సంభారవాక్యమత్కర్షు, 2. భల్లరకును.

సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యము ల్దిక్కులం
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీగేహరంగంబులన్. 11

కుకవినిరాకరణము

చ. వెస వసుధాస్థలంబునఁ గవీంద్రులు గొందఱు శేముషీమషీ
రసము మనఃకటాహకుహరంబుల నించి కలంచి జిహ్వికా
కిసలయతూలికం గొని లిఖింతురు కబ్బము లెన్నఁగా మహా
వ్యసనముతో నిజాననవియత్తలతాళపలాశరేఖలన్. 12

తే. బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములుఁబోలెఁ గొంచె మెఱిఁగి
పండితంమన్యులైన వైతండికులకు. 13

తే. నికటమునుండి శ్రుతిపుటనిష్ఠురముగ
నడరి [1]కాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుడిగి[2] రాయంచ యూరకయుంట లెస్స
సైఁపరాకున్న నెందేనిఁ జనుట యొప్పు. 14

తే. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యంద్రు
పలుకునుడికారమున నాంధ్రభాష యందు
రెవ్వ రేమంద్రుగాక నాకేల కొఱఁత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష. 15

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవీంద్రగుణకీర్తనంబును
గుకవినిరాకరణంబునుం జేసి యాత్మగతంబున. 16

1. నరలిటద్దమబిట్టబెట్టఱచి. 2. డుదధి.

తే. నవమరుత్తచరిత్రంబు నైషధంబు
సప్తశతి పండితారాధ్యచరిత మనఁగఁ
గావ్యములు పెక్కు సెప్పియుఁ గాంక్ష సనక
వెండియును గావ్య మొకటి గావింపఁదలఁచి. 17

వ. ఉన్నంత. 18

షష్ఠ్యంతములు

సీ. ఏమంత్రికులదైవ మిందుశేఖరుఁడు ద
క్షారామభీమేశుఁ డఖిలకర్త
యేమంత్రియేలిక యిక్ష్వాకుమాంధాతృ
రామసన్నిభుఁడైన వేమవిభుఁడు
యేమంత్రిసితకీర్తి యేడువారాసుల
కడకొండయోల[1]చీకటికిఁ గొంగ
యేమంత్రిసౌభాగ్య మిగురుఁగైదువుజోదు
లాలిత్యలీలకు మేలుబంతి
తే. యతఁడు కర్ణాట లాట భోట్టాంగ వంగ
కురు కుకుర కుంత లావంతి ఘూర్జరాది
నృపసభాస్థానబుధవర్ణనీయసుగుణ
మండనుఁడు బెండపూఁ డన్నమంత్రివరుఁడు. 19

వ. ఒక్కనాఁడు. 20

సీ. భాట్టప్రభాకరప్రస్థానసంవేద్య
లుద్దండపాండిత్య లొక్కవంక
ఫణిపభాషితభాష్యఫక్కికాభావజ్ఞు
లుత్తమప్రాగల్భ్య లొక్కవంకఁ

1. యవుల.

గణభుజ్మతగ్రంథకారార్థ[1]విపుల బా
హుశ్రుత్యసంపన్ను లొక్కవంక
వేదాంతవాసనావిశ్రాంతహృదయజ్ఞు
లుపనిషత్తత్త్వజ్ఞు లొక్కవంక

తే. నుభయభాషాకవీశ్వరు లొక్కవంక
వేశ్య లొకవంక నొకవంక వీరభటులు
బలసి కొలువంగఁ గొలువుండి పిలువఁబంచె
బెండపూఁ డన్నమంత్రీశ్వరుండు నన్ను. 21

తే. ఇట్లు పిలిపించి సన్మాన మెసక మెసఁగ
సముచితాసనమున నుంచి చతురలీల
నానతిచ్చెను రాయవేశ్యాభుజంగు
మంత్రి గంభీరధీరసంభాషణముల. 22

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందుఁ

తే. బాకనాఁటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభునిపౌత్రుఁడ వమలమతివి

---

1. గా నార్థ.

నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు
కలితగుణగణ్యా! శ్రీనాథకవివరేణ్యా! 23

తే. సప్తసంతానములు నాకు సంభవించె
నొకప్రబంధంబు వెలితిగా సుకృతగరిమ
నావెలితి మాన నాపేర నంకితముగ
శివపురాణంబు తెనుఁగుగాఁ జేయు మొకటి. 24

వ. అదియును. 25

క. బంధురసపాదలక్ష
గ్రంథంబై యెదుపదులు ఖండంబులతో
సంధిల్లిన స్కాందంబను
సింధువునకుఁ గాల్వ లమరిచినచందమునన్. 26

మ. అరవిందాప్తకృతప్రతిష్ఠుఁ డగు దక్షారామభీమేశ్వరే
శ్వరుమాహాత్మ్యముతోడఁ గూడి భువనశ్లాఘాస్పదంబై యభం
గురమై స్కాందపురాణసార మగు శ్రీగోదావరీఖండమున్
బరిపాటి న్రచియింపు మంధ్రజగతీభాషాప్రబంధంబుగన్. 27

వ. అని పలికి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలజాంబూనదాం
బరాభరణంబు లొసంగి వీడుకొలిపిన. 28

సీ. ధారాసురత్రాణధాటీసమారంభ
గర్వపాథోరాశికలశజులకు
సప్తమాడియరాజ ఝూడియక్ష్మాపాల
వందితశ్రీపాదవనరుహులకు

సింహాద్రిపర్యంతసీమాంధ్ర మేదినీ
మండలీపాలనాఖండలురకు
హరిదంతదంతిదంతావళీలిఖ్యమా
నానేకజయశాసనాక్షరులకు

తే. వీరభద్రేశ వేమపృథ్వీశ్వరులకు
ననుఁగుమంత్రి మహాప్రధానాగ్రగణ్యు
బెండపూఁడన్న జగనొబ్బగండబిరుద
సచివదేవేంద్రుఁ గృతి కధీశ్వరుని జేసి. 29

వ. సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితంబు లను పంచ లక్షణంబులతోడం గూడి సపాదలక్షగ్రంథసంఖ్యాసమన్వితంబై పంచాశత్ఖండమండితంబై బహుసంహితాసమాకీర్ణంబై యొప్పు శ్రీస్కాందం బను నాదిపురాణంబునందు గోదావరీఖండంబు శ్రీమద్దక్షారామభీమేశ్వరమాహాత్మ్యసంయుతం బగుటంజేసి భీమేశ్వరపురాణం బనఁ బరగు; నది యాంధ్రభాషాప్రబంధంబుగఁ జెప్పందొడంగితి; నమ్మహాప్రారంభంబునకు మంగళాలంకారంబుగా నమ్మహామంత్రీశ్వరు నేలిన వీరభద్రేశ్వర వేమభూపాలుర వంశావతారం బభివర్ణించెద. 30

వేమభూపాలుని వంశావతార వర్ణనము

ఉ. కైటభదైత్యవైరిపదకంజమునం దుదయంబునొందె మి
న్నేటికి భూతధాత్రికిని నెంతయు నచ్చినతోఁడఁబుట్టువై
హాటకగర్భముఖ్యనిఖిలామరమౌళిమహామణిప్రభా
పాటలవర్ణమైన యొకపావనవంశ ముదీర్ణసంపదన్. 31

వ. అప్పుణ్యవంశంబు కంసాసురధ్వంసిచరణపల్లవంబు దనకుఁబుట్టినిల్లు గావునఁ గారణగుణసంక్రమంబునంబోలెఁ జామరతోమరచ్ఛత్రధనుఃఖడ్గాదిచిహ్నోపశోభితంబై, చదలేటినీటివంలని సోదరీయస్నేహలబ్ధంబులుం బోని పావనత్వశుచిత్వగాంభీర్యమాధుర్యంబులు చరితమనస్స్వభావవచనంబుల ధరియించి, సైదోడుం బొదివి విశ్వవిశ్వంభరాక్రీడనంబు దనకు విచ్చినపరమక్షాంతి యంతరంగంబున సంతరించి, నిఖిలప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. అందుఁ బద్మనాయకులన వెలమలనఁ గమ్మలన సరిస[1]ల్లన నంటర్లన బహుప్రకారశాఖోపశాఖాభిన్నంబులైన మార్గంబులం ద్రిమార్గగంగాప్రవాహంబులుం బోలె గోత్రంబు లెన్నియేనియు జగత్పవిత్రంబులై ప్రవహించుచుండఁ, గల్పంబు లతిక్రమించి, మన్వంతరంబులు జరిగి, యుగంబులు సరిఁగడచి, వత్సరంబులు చని కాలచక్రం బతిక్రమించుచుండఁ జతుర్థకులమాళిమండనంబై కీర్తివిహారఘంటాపథంబైన పంటమహాన్వయంబు పాకనాఁటిదేశంబున భద్రపీఠంబు సధివసించి, సింహవిక్రమనగర దువ్వూరు గండవరాది[2]పట్టణంబులు నిజనివాసంబులుగా భూలతాదిష్టాష్టాదశద్వీపాంతరాళులగు భూపాలగ్రామణులం ద్రిలింగభూమండలాఖండలురను బ్రోలయవేమాన్నపోతాన్నవేమ కుమారగిరీశ్వరాదులం బూజ్యసామ్రాజ్యపీఠస్థులం గాంచె; తత్సంబంధబాంధవంబున వసుంధరాభారధౌరంధర్యంబునం గంధసింధురఘటాకూటకపటకిటికచ్ఛపావతారనారాయణభుజంగభూధరంబులకుఁ దోడుజోడై, రాయగురుపరమేశ్వర సాధుజనవిధేయ ఘోడెరాయ సకలకళాధామాదిబిరుదభాస్వరుండైన భీమయగురువరేణ్య పుణ్యకారుణ్యకటాక్షవీక్షాలబ్ధసుస్థిరైశ్వర్యధుర్యుండై విజయధాటీసమాటీకనంబుల దిశ లల్లాడ నల్లాడభూవల్లభుండు రాజ

1. నడినట్లన వంటలన. 2. కొండపురాది?

మహేంద్రంబు రాజధానిగా సింహాద్రిపర్యంతం బుత్కళ కళింగ యవన కర్ణాట లాటాంతర్ద్వీపంబైన ప్రతాపంబున దిలీప నహుష నాభాగ భరత భగీరథ మాంధాతృ దుందుమార పూరు పురూరవః ప్రభావుండై, విశ్వవిశ్వంభరాభువనమండలంబుఁ బరిపాలించెఁ; దదనంతరంబ— 32

తే. రాజరఘురాము లల్లాడరమణసుతులు
ధాత్రిఁ బాలింతు రాచంద్రతారకముగ
వేమభూవల్లభుండును వీరవిభుఁడు
నన్నదమ్ములు హరి[1]యును హరియుఁ బోలె. 33

ఉ. తమ్ముని వీరభద్రవసుధాధిపు విక్రమవీరభద్రుని
న్సమ్మదలీల రాజ్యభరణస్థితిఁ బట్టముగట్టి బాహుద
ర్పమ్మున వేమభూవరుఁడు వ్రాసె జగద్విజయప్రశస్తివ
ర్ణమ్ములు దిగ్ధురంధరసురద్విపకుంభవిషాణమండలిన్. 34

సీ. పాతాళభువనాధిపతికి శేషాహికిఁ
ప్రియలతో మసకానఁ బెనఁగ గలిగె
దిక్సింధురములకు దివ్యవాహినిలోనఁ
దేఁటిరాయిడి మానఁ దేల నోదవె
నుర్వీధరములకు నుదధిలోఁ గాఁపున్న
కొలముసాములయిండ్లఁ గుడువ నబ్బెఁ
గుహనాకిటికి లక్ష్మికుచకుంభములమీఁది
కుంకుమంబున నస[2]ల్కొనఁగఁ గూడె

తే. రాయవేశ్యాభుజంగ వీరప్రతాప
భాసి యల్లాడవిభువీరభద్రనృపతి

1. హరియును హరుఁడు. 2. నుసుల్కొనఁగ.

సర్వసర్వంసహాచక్రసర్వభరము
పృథుభుజాపీఠమున సంభరించుటయును. 35

క. ఏగీ ధరణిపు లల్లయ
వీరక్ష్మాపతికి సాటి వితరణగరిమన్
ధారాధరధారాధర
ధారాధరవాహదానధారావిధికిన్. 36

మహాస్రగ్ధర —
ఫణిరాజ స్తబ్ధరోమ ప్రమద[1]కమఠరా ట్పర్వతశ్రేణి దిగ్వా
రణధౌరంధర్యధారారభటి సమధికప్రౌఢబాహాప్రతాప
ప్రణతప్రత్యర్థిపృథ్వీపతి మకుటమణీభాసమానాంఘ్రిపీఠున్
బ్రణుతింతున్ వీరభద్రుం బ్రతిభటధరణీపాలకాలాగ్నిరుద్రున్. 37

సీ. పాండు[2]వాసురదాణి పావడంబిచ్చిన
భద్రేభములు వీథిఁ బౌళిముండు
నోఢ్డధాత్రీనాథుఁ డుపదపుత్తెంచిన
బింబాధరోష్ఠి సంబెళ వహించుఁ
గర్ణాటభూపతి కానుకయనిచిన
ముక్తాతపత్త్రంబు మ్రోల మెఱయు
యవనాధిపతి యుపాయనముగా నొసఁగిన
పాగాహయంబులు వాగెవచ్చు
తే. దూరమంతంత బారుహదొంతిమన్నె
సప్తమాడియరాజన్యసమితి మొక్క-

1. ప్రకట. 2. పండువాసురతాణి.

రాయవేశ్యాభుజంగ సంగ్రామపార్థ
గాయగోవాళ వేమనక్ష్మాధవునకు. 38

శా. దేవబ్రాహ్మణభక్తివర్ధితధరిత్రీచక్రసామ్రాజ్యల
క్ష్మీసామ్రాజ్యపతి సంస్తుతింపఁగఁదగున్ శ్రీవేమపృథ్వీ[1]వరున్
లావణ్యాపరమత్స్యలాంఛనుని నాలంకాపురీశంకర
గ్రావాభ్యంతరకూలముద్వహయశఃకల్లోలినీవల్లభున్. 39

క. కాంచీ శ్రీగిరి కాశీ
పంచారామాది దేవభవనంబుల వ్రా
యించెను వేమక్ష్మాపతి
యంచితభూదానశాసనాక్షరపంక్తుల్. 40

సీ. ధరియింపనేర్చిరి దర్భవెట్టెడుచ్రేళ్ల
లీలమాణిక్యాంగుళీయకములు
కల్పింపనేర్చిరి గంగమట్టియమీఁదఁ
గస్తూరికాపుండ్రకములు నొసల
సవరింపనేర్చిరి జన్నిదంబులమోలఁ
దారహారములు ముత్యాలసరులు
[2]చెరువంగనేర్చిరి శిఖలనెన్నడుములఁ
గమ్మని క్రొత్తచెంగల్వవిరులు

తే. ధామముల వెండియును బైఁడి దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు

1. పృథ్వీశ్వరున్. 2. చేర్పంగ.

వేమభూపాలుఁ డనుజన్ము వీరభద్రు
ధాత్రియేలింపఁ[1] గాతమిూతటమునందు. 41

తే. ధర్మశాసనఘనశిలాస్తంభ [2]మెత్తె
శ్రీమృకండూద్భవస్వామి[3]శివుని మ్రోల
వీరభద్రేశుఁ డాచంద్రతారకముగ
నగ్రహారాళి నఖిలమాన్యంబు లొసఁగి. 42

సీ. కమలాచలాగ్రమార్కండేయశివశిర
శ్శశిచంద్రికాధౌతసౌధవీథి
గోదావరీపుణ్యకూలంకషాజల
స్ఫారితశ్రీరుద్రపాదయుగళి
బలవదభ్యున్నతప్రాకారపరివేష
గండూషితాజాండమండలంబు
గంధదంతావళగ్రైవేయఘంటికా
ఠంకారముఖరఘంటాపథంబు

తే. రాజబింబాననానూత్నరత్నపేటి
వీరరాహుత్తసుభటకంఠీరవాద్రి
వేమభూపాలరాజ్యాభివృద్ధికరము
సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము. 43

తే. వీరభద్రేశవేమపృథ్వీధవులకు
మంత్రియగు బెండపూఁ డన్నమంత్రివరుని
విమలవంశావతారంబు విస్తరింతు
నభ్యుదయహేతువుగఁ బ్రబంధాదియందు. 44

---
1. ధాత్రిఁ బాలింప. 2. మేలె. 3. ముకుందోద్భవస్వామి.

## కృతినాయకుని వంశావతార వర్ణనము

సీ. ఆకాశలక్ష్మికి నవతంసకంబైన
మునిమండలములోని మొదలిచుక్క
యఱకాల బ్రహ్మాండ మప్పళించినయట్టి
చిన్ని వేల్పులరాజుఁ గన్నతండ్రి
యాదికల్పంబునాఁ డఖిలప్రపంచంబు
సృజియించుబ్రహ్మకుఁ జేయిదోడు
పరశురామునిచేతఁ బాథోధిమేఖలా
భరము దానముఁగొన్న బ్రాహ్మణుండు

తే. పేరుదక్షప్రజాపతిపెండ్లికొడుకు
కశ్యపబ్రహ్మ నిజవంశకర్తగాఁగ
వెలసె నుభయాన్వయంబులు వృద్ధిఁబొంద
ప్రాలుఁ బ్రాలును గలమంత్రి పోలమంత్రి. 45

తే. సాటి చదలేటినీటికి
హాటకగర్భనివధూటి కమరద్రువనీ
వాటికి మధుకైటభరిపు
వీటికి శ్రీపోలమంత్రివిశదయశంబుల్. 46

క. ఆమంత్రికి నుదయించిరి
శ్రీమంతులు కార్యఖడ్గజితవైరిమహా
సామంతులు శ్రీ యల్లా
డామాత్యాగ్రామణియును నన్నవిభుండున్. 47

క. అల్లాడవిభుఁడు రిపుహృ
దృల్లాడంబరుఁడు వాఁడు భామలమనముల్

గొల్లాడఁగ మదనుఁడు దిశ
లల్లాడఁగఁజేయుఁ దద్భుజాటోపంబుల్. 48

సీ. కాకతిక్ష్మాపాలగంధదంతావళ
ధ్వజినీమహాధురంధరుఁ డనంగ
నవలక్షకోదండనాథరాజ్యాంభోధి
సంపూర్ణపూర్ణిమాచంద్రుఁ డనఁగ
నంధ్రభూమండలాధ్యక్షసింహాసన
సంప్రతిష్ఠాపనాచార్యుఁ డనఁగ
వీరరుద్రాశేషవిశ్వంభరాధీశ
పృథులదక్షిణభుజాపీఠ మనఁగ

తే. యవనసంహారవిలయకాలాగ్ని యనఁగఁ
ధాటివిఘటితకుమ్మరోద్యానుఁ డనఁగ
విశ్వలోకప్రశస్తుఁడై వినుతికెక్క
నతులబలసీరి పోలయయన్న శౌరి. 49

చ. కొలనుప్రతాపరుద్రనృపకుంజరుచేత [1]నరేఁడు నారణీ
సలిలవివర్ధమానబహుసస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకరగ్రహణవేళఁ దగంగఁ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరి యెట్లు ప్రధాను లెవ్వరున్. 50

శా. అయ్యన్నయ్యకు యావదర్థపదగర్వానర్వ గంభీరవా
క్ఛయ్యా నైటభవైరిశయ్యకు ఘనుల్ షాడ్గుణ్యవిద్యానిధుల్
త్రయ్యంతజ్ఞులు దేవధీమణియునున్ దల్లప్రభుండున్ సుతుల్
వియ్యాం బందఁ దదీయకీర్తులు దిశావేదండతుండాళితోన్. 51

---

1. నరేంద్ర.

శా. లక్ష్మీదేవిఁ బయోరుహేక్షణునిఁ బోల్పం బాత్రులై యొప్పుశ్రీ
లక్ష్మీదేవికి నన్నమంత్రికి సుతుల్ లావణ్యసంపన్నిధుల్
లక్ష్మీవంతులు దేవమంత్రియును దల్లప్రప్రధానుండు స
ర్వక్ష్మాధీశసభాంతరస్తుతనయప్రాగల్భ్యవాచస్పతుల్. 52

క. పన్నీట గంధజలమున
నన్నయతల్లప్రధానుఁ డభిషేకింపన్
గన్నపపుక్కిటనీటను
గన్నయరోచకము వాయు గఱకంఠునకున్. 53

సీ. ముక్కంటిదరహాసమున కనుప్రాసంబు
మిన్నేటినీటికి మిక్కుటంబు
శారదజ్యోత్స్నప్రసాదంబునకు వీప్స
నలువశుద్ధాంతంబున కనుభాష
కల్పకారామరేఖకుఁ బ్రతిచ్ఛందంబు
త్రిదశేందుకరటి కామ్రేడితంబు
పుండరీకారణ్యమునకు నధ్యాహార
మమృతాంబునిధి కభిధాంతరంబు

తే. గంధసారతుషారపాణింధమంబు
దానవిద్యావిలాసవిద్యాధరంబు
మంత్రియన్నయదేవయ్య మహితయశము
నిఖలదిక్తట మంతయు నిండియుండె. 54

మహాస్రగ్ధర—

వియదాశాభూతధాత్రీవివృతికలననిర్విఘ్నసంభారనిఘ్నా
వ్యయకీర్తిస్ఫూర్తిముద్రాహసితశశికిరీటాట్టహాసస్వయంభూ

దయితామందారచంద్రాతపసురతటినీతారనీహారుతో న
న్నయదేవామాత్యుతోడన్ హారహార! సరియే యన్యభూపాల
మంత్రుల్. 55

ఉ. ధీరుఁడు దేవమంత్రి నయధీగుణనిర్జితదేవమంత్రి శ్రీ
వీరయ దేవవల్లభాధిపవిశ్వపతి[1] ప్రియపుత్రి రామమాం
బారమణీమణి న్శుభనపావనవర్తనఁ బెండ్లియాడె సం
భోరుహనేత్రుఁ డంబునిధిపుత్రికఁ బెండిలియాడుకై నడిన్. 56

సీ. జగదేకసంస్తుత్యసౌభాగ్యసంపద
రతిదేవిఁ బోలు నీరాజవదన
పరమపాతివ్రత్యభాగ్యగౌరవమున
భూపుత్రిఁ బోలు నీపువ్వుఁబోణి
యక్షీణమహిమఁ గల్యాణవైభవమునఁ
బార్వతిఁ బోలు నీపద్మగంధి
మృదుగభీరప్రౌఢమితభాషణంబుల
భారతిఁ బోలు నీపరమసాధ్వి
తే. యనుచు బంధులు వినుతింప నవని మించె
నధికశుభగాత్రి విశ్వనాయకునిపుత్రి
యన్నవిభు దేవమంత్రియర్ధాంగలక్ష్మి
రమ్యసద్గుణనికురుంబ రామమాంబ. 57

తే. సింధు కరికాళ భల్లాణ సేనయాది
పరమమాహేశ్వరాచారపరులసరణి

---

1. విశ్వరతి.

నన్నవిభు దేవయామాత్యు నెన్నవచ్చుఁ
బార్వతీవల్లభునిమీఁది భక్తిగరిమ. 58

శా. ఆరామాంబకు దేవమంత్రికిని దక్షారామభీమేశ్వర
స్ఫారాపారకృపాగుణోదయమున న్జన్మించి రాత్మోద్భవుల్
ధీరోదాత్తుఁడు లింగమంత్రివిభుఁడున్ ధీశాలి తల్లన్నయున్
బారావారగభీరుఁ డన్నధరణీపాలుండు లక్ష్మీన్నిధుల్. 59

ఉ. సంగరసవ్యసాచికిఁ బ్రశస్తవితీర్ణిదధీచికి న్మహా
మంగళచారుమూర్తికి సమంచితనిర్మలధర్మమూర్తికిన్
లింగనమంత్రికి న్విశదనీతిపురావిబుధేంద్రమంత్రి కు
త్తుంగతరప్రతాపగుణధూర్జటి కెవ్వరు సాటి ధారుణిన్. 60

సీ. ఖండశర్కర జున్ను కండచక్కెరలు దో
సెలు వడ లేవెపాసెములతోడఁ
గమ్మఁగాఁ గాచిన కఱియాలనేతితోఁ
గమనీయపంచభక్ష్యములతోడ
సచ్చారువుల[1]తోడ శాకపాకములతోఁ
బక్వమైన పెసరపప్పుతోడఁ
దేనియధారతోఁ బాసకంబులతోడ
శిఖరిపాడఁబరసశ్రేణితోడ

తే. సచ్ఛలవణాదికముతోడ[2] నమృతఖండ
పాండరంబైన దధితోడ బ్రాహ్మణులకు
భోజనముపెట్టు ద్వాదశీపుణ్యవేళ
లింగమంత్రి నవీనరుక్మాంగదుండు. 61

1. సంబారముల 2. సౌధలవణికములలోనమృతఖండ

క. ప్రతిఘటియింపఁగవచ్చునె
ప్రతిభటులకు నసమసమరఘల్లునుతోడన్
శతకోటిదృఢకతార
క్షతశాత్రవుతోడ లింగసంచివునితోడన్ 62

సీ. ఝూడేశవస సప్తమాడె బారుహదొంతి
వంతునాది[1] క్షితీశ్వరులఁగెలిచి
యొడ్డాదిమత్స్యవంశోదయార్జునుచేతఁ
జల్లవాధిపుచేతఁ బలచమంది
దండకారణ్యమధ్యపుళింద రాజరం
భాహివంశజులకు నభయ మొసఁగి
భానుమత్కుల వీరభద్రాన్న దేవేంద్ర
గర్వసంరంభంబు గట్టిపెట్టి
తే. యవన కర్ణాట కటక భూధవులతోడ
బలిమి వాదించి[2] యేలించెఁ దెలుఁగుభూమిఁ
దననిజస్వామి నల్లాడధరణినాథు
భళిరె యరియేటి లింగనప్రభువరుండు. 63

క. దేవబ్రాహ్మణభూములు
భూవరునకుఁజెప్పి ధారవోయించె భళీ
దేవయలింగన ప్రియసం
భావన నిరుపాధి సర్వమాన్యంబులుగన్. 64

చ. అవుర ! ప్రతాపవేమవసుధాధిపుచే నృపపట్టభద్రుచే
భువనమనోహరంబయిన బోడసకుర్తి మహాస్థలంబునన్

1. మింతువాది. 2. వాటించి.

దివిరి పరిగ్రహించె మన దేవయలింగనమంత్రియన్న చో
డవరము నగ్రహారముగ దాత కవిద్విజబంధురక్షకై. 65

సీ. వాహ్యాళిభూమి రేవంతనై షధులట్లు
హయరత్నముల నెక్కి యాడనేర్చుఁ
గవిబుధశ్రేణికిఁ జెవులుపండువులుగా
నాస్థానమున మాటలాడనేర్చు
శక్తిత్రయంబునఁ జతురుపాయంబుల
షాడ్గుణ్యముల బుద్ధిఁ జరుపనేర్చుఁ
గై సేసి ప్రత్యక్షకందర్పమూర్తియై
నిర్వికారంబున నిలువనేర్చు

తే. నిష్ఠురాటోపవిస్ఫూర్తి నృహారికరణి
నతికఠోరకుఠారధారాంచలమున
వైరివక్షస్స్థలము ప్రచ్చివైవనేర్చు
సంగరార్జునుఁ డరియేటిలింగవిభుఁడు. 66

ఆ. లింగమంత్రిభామ గంగాంబికాదేవి
గనియె సుతుల నర్థికల్పతరుల
భవ్యరూపపంచబాణావతారుల
మంత్రిమంత్రి దేవమంత్రివరుల. 67

తే. కశ్యపాన్వయపాథోధికల్పశాఖి
సర్వగుణరత్నరోహణక్ష్మాధరేంద్ర
మభ్యుదయమందు మంత్రిలింగయ్యసుతుఁడు
మదనగోపాలసన్నిభమంత్రిమూర్తి. 68

ఉ. చంచలలోచనాకుసుమచాపుఁడు దానకళాదధీచి యా
శాంచలవారణేంద్రదశనాంకురనిర్మలకీర్తి వైభవా
భ్యంచితసర్వలోకుఁ డనపాయరమావిభవప్రపంచరా
త్రించరశాత్రవుండు మనదేవయతల్లన మంత్రిమాత్రుఁడే. 69

క. ఈవసుధామండలమున
నేవారును సరియె రూపహేలాసుకృత
శ్రీవత్సలాంఛనునకును
దేవయతల్లనికి మంత్రిదేవేంద్రునకున్. 70

క. నాళీకభవ నధూస్తన
పాళీకల్హారరమ్యపరిమళలహరీ
శాలీనతావిధాయివ
చోలీలలు తల్లనార్థిసురభికి నమరున్. 71

తే. తదనుసంభవుఁ డఖిలవిద్యావిరించి
యర్థిజనకామధుగ్ధేను వన్నమంత్రి
క్రీడసల్పును వానిసత్కీర్తికాంత
సప్తలోకమహోత్సవసౌధవీథి. 72

మ. అరభీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్రగాంధారఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభాషాసింధుసౌవీరబ
ర్బరభాషల్ కరహాటభాష మఱియుం భాషావిశేషంబు ల
చ్చెరువై వచ్చు నరేటియన్ననికి గోష్ఠీసంప్రయోగంబులన్. 73

ఉ. అన్నయమంత్రిశేఖరుఁ డహమ్మదుపాసురధాణభూమి[1]భృ
త్సన్నిధికి [2]సన్మదిన్నముచితంబుగ వేమమహీసురేంద్రరా

---

1. అహమ్మదు శాసనదాణభూమి 2. మదీనవసరంబున.

జ్యోత్స్నతి సంతతాభ్యుదయ మొందఁగఁ బారసిభాష వ్రాసినం
గన్నులపండువై యమరుఁ గాకితమందలివర్ణపద్ధతుల్. 74

సీ. రాజమహేంద్రదుర్గమునఁ గావించె శ్రీ
వీరభద్రునకుఁ బ్రాకారరేఖ
నిలిపె మార్కండేయనీలకంఠునిముంగల
రామేశుఁ దమతల్లినామకముగ
సంగమేశ్వరదివ్యశంభులింగమునకుఁ
గల్పించెఁ గల్యాణగర్భగృహము
దక్షివాటికయందుఁ దరుణేందుమౌళికి
మొగలివాకిట ధామమును రచించెఁ

బ్రాగ్దిశావప్రగోపురప్రాంగణమున
సప్తమునిసింధుసోపానసరణికెలనఁ
దీర్చెభవనంబు భీమయదేవునగర
మంత్రిదేవయయన్న యామాత్యవరుఁడు. 75

ఉ. భావన సంతసిల్లఁగ విభావసజాప్తుని విద్విషత్పురీ
భావ[1]నవీనగాండివి ప్రభావనమన్నిఖిలక్షమాజనుల్
దీవనలిచ్చి యెప్పుడును ధీవనరాశి నుతింతు రుత్తముల్
దేవయమంత్రి యన్నవిభు దేవనదీనవపావనాన్వయున్.  76

క. సిరియేలిక యగునరకే
సరి యేమో కాని గర్వసంరంభముపై
సరియే[2]పనపఁగ నితరులు
సరియే యరియేటి యన్నసచివాగ్రణికిన్. 77

---

1. భావనవీనశౌరిఁ బ్రవిభావనునిన్ 2. సరియేపానరఁగ

శా. కాంచీకంకణతారహారకటకగ్రైవేయభూషావళుల్
లంచంబిత్తురు దూతికాతతికి లీల న్బెండపూఁడన్న నిన్
బంచాస్త్రోపముఁ దారతార కవయం బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బల్వేలపురిం బ్రాఘేందుబింబాననల్. 78

తే. తారగిరిమందరముల బృందారకాది
తారకారాజవదనలు తారుతార
తార[1]తారశ్రుతి స్వరోదారలీలఁ
బాడుదురు బెండపూఁడన్న భవ్యకీర్తి. 79

సీ. కలకంఠములచాయ గలకంఠకోణంబు
నాగకుండలముల నాగరికత
చూడఁజూడఁగ నొప్పుసురసరిత్పూరంబుఁ
గాలఁ గాలవిభాళకటకముద్ర
మేన మేనాత్మజామానినీరత్నంబుఁ
గేళికురంగంబు గేల[2]వ్రేల
భస్మోపలేపంబు పాండుదేహంబునఁ
గటిని బుట్టంబైన కటికితోలు

తే. వికటశృంగారమున నొప్పువేల్పు శేని
నాగమోపనిషన్మనోహరుని హరుని
సచ్చరనుసేయు సంధ్యాత్రయంబులందు
బెండపూఁడన్న కన్నులపండువుగను. 80

3. తారధారా 4. గెలి.

సీ. అఖిలదిగ్దంతిదంతాగ్రళంబుల వ్రాయు
సధిపుదిగ్జయశాసనాక్షరములు
గువలయాక్షుల మించుగుబ్బచన్నుల వ్రాయుఁ
గుంకుమపత్రభంగాంకురములు
గర్వితారాతివక్షస్థ్సలంబుల వ్రాయు
నయకార్యసరణికిణాంకణములు
నర్థిసందోహఫాలాంచలంబుల వ్రాయు
లక్ష్మీప్రదము లైనలక్షణములుఁ

తే. బసిఁడిగంటాన భూపాలుపార్శ్వసీమ
వ్రాయు నయకార్యసరణి గేవలముకాదు
వేమధాత్రీకళత్రుతు గారాముమంత్రి
యతులగుణహారి బెండపూఁడన్న శౌరి.

షష్ఠ్యంతములు

క. ఇట్టిమహిమంబు గల జగ
జెట్టికి నర్థార్థిలోకచింతామణి కా
రట్టహయఘట్టసేనా
ఘట్టితరిపుపట్టణోపకంఠక్షితికిన్. 82

క. కంఠీరవవిక్రమున క
కుంఠప్రతిభు[1]నకు దానగుణసురభికి శ్రీ
కంఠాంఘ్రికమలనయనో
త్కంఠాన్వైకుంఠునకు నఖండితధృతికిన్. 83

1. శ్రీకంఠాశ్రిత.

క. దుగ్ధపయోధి సుధారస
ముగ్ధేందుధరాట్టహాస మురహరశయ్యా
దిగ్ధూర్ధరకరటిఘటా
స్నిగ్ధయశోదిగ్ధరోదసీకుహారునకున్ 84

క. చెంచుమలచూరకారున
కంచితబాహాపరాక్రమాధారునకున్
బంచారామవధూటీ
పంచాస్త్రవిహారకేళిపాంచాలునకున్. 85

క. శ్రీవీరభద్ర వేమ
క్ష్మావర రాజ్యాభివృద్ధికారణమునకున్
లావణ్యరూపసంపదఁ
బూవిలుకానికిని బెండపూఁ డన్ననికిన్. 86

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యిమ్మహాప్రబంధంబునకుఁ గథానాయకుండైన భీమేశ్వరమహాదేవునకుఁ బ్రియధామంబైన దక్షారామపురవరం బెట్టిదనిన. 87

దక్షారామపురవర్ణనము

సీ. పర్యంతమందారపారిజాతకవనీ
రమమాణకిన్నరీసముదయంబు
సరస రసాసిద్ధవరవారిసంపూర్ణ
గంభీరతరపరిఖాపయోధి
ప్రబలచింతారత్నపాషాణసంఘాత
వప్రరేఖాచక్రవలయితంబు
కామధేనుసహస్రకఠినరింఖాటంక
దళనదంతురితరథ్యాముఖంబు

తే. భద్రపాతాళభైరవపాలితంబు
గుహవినాయకరక్షణాకుంఠితంబు
సప్తమాతృకపరివారసంయుతంబు
వసుమతీనూపురము దక్షవాటిపురము. 88

సీ. కాంతిసంపద నేల[1] కైవార మొనరింప
విధుబింబమున నుద్భవించి రనినఁ
మాధుర్యగుణమేల మాటిమాటికిఁ జెప్ప
నమృతాబ్ధి నవతారమంది రనినఁ
దేజోవిశేషంబు తెఱఁగు పల్కఁగ[2]నేల
విద్యుల్లతలలోన వెడలి రనిన
మోహనాకృతి యేల మునునాడి[3] కొనియాడఁ
బుష్పచాపునివింటఁ బుట్టి రనిన
సంభవించిరి గంధర్వజాతి ననఁగ
గలితనం బేల పెన్నాటకంబు[4] సేయ
ననఁగ భీమేశ్వరుని గొల్తు రప్పురమున
సాను లనుపేరి యప్సరశ్చంద్రముఖులు. 89

మ. మొరయించు న్మరుఁ డిక్షుచాప మనిశంబుం దక్షవాటీనుహా
పురమధ్యంబున ముజ్జగంబు గెలువన్ బుత్తెంచులీలన్ బురం
దరవిశ్రాణిత దేవతాభువనగంధర్వాప్సరోభామినీ
చరణాంభోరుహనూపురస్వనములన్ జంకించు ఝుంకారముల్. 90

శా. గంధర్వోపనిషద్రహస్యములు వక్కాణింతు రాలాపసం
బంధప్రస్ఫుటఝుంటుఝుంటుపదగుంభస్థాపవర్గావళీ

1. కల్ల 2. తెఱచిరాజన 3. మునిమాటి 4. వెల్నాటకంబు

సంధానక్రమదివ్యమంత్రకములన్ సాయాహ్నకాలంబులన్
గంధర్వాప్సరసల్ పురోపవనికాకల్పద్రుమచ్ఛాయలన్. 91

సీ. చరణద్వయీభూరిసౌభాగ్యసంపదఁ
బరిభవింతురు హేమపద్మవనము
ఘననితంబస్థలీగౌరవాభ్యున్నతి
సంప్రతింతురు నదీసైకతముల
గంభీరతరనాభిగర్తవిభ్రమముల
వ్రక్కలింతురు జలావర్తశోభ
గురుపయోధరభారపరిణాహవిస్ఫూర్తి
గుద్దలింతురు హేమకుంభగరిమ

తే. గారవింతురు కంఠోపకంఠకాంతిఁ
గంబుమణికాంతిబిబ్బోకడంబరంబు
మచ్చరింతురు సుఖచంద్రమండలములఁ
బూర్ణశశిమండలముతోడఁ బురముసతులు 92

శా. దక్షారామవిలాసినీవతుల సౌందర్యంబు వర్ణింపఁగాఁ
జక్షుశ్శ్రోత్రకులాధినాయకునకున్ శక్యంబె? తచ్చారుఫా
లక్షేత్రంబును బోలలేక మునిగెన్ లజ్జాభరాక్రాంతుఁడై
నక్షత్రేశుఁడు శంభుశేఖరసుధాంధస్సింధుపూరంబులన్. 93

సీ. అంబుధరశ్రేణి హరిణలాంఛనరేఖ
కప్రసుకార్ముకవల్లి కామతల్లి
జలచరద్వంద్వంబు చంపకప్రసవంబు
బింబంబు దాడిమబీజరాజి

శష్కులీయుగళంబు చారుదర్పణములు
శంఖంబు బిసములు జలరుహములు
పసిఁడికుంభంబులు బయ లంబువీచులు
పుష్కలావర్తంబు పులినతలము
తే. కదళికాహేమ కాహళ కచ్ఛపములు
మణులబంతులు తారకామండలములు
సంఘటించి పురంబువేశ్యల సృజించె
జాణదేవర శ్రీపంచశరవిరించి. 94

సీ. ముడువంగనేర్తురు మూలఁ గమ్మనితావి
గలుగఁ గ్రొవ్విరులు లోఁ గందకుండ
మురియంగనేర్తురు మోహనాస్పదమైన
మొగలివాకిటిచాయ నగరవీథి
వలపింపనేర్తురు వలరాజు గెలిచిన
పెద్దకాలమువేల్పు భీమనాథుఁ
బలుకంగనేర్తురు పాటలాధరముల
మొల్కలేనగవులు ముద్దుగురియఁ
తే. జందురునితోడఁ గల్పవృక్షములతోడఁ
దారతో లక్ష్మితో నమృతంబుతోడఁ
గౌస్తుభముతోడ మున్నిటఁ గలిగినారు
విబుధగంధర్వజాతు లవ్విటసతులు. 95

క. పూఁబోణులకును విటులకు
వేఁబోకలఁ దలరుసొంపు వీడ్కోలుపుఁ బురిన్
వేఁబోకఁ బోఁకతోఁటల
పూఁబాళల కమ్మతావి పొదలినగాడ్పుల్. 96

ఉ. వీటికి నాల్గువంకలను వెన్నెలతేటలఁ బోలునీళ్ళతో
హాటకపద్మమండితము లైనకొలంకులు చూడ నొప్పగున్
జీటికి మాటికి స్మరుఁడు జృంభితలీల నటింప వాళిమి
న్నేటికృపీటనిర్ఝరము లింతటనంతటఁ జిందెనోయనన్. 97

సీ. తిలకంబుబలు తేనియలఁ బోఁకమోకల
పువ్వుఁబాళలతావి పుక్కిలించి
కలమగోపికల చిక్కనిచన్నుఁగవలపై
వటపల్లవంబులు వాయఁదట్టి
సప్తగోదావరీజలతరంగారోహ
కేళీసుఖంబు లంగీకరించి
దేవగంధర్వలీలావతీహాటక
ప్రాసాదవలభిగర్భములు దూరి

తే. ప్రతిదినము దక్షవాటీపురంబునందు
మలయవేలావనీమందమారుతంబు
గంధసారలతాకుడుంగముల మెలఁగు
చిలువలేమలు సేవింప వెలితిపడుచు. 98

తే. దక్షవాటికఁ బశ్చిమద్వారభూమిఁ
బ్రతివసించును సర్వాంగరమ్య యగుచు
సేవకులపాలిసురశాఖ పూవుఁగొమ్మ
కోమలార్ధేందుధరుకొమ్మ గోగులమ్మ. 99

తే. దక్షపురమున నుత్తరద్వారమందు
నూర్జితంబుగ నుండు మహోజ్జ్వలాంగి

కామితార్థైకసంకల్పకల్పవల్లి
మహితసుగుణమతల్లి మండతల్లి. 100

క. సారమతి దక్షవాటిక
తూరుపుగవనిం బ్రసిద్ధితో వసియించున్
హేరాళక్రీడాసం
చారిణి నూకాంబ భక్తజనరక్షణకై. 101

క. మట్టయినయట్టి దక్షుని
పట్టణమున దక్షిణంబు పార్శ్వపుగవనిన్
నెట్టుకొని వెండి నిలిచిన
ఘట్టాంబికఁ గొల్వఁ గలుగుఁ గామితఫలముల్. 102

తే. పృథివిఁ బదునెనిమిది యోగపీఠశక్తి
గణములో నెంచ సర్వశృంగార యగుచు
భీమనాథునిసన్నిధిఁ బ్రేమ వెలయు
మాణికాదేవి సకలకల్యాణమూర్తి. 103

ఉ. ఏదెసఁ జూచిన న్విబుధు లేదెసఁ జూచిన మానిమండలం
బేదెసఁ జూచిన న్హరిదధీశ్వరవర్గము వాసవాది[1] యం
దేదెసఁజూచిన న్నవమహేశ్వరమూర్తులు శ్రీనికుంభ కుం
భోదర తండు భృంగిరిటి హాహుక హూహువులు దక్షవాటికిన్. 104

సీ. విరులదండలతోడి వేణికాభారంబు
పొంకంబు పిఱుఁదులఁ[2] బొరలియాడ
మణితులా[3]కోటి కోమల ఝణత్కారంబు
రవలమట్టెలమ్రోఁత యవఘళింప

---

1. వాసవాటికిన్ 2. జఱిగుపై 3. శిలా

గుదురునిండిన చిన్ని గుబ్బచన్నులమీఁద
ముత్యాలత్రిసరంబు మురువుసూప
వలమాన తాటంక వజ్రాంకురచ్ఛాయ
లేఁత వెన్నెలఁ బుక్కిలించి యుమియ
తే. సాని యీశానినై మహోత్సవమునందుఁ
గేల నవచంద్రకాంతంపుగిన్నె పూని
వీధి భిక్షాటనము నొనర్చు వేళఁ జేయు
మరులనృత్యంబు జగముల మరులుకొలుపు. 105

సీ. వేదండవదనశుండాదండచుళుకిత
ప్రోజ్ఝితాంభశ్ఛటాప్లుతనభంబు
దేవగంధర్వాప్సరో వధూటీ స్తన
స్థాసక శ్రీగంధధవళితంబు
కనక సౌగంధిక గంధోత్తమాగంధ
సార నిష్పందపుష్పంధయంబు
చటులవీచీ ఘటాఝాటడోలారూఢ
హంసహంస న్నినాదాలసంబు
తే. భూరి తీరావనీ ఘనీభూత చూత
జాతి వకుళ వనీసమాచ్ఛాద్యమాన
బహుళసింధు ధునీ వనబకమరాళి
దక్షపురియొద్ద సప్తగోదావరంబు. 106

సీ. సరివచ్చు ననవచ్చు శతమన్యువీటికి
వివిధ దేవాగారవిభ్రమమునఁ
బ్రతివచ్చు ననవచ్చుఁ బాలమున్నీటికి
నక్షయ[1] బహుజీవనాభివృద్ధి

---

1. అక్షయంబగు.

నెనవచ్చు ననవచ్చు నిందుబింబమునకు
సకలకళావిలాసప్రవృద్ధి
దొరవచ్చు ననవచ్చుఁ దోయజాక్షునిమూర్తి
కభిరామ లక్ష్మీసమగ్రమహిమఁ

తే. జెప్పనొప్పదె యప్సరస్త్రీసహస్ర
ధవళతరదీర్ఘదృక్పుటధాళధళ్య
సమ్మిళద్భీమనాథభూపాశశాంక
తరళదీధితిపరిపాటి దక్షవాటి. 107

క. రోధించు నభముఁ బటికపు
సౌధంబులు వీట భీమశంకరహర్షో
త్సేధాట్టహాసరేఖా
దీధితిమైత్త్రీవిధావిధేయము లగుచున్. 108

చ. ప్రహరిచరింతు రెప్పుడును భైరవు లర్ధనిశాగమంబులన్
గహకహనిష్ఠురాట్టహసగర్వితకంఠకఠోరహుంకృతుల్
బహుళభుజాలిడమ డ్డమరుఘాంకృతినాదము మేళగించి ది
క్కుహరము లోర్చు హాటకపుఁగోటలమీఁదట దక్షవాటికన్. 109

వ. మఱియు నప్పురంబు దళితసమదకరిసహస్రంబు లగుసుభటసహస్రంబులవలన సింహసంహతియు, సమధికవితరణశాఖానిరాఘాటకీర్తిస్ఫూర్తులగు విద్వాంసులవలనఁ బారిజాతోద్యానంబును, ననేకశతసవనసమజ్యోతిర్ధారియగుసుమనోవర్గంబువలన సుధర్మాస్థానంబును, నభిరామరామణీయక సౌభాగ్యరేఖావిలాసపక్ష్మాంతలక్ష్మీవిరాజమానంబగు రాజకుమారలోకంబువలన గంధర్వలోకంబును, మకరకచ్ఛపముకుందనిధిసనాథులగు వైశ్యులవలన వైశ్రవణస్థానంబు ననందగి, సకలభువనప్రశస్తంబై భారతవర్షంబునకు ఫలసంపద

యునుం బ్రోలె శాఖానగరసహస్రసంబాధపరిసరంబై, సకలజగన్నిర్మా
ణమాత్రైకయగు కృశయునంబునకుం గారణంబన, కనకగిరివప్రదీప్ర
ప్రాకారబహుప్రకారవప్రప్రకరపరివేషవలయావలయితంబై, సలిలసం
క్రాంతకనకావరణమండలప్రతిబింబంబగుటం జేసి కులిశపతంభయా
వగాహహాటకక్షితిధరంబగు నపరాంబురాశియుంబోని పరిఖాచ
క్రంబుచేతను, క్రీడామదజలపంకిలప్రాంగణంబులగు భృంగిరిటి నికుంభ
కుంభోదర ప్రధాన ప్రమథగణమణిభవన సౌధంబులచేతను, నాసన్న
దీర్ఘికావీచీపవనవికీర్యమాణకనకస్వాదుజలనిష్యందమనుబంధు వర్షాంబు
దూరీకృతశంభళీకపోలకస్తూరికాపత్రభంగంబులగు నప్సరోంగనా
వాటంబులచేతను, గుట్టిమఖచితమణికిరణవిసరణజనితాకాండప్రసా
రితకదళీపలాశసంగతిసంశోభితకక్ష్యాంతభాగంబులగు యక్షగంధర్వకి
న్నరకింపురుషసిద్ధవిద్యాధరస్థానంబులచేతను గారుత్మతరత్నాంశు
పటలఘటితపటమాయిమీతారకాయమాన స్థూలఖచితస్థూలముక్తాఫల
శలాకానికాయంబులగు భైరవాయతనంబులచేతను ప్రస్నిగ్ధశ్యామ
లశిలోత్కీర్ణరమ్యోపవాహ్యాశాక్వరంబులగు శంకరాగారద్వారంబు
లచేతను, తులసీదళశీతలామోదముషితకిల్బిషంబులగు విష్వక్సేన
ధామంబులచేతను, నిరంతరసంఫుల్లమల్లీవల్లికాతల్లజపుష్పనిష్యంద
మానమధుమత్తపుష్పంధయవిరుతిపునీతహరిదుపఘ్నంబు లగు వి
శ్వేశ్వరావాసలలితోద్యానంబులచేతను, బృథులనారికేళపటలపా
నదరవికటకరటిముఖవికలితవరాటకోశవ్యాకోచహాటకకుశేశయంబు
లగు సప్తగోదావరసలిలంబులచేతను, గోమంకింజల్కాగ్రగ్రసనజాగ్ర
చ్చక్రవాకచరణ నఖశిఖరసముల్లిఖితకమలకంవలయకుముదషండం
లగు తీర్థకుండంబులచేతను, గోదావరీ తుల్యభాగా కౌంతేయీ కణ్వా
పగానదీమాతృకాయమానంబై యిరుగారునుం బంట పండంగు పంట
వలంతి కేదారక్షేత్రంబులచేతను, నఖండితాంభస్సమృద్ధి విజృంభించి

విశ్వంభరాభ్రూలతాకారి సేతురేఖాలంకారంబులై తటతరుకుసుమాంతరక్షరదమందమకరంద సందోహస్యందనకల్లోలంబులై సలిలకేళీలోలకలహంసకామినీకోలాహలానుకృత జలదేవతాచరణ మణినూపురఘుణఘుణత్కారంబులై కారండవపక్షవిక్షేపపరిచలితపంకజపరాగపాళీవిరచితాళీకసంధ్యానుబంధచరిత చక్రవాకమిథునంబులై పయోధిగన్నబిడ్డలుంబోని యొద్దుచెఱువులచేతను, సరససహకారశాఖాశిఖాధిరూఢకోకిలకుటుంబినీకంఠనాళ కోమలకుహూకారకోలాహలకలిత విరహిణీహృదయహాలాహలక్షేపంబులును, మధుకరనికరగుంజాయమాన మాధవీనికుంజసన్నిహితకిరణపుంజంబులును, సముద్భిన్నపున్నాగకుసుమపరిమళోద్గారనీహారంబులును, సముల్లసితచంపక కళికాకలాపకల్పితకందర్పపావకాస్త్రపరిత్రస్తపథికలోకంబులును, పాకపరిస్ఫుటిత పుండ్రేక్షుపర్వముఖోద్గీర్ణ ముక్తామణిదర్శితాకారరాకానిశాకరప్రకాశంబులును, గోకరప్రకర తార తారకితకురువకానోకహంబులును, వనితావదనాసవసనాథవకుళవనంబులును, మహోరుకుచకలశకాంతిచోరఫలకలితలికుచనిచయంబులును, మాతులుంగామోదహృదయంగములును, నవనాగరంగసంగమసుఖితసారంగమంగళగాన సరససంగీతప్రసంగంబులును, భుజంగలతాపరిష్వంగభవ్యతరుణపూగద్రుమంబులును, లలితలవలీలతాలింగితలవంగంబులును, నగుశృంగారారామంబులచేతను, నభిరామంబై; కలితచాతుర్వర్ణ్యస్థితి యగుటం ద్రైలోక్యతిలకంబును, సముద్భాసితాసంఖ్యదేవాలయంబగుట శతమఖనగరంబును, నక్షయజీవనధృతి యగుట ధర్మపాలమండలంబును, ననధిగతకంటకరుచిరంబగుటం బ్రజాభాగ్యఘంటాపథంబును, బ్రచురసన్మణివాసంబగుట వసుంధరాధిపస్థానంబును నై, గుహ్యకనగరంబునుంబోలె వివిధమనుష్యధర్మచరితపవిత్రంబును, లంకానగరంబునుంబోలెఁ బుణ్యజనాధ్యాషిత

సన్నివేశంబును, కార్తవీర్యార్జునమూర్తియుంబోలె సవిరళకరభూషితంబును; నృసింహలీలాడంబరంబునుంబోలె బ్రథితహిరణ్యకశిపుక్షయంబును, శరత్కాలంబునుంబోలె విలసత్ప్రకాశంబును, బ్రాహ్మణజాతిధర్మంబునుంబోలె నిగమశాలియును నై, మహాదుర్భాషాన్వితంబయ్యును నిరాక్రోశంబును, ప్రకటభుజంగప్రకారంబయ్యును సదాహితాభయంబును, బలిరాజనిలయభూతంబయ్యును గంధర్వభూమియును నై, వర్ణసాంకర్యంబు వాసవకోదండంబునంద; యాహిభయంబు వల్మీకంబులయంద; జీవనసంశయంబు వారిదంబులయంద; వృషాతిక్రమంబు గృహంబులయంద; పరదర్శనంబు యతులయంద; దోషోల్లాసంబు కువలయంబులయంద; కౌరవపదానుసరణంబు కిరాతులయంద; తరళత్వంబు కరికరసంతానంబులయంద; విపక్షక్షోభంబు కొలంకులయంద; యార్తగంధత్వంబు చందనంబులయంద కాని తనయందుం బొందనీక విభవంబునకుఁ బ్రభవంబును, విలాసంబునకు నివాసంబును, నపవర్గంబునకు సర్గంబును, ధర్మంబునకు మర్మంబును, దానంబునకు నిధానంబును, నానందంబునకు మూలకందంబును, విద్యలకు నిషద్యయు, విశ్రామంబునకు ధామంబును నై యొప్పు నప్పట్టణంబున కధీశ్వరుండు.

సీ. హాలాహలం బను నల్లనేరేడుపండు
మిసిమింతుఁ డను గాక మ్రింగినాఁడు
పెనువ్రేలికొనగోర బిసరుహాసనుమోముఁ
గెందమ్మిపిరివోలె గిల్లినాఁడు
పంచవన్నియతోడఁ బ్రసవనారాచుని
నెఱ్ఱచిచ్చుటకంట జుఱ్ఱినాఁడు
మెఱుఁగుఁగోఱలు దుల్ల మృత్యుదేవతనోరు
ఘట్టించి యాఱకాలఁ దన్నినాఁడు

తే. త్రిపుర దైత్యావరోధ నారీవిలాస
దంతతాటంకముల కెగ్గుదలఁచినాఁడు
దక్షపురిసానికూఁతులఁ దవిలినాఁడు
విశ్వలోకకుటుంబి భీమేశ్వరుండు. 111

మ. ఎనయఁ గల్గినకూర్మి భృంగిరిటిఁ గాని తండుఁ గానీ నికుం
భుని గానీ కయిదండ పట్టుకొని సంభోగేచ్ఛ సంతఃపురాం
గనలం గన్నుమొఱంగి యప్పురముఖం గన్నెఱుకాఁదారిఁబ్రా
గ్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబునన్. 112

క. పదునాల్గుమహాయుగములు
ముదుకగు భీమేశ్వరునకు మొగచాట్లెయుం
డదు సానిపెండ్లి యెప్పుడు
నది దక్షారామమహిమ మగునో కాదో? 113

సీ. నేదిష్ఠమున సప్తగోదావరంబున
సఘమర్షణస్నాన మాచరించి
త్ర్యాయుషమంత్రాక్షరాభి[1]మంత్రితమైన
విమలభూతి త్రిపుండ్రము ధరించి
మొగలివాకిలిఁ దూఱి దిగువశాక్వరరాజు
నగరిపై వెన్నుని[2]సనువుఁ జూచి
మణిశిలాసోపానమధ్యమార్గంబుగా
సభ్రంకషంబైన హర్మ్యమెక్కి

తే. సప్తపాతాళభువనవిష్కంభములను
దెఱచి వెడలిన జ్యోతిఃప్రదీప్తమూర్తి

1. త్ర్యాయుతిమంత్రాక్షతాభి. 2. పసిఁడివెన్నుని.

శంభు శ్రీమేశ్వరేశ్వరస్వామిఁ గొలుచు
పరమమాహేశ్వరుఁ కేమి ప్రాఁతి ముక్తి 114

క. పర మాసించుచుఁ బరమే[1]
శ్వరుఁ నుమఁజేసి చోడ రాశాధిపను
డరికాలుఁడు కరికాలుఁడు
ధరణీధరపత్ని మనసు దేశ్యము నిలుచెన్. 115

సీ. గజచర్మ మెన్నఁడో కాని సిచ్చులుఁ గట్టు
పసిఁడికమ్ముల పట్టుపచ్చడంబు
భసిత మెన్నఁడో కాని ప్రతిదినంబు నలఁదు
మలయజంబు కురంగమదము గూర్చి
నిడుద పాములరాజుతొడవు లెన్నఁడో కాని
తారహారములు నిత్యము ధరించు
నృకరండరుండమాలిక లెన్నఁడో కాని
ధరియించుఁ గల్హారదామ మెపుడు
తే. కాటినడుచక్కి నెన్నఁడో గాని యుండు
దక్షవాటి సువర్ణసౌధములమీఁద
నెన్నఁడో పిశాచులను గాని యిందుముఖుల
నెల్లకాలంబుఁ దలఁచు శ్రీమేశ్వరుండు. 116

సీ. ఒకవేళ ధరియించు యవనాశ్వుఁ డిచ్చిన
కట్టాణిముత్యాలకంఠమాల
మాంధాతృఁ డిచ్చిన మాణిక్యఖచితకే
యూరంబు ధరియించు నొక్కవేళ

1. భీమే

నిక్ష్వాకుఁ డిచ్చినహీరాంకురంబుల
యుంగరంబు ధరించు నొక్కవేళ
మనుచక్రవర్తి యిచ్చినప్రవాళంబుల
యొడ్డాణము ధరించు నొక్కవేళ
తే. వేడ్కఁ ధరియించు నొక్కొక్కవేళయందు
భరత దుష్యంత రంతి నాభాగ నహుష
నల భగీరథ నృగ మహీనాథసత్త
హేమమణిభూషణములు భీమేశ్వరుండు. 117

వ. వెండియు భీమేశ్వరుండు పండువుపంపువు నఖండవిభవంబున నాఖండ
లాదివిబుధమండలంబు పరివేష్టింపఁ జలిగొండరాచూలియుం
దానును మార్తాండచంద్రమండలంబులవలనను బాలసముద్రంబు
వలనను మధుకైటభారియూరుకాండంబువలనను గృపీటభవసజ్వా
లాజాలంబువలనను, గంధర్వసార్వభౌమువలనను, బ్రభవించి, కంతు
కుంతంబులనఁ, గాముతోమరంబులన, మదనుముద్గరంబులన, శంబరారి
కలితారంబులన, నంగభవుకొంగవాలులన, సిరిపట్టిసెలకట్టియలన, వల
రాజుభిండివాలంబులనఁదళతళంబొలయుతొలకరిమెఱుంగుమొలకలఁ
గలకలనగు కలికితెలికన్నుఁగవయు, జక్కవకవలపెక్కువలు దక్కవ
పఱచుచుఁ గ్రిక్కిఱిసిన మెఱుంగునిబ్బరంపుగబ్బిగుబ్బచన్నులును,
మిలమిలని జిలుఁగువలిపంపువలువల పొరల[1]మెడల వెలువడికేలి
గడలుకొను పసిమిగల పసిండితగటునుం దెగడు నునుఁదొడలజిగియును,
బగడంపుఁ జిగురుటధరములతుదల నిగుడుచుఁ జిఱునగవులు బిగియ
నగినం దెగిపడియెడు ననువపువున నడుగడుగునకు నడనడనదంకుచుం
బిడికిట నడంగునడుములబెడంగునుం గలిగి, ఘుగఘుగం గుఱంగనాభి
సౌరభసారంబులతోడం గూడి సంకుమదపంకపరిమళంబుల జంకించు

1. తెరల.

కర్పూరవాసనాసముల్లాసంబును, కర్పూరవాసనాసముల్లాసంబు
నుల్లసంబాపు కాలాగురుకర్దమామోదంబునను బునుంగుంబస
బిసాళించు గొజ్జంగినీటినెత్తావియును, గొజ్జంగినీటినెత్తావి బిత్తరించు
గందవడిపొలుపును, గందవడిపొలుపునుం గ్రుమ్మరించు ధమ్మిల్లమల్లి
కామల్లికవకుళవాసంతికాజాతికేతకీకుందకుసుమగంధంబులును, నిఖిల
దిక్సంధిబంధంబుతో బాంధవం బనుసంధింప, నిలింపగంధర్వాప్స
రోజాతులగు సానికూతులు గొలువ, జగనొబ్బగండ జగదగోపాల
పల్లవాదిత్య పల్లవత్రినేత్ర కేళాదిరాయ రాయవేశ్యాభుజంగ బిరు
దాభిరామాల్లయవేమభూపాల రాజ్యభారధురంధరుండైన బెండ
పూఁడన్నయామాత్యుండు గట్టించిన మొగసాలవాకిటి మహోన్నత
మంటపంబునందుం బేరోలగంబుండి, కుడలీ దండలాసక ప్రేరణీ
ప్రేంఖణసింధుకందుక ఘుమూళిచేలుమల్లీ హల్లీసకాదినృత్యంబు లవ
లోకించుచుఁ, బంతంబు లవధరించుచు, మేలంబు లాలకించుచుఁ,
జంపూవాటు నాటకోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర
చతురాస్యప్రబంధంబు లాకర్ణించుచు, వేణు వీణా మృదంగ కాంస్య
కాహళ పటహ ఢక్కా హుడుక్కా నక ఝల్లరీ ప్రముఖవాద్యాను
షంగంబు లాదరించుచు, సంగీతభంగీసరంగంబు లంగీకరించుచు,
నిగమంబులు గ్రహించుచుఁ, బురాణంబులు వినుచు, నితిహాసంబు
లిచ్ఛగించుచుఁ, దర్కంబులు వితర్కించుచు, నాగమంబులుపరీక్షిం
చుచు, నిఖిలలోకరక్షణార్థంబుగా వివిధవిద్యాకలాపంబుల వినో
దించుచుండ. 118

క. ఏతాదృశప్రభావా
పేతుండగు దక్షవాటిభీమేశ్వరు వి
ఖ్యాతకథ చెప్పెదను శ్రీ
తాతకృతపురాణసరణి తప్పక యుండన్. 119

## క థా ప్రా రం భ ము

వ. ఇమ్మహాపురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన—నైమిశారణ్యపుణ్య
క్షేత్రంబున ద్వాదశవార్షికంబైన దీర్ఘసత్రంబు ప్రవర్తిల్లుచుండఁ
గులపతి యైన శౌనకుం డనుపరమఋషి మొదలుగాఁగల సంయమీశ్వ
రులు యదృచ్ఛాసమాగతుండైన రోమహర్షణపుత్రు బాదరాయణ
ప్రియశిష్యుఁ బౌరాణికు సూతవ్యాహాసంభవు సూతు నర్చించి,
యతనివలనను బంచాశత్ఖండమండితంబును, బహుసంహితాసమాకీ
ర్ణంబును,సపాదలక్షగ్రంథసంఖ్యాసమన్వితంబును నైనస్కాందపురా
ణంబు వినువారును సందుఁ బూర్వఖండంబు నం "బారాశర్యుండు
నిజాపరాధంబు కారణంబుగా విశ్వనాథుచేత నధిక్షేపింపంబడి వార
ణాశి వెల్వడిరయె" నని విన్నవా రగుటం జేసి యటమీఁదివృత్తాంబు
విను వేడుక నమ్మునీంద్రు లభినందించి యిట్లనిరి.

తే. కాశి వెలువడివచ్చి పరాశరాత్మ
జుండు ఖేదంబు నొంది శిష్యులును దాను
నెచట వసియించె నెచ్చోట నేమి చేసె
ననఘ! యేతీర్థమాడె మా కానతిమ్ము.

వ. అని యడిగిన —

మ. సరసీజాసనవంశమౌక్తిక! కళాసర్వజ్ఞవిజ్ఞాన! శాం
కరినాథాంఘ్రిసరోజషట్పద! సమిద్గాండీవకోదండ!
భూభరణప్రౌఢభుజాభుజంగ! మహిళాపాంచాల! వేమక్షమా
వరసామ్రాజ్యరమాధురంధర! జగద్వ్యాప్తప్రతాపోదయా!

క. శ్రీవీరభద్రభూపతి
సేవాహేలాకటాక్ష సిద్ధసమృద్ధ

శ్రీవిభవపాకశాసన
భావభవారాతిభక్తి పరతంత్ర నిధీ!

మాలిని —

అకుటిలనయమార్గా! యాశ్రితార్థిప్రవర్గా!
సుకృతసరణిపాంథా! శుద్ధకీర్తిప్రబంధా!
సకలజనవిధేయా! శారదాభాగధేయా!
ప్రకటసుగుణసంగా! రాయవేశ్యాభుజంగా!

గద్య — ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన భీమేశ్వరపురాణం బను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

# శ్రీ భీమేశ్వర పురాణము

## ద్వితీయాశ్వాసము

శ్రీఖండఘుసృణమకరీ
రేఖాలంకార సుందరీ స్తనయుగపా
ళీఖచితభుజాంతర విభ
వాఖండల బెండపూఁడి యన్నామాత్యా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పందొడంగె. 2

తే. మృడునిచే నిట్లు కోపానఁ బడి కలంగి
గంగదరినుండి నిజశిష్యగణముతోడ
మగ్గురుస్వామి సకలధర్మజ్ఞుఁ డపుడు
పృథివిఁ గలతీర్థములు లెక్కవెట్టి చూచి. 3

వ. ఇట్లనియె.

తే. అంబ పార్వతి నాతోడ నానతిచ్చెఁ
గాశి యెక్కుడు తీర్థసంఘములలోనఁ
గాశికన్నను నెక్కుడు గారవమున
మోక్షభోగనివాసంబు దక్షవాటి. 5

వ. తొల్లి దక్షప్రజాపతి భూచరఖేచరులగు నఖిలగీర్వాణుల రప్పించి, హాటకగర్భకైటభారులఁ బురస్కరించుకొని మహాధ్వరంబు సేయం బ్రారంభించి. 6

తే. అద్రితో నోషధీశ్వరుఁ డాదియైన
పెండ్లికొడుకుల నెల్లను బిలువనంపె
గబ్బితనమున జగదీశుఁ గాలకంఠుఁ
బిలువఁబంపక మానె నబ్బిరుదులాఁడు. 7

క. అజ్ఞానంబున హరున క
వజ్ఞ దలఁచి యతనినొసలివ్రాఁతఫలమునన్
యజ్ఞముసేసెను సురలయ
నుజ్ఞం బరివృద్ధి కప్పనులు సమకొనునే? 8

మ. అల్పపుబుద్ధి నీక్రియ మహాక్రతుతంత్రము పన్నగాధిపా
కల్పుని బాయఁబెట్టి కనుగానక దక్షుఁడు చేయఁజొచ్చి యా
వేల్పులుఁ దాను దుర్దశలవేఁగె మహాప్రళయాగ్నిరుద్రునిం
బోల్పఁగ వచ్చునట్టి పటుభూరివిభుండగు వీరభద్రుచేన్. 9

తే. పువ్వుముడిచిన పురవీథిభూమియందుఁ
గట్టె మోవంగవలసిన కారణమున
వీరభద్రునిచే దైన్యవృత్తినొందె
దక్షుఁ డట్టె మహాధ్వరస్థానమునను. 10

క. తుదిఁబోయి యమ్మహేశ్వరు
పదపద్మము లాశ్రయించి బ్రదికెం దానుం
ద్రిదశులుఁ బెద్దలు నయ్యె
యదనునఁ జూపుదురు నిగ్రహానుగ్రహముల్. 11

సీ. దక్షప్రజాపతితప్పు లోఁగొని యాత్మఁ
గృపపుట్టి మిగుల రక్షించెఁగాన
హరివిరించిపురందరాది దేవతకోటి
మించి క్రమ్మఱ గారవించెఁగాన

నరిగి యంతర్ధాన మందినతన దేవి
నెడమ మేనఁ బరిగ్రహించెఁగానఁ
గోపాగ్నిఁ గడుఁ బరితాపంబు నొందెడు
రుసులకు నభయంబు లొసఁగెఁగాన

తే. నేరు[1] దెగనేసి జన్నపుటిట్ట్రిశిరము
గరిమ చెడకుండ దివి వ్రేలఁగట్టెఁగాన
నయముగలవేల్పు శ్రీభీమనాయకుండు
దక్షవాటంబు తీర్థంబు ధరణియందు. 12

తే. కాలకూటోపసంహారకారి యతఁడు
త్రిపురదైత్యాధిపతుల మర్దించె నతఁడు
నిగ్రహానుగ్రహప్రౌఢినిపుణుఁ డతఁడు
సంతతము దేవవేశ్యాభుజంగుఁ డతఁడు. 13

తే. ఏమి చిత్రంబు భీమేశ్వరేశ్వరుండు
నిగ్రహానుగ్రహ క్రియానిపుణుఁ డగుట
యతనిశ్వాసములమాత్ర నౌనొ కాదొ
వేదములును జరాచరవిశ్వజగము. 14

వ. బ్రహ్మాదిసంస్తుతుండై నిజార్ధదేహంబున నున్న మాయారూపిణి మహాదేవి భువనమోహిని దేవకార్యప్రయోజనంబును మేనకాదేవి భాగధేయంబును హిమవంతుని తపోవిశేషంబును గారణంబుగాఁ దద్దేహంబున జన్మింప నియోగించిన భువనేశ్వరి మహేశ్వరుని దేహంబు

1. అట్టి

వలన విముక్తియయ్యెం గావున దక్షారామంబు ముక్తిక్షేత్రం
బునాఁ బరగె వెండియు. 15

క. దక్షునిసవనా[1]గారము
దాక్షారామంబు శివుఁడు తన్మధ్యమునన్
సాక్షాత్కరించియుండుట
మోక్షము భోగంబు బ్రాఁతె ముజ్జగములకున్. 16

తే. ధాత్రివలయములో భోగదములు కొన్ని
మోక్షదంబులు గొన్ని పరీక్ష సేయ
భోగమోక్షములకు జన్మభూమియైన
దక్షవాటంబు కావు తీర్థములకెల్ల. 17

తే. భీమనాథేశ్వరునికన్నఁ బెద్దవేల్పు
దక్షవాటంబుకంటె నుత్తమపదంబు
సప్తగోదావరముకంటె సకలతీర్థ
సారమగు తీర్థరాజంబు జగతి లేదు. 18

క. అచ్చమగు భోగమోక్షము
లచ్చోటం దొరకుఁ గరతలామలకముగన్
విచ్చలవిడిఁ బ్రదికినను
జచ్చినఁ గడు లెస్స భీమశంకరునగరన్. 19

క. దక్షిణవారాణశికిని
మోక్షశ్రీభోగవిభవమూలంబునకున్
దాక్షారామమునకు స
దృక్షంబగునట్టి పుణ్యతీర్థము గలదే. 20

1. భవనా

సీ. కాలకూటవిషాగ్నికబళహేలాగ్రాస
కల్మషకంఠోప[1] కంఠుచేతఁ
గుంభినీధరసుతాకుచకుంభపరిరంభ
సంభావనాకేళిలోలుచేత
గగనకల్లోలినీకల్లోలమాలికా
స్ఫాలితబాలేందుమౌళిచేతఁ
గుటిలకుండలిరాజకుండలాలంకార
విలసితగండమండలునిచేత

తే. ద్రుహిణపంచమమస్తకద్రోహిచేత
భీమనాథునిచే జగత్స్వామిచేత
హరునిచేత సనాథమై యతిశయిల్లు
మోక్షభోగనిదానంబు దక్షవాటి. 21

వ. అని దక్షారామమాహాత్మ్యం బభివర్ణించుచు 22

మ. కినుకం బుట్టినయట్టి మౌనిహృదయక్లేశంబు శాంతంబుగా
ముని శిష్యప్రకరంబుతోడ గమనౌన్ముఖ్యంబున న్మచ్చటల్
తనియం జెప్పుచు వేల్పుటేటినికటస్థానంబునం దుండఁగా
వనజాతాప్తునిమండలంబు దిగియె న్వారాసిదిక్సీమకున్. 23

సూర్యాస్తమయ వర్ణనము

తే. అల్లనల్లన గగనమధ్యముననుండి
వ్రాలె నస్తాద్రి కరుణసారథిరథంబు
పశ్చిమాంభోధిమారుతాస్ఫాలనమునఁ
గేతనముమీఁది పసిఁడికింకిణులు మొరయ. 24

1. కల్మాషితాసిత

క. తారాపథాంచలము డిగి
వారిజహితమండలంబు వ్రాలె నపరది
క్పారావారంబునకై
పారావతపతగపాదపాటల మగుచున్. 25

తే. కూడి యొప్పారె నస్తాద్రికూటకోటి
భానుబింబంబు కన్నులపండువుగను
విశ్వనాథునిగుడిమీఁది విమలకాంతి
భాసురంబైన హేమకుంభంబువోలె. 26

క. చరమాచలశిఖరంబునఁ
దిరమై యొక్కింతతడవు దినకరుఁ డొప్పెన్
వరుణునిశుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించుటద్దం బగుచున్. 27

సీ. సిద్ధవాహినినీటఁ జిలుబంతిపసుపాడి
శ్రీవిశాలాక్షి గై సేయఁ దొడఁగె
మొరసె నంతర్గేహమున విశ్వనాయక
తాండవారంభమర్దలరవంబు
మందారతరుపుష్పమధుపానగోష్ఠికిఁ
బ్రారంభ మొనరించె భైరవుండు
కొక్కొరోకో యని కొమరుసామిరథంబు
కంఠంబు సాఁచి క్రేంకారమిచ్చె

తే. మొగుడఁ బాఱిన యరవిందములకుఁ బాసి
గములుగములుగ మత్తభృంగములు గూడి
ఢుంఠివిఘ్నేశు చెక్కు లుత్కంఠఁ జేరె
నభినవంబైన యపరసంధ్యాగమమున. 28

చ. ప్రమదమదాతిరేకమునఁ బాశివిలాసవతీకదంబకం
బుమిసినతమ్ములంపుఁగఱయో యన నింగిలికంబుచాయకుం
గమిసినదాసనంపుఁ బువుకాంతికి డాసినకూర్మిచుట్టమై
కొమరున సంజ[1] యంబరముకొంగున నూన్చెఁ గుసుంభరాగమున్.

తే. సంజకెంపును దిమిరపుంజంపునలుపుఁ
గమిచి బ్రహ్మాండభాండంబు గరిమ[2] మెఱసె
పరమపరిపాకదశ వృంతబంధ మెడలి
పతనమగు తాటిపండుతోఁ బ్రతిఘటించి. 30

తే. కామినీవిప్రయోగదుఃఖమునఁ గుందెఁ
జక్రవాకంబు సురనదీసైకతమునఁ
గాశికావిప్రయోగదుఃఖమునఁ గుందు
బాదరాయణమునిసార్వభౌముకరణి. 31

శా. ఆకాశాంచలవీథుల న్నిగిడె సంధ్యారాగరేఖావళుల్
పాకోన్ముద్రితపారిభద్రకళికాపాండిత్యమై తండికో
త్సేకస్ఫూర్తిఁ బ్రచండతాండవరయోద్రేకారభట్యుద్భట
శ్రీకంఠస్థిరదీర్ఘపాటలజటాశ్రేణిన్ విడంబించుచున్. 32

వ. అప్పుడు బాదరాయణుండు సంధ్యాసమయంబు నిరూపించి, యమర
సింధుప్రవాహంబునం గాలోచితక్రియాకలాపంబులు నిర్వర్తించి,
యొక్కనిర్మలసైకతప్రదేశంబునం గూర్చుండి, పార్వతీవల్లభుండు
తనకుఁ జేసిన యవమానంబునకు నుల్లంబునం దురపిల్లుచుండె;
నయ్యవసరంబున. 33

1. కొమజెరసంజ 2. స్ఫూర్జితచండ.

క. వెల్లిగొనె నఖిలదిక్కులఁ
నల్లనిచీకటి నవాంజనప్రతిభటమై
భల్లూకసటావల్లిమ
తల్లీవిభ్రమదమై యదభ్రస్ఫురణన్. 34

సీ. గిరినికుంజములఁ గుంజరపుంజ మనుశంకఁ
కంఠీరవంబు లుత్కంఠ నెగయఁ
జల్వలంబులఁ గిరిప్రకరంబు లనుశంక
నెఱుకురాజులు విండు లెక్కువెట్టఁ
గడలిమధ్యంబునఁ గాకోల మనుశంక
జలదేవతలు భీతి సంభ్రమింప
నదములఁ గువలయవనవాటి యనుశంక
నిందిందిరశ్రేణి యెదురుకొనఁగ

తే. రజతగిరియందుఁ దాండవారంభరభస
భంగిఁ బతితపరశ్వధపాణివికట
కంధరారుద్ధగజకృత్తికంథశంక
ప్రమథులకుఁ దోఁప నంధకారంబు ప్రబలె. 35

తే. ప్రబలమై యంధకారంబు బలిసియుండఁ
దారకంబులు కాంతి నెంతయును బెరసె
నీలిపుట్టంబు పఱచి పై నిలిపినట్టి
ఫలుఁదముక్తాఫలముల తావళములట్లు. 36

శా. శ్రీవారాణసివిశ్వనాయకగళత్క్ష్వేళానుకారక్రియా
హేవాకోద్ధతిఁ జీకువా ల్ప్రబలఁగా హేలావతీకోటిపైఁ

బూవుందూపులజోదు పుచ్చుకొనియెన్ భూపాలలీలావతీ
భ్రూవల్లీనిభశృంగకంబగు లసత్పుండ్రేక్షుకోదండమున్. 37

వ. అంత. 38

చంద్రోదయవర్ణనము

ఉ. ఆనతలీలఁ గోమలనవాంశుకపాళి మహాంధకారసం
ఘాతము మీఁటె నద్భుతముగా శశలాంఛనుఁ డభ్రవీథికిన్
శ్వేతవరాహమూర్తి యగువెన్నుఁడు ప్రన్ననియొంటికోర ధా
త్రీతల మెంత యంతయు ధరించినయట్టి విజృంభణంబునన్. 39

తే. అర్ధమండల ముదయింప నమృతభానుఁ
డుదయరాగంబుతోఁ గూడ నొప్పుమిగిలెఁ
బ్రకటతాంబూలరాగసంరక్తమైన
ప్రాగ్దిశాకాంతబింబాధరంబువోలె. 40

క. సంకలితోదయరక్తి శ
శాంకుఁడు శోభిల్లె గైరికావనిధరవ
ప్రాంకక్రీడాపాటల
శంకరభృతకాలకూటసంకాశుండై. 41

సీ. కాదుకా దుదయాద్రికనకకూటం బిది
డాగైన[1] పానవట్టంబుగాని
కాదుకా దిది సుధాకరపూర్ణబింబంబు
కాశ్మీరశంభులింగంబుగాని

1. పెంబైన

కాదుకా దుదయరాగప్రకాశం బిది
నవకుంకుమాలేపనంబుగాని
కాదుకా దిది కళంకచ్ఛటాంరింఛోళి
పూజచేసిన కల్వపువ్వుగాని
తే. యనంగ సప్తార్ణవములు మిన్నందికొనంగం
జంద్రకాంతోపలంబులు[1] జాలువాఱ
ససమశరసార్వభౌముముత్యాలగొడుగు
విధుండు విశ్వంబు వెన్నెలవెల్లిం దేల్చె. 42

తే. ఉదయరాగము నించించు కుజ్జగించి
నిండుచంద్రుండు కన్నులపండువయ్యె
ధావనాన స్తర[2]స్నిగ్ధదాక్షిణాత్య
రాజశుద్ధాంతదంతవజ్రములకాంతి. 43

సీ. అభిషేకమొనరించు నమృతధారావృష్టి
మదనాంతకుని ముక్తిమండపికకు
నలవోకగా విశాలాక్షీమహాదేవి
నిద్దంపుంజెక్కుల నీడం జూచు
నెరియించు మిన్నేటియిసుకతిన్నెలమీందం
జక్రవాకాంగనాసముదయంబు
డుంఠివిఘ్నేశునిష్ఠురకంఠవేదిపైం
గొదమచుక్కలరాజుం గుస్తరించుం
తే. గాయువెన్నెల యానందకాననమునం
గాలభైరవుదంష్ట్రకు డాలుకొలుపు

1. చంద్రకాంతాతపంబులు 2. దానరాగాస్తర

విధుఁడు వారాణసీసౌమవీథిచక్కి
నభ్రఘంటాపథంబున నరుగునపుడు. 44

సీ. రోహిణీగాంఢోపగూహనంబునఁ గన్న
కస్తూరికాస్థాసకం బనంగ
రాహుదంష్ట్రాఘాతరంధ్రమార్గంబున
లలిఁ దోఁచు నాకాశలవ మనంగ
నైర్మల్యమునఁజేసి నడుమఁ దాఁ గనవచ్చు
కమిచిత్రమింగిన యంధకార మనఁగ
జన్మవేళను మంథశైలాభిఘట్టన
సంభవించిన కిణస్థాన మనఁగ

తే. విరహపరితాపవేదన వేఁగుచున్న
చక్రవాకాంగనల కటాక్షములయగ్గి
నావహిల్లిన కఱదూప మనఁగ నొప్పు
నుడుగణాధీశబింబంబునడిమిమచ్చ. 45

సీ. కాలభైరవుఁడు ఢక్కాడిండిమము మ్రోయ
బహుభూతములుఁ దాను బ్రహరితిరుగఁ
జంద్రికామధు వాని చాకోరము లిక్కి
దేవతాసౌధవీథికల సొగయ
నానందకాననాభ్యంతరంబులయందు
సిందువారమునఁబూ శిథిలపడఁగఁ
గడునివాతములైన కలుమఠంబులయందు
యతులు ప్రాణాయామ మభ్యసింప

తే. దొడ్డవయసున శీతాంశుఁ డొడ్డగిల్లెఁ
దఱపిచంద్రాతపము నేల చఱచి కాయ
వంత మరపిల్లి వెన్నెల వగచి వగచి
గంధవతిపట్టి యొకభంగిఁ గన్నుమోడ్చె. 46

వ. అంత. 47

చ. వెలవెలఁబాఱెఁ జంద్రుఁడును; విన్ననఁ దారకచక్రవాళముల్
పలపలనయ్యె; దీర్ఘికలఁ బద్మవనంబుల షట్పదాంగనా
కలకలము ల్చెలంగె; వెడ కన్నుమొగిడ్చె లలిం గుముద్వతుల్
తెలతెలవాఱె జంభరిపుదిక్కునఁ దోఁచె[1]ననూనరాగముల్. 48

సీ. ప్రథమసంధ్యాంగనాఫాలభాగంబునఁ
జెలువారు సిందూరతిలక మనఁగఁ
గై సేసి పురుహూతుగారాపుటిల్లాలు
పట్టిన రత్నదర్పణ మనంగ
మలయాచలేంద్రంబుతుదిఁ బల్లవించిన
మంజుకంకేళినికుంజ మనఁగ
శతమన్యుశుద్ధాంతసౌధకూటముమీఁదఁ
గనుపట్టు కాంచనకలశ మనఁగఁ

తే. గాల మనియెడుసిద్ధుఁడు గమిచి మ్రింగి
కుతుక మొప్పఁగ నుమిసిన ఘుటిక యనఁగ
గగనమందిరదీపికాకళిక యనఁగ
భానుఁ డుదయించె దేదీప్యమానుఁ డగుచు. 49

---

1. అనూను.

వ్యాసమహర్షి యాత్రకు వెడలుట

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు బాదనారాయణుండు గాలోచిత కృత్యంబులు నిర్వర్తించి గమనోన్ముఖుండై కాశీవియోగజనిత వేదనాభరంబు దుస్సహంబై యంతరంగంబుఁ గుందింప నెట్టకేలకు నేటి కెదురీఁదువిధంబున శిష్యులుం దానును గనద్ఘనకనకమణిమయ సౌధాట్టవిలాసంబైన యప్పట్టణంబునకుఁ బ్రదక్షిణక్రమంబునఁ జనువాఁడై, లోలార్క కేశవులకు నభివాదనంబును, భాగీరథికి నంజలిబంధంబును, విశ్వనాథునకు వినుతియు, విశాలాక్షికిఁ బ్రార్థనంబును, మోక్షమంటపంబునకు జయకారంబును, నంతర్గేహంబున కామంత్రణంబును, గాలభైరవునకు జోహారును, డుంఠివినాయకునకు శరణార్థియు, దండపాణికి దండప్రణామంబును, గుక్కుటచతుష్టయంబునకు మ్రొక్కును, సకలదేవతాకోటికి నేటికోళ్లును జేసి చనునప్పుడు కతిపయదినప్రయాణంబున. 50

సీ. గంగానదీప్రవాహకణము మాధవదేవు
దోరంతరంబు శ్రీతులసిచిగురుఁ
బురుషోత్తమమునందుఁ బుండరీకాక్షుని
దివ్యపాదాంభోజతీర్థజలము
శ్రీకూర్మమునయందు శేషాహిపర్యంకు
కంఠంబుక్రొత్తచెంగల్వదండ
సింహాద్రియందు లక్ష్మీనృకంఠీరవ
సార్వభౌము ప్రసాదచందనంబు

తే. కాశికావిప్రయోగోరుగాఢతాప
శాంతి కొదవెను శిశిరోపచార మగుచుఁ

54(A)



పిఠాపురం శ్రీ కుంతీ మాధవస్వామివారు

( మూలవిరాట్టు )

జాయ తెరువున శ్రీబాదరాయణునకు
హరిహరధ్యానపూజాపరాయణునకు. 51

సీ. ఏపట్టణము ప్రోల నేలేరు ప్రవహించుఁ
బృథివికి ముత్యాలపేరువోలె
మున్నూటయఱువదిమూర్తి భేదములతో
విహరించు నేపీట వేల్పుపిండు
పీఠాంబచెలి యోగపీఠి హుంకృతిదుర్గ
ననిచి కాపుండు నేనగరికెలనఁ
గుంతీమహాదేవికూర్మి మేనల్లుఁడు
మాధవుం డేపీట మరగినాఁడు

తే. పెద్దగవఁకుల నేపుటభేదనమున
నెలమి నిలుచుండు వ్రీడావిహీనజఘనుఁ
డట్టిపీఠాపురముఁ జేర నరుగుదెంచెఁ
బరమశైవుండు శ్రీపరాశరసుతుండు 5:

తే. నారికేళంపుమట్టనెన్నడిమిచాయ
దళములందును బోలె సంతతముఁబాఱు
వేణికాసారణులయందు విస్మయముగ
జగతి నెక్కడి వేలేటిసాటి నదులు. 5:

సీ. ఏతోట విడిసీట నిదుగారునుం బండఁ
బ్రాసంగువరిచేలు పసిఁడిచాయఁ
బరిపాకమున వేరుపనసపండులతావి
యిందిందిరములకు విందుసేయు

వేఁబోకఁ బొలుపారువింధ్యాద్రిపవనంబు
పోకపువ్వులతావిఁ బుక్కిలింప
వేశ్యవాటికలందు విహరించువలరాజు
ననయంబుఁ జెఱుకువిల్లును ధరింప
తే. నారదంబులవలపు పొన్నలఁ బెనంగి
విచికిలామోదములతోడ వియ్యమందఁ
బాటలీపుష్ప కేతకీపరిమళములు
పొదల విలసిల్లుఁ బీఠికాపురమునందు. 54

వ. వెండియు నవఖండమండితంబగు మహీమండలంబునకు మకరకుండలాలంకారంబునుంబోలె భీమేశ్వరమండలంబు పొరువునఁ ద్రిలింగోత్కళతలంబులసంధి వింధ్యాచలపాదంబునఁ గేదారకుంభఘోణార్కస్థానంబుల కుపమానం బనఁజాలి యేలేటిమేటికాలువలవలన నదీమాతృకంబులగు పంటవలంతిసలిలధౌతకలధౌత శకలసంకోచంకరణంబులై యంకురించినవియును, గోదమపసరుతెక్కలపక్కిడాలు పుక్కిలించి యుమియంజాలుచాయ లేర్పడం బసరెక్కనవియును,[1] దక్షారామరామాజనంబుల చిఱుపిక్కలచక్కందనంబు నెకసక్కెంబాడు బిగువుపొట్టలం గనుపట్టునవియును, బధికనాసాపుటకుటీరంబులకుఁ గుటుంబకములగు కమ్మఁదనంబు లీని పాలుకుడిచి సురేంద్రప్రాయంబున నామువలచునవియును, బదియూఁజువన్నెకుందనపుఁదగటిం దెగడుచుఁ బండి యుద్దండకేదారవలయకుముదషండంబులాఘ్రాణింపనుంబోలెఁ గై వ్రాలునవియు నై కలమ శాలి శారదాముఖాదివ్రీహిసస్యంబులవలనను, నిరంతరనారికేళచ్ఛదచ్ఛాయాచ్ఛన్నహరిదంతరంబులగు భుజంగవల్లీమతల్లికాలింగితక్రముకకంఠోపకం

1. పసరుపాఱునవియు.

తంబులఁ గ్రీడించుక్రోడదశనదష్టస్వాదిష్టపనసఫలసారణీపరంపరాసం
పూర్ణచంపకద్రుమాలవాలవలయంబులు వనదేవతావిలాసతాండవృం
తాయమానరంభాపలాశసంభారంబులుఁ, దిలకతిలకితంబులుఁ, విదేశ
విచికిలంబులుఁ, గోరకితకురువకంబులుఁ, నిబిడరసకేసరంబులు,నఖిల
భువనాభిరామంబులు నైన యారామంబులవలననుగన్నులపండువై,
కుంతీమాధవదేవునకు విశ్రాంతిప్రదేశంబును, హుంకారిణీమహాదేవికి
విహారసంకేతభవనంబును, పీఠాంబికాలక్ష్మికి కాటకూటంబును,
హేలాసానికిహాలాపానగోష్ఠీమంటపంబును, ననం దగి భూతబేతాళ
డాకినీప్రేతరంకభైరవవ్రాతనిర్మితప్రాకారనప్రహట్టకుట్టిమం బగుపీఠా
పట్టణంబుఁ బ్రవేశించి రంత. 55

సీ. త్రపుసపుష్పలతామతల్లీ పటోలికా
కారవేల్ల కుష్మాంగికములతోడఁ
గూశ్మాండ వృంతాక కోలక చించికా
కాయమానకదంబకములతోడ
శాకినీ మూలక చ్ఛత్రాక సారణీ
ధాన్యాక మేఘనాదములతోడ
పిప్ప ల్యుపోదకీ పీతపలాండుక
వాస్తుశాఖాకోటివాటితోడ
రాజనలతోడ శృంగబేరములతోడఁ
జిఱుగడపుఁ బెండలముతోడఁ జేమతోడ
నొప్పునాలుగుపొలములం దుపవనములు
భువనసారము పీఠికాపురవరంబు. 56

ఉ. హాటకపానపాత్రయును నారఁగిఁ బండినమాతులుంగమున్
ఖేటము లోహదండము నొగిం ధరియించి పురోపకంఠశృం

గాటకభూమిభాగమునఁ గాపురముండెను పీఠికాంబకున్
గైటభదైత్యవైరిప్రియకాంతకు మ్రొక్కి నతింతు భక్తితోన్. 57

శా. అంతర్వాణి భజించెఁ గుక్కుటపతిన్ హాలాహలగ్రీవునిన్
శాంతస్వాంతుఁడు గొల్చె దానవచమూసంహారిణిన్ హుంకృతిన్:
జింతించెన్ మునిసార్వభౌముఁడు పురక్షేత్రాధిదైవంబులన్
గుంతీమాధవుఁ బూజచేసె ఋషి వాక్పుష్పోపహారంబులన్. 58

తే. హేల నేలాతరంగిణీకూలనిలయ
బాల బాలారుణాశోకపల్లవోష్ఠి
వేల వేలావనోద్దేశవిహృతిలోల
నేల నేలా యనుచుఁ[1] బాడె ఋషివరుండు. 59

వ. అనంతరంబ యొక్కింతమార్గాంతరం బతిక్రమించి. 60

కుమారారామ వర్ణనము

శా. ఆలోకించె మహామునీంద్రుఁడు కుమారారామమున్ వింధ్యకు
త్కీలోపాంతధరాలలామము బహుక్రీడావనశ్యామమున్
బ్రాలేయాచలకన్యకాధవజటాభారాసనార్ధేందురే[2]
ఖాలానాయితహేమకూటకలధౌతాట్టాలకగ్రామమున్. 61

సీ. కొమరేటి కల్యాణకమలషండంబుల
[3]సౌరభభారంబు సవదరించి
నారికేళాటవీనవపుష్పకహాళికా
వితతికన్నెరికంబు వీపుకొలిపి

1. యనిరి 2. జటాభారావనార్ధేందు. 3. సౌరభ్యభారంబు సంతరించి.

యప్సరఃకాంతావిహారహాటకహర్మ్యశ్రీ
శశికాంతమణిగవాక్షముల దూరి
భీమనాయకదేవుపేరురంబునఁ గ్రాలు
భుజగహారములకుఁ బుష్టిపెట్టి,

తే. రాజనారాయణస్వామిరమ్యభవన
తార్క్ష్యకేతనపతికి న ర్తనము గఱపి
పోలసె నధ్వపరిశ్రాంతిపోడఁ గడఁగ
మౌనివరుపైఁ గుమారవనానిలములు. 62

తే. బాదరాయణుఁ డత్యంతభక్తినియతి
దివ్యవాహినిఁ గొమ రేటఁ దీర్థమాడి
శిష్యవర్గంబు దాను దర్శించి మ్రొక్కె
శాశ్వతునకుఁ[1] జళుక్యభీమేశ్వరునకు. 63

వ. వెండియుఁ గొంతదవ్వు చని. 64

సర్పపురవర్ణనము

శా. కాంచె న్సర్పపురాధివాసముఁ[1] ద్రిలింగక్షోణికైవ కుంఠమున్
ముంచెన్ నారదకుండికాజలముల నోత్సాదంబుతో దేహమున్,
ఉంచెన్ గాశివియోగదుఃఖము మహాక్షేత్రంబు వీక్షించి ద
ర్శించె న్నన్మని లోచనోత్సవముగా శ్రీభావనారాయణున్. 65

సీ. శ్రీసుదర్శనశంఖచిహ్నాంకితము గాక
యెపుడు మిన్నకయున్న యిల్లు లేదు
బహుళోర్ధ్వపుండ్రసంపద లేక వృథయైన
ఫాలరేఖలతోడి ప్రజయు లేదు

1. సర్పపురాభిధానము.

వైష్ణవోత్తము భాగవతసాత్త్వికులగోష్ఠి
వెలిమైన వాటికావేది లేదు
నలినేక్షణుఁడు భావనారాయణస్వామిఁ
దప్పించి పరదైవతంబు లేదు

తే. పరమగీర్వాణయాగవైభవమునెలవు
నిఖిలకల్యాణగుణకేళినిలయ మనఁగ
దివ్యములు నూటయెనిమిదితిరుపతులకుఁ
బరమపదమైన శ్రీసర్వవరము[1]నందు. 66

మ. శనివారోత్సవ మాచరించె మునిశిష్యవ్రాతముం దానుఁ గ
మ్మనిపణ్యారముతోడఁ బూరగముతో[2] మండెంగతండంబుతో
ననుకుంబానెము[3]తోడఁ బాండుకలమాహారంబుతో నేతితో
ఘుసరంభాఫలఖండశర్కరలతోఁ గారుణ్యపాథోధికిన్. 67

తే. ద్వాదశాక్షరదివ్యమంత్రమునఁ బూన్చెఁ
జెంగలువ పువ్వుదండ లక్ష్మీధవునకు
శ్రీమదష్టాక్షరమున నర్చించెఁ దపసి
భావనారాయణస్వామిఁ బసిఁడివిరుల. 68

వ. అనంతరంబ కతిపయప్రయాణంబులఁ దుల్యభాగాతీరంబున. 69

శా. చేతోమోద మెలర్పఁ గట్టెదుటఁ గాంచె న్భారతామ్నాయవి
ద్యాతంత్రగ్రథనాబ్జసంభవుఁడు వేదవ్యాసుఁ డభ్యర్హిత
జ్యోతిర్లింగమయస్వరూపుల జటాజూటాసనా[4]ర్ధేందులన్
వాతాపీల్వలవైరిగౌతమనదీవాస్సంగమేశానులన్. 70

1. సర్వపురము. 2. బూరెగమితో 3. అనుగుంబానెము. 4. జూటాసనా

తే. వేదశాఖావిభాగసంవేది యతఁడు
లలితబిల్వత్రిశాఖాపలాశసమితి
సంగమేశఘటోద్భవశంకరులకు
నర్చనము సేయుఁ బ్రణవపంచాక్షరముల. 71

వ. మఱియుఁ దుల్యభాగాతీరంబున సాంపరాయణగ్రామంబుచేరువ బిల్వాటవి నాటఁ గపటభిల్లుండై న చలిగొండజేనియల్లుని ముక్తీశ్వరు దర్శించి. 72

ఉ. వేదవిభాగముం బరిఢవించినపుణ్యుఁడు వేడ్కఁ బూన్చె బి
ల్వాదళపూజనంబు గను లెన్నఁగఁ గూరిమిశిష్యపంక్తితో
నాదిమభిల్లు నిత్యకరుణామృతపూరముఁ జల్లు పుండరీ
కోదరభల్లు నృత్తకరియూథపుమల్లుని గొండయల్లునిన్. 73

తే. పదియునార్వన్నె బంగారుఁ బరిహసించు
ననవవారగ్వధప్రసూనములు గోసి
సాంపరాయమహాగ్రామసవిధనిలయు
నభవుఁ బూజించెఁ బుండరీకాక్షమూర్తి. 74

క. పంచబ్రహ్మంబుననున్
బంచాక్షరమంత్రమునను బంచాననుని౦
బంచమవేదం బభిని
ర్మించిన ముని పూన్చెఁ బుండరీకకళికలన్. 75

వ. ఇవ్విధంబునఁ గాలకంఠునకుఁ బ్రభాతకాలపూజ నిర్వర్తించి సాత్త్వ వతేయుండు గమనోన్ముఖుండై యున్న సమయంబున. 76

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిట్టింకు లింకించె
గంభీరహుంకారగర్జనమునఁ
బ్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబు
నెవ్వాఁడు శివునిచే నెఱిఁగికొనియె
గడసిల్లుధర యొడ్డగెడవైన నెవ్వాఁడు
ద్రాసుపైఁ గల్లచందమున వంచె
సంభోధు లేడింటి నాపోశనంబెత్తి
కలిగించె నెవ్వాఁడు క్రమ్మఱంగ

తే. భీమనాథేశ్వరుఁడు గౌరిఁ బెండ్లియాడి
దక్షిణాముఖకల్యాణదర్శనమున
వత్సరము వత్సరంబు నెవ్వానిఁ జూచు
నతఁడు గగనాగ్రమాణిక్య మరుగుదెంచె. 77

తే. మలయదర్దురగిరిమహామందిరుండు
తామ్రపర్ణీజలస్నానధౌతమలుఁడు
కలుషితాంభఃప్రసాదైకకతకఫలము
కోమలియుఁ దాను నేతెంచెఁ గుంభజుండు. 78

శా. ద్వీపాంతోద్భవుఁడైన సంయమికులాధీశుండు కాలోచిత
వ్యాపారంబులు దీర్చి తేపకడ దాక్షారామయాత్రోద్యమం
బాపాదించుచు నోంక్రియానగరపర్యంతార్ధమార్గంబునన్
లోపాముద్రయుఁ దాను వచ్చు ముని నాలోకించె దాదవ్వులన్. 79

తే. ద్వాదశక్షేత్రయాత్రావిధాననియతి
భీమమండలిఁ జరియింపఁ బృథులభక్తిఁ
గుక్కుటేశ్వరు దర్శింపఁ గోర్కె పుట్టె
యట్టిపీఠాపురంబున కరుగువాని. 80

ఉ. తేఁపలు భీమలింగముఁ గుఱించి జపం బొనరించి నిచ్చలున్
మాపటివేళఁ దీర్థముల మజ్జనమాడుచు నుండువానిఁ బీ
ఠాపురిఁ గుక్కుటేశ్వరుని డాయఁగఁ బోయెడువానిఁ దుల్యభా
గాపగ చెంత శంకరగృహాంగణబిల్వవనాంతరంబునన్. 81

వ. అప్పరమమాహేశ్వరుం గనుంగొని సాత్యవతేయుండు ప్రత్యు
త్థానంబు సేసి యెదుర్కొనియె; నతండును. 82

సీ. భస్మత్రిపుండ్రాంకఫాలప్రదేశుని
రుద్రాక్షమాలికారూఢవక్షు
నుపవీతకృష్ణాజినో[1]త్తరాంగమువానిఁ
బల్లవారుణజటాపటలధారుఁ
దామ్ర[2]హస్తాంగుళీదర్భమూలపవిత్రుఁ
దరుణకింశుకలతాదండధారుఁ
బ్రావృషేణ్యవినీలపాథోధరశ్యాము
సాలవృక్షప్రాంశు చారుదేహుఁ

తే. బరమభాగవతోత్తముఁ బ్రథమగణ్యు
విమలమాహేశ్వరాచారవిధి[3]కథకు
నఖిలనీహారముష్టింపంచాగ్రవరుని
బులిసంభవుఁ బొడగాంచెఁ గలశజుండు. 83

ఉ. యోజనగంధినందనుఁడు నూర్వశిపట్టియు నిర్జరోధని
ర్వ్యాజనిరంకుశప్రణయులై భవసంపదసొంపు మానసాం
భోజములం దలిర్ప మునిపుంగవు లొండొరులఁ గౌఁగిలించి వి
భ్రాజితలీలఁ జల్పిరి పరస్పరముం గుశలప్రసంగముల్. 84

1. నోత్తరాంగునిఁ బల్లవారుణాంచితజటా 2. తామ్రపత్రా 3. నిధిపఠక.

క. వినయము భక్తియుసంభ్రమ
మును సౌహార్దంబు హృదయముల మొలతేరన్
వినుతి యొనర్చి రగస్త్యున
కును వైశంపాయనాదికులు మునిశిష్యుల్. 85

వ. అనంతరం బాతుల్యభాగాతీరబిల్వతరువనాంతరంబున శశికాంతశిలాతలప్రదేశంబున నాసీనులై యిల్వలాసురదమనుండును బరాశరనందనుండును గొంతతడ విష్టకథావినోదంబులఁ బ్రొద్దువుచ్చి రప్పు డగస్త్యుండు సాత్యవతేయున కిట్లులనియె. 86

వ్యాసుని గాశిఁ బాసి వచ్చుటకుఁ గారణ మడుగుట

తే. ఆననమునందు వైవర్ణ్య మగ్గలించెఁ
గన్నుఁగవయందు దైన్యంబు గానఁబడియె
[1]నార్తి యేదేని యొకటి నీయంతరంగ
మూనియున్నది ; యిది [2]యెట్టులొక్కొ యనఘ! 87

సీ. లోలార్కునకు నీకు లోలోన నేమేనిఁ
బోటు పుట్టదు గదా? మాటమాట
వెసకయ్య శ్రీఢుంఠివిఘ్నేశ్వరస్వామి
ధిక్కరింపఁడుగదా? తెగువ నిన్ను
నాఁకొన్న నిన్ను మధ్యాహ్నకాలంబున
నరయకుండదు గదా? యన్నపూర్ణ
నెపమేమియును లేక నీయెడాటమ్మునఁ
బాటి దప్పదుగదా? భైరవుండు

1. నా డెనేదేని యొకటి. 2. యెట్టిమూలమునఘ

తే. ఎట్టు పాసితి మిన్నేటియిసుకతిప్ప ?
యెట్టు పాసితి వాస్తలంబేమగ్రోసు ?
లెట్టు పాసితి వవిముక్తహట్టభూమి ?
యెట్టు పాసితి విశ్వేశు నిందుధరుని ? 88

క. కాళీసందసకంఠే[1]
కాలురశిరములకు విరులు గల్పించునొకో ?
లీలావనాంతరమునను
మాలోపాముద్ర యిడిన మల్లీవల్లుల్. 89

శా. ఆమందాకిని యాత్రివేణివలసం బాబాహ్యాకక్ష్యాంతరం
బామధ్యాంతకక్ష్య లావిమలదివ్యజ్యోతిరుజ్జృంభణ
శ్రీమద్విశ్వపతీశలింగము మదిం జింతింపం గాశీమహా
గ్రామం బెప్పుడు నాకనంగొనకు[2] సాక్షాత్కారముం గైకొనున్. 90

శా. ఆనందంబున సర్ధరాత్రములం జంద్రాలోకము లాక్రయంగా
నానాసైకతవేదికాస్థలములన్ నల్గిక్కులం స్తంభుం గా
శీనాథున్ దరుణేందుశేఖరు శివున్ శ్రీకంఠునిన్ బాడుదు
న్మేనెల్లన్ బులకాంకురప్రకరముల్ నిండార మిన్నేటిలోన్. 91

క. గంగాయమునాతీరో
త్సంగమునం బ్రయాగను సదాశివు విశ్వే
శుంగూర్చి తపముచేసితి
నంగుష్ఠము ధరణి మోపి యతిఘోరముగన్. 92

తే. విస్మయము నాకు మదిలోన విస్తరిల్లెం
బరమధర్మజ్ఞ! కాశికాపట్టణమున

1. కాళీనందనుకంఠని కాలుని శిరమునకు. 2. గవసు.

నుండు మాహాత్మ్యము హైనను నొందుమగడకుఁ
బోవఁ దలఁచెదు నీ కెట్టి బుద్ధిపుట్టె? 93

వ. అనిన బారాశర్యుండు వాతాపిదమనున కిట్లనియె. 94

వ్యాసుఁడు తాను గాశిఁ బాసిన కారణంబుఁ జెప్పుట

చ. సమధికసత్కవీశ్వరులు జైమిని పైల సుమంతు లాదిగా
శమదమసద్గుణాన్వితులు సాధులు శిష్యులు తోడఁ గూడిరాఁ
గ్రమమునఁ దీర్థయాత్రకు ధరాతలమం దఖిలంబు ద్రొక్కి భా
వము భవభక్తియుక్తముగ వచ్చితిఁ, గాశికిఁ బుణ్యరాశికిన్. 95

క. ఏమిశకునమునఁ జొచ్చితి
నో? మన్మథదమనుపీ డహోరాత్రంబుల్
మే మేమునాళ్ళదనుకను
స్వామీ! యుపవాసముండి జడిసితిమి మదిన్ 96

క. గేహముల కేఁగి 'భిక్షాం
దేహి' యన నీట నొకపతివ్రతయైనన్
సౌహార్దంబునఁ దెద్దెం
డాహారము పెట్టదయ్యె నాదినములలోన్. 97

శా. శ్రీవిశ్వేశ్వర దేవదేవునికృపాశ్రీచే దివోదాసుబా
హావిశ్రాంతబలంబుచేత ధవళన్యాయప్రజావృద్ధి నో
పైవిశ్రామము గల్గి సుస్థిరతరంబై యుండి భాసిల్లఁగా
నీవారాణసిలోన భిక్షకొ అవయ్యెం జూడుమీ కుంభజా! 98

శా. వైశంపాయనుఁ డెంతయు న్నుడివడె న్వాడె న్సుమంతుం డతి
క్లేశంబందిరి పైలజైమినులు దుఃఖించె న్మది న్దేవలుం

డా శాంతంబులు చూచె దాల్భ్యుఁ డుదరోదగ్రక్షుధాక్షోభచేఁ
గాశీపట్టణవిప్రవాటికల భిక్షాలబ్ధి లేకుండుటన్. 99

తే. అక్కటా! యేమి చెప్ప వింధ్యాద్రిదమన!
కాశిలో నేడునాళ్లు నిష్కారణంబ
శిష్యులును నేను నిత్యుపాసంబు వడితి
మమరగంగానదీసైకతములయందు. 100

వ. అష్టమదివసంబునం దరుణోదయకాలంబున గంగాపులినోత్సంగంబులం గుశశయనంబులు మేలుకాంచి, యభ్యుదితంబైన మార్తాండమండలం బాఖండలదిశావేదండకంఠగ్రైవేయ కనకఘంటికాకారంబునుంబోలె నుదయగిరితటసవిధంబునం గుంకుమరజస్త్రసరేణువిసరంబునుంబోసి నిగనిగమను నునుజిగి గీలుకొని కోమలంపుఁబ్రోవులుఁగుజిగికొనలు గగనతలం బలమికొనుకొలంది మణికర్ణికాంభఃప్రవాహంబున నఘమర్షణస్నానం బాచరించి యత్తీరవాసిజనవిరచితవాలుకాలింగంబులకుం బీఠార్చనాశంభులింగంబులకును మంత్రాక్షరపుష్పపూర్వకంబుగా నభివాదనంబు సేసి, పంచబ్రహ్మ పంచాక్షరీమంత్రప్రధానంబులు జపియించి, సిద్ధమునిపరంపరాసంకులంబైన ఘంటాపథంబున బహిర్గేహ దేహళీవిభాగంబును, నంతర్గేహసౌధవీథికాట్టకట్టిమప్రఘాణంబులును గడిచి, లోలార్క కాలభైరవ డుంఠివినాయక విశాలాక్షీప్రముఖపరివార దేవతాకోటికి నేటికోళ్లు సమర్పించి, విశ్వేశ్వరు, విరూపాక్షు, నక్షీణమోక్షలక్ష్మీసామ్రాజ్యసింహాసనారూఢునిం, దారకోపదేశదేశికు, దాక్షిణ్యపుణ్యాకరుణాకటాక్షవీక్షాపేక్షుని బ్రదక్షిణక్రమదండప్రణామపురస్సరంబుగా సేవించి, ముక్తిమండపంబునం గొంతతడవుండి, మధ్యాహ్నకాలంబగుట నిరూపించి, భిక్షా

పాత్రంబులు కేలంబూని, యతికఠోరజఠరక్షుధాగ్ని తాపంబునకుం దోడగు తపనమయప్రచండకిరణకాండప్రకాండంబులు నెత్తి మండింప, లేదు; సమవుండు; పొండు; కూడ దనునిషేధవాక్యంబులు చెవులు నిండికొన విప్రవాటంబులం బ్రతిగేహంబును బరిభ్రమించి, విసికి [1]బవిసిమాలి వేసరి యలసి యారటంబొంది సొలసి [2]జూంకించి తూలి దూంపటిలి యుల్లంబునం గ్రోధం బుద్భవించిన. 101

శా. కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధితదుష్ప్రోక్తాంధకారంబునం
జక్షు ర్రెండును జిమ్మచీకటులుగా సంరంభశుంభద్గతిన్
బ్రేక్షచ్ఛాత్రులు భీతినొందఁ గడు నుద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రము జాతిమీఁద శతధా భిన్నంబుగా వైచితిన్. 102

క. అటు పౌరవీథిచక్రటిఁ
బటుకునఁ బడవైచి క్రోధపరిపాటి మెయిం
గటము లదరంగ భ్రూకుటి
నిటలమునను జెమటనీరు నిండి ఘటిల్లన్. 103

క. ఏమియని చెప్పుదును లో
పాముద్రాప్రాణనాథ! ప్రజ్ఞావిభవం
బేమోయయి చెడిపోవఁగ
నామది నెన్నండు లేని నైచ్యము పొడమెన్. 104

సీ. ఏలా విచారింప నిందు రేఖామౌళి?
విమలమోక్షవిధాత విశ్వనాథు
నేలా వితర్కింప హిమశైలశైఖరో
ష్ణీషకాశేయంబు సిద్ధతటిని?

1, విసిమాల. 2. జోళించి. 3. వివిధమౌక్తికధాతు.

నేలా పరీక్షింప నిభరాజవదనుని
మంటివిఘ్నేశు మందూకజఠరు ?
నేలా విలోకింప శ్రీఢాకళాశూన్య
కటిఁ గాలభైరవు వటుకనాథు ?

తే. నిఖిలకైవల్యకల్యాణనిలయమైన
కాశిపైఁ గూడు లేకుండు కారణమున
నలిగి శపియింపఁగాఁ బూని యందుకొంటి
ధృతకమండలుభాగీరథీజలంబు. 105

ఉ. కోపము సంహరింపు మునికుంజర ! యంచు లలాటదేశసం
స్థాపితపాణిపద్మయుగసంఘటితాంజలిబంధులై మహా
తాపసశిష్యబంధువులు[1] ధర్మపథంబును దెల్పి చెప్పఁగా
శాపజలంబు పూనితిఁ బ్రశాంతివిహీనత నేమి చెప్పుదున్? 106

వ. ఇవ్విధంబున సప్తవాసరోపవాసాయాససంభూతప్రభూతరోషావేశం
బున నంగుళీపవిత్రసనాథంబైన హస్తంబున మణికర్ణికాజలంబులు
ధరియించి యిట్లని శపింప నుద్యోగించితి. 107

వ్యాసుఁడు కాశిని శపింపఁ బూనుట

శ్లో. మాభూత్ త్రైపూరుషీ విద్యా మాభూత్ త్రైపూరుషం ధనం
మాభూత్ త్రైపూరుషీ భక్తిః కాశ్యాం నివసతాం సదా. 108

తే. అని శపింపఁగఁ బూనుటయ్యవసరమున
నేమి చెప్పుదు నోసంయమీంద్రవంద్య !
యుదిలఁగొని కంపమందుచు నుండెఁ గాని
శాపజల మందుకోఁ గేలు సాఁగదయ్యె. 109

1. బృందములు.

వ. ఆసమయంబునఁ గాశికానగరసోమవీథికాభవనవాటికామధ్యంబున నొక్కయింటిముచ్చుకంటి పంచాశద్వర్షదేశీయ, పలితనారంబైన వేణికాభారంబు గైవడ, ముదుసలిచక్రవాకంబులతో నెకసక్కెం బాడు వీఁగుచన్నులక్రేఁగుఁదనంబునఁ దనూవల్లి జలదరింపఁ, గంకణఝుణఝుణత్కారంబు తోరంబుగా గ్రక్కునగోపురద్వారంబుబోరుతలుపు వాయం దట్టి, యందియలరవళితోడం గూడి మట్టియల మ్రోఁత త్రిభువనంబులు నురుజగొనం [1]దేఁకుగడప మోలం జరణ [2]పల్లవంబుఁ జాచి, యనంగధ్వజపటకతోరపాకసచ్ఛాయాదాయాదంబులైన వెండఁడకన్నులు సెలచుట్టును బలిసి పొలయఁ, గలమధుర వీణాక్వాణపాణింధమంబైన యెలుం గెత్తి, యో! బ్రాహ్మణోత్తమా! శాప ముపసంహరించి యిటు రమ్మని నన్నుం జేరంబిలిచిన. 110

ఉ. సంతసమంది యే నపుడు శాపజలంబులు పాఱఁజల్లి వే
దాంతవచోమహోపనిషదర్థమయిన్ శుభరూప వృద్ధసీ
మంతినిఁ గాశికానగరమధ్యనివాసిని విశ్వనాథుశు
ద్ధాంతము డాయఁబోయితిఁ బ్రియంబును భక్తియునుం దలిర్పఁగన్.

ఆ. డాయఁబోయి యప్పు డాయమ్మ యెవ్వరో
యేకులంబునదియొ యెఱుఁగకయును
నే జొహారు నిడితి హృదయంబ నేరుచు
[3]నెదిరిప్రాభవంబు నేర్పరింప. 112

వ. అంత నన్నుం జేరంబిలిచి యక్కాంత యిట్లనియె. 113

తే. భిక్ష లేదని యింత కోపింతురయ్య!
కాశికాపట్టణముమీఁదఁ గానిసేయ!

---

1. దేరుగడుప. 2. పల్లవంబుజంగఁ జాచి. 3, నెదురు.

నీమనశ్శుద్ధి దెలియంగ నిలకడంబు
డింత చేసెనుగాక కా నేమి భ్రాంతి ? 114

తే. శ్రీవిశాలాక్షి బంగారుత్రెడ్డునందు
సమృతపాయస మొసఁగు నభ్యాగతులకుఁ
గాశికాపురి మధ్యాహ్నకాల మనఁగ
వినియు నెఱుఁగవె యాతిథ్యవేళలందు. 115

ఉ. ఏడుదినంబు లన్నమున కడ్డము పుట్టినయంతమాత్రలో
నేడుచుచున్నవాఁడవు మునీశ్వర! నేఁడును నీమదీరనేల్
పాడటిపోయెనే శివునిభార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిన్
గాడ యొనర్పఁజూచెదవు [1]కష్టపుఁగ్రోధము పెచ్చులెచ్చఁగన్. 116

ఉ. క్రొన్నెలపూవుఁదాల్పునకుఁ గూరిమిభోగపురంధ్రి కక్కటా!
యన్నగరీలలామమున కీపరిపాటికి నిట్టికోప మే
లన్న! ఘటించె; దోమునికులాగ్రణి! నిక్కము వో 'బుభుక్షితః
కిం న కరోతి పాప' మను కేవలనీతి దలంచి చూడఁగన్. 117

తే. కాశిపైఁ గోపగింపంగఁ గాదు నీకు
నెంత కోపించునో యింత కిందుమాళి
విప్రుఁడవు గాన నేరము వెదుకఁ దగదు
భిక్షుఁగాన నెమ్మి మాటలు పెక్కు లేల ? 118

వ. అనిన నవ్యాసుఁ డలుకఁ దక్కి నిట్లనియె. 119

శా. తల్లీ! యిన్నిదినాల కేనియు సుధాధారానిస్యందినై
యుల్లంబు న్సుఖియింపఁ జేయుపలు కెట్లో వింటి మిప్పాటిలోఁ

1. కంపు.

బెల్లాఁగొన్నతనాన నేనొకఁడనే భిక్షానకు న్వత్తునో
యెల్లన్ శిష్యులఁ గొంచు వత్తునొ? నిజం బేర్పాటుగాఁ జెప్పుమా.

తే. ఈవు పెట్టినభిక్ష మే మింపలరమును
బంచుకొని చేయువారము ప్రాణరక్ష
నాతి! యంపలవియును బ్రాణములు కావె?
నాదియే ప్రాణ మని వత్తునా? భుజింప. 121

వ. అనిన మందస్మితవదనారవిందయై యయ్యిందుబింబానన యిట్లనియె.

శా. అంతేవాసులు నీవుఁ గూడుకొని మధ్యాహ్నాభిషేకక్రియల్
శాంతస్వాంతత జాహ్నవిం జలిపి [1]పెల్చ న్రండు నేనింతలో
నంతర్గేహమున న్సమగ్రముగ మీకాహారము ల్వేగఁ గ
ల్పింతున్ భోజన మిష్ట మిందఱకుఁ దృప్తిం బొందఁగాఁ బెట్టెదన్.

క. ఆఁకొంటి రిన్ని దినములు
పోఁకంతయు భిక్ష వీటఁ బుట్టకయునికిన్
ఆఁకటదూఁకట నలగితి
రేఁకట వాయంగ భిక్ష లిడియెద రండీ. 124

వ. అనిన నేమును వియల్లోకకల్లోనికిం జని యాప్లవనం బాచరించి,
యుభయపవిత్రంబులు ధరియించి, వేదంబులు పఠియించుచు వచ్చి
యమ్మచ్చకంటియింటిమొగసాలం గూర్చుంటిమి. 125

క. మున్నూఱు శిష్యులును నే
నన్నెలఁతుకతోడ మాటలాడిన యయ్యా

1. మీరే తెందు,

భ్యున్నతసౌధముమీఁదను
సున్నము నిగుడించినట్టి జోడరుగులపై. 126

వ. ఉండి యాసారప్రసారంబులు సేయుశంభళీజనంబులచేతను మార్గ మెఱింగించిన నబ్బోటి హాటకమయంబైన గొడుగుపావలుగిలుకలు గులుకరింపఁ గుసుమకోదండసమ్మోహనకాండంబునుం బోని యొక్క రెండవవయసు తాంబూలకరండవాహినిం గైదండపట్టుకొని యే తెంచి, రండు విచ్చేయుం డని సబహుమానంబుగాఁ దోడ్కొని పోయి, చంద్రికాసంకాశకౌశేయశతసహస్రసందానితవితానోపశోభి తంబును, గాలాగురుధూపధూమవాసనాసనాథంబును, గర్పూ రచితరంగవల్లీవేల్లితంబును, గస్తూరికాలేపసురభిశశికాంతమణిశిలా కుట్టిమంబును, నగు చతుశ్శాలాభోజనమందిరంబున వృద్ధానుపూర్వ కంబుగ నుచితాసనంబులఁ గూర్చుండ నియమించిన. 127

క. మొగి విరిసి, కఱకు గూడక
పగులక వెడలుపును నిడుపుఁ బసిమియుఁ గల లేఁ
జిగురరఁటాకులు వెట్టిరి
దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్. 128

వ. అనంతరంబ. 129

తే. అర్చనలు చేసి గంధపుష్పాక్షతముల
ధూపమిచ్చెఁ గాలాగురుధూమరేఖఁ
గప్పురంబు నివాళించెఁ గమలనేత్ర
పంక్తిపంక్తికి నేతెంచి బ్రాహ్మణులకు. 130

ఉ. ఇందఱు గూడి శాంతి పఠియింపుఁడు మజ్జన మాచరింపుఁ డ
ర్ధేందుకళాకిరీటునకు నీయమృతాన్నము లీపదార్థముల్

మందగతిం భుజింపుఁడు సమస్తజగత్పతి కాశికాపురీ
మందిరవిశ్వనాయకుఁ డుమాపతి ప్రీతి[1] వహించుఁగావుతన్. 131

వ. అనిపంక్తిపంక్తినడుమ నిలుచుచు నత్యంతి భక్తిశ్రద్ధాతాత్పర్య
విశ్వాసపూర్వకంబుగా నుర్వీగీర్వాణవర్గంబులఁ బ్రార్థించుచు నా
పోశనంబులు పోయించుచుండె; నప్పు డేను బైలవైశంపాయనాది
శిష్యప్రకరంబు నెమ్మనంబుల నిట్లని వితర్కించుచుంటిమి. 132

ఉ. వండినచొప్పునుం బొగపు[2]వాసనయున్ బొగపాలుచందమున్
భాండసమృద్ధిసంపదయుఁ బానవిభూతియు సర్వమంగళం
బండజయాన రిత్తప్రియ మాడెను నేఁడును భోజనంబు లే
కుండుట గాననయ్యె నసితోత్పలగంధి యి దేమి మాయయో? 133

ఉ. చల్లని సౌమ్యదృష్టియుఁ బ్రసాదము మాధురియు న్వివేకము
న్వెల్లఁదనంబు మార్దవమును నిర్మలినత్వముఁ జూడవచ్చిన
న్గల్ల యొకింతయేనిఁ బొడఁగానఁగరా దరఁటాకుఁ జూచినన్
ఝల్లనె గుండె యోగిరము శాకములుం బొడగానరామికిన్. 135

తే. పాత్రసంశుద్ధి కాజ్యంబు పస్తరించి
యూరకుండిరి యిది యేమియొక్కొ వీరు
కానరా విప్రు శాకపాకములు నెదుర
మనకు నిజమయ్యె నల చందమామగుటక. 135

మ. అవుఁగా కేమి నిజంబు తేటపడఁగా నర్చించె గంధాక్షతా
దివిశేషంబుల శాంతిపాఠముల సందీపించె విశ్వేశ్వరున్
శివు నుద్దేశముచేసి మ్రొక్కి వివిధాశీర్వాదముల్ గైకొనెన్
ధవళాంభోరుహనేత్ర యింతయును మిథ్యాసృష్టి[3] గానేర్చునే! 136

---

1. కీర్తి. 2. పొగయు. 3. దృష్టి.

క. కానీ యీదివసంబున
నే నిన్నటియట్లు గాక యేమనఁగ నపో
సానంబులు వడ్డించిరి
మానవతీజనులు లీల మహిదివిజులకున్. 137

తే. పోసిరా యెల్లవారి కాపోసనములు?
నారగింపుఁడు లెందు మీ కమృత మస్తు
ప్రొద్దుపోయెనుజుం; డని బుజ్జగించి
మ్రొక్కి యంజలి యెత్తె నమ్ముదుకపణఁతి. 138

శా. ఆముత్తైదువయాజ్ఞ విప్రనికరం బాపోశనం బెత్తిన
న్సామర్థ్యం బది యెట్టిదో? నిఖిలము న్సంపూర్ణమై పత్త్రపా
త్రీమధ్యంబునఁ బిండివంటకములున్ దివ్యాన్నముల్ షడ్రసీ
సామగ్రీరుచిమత్పదార్థచయము ల్సంధిల్లె నొక్కుమ్మడిన్. 139

ఉ. పప్పును బిండివంటలును బాయసముల్ ఘృతముల్ గుడంబులుం
గుప్పలుగాఁగఁ జుట్టునను గూర్పఁగఁ గూడిన యేరుఁబ్రాలతె
ల్కప్పురభోగివంటకము గమ్మనితాలిపుసాజెపిండితో
నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాఁకటిచిచ్చుపెచ్చునన్. 140

క. తరుణి యిది యన్నపూర్ణా
పరమేశ్వరి గాని యితరభామిని గా దం
చరవాయిగొనక మెసఁగిరి
పరమమునీశ్వరులు పంచభక్ష్యాన్నంబుల్. 141

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెఁగలతోఁ గ్రొన్నేతితోఁ బప్పుతో

నక్షయ్యంబగు నేరుఁ బ్రాలకలమాహారంబు నిశ్శంకతం
గుక్షు ల్నిండఁగ నారగించితిమి యక్షుద్రక్షుధాశాంతికిన్. 142

ఆ. ఎవ్వఁ డేపదార్థ మెంతేనిఁ జింతించు
నతని కాపదార్థ మంత గలిగి
యరఁటియాకుమీఁద నవతారమై యుండు
నిట్టిమహిమ చూడ మెన్నఁడేని. 143

ఉ. వేలుపుగిడ్డియుం బరుసవేదియుఁ గల్పకుజంబుఁ దోడ రా
లాలితపాదనూపురఝుళంఝుళనాదము లుల్లసిల్లఁ బై
చేలచెరంగు దూలఁగ విశృంఖలవృత్తిఁ జరించుచుండె నీ
లాలక యన్నపూర్ణ యమృతాన్నముఁ బెట్టుచు నన్నిపంక్తులన్. 144

వ. ఇవ్విధంబున నాజ్యధారాప్రవాహంబును, శర్కరాక్షోదసికతిలం
బును, పాయసాపూపసంపన్నంబును, గలమాన్నపూర్ణంబును,
ద్రాక్షాగోక్షీరక్షౌద్రఘుంద్రేక్షుఖండమండితంబును, రంభానారికేళ
ఫలశాకసాకల్యకల్యంబును, షాడబరసావళీపానకప్రచురంబును, శర
చ్చంద్రచంద్రికాధవళదధిసమృద్ధంబును నైనభోజనమహోత్సవంబు
వైశంపాయనమనఃప్రమోదసపత్నసంపాదనలంపటంబును, సుమంతు
సంతోషకారణంబును, పైలరసనాతపఃఫలంబును, జైమినికామనా
కామధేనువును, దేవలముదావహంబును, రోమహర్షణహర్షోత్కర్షా
వహంబును, సూతకౌతూహలహేతుభూతంబును, నస్మన్మనోరథ
విహారఘంటాపథంబును నై ప్రవర్తిల్లెఁ; దదనంతరంబ. 145

ఆ. హస్తములను గడిగి యాచమనక్రియా
వ్యాప్తి దీర్చి దేవియాజ్ఞ మేము
విమలసౌధమధ్యవేదికాస్థలమున
విశ్రమించి యున్నవేళయందు. 146

వ. అభ్యంతరభవనంబునందుండి. 147

విశ్వనాథుఁడు పార్వతితోడ వేదికడకు వచ్చుట

సీ. చంద్రబింబానన చంద్రరేఖామౌళి
నీలకుంతలభార నీలగళుఁడు
ధవళాయతేక్షణధవళాఖిలాంగుండు
మదనసంజీవని మదనహరుఁడు
నాగేంద్రనిభయాన నాగకుండలధారి
భువనమోహనగాత్ర భువనకర్త
గిరిరాజకన్యక గిరిరాజనిలయుండు
సర్వాంగసుందరి సర్వగురుఁడు
తే. గౌరి శ్రీవిశ్వనాథుఁడు కనకరత్న
పాదుకలు మెట్టి చట్టలు పట్టుకొనుచు
నేఁగుదెంచిరి యొయ్యార మెసక మెసఁగ
విహరణక్రీడ మాయున్న వేది కపుడు. 148

తే. జయయు విజయయు నొకవంక సరస రాఁగ[1]
నందికేశుండు ముందట నడచి[2] రాఁగ.
ప్రథమదంపతు లేమి సంభ్రమము లేక
యరుగుదెంచుట యద్భుతమయ్యె మాకు 149

శా. గౌరిం జూచినయప్పు డంచితమహాకారుణ్యసంపత్తియుం
దారానాయకమౌళిఁ జూచినపు డుద్యత్రోధసంరంభముం
దోరంబై యపు డంతరంగముల సంతోషంబు సంత్రాసముం
బూరించె న్వీను మేమి చెప్పుదు మహాపుణ్యాత్మకుంభోద్భవా! 150

1. రారు. 2. రాఁడు.

తే. కాశి శివునకు శుద్ధాంతకాంత గాన
దానిపై నల్గి కోపపాత్రంబ నైతి
కాశి గౌరికి సవతి యౌఁగాన నేను
దానిపై నల్గి ప్రేమపాత్రంబ నైతి. 151

వ. అనంతరంబ యేము ప్రత్యుత్థానంబుసేసి యాపురాణదంపతులకుఁ బ్రణామంబు లాచరించి, మడిసందులం జేతు లిడి, యొక్కకెలన నిలిచియుండితిమి. పార్వతీపరమేశ్వరులు వేదికాస్థలమున విజయం చేసి కూర్చుండి; రప్పుడు శంభుండు కోపసంరంభంబున నాదిక్కు చూచి ధిక్కరించి యిట్లనియె. 152

శివుఁడు వ్యాసుని శిష్యులతోఁ గూడఁ గాశి వెడలిపొమ్మనుట

సీ. ఓరి దురాత్మ! నీవారముష్టింపచా
భాస యోజనగంధిప్రథమపుత్ర!
దేవరన్యాయదుర్భావనాపరతంత్ర!
బహుసంహితావృథాపాఠపఠన!
భారతగ్రంథగుంభనపండితంమన్య!
నీవా మదీయపత్నికి నశేష
కైవల్యకల్యాణఘంటాపథమునకుఁ
గాశికాపురికి నిష్కారణంబ

తే. శాపమిచ్చెద నని యనాచారసరణి
నడుగువెట్టినవాఁడ వహంకరించి
పొమ్ము నిర్భాగ్య! మాయూరిపొలము వెడలి
యెచటికేన్ శిష్యులును నీవు నీక్షణంబ. 153

క. పోక నడగొట్టితేనియు
రాకింతుఁజుమీ మొగంబు రాచట్టుపయిన్

శ్రీకాశిక నిందించిన
నీ కింతట నేలపోవు నీచచరిత్రా! 154

క. వడి విడువక యివ్వడువున
నుడుపతిమకుటుండు చెవుల గొనరనినుడుగుల్
నొడివిన నే నయ్యురువుర
యడుగులఁ బడి కాశి వెడలి యరిగెడువేళన్. 155

చ. వెఱవకు మోకుమార! పదివేలవిధంబులనైన నిన్ను నే
మఱవి మఱేడకుం జనుట మాని సుఖంబున దక్షవాటికిన్
దుఱఁగలిగొన్న సమ్మదముతో గమనింపుము భీమనాయకుం
డఱగొఱ లేనివేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్. 156

వ. అనిన నంబవచనంబులు విని విశ్వేశ్వరదేవరచితన్యక్కారమహోపద్రవసంభూత వేదనాదూయమానమానసుండనయ్యును భవానీకృపాపాంగవీక్షావిక్షేపదాక్షిణ్యంబున నొక్కింత యంకిలి దెలిసి, శిష్యసహితుండనై యెన్నఁడెన్నఁడు భీమేశ్వరు దర్శింతునో యని యువ్విళ్లూరి యే తెంచుచున్నవాఁడఁ; బరమమాహేశ్వరుండవైన నిన్నుఁ గనుఁగొంటి; నింక నామనోరథం బవ్యాహతగతిం బ్రవర్తింపఁగల యది. 157

తే. అనవధానత యావగింజంత సూవె
పర్వతంబంత యపరాధభరము గొలిపి
కాశి వెడలంగ మొత్తినఁ గాసిఁ బొంది
తిరుగుచున్నాఁడ నిదె యేను దిక్కుమాలి. 158

తే. కడుదయాళురు దేవతాగణములెల్లఁ
గాలవభైరవుచిత్తంబు కఠినపాక

మీరసము పెద్ద డుంఠివిఘ్నేశ్వరునకుఁ
గాశి మనబోటి కెల్లను గాసి [1]బ్రతుకఁ. 159

క. అని కుంభసంభవునకును
దనవృత్తాంతంబు చెప్పి దైన్యము నొందెన్
గనుఁగవ నశ్రులు దొరఁగఁగ
ననఘుఁడు సత్యవతిసూనుఁ డని చెప్పుటయున్. 160

వ. అటమీఁదివృత్తాంతం బెయ్యది యని యడిగిన. 161

మ. [2]స్మరజిద్భూధర దిక్కరి ద్రుహిణయోషా చంద్రి కాభ్రాపగా
శరద భ్రాభ్రముపల్లభ ప్రతిభటస్ఫాయత్ స్ఫురత్కీర్తిని
ర్భరగర్భోదయ! భూర్భువస్స్వరఖిలబ్రహ్మాండభాండోదరా!
యరివేదండఘటావిఘట్టనకఠోరాటోపకంఠీరవా! 162

క. అసమసమవిషమసమర
ప్రసృమరరిపుసుభటనిటలపట్టవిఘట్ట
వ్యసనదృఢదోఃకఠారా!
కుసుమశరాసనసమానకోమలమూర్తీ! 163

స్రగ్విణి — రామమాంబాసుతా! రాజవిద్యాధరా!
కామితార్థైకసంకల్పకల్పద్రుమా!
వేమనక్ష్మోణిభృద్వీరభద్రేశ్వరా!
స్వామికార్యాభిరక్షాక్రియాదక్షిణా! 164

గద్య — ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర
సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన
భీమేశ్వరపురాణం బను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

---

1. గాని. 2. పురజిద్భూధర.

8|

# శ్రీ భీమేశ్వర పురాణము

## తృతీయాశ్వాసము

శ్రీభీమేశ్వరకరుణా
లాభసముజ్జృంభమాణలక్ష్మీవిభవ
ప్రాభవ! కశ్యపమునివం
శాభరణా! బెండపూఁడి యన్నామాత్యా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమునులకుం జెప్పం దొడంగె. 2

గీ. అవ్విధంబున బాష్పధారాకులాత్ముఁ
డగుచు సత్యవతీసూనుఁ డడలుటయును
నెలఁతయును దానుఁ గన్నుల నీరు నించెఁ
గరుణ చిత్తంబులో నుబ్బఁ గలశభవుఁడు. 3

వ. అనంతరంబ యంతరంగంబున సంతాపంబు డిందుపఱచుకొని సత్య
వతీనందనుండు కమండలుజలంబులఁ గన్నులఁ దుడుచుకొని, నిట్టూర్పు
నిగుడించి, కాశికావియోగక్లేశంబున సమానవ్యసనుఁడైన కుంభ
సంభవున కిట్లనియె. 4

ఉ. ఈవును నేనపోలెను మునీశ్వర! భాగ్యము లేమిఁ జేసి కా
శీవిరహాగ్ని తాపమునఁ జేడ్పడినాఁడవు చెప్పవయ్య నా
త్రోవ; మహాత్మ! దక్షపురిధూర్జటి శంభుఁడు భీమనాథుఁ డా
ర్యావిభుఁ డాశ్రయింప నగునా? నను నేలికొనం దలంచునా? 5

మ. జగతీమౌళివతంసభూషణము విశ్వఖ్యాతముం గాశికా
నగరంబుం బెడఁబాసి, నీకును జగన్మాన్యైకచారిత్ర యీ
చిగురుంబోఁడికి నాకునుం గటకటా! చేడ్పాటు వాటిల్లె నీ
ముగురిం గూర్చిన ముండదైవమునకు న్మోమోట లేదోసుమీ! 6

సీ. నిండి పాఱుచునుండునే నిదాఘములందుఁ
దళుకొత్తుసప్తగోదావరంబు?
షట్కాలశంభుపూజావిధానములకుఁ
బల్లవప్రసవదర్భలును గలవె?
కాంతాజనంబులు కమియార నిడుదురే
పురములోఁ దత్కాలపుణ్యభిక్ష
ఘనతపంబునకు విఘ్నంబు సేయరుగదా
యమరేంద్రుఁ డోసఁగిన యప్సరసలు?

తే. కాలభైరవవిఘ్నేశకార్తికేయ
వీరభద్రాదిపరివారవీరగణము
స్వాగతము సేయునే కార్యసాధకులకు?
దక్షవాటికయందు వాతాపిదమన! 7

ఉ. ముక్కు మొగంబు చూడక కొకమోసపుమాటకు విశ్వనాయకుం
డెక్కడికైనఁ బొమ్మనుచు నెఱ్ఱనిచూపులఁ [1]జూచి యల్కతో
ధిక్కరణంబు సేయఁ జనుదెంచితిఁ గాశిక[2]నుండి నాకుఁ దా
దిక్కయి భీమనాయకుఁడు దీర్చునొకో యవమానదుఃఖముల్? 8

ఆ. నన్నుఁ గన్నతల్లి యన్నపూర్ణామహా
దేవి విశ్వనాథదేవుతరుణి

---

1. చూచెనల్కతో. 2. కాశిని.

గుఱుతు చెప్పి తన్నుఁ గొలువంగఁ బుత్తేర
వచ్చినాఁడ నేలవలదె తనకు? 9

సీ. భీమేశ్వరేశ్వర శ్రీమహాదేవుండు
కరుణించునే నన్నుఁ? బరమశైవ!
సప్తగోదావరోత్సంగధాముఁడు నన్ను
నాదరించునె? యిల్వలాసురారి!
సప్తపాతాళవిష్కంభమూలస్తంభ
మూరడించునె నన్ను? నుపరతాత్మ!
దక్షిణాంభోరాశితటమేదినీభర్త
రక్షించునే నన్ను? బ్రహ్మవాది!
తే. స్వాగతము సేయునే నాకుఁ జంద్రమౌళి?
కాక్షితం బిచ్చునే నాకుఁ గాలగళుఁడు?
కాశిలోఁ బడ్డమానభంగంబు వాయఁ
గుస్తరించునె నను శూలి? కుంభజన్మ! 10

ఉ. దోసము పెద్దలేదనక ధూర్జటి నిష్ఠురకంఠహుంక్రియా
భ్యాసముమై నదల్చి యదయస్థితి కాశి వెలార్చె; నింక నే
నాసరిసంయమీంద్రుల ననాథత నేమెయిఁ జూతు దక్షవా
టీసదనుండు [1]ప్రేమముఘటింపక తాను నుపేక్ష సేసినన్. 11

అగస్త్యుఁడు వ్యాసునకు దక్షారామ మహిమంబు చెప్పుట

వ. అనినఁ బారాశర్యున కత్తపోధనవర్యుం డిట్టు లనియె. 12

మ. వితతాష్టాదశసంహితాగమకథావీథీసహస్రంబు భా
రతతంత్రం బఖిలంబు నీయది; యపారంబైన యామ్నాయసం

1. ప్రేమఘటియింపక — అనిన యతిభంగము.

తతి నీచే వివరింపఁగాఁబడియె; విద్యావర్ధనా! నీవు నీ
క్షితిలోఁ గాననితీర్థముల్ గలవె? యీచింతాభరం బేఁటికిన్. 13

వ. భీమలింగంబుమాహాత్మ్యంబు నీవెఱుంగనియదియుం గలదె? దక్షా
రామపుణ్యక్షేత్రం బఖిలపురాణప్రసిద్ధంబు కాదే? నీమనోవిషాదం
బునంజేసి యెఱుంగనివాఁడవుంబలె నడిగెదవుగాక; నైన నడిగిన
యర్థంబు చెప్పెద నాకర్ణింపుము. 14

శా. మోక్షస్థానము భోగభూమియును నై మున్నూఱుతీర్థంబులన్
సాక్షాద్బ్రహ్మపదం బనంగ నపరస్వర్గంబునా నొప్పుగున్
దక్షారామము భీమనాయకమహాధామంబు లోకత్రయీ
చక్షుఃప్రాఘు[1]ణికాయమానసుషమాసంపత్సముద్దామమై. 15

తే. రాజవంశజుఁ డగుభగీరథుని వెనుకఁ
బాఱుదెంచిన చదలేఱు పాటియగునె
సప్తమునిరాట్ప్రతాపసంప్రాప్తమైన
సప్తగోదావరంబుతో సారమహిమ? 16

సీ. దక్షప్రజాధినాధమహాధ్వరక్రియా
దీక్షాధిగమపుణ్యదేశమునకు
బ్రహ్మవిష్ణుపురందరప్రధానసుపర్వ
పరమసంయమిసభాభవనమునకు
దాక్షాయణీయోగదహనార్చిరున్మేష
సామిధేనీమంత్రజాతమునకు
వీరభద్రభుజా[2]విహారహేలాసమా
రంభనాటకనాట్యరంగమునకు

1. ప్రాహుణికాయమాన. 2. యజావిహార.

తే. నమృతమయదివ్యతేజస్స్వయంభులింగ
శాంతభీమేశ్వరేశ్వరస్థానమునకు
దక్షవాటంబునకు మోక్షధామమునకు
భోగజన్మస్థలమున కేపురము సాటి? 17

వ. వెండియుఁ జండభానుకృతప్రతిష్ఠుండును, నాఖండలముఖబర్హిర్ముఖ శిఖామణిమయూఖరేఖాకిమ్మీరితచరణారవిందుండును, సప్తపాతాళభువనవిష్కంభనిర్భేదసమాసాదితావిర్భావుండును, దివ్యామృతస్వయంభూర్జ్యోతిర్లింగమయమూర్తిధరుండు నైన భీమేశ్వరుండు భోగమోక్షప్రదానదీక్షాధురంధరుండై యందు నివసించియుండు; నమ్మహాదేవుచేత నప్పుణ్యక్షేత్రంబు భీమమండలంబనఁ బండ్రెండు యోజనంబులమేర కైవల్యకల్యాణమండపంబును, భోగలక్ష్మీవిలాసభవనపుండరీకంబును నై, కుండలాముఖ సంవేద్య శార్దూల తీర్థంబులు మొదలుగాఁగల శాఖోపశాఖాతీర్థంబులు గలిగి, దక్షిణ జలధివేలావనోపకంఠంబున వేదండవదనశుండాకాండచుళికితోన్ముక్త సప్తగోదావరసలిలధారాఘుణత్కారబృంహితబ్రహ్మాండగోళంబును, తుల్యభాగాప్రవాహలహరికాఘోష ఘుమఘుమాయమాన దిగ్విభాగంబును, నేలానదీమాతృకాయమాన కేదారక్షేత్రసంవర్ధితానేకవ్రీహిభేదసంపత్సంపన్నంబును, ఫలభరితనారికేళషండమండిత ప్రౌఢపీఠాపురోపకంఠసీమాబహిర్భాగంబును, మాతృకాయమాన గోదావరీతీరపుణ్యాగ్రహారపరంపరా భూనిలింపసంసత్సంపాదితాధ్వరక్రియాసమాహూతపురుహూతాదిదేవతాకదంబ సంబాధసంచరితంబును, గాంతేయవాహినీప్రాంతసంతన్యమాన[1] సహకార కాంతారఫలరసాస్వాదమోదమానపుంస్కోకిలకుటుంబకంఠనాళకో

1. సంతప్యమాన.

మలకుహూకారకోలాహలప్రపంచిత పంచమంబును, హరివంశంబు నుంబోలె బలభద్రప్రద్యుమ్నానిరుద్ధపురుషోత్తమాధిష్ఠితంబునునై మహాక్షేత్రంబన, మహాలింగస్థానంబన, దక్షిణకాశియనఁ, గల్యాణ నిలయంబనఁ, గైలాసప్రతిబింబంబన, ననశ్వరమహైశ్వర్యంబును, నప్రతిమవైభవంబును, నవాఙ్మానసగోచరంబును, నసంఖ్యాతప్రమథ గణసమాకీర్ణంబునునై, యశేషకల్యాణనిలయంబై యొప్పు నమ్మహా స్థానంబునందు. 18

సీ. పాటలం బగుజటాజూటంబు నడునట్టు
పూపచుక్కలరాజు పొడవు చూపు
వెడఁదయైన లలాటవీథీవిటంకంబు
కట్టెఱ్ఱ క్రొవ్వేఁడి కన్నుఁ గూర్చుఁ
గంబుసన్నిభమైన కంఠప్రదేశంబు
గరళకూటముఛాయఁ గ్రాఁచి యుమియుఁ
గడుమనోజ్ఞములైన కర్ణపార్శ్వములందుఁ
బెనుపాఁపపోఁగులు[1] బిత్తరించు

తే. భీమమండలికాపుణ్యభూమియందు
వివిధకైవల్యకల్యాణవేది ననఁగఁ
గీటపక్షిసరీసృపక్రిమిచరాది
జంతుసంతతి ప్రాణావసానవేళ. 19

సీ. ఒకచోటఁ గోటిపల్లొయ్యదురాజకోటీర
విభ్రాజితోత్సంగ వృద్ధగంగ
యొకచోటఁ బీఠాంబికోన్నతస్తనభరా
స్ఫాలజర్ఝరితకల్లోల యేల

1. పొంగళ్లు.

యొకచోటఁ జటులనక్రకుళీరపాఠీన
తోయగర్భాభోగ తుల్యభాగ
యొకచోట నప్సరోనికరసంసేవితాం
తరము శ్రీసప్తగోదావరంబు

తే. నమరు నాగరఖండసిద్ధాంతజాతి
నాగవల్లీసమాక్రాంతపూగఖండ
మండితోద్యానవాటికాఖండవిభవ
పాత్రమగు భీమమండలీక్షేత్రమునకు. 20

సీ. త్ర్యంబకాచలశిఖాగ్రంబునం దుదయించి
పొదలి యార్యావర్తసీమ దఱసి
మలఁగి దండకవనీమధ్యభాగము న నా
ప్రస్రవణాచలప్రస్థ మొఱసి
పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథు మందిరము డాసి
యేచి యనంతభోగేశ్వరస్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవ గాఁగఁ

తే. గోటిపల్లీశుకోమలాంఘ్రులకు మ్రొక్కి-
కుండలాముఖతీర్థంబు గుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టికొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె. 21

తే. నీరుకడఁ గోళ్లఁ గూడి మున్నీటిఁ గవయు
మొగులుబడివాహినుల కెట్లు మొరయవచ్చు ?

1. తీరసోమేశుమందిరము.

వార్ధు లేడింటికి వలపువనిత[1] మైన
మంగళోత్సంగ గాతమిాగంగ యెమర. 22

ఉ. ఎక్కడఁ జూచిన న్సరసి, యెక్కడఁ జూచిన దేవమందిరం,
బెక్కడఁ జూచినం దటిని, యెక్కడఁ జూచినఁ బుష్పవాటికం,
బెక్కడఁ జూచిన న్నది, మహీవలయంబున భీమమండలం
బెక్కడ ? యన్యమండలము లెక్కడ ? భావనచేసి చూచినన్. 23

తే. బ్రహ్మహత్యాదులగు మహాపాతకములు
ధాత్రి జనులకు నిమిషమాత్రమునఁ బాయు
భీమనాథమహాదేవు పెండ్లినాఁటి
దక్షిణాముఖ [2]కల్యాణదర్శనమున. 24

తే. కార్తికికవేళ భీమశంకరునినగరఁ
దూఱు నెవ్వాఁడు చిచ్చుటతోరణంబు
[3]నతఁడు దూఱఁడు ప్రాణనిర్యాణవేళ
ఘోరయమపట్టణద్వారతోరణంబు. 25

తే. ద్వాదశక్షేత్రపుణ్యతీర్థములతోడ
రమ్యమగు సప్తగోదావరంబుతోడ
వరదభీమేశ్వరేశ్వరావాసమైన
దక్షవాటంబు కల్యాణధామ మమరు. 26

తే. [4]అప్పురంబుప్రభావంబు చెప్పనేల ?
తిరిగి పాఱంగ యోజనత్రితయభూమి

---

1. వంశవనిత 2. మండప 3. వాఁడు. ఈ పాఠమున నిర్యాణమును నిర్వాణముగా మార్చవలెను. 4. అప్పురం బిట్టిదని వేఱె చెప్పనేల.

వాపికాకూపగర్తపల్వలతటాక
తీర్థజలములు భాగీరథీజలములు. 27

సీ. పంచాక్షరీమంత్రపారాయణంబులు
జపియించు శారికాసముదయములు
నీలకంఠస్తోత్రకోలాహలప్రౌఢిఁ
జూపు నున్మత్తపుంస్కోకిలములు
శతరుద్రి యశ్రుతిస్వాధ్యాయపాఠంబుఁ
బరిఢవించుఁ గిశోరబంభరములు
ప్రణవాక్షరాభ్యాసపరిపాటిఁ బాటించు
నానావిధంబుల సమిలిపించు

తే. సప్తగోదావరాంబుపూర్ణరసహస్ర
సారణీసేకసాంతత్యసంప్రవృద్ధ
వివిధతరుగుల్మవల్లికావేల్లమైన
తత్పురోద్యానవీథికాంతరమునందు. 28

సీ. నిఖిలపుణ్యక్షేత్రనివహంబునందును
నత్యంత మాశ్రయం బనఁగ నెగడి
యైంద్రసంపదకెల్ల నాధారభూతమై
దక్షుని యజ్ఞంబు తానకముగ
ద్వాదశపుణ్యతీర్థములతో సంధిల్లి
భోగమోక్షవిహారభూమి యగుచు
నియమయాత్రామాత్రనిశ్శేషదోషాప
హరణంబొనర్ప సమర్థ మగుచు

1. శతరుద్రసచ్ఛ్రుతి.

తే. సిద్ధనిర్మలనిరవధిశ్రీస్వయంభు
ధన్యభీమేశ్వరేశ్వరస్థాణులింగ
దైవతస్థితిసంభవస్థానమైన
దక్షవాటంబు వర్ణింపఁ దరమె మనకు? 29

క. దక్షిణకాశీనగరము
దక్షారామంబు భీమధామము ధన్య
త్వక్షితిక్షోణీమండల
రక్షామణి దానిఁ బొగడ బ్రహ్మకు వశమే? 30

సీ. భీమేశ్వరేశ్వరశ్రీమహాదేవుండు
హిమధామమౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావరసలిలప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరుచుట్టుమాలెలోఁ దిరమైన గణపతి
యేకాంతదుంఠివిఘ్నేశ్వరుండు
దక్షిణంబున నున్న దండపాణీశుఁ డూ
హింపంగ దండపాణీశ్వరుండు

తే. భైరవస్వామి శ్రీకాలభైరవుండు
నంది నందీశ్వరుం డేమి సందియంబు
దక్షవాటంబు కాశికాస్థలము కాదె?
తీవ్రకరతేజ! సత్యవతీతనూజ! 31

వ. మఱియు భీమేశ్వరమండలమునకు సీమావిభాగంబు. 32

తే. జంభరిపుదిక్కునకు సీమ సలిలరాశి
పశ్చిమమునకు సీమ త్ర్యంబకతనూజ

ద్యుమ్నపతిదిక్కునకు సీమ తుల్యభాగ
దక్షిణమునకు వృద్ధగౌతమియె సీమ. 33

తే. భోగ మోక్షము హైశ్వర్య యోగ కాంక్ష
భీమమండలిఁ గాపుండఁ బ్రియము పుట్ట
మర్త్యయోని జనింపఁగ మదిఁ దలఁతు
వివిధగంధర్వకిన్నరవిబుధవరులు. 34

తే. భీమమండలికాపుణ్యభూమియందుఁ
దేజరిల్లెడు పండ్రెండుతీర్థములకు
జాతరలు సేయు నప్సరస్సతులతోడ
నాకమునుండి యేతెంచి నముచివైరి. 35

సీ. ఏడురసాతలక్రోడంబులును విని
ర్భేదించి వెడలిన పెద్దవేల్పు
మార్తాండుచే నభోమణిచేత రవిచేఁ బ్ర
తిష్ఠఁ బొందిన మహాదివ్యమూర్తి
సప్తర్షులరుదేర సప్తగోదావరం
బవగాహనముచేసి నట్టిప్రోడ
తొలుమాయయగు దక్షునెలదోఁటనడుచక్క
విహరణం బొనరించు వేడ్కకాఁడు
తే. విశ్వపతి భీమనాథేశ్వరేశ్వరుండు
కర్తయై యుండి భోగమోక్షముల నిచ్చు
భక్తజనులకు నట్టివై భవపదంబు
మండనము మేదినికి భీమమండలంబు. 36

సీ. ఎచ్చోటఁ దాఁ బొత్తె నిట్టిరూపము దాల్చి
యతిసాధ్వసంబుతో నధ్వరంబు
పాటిల్లె నెచ్చోట భాషావధూటికి
నతిజుగుప్సితమైన యంగవికృతి
యెచ్చోట ముచ్చిచ్చు సేడేసినాల్కలు
కొండనాల్కలుదాఁకఁ గోఁతవడియె
నెచ్చోట నులివేఁడియెండఁ బండులు రాలి
పూషార్కవదనంబు బోసివడియె
తే. దక్షుఁ డెచ్చోటఁ [1]బొట్టేలితల ధరించెఁ
జిందువందయ్యె నెచ్చోట నిందుఁ డనుచుఁ
జెప్పుదురు వీరభద్రవిజృంభణంబు
భీమమండలి నుండు ప్రాఁబెద్దమునులు. 37

వ. నీవు విశ్వేశ్వర దేవవిరచితావమానమనశ్శల్యంబున డస్సి ఖిన్నుండవై యున్నవాఁడవు; నిన్ను విడిచి పోవుట నాకు నుచితంబు గాదు; నీవు నేనునుం గూడి ద్వాదశపుణ్యక్షేత్రయాత్రాప్రసంగంబునఁ గుక్కుటేశ్వర దేవు దర్శింపఁగలవార; మీవేళ దక్షారామంబునకు మగిడి పోదము లెమ్మని యతండును దానును లోపాముద్రయును శిష్యమండలంబును గదలి, యిష్టాలాపంబులఁ బ్రొద్దుపుచ్చుచుం జనిచని. 38

సీ. తుల్యభాగాతటీద్రుమమండితంబైన
సాంపరాయపురంబుసరణిఁ బట్టి
చూతాటవీవా[2]టిశోభమానంబైన
[3] పులిగుర్తసోమేశు వలపలించి

1. పొట్టేలితల. 2. వాపి. 3. పులుగుర్తి.

యోంకారపురిఁ ద్రికూటోపరిస్థితశైలః
హరిహరబ్రహ్మల నభినుతించి
శ్రీలామహాగ్రామసింహాసనస్థున
కురగహారున కెదురుండి మ్రొక్కి

తే. యరుగువాఁడు మును ల్పరాశరసుతునకు
దక్షవాటిఁ బ్రవేశింపఁ దగినయట్టి
శుభముహూర్తంబునకుఁ గాలశుద్ధి దెలియఁ
దలఁచి కూర్చుండి రొకవివిక్తస్థలమున. 39

వ. అప్పుడు కాలశుద్ధి విమర్శించి మైత్రావరుణుండు పరాశరసుతున కిట్లనియె. 40

తే. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మత మగు. 41

తే. అసురపురములు సాధించె నంధకారి
యమరపాథోధి మథియించి రమరవరులు
దివ్యసింహాసనం బెక్కె దివిజభర్త
సిద్ధమధ్యాహ్నవేలాభిజిత్తునందు. 42

వ. ఇంక నొక్కవిచారంబు. 43

తే. నాభిమండలి మిచ్చోటు నడుముగాన
భీమమండలికాపుణ్యభూమి నెల్ల
నిచ్చటనె యుండి వీక్షింతనే? మునీంద్ర!
యాకసం బెక్కి యోగవిద్యాబలమున. 44

క. భద్రగతి నేను లోపా
ముద్రయు నిర్నిద్రయోగముద్రాశక్తిన్
రుద్రవిహారాలయము స
ముద్రముతోఁగూడఁ జూతు మోమునివర్యా! 45

తే. ఇపుడు ఘటికాద్వయం బయ్యె నినుఁడు పొడిచి
దవ్వు చాల దిచ్చోటికి దక్షవాటి
కేవలము మంచినడకైనఁ గీసవెత్తి
రెండుజాములు; నిట నూర కుండ నేల? 46

వ. ఈయోంకారపుర పుణ్యక్షేత్రంబునం ద్రికూటదివ్యభవనవాటంబున ముని సంఘంబు లుండునది; మనము నభోమండలంబున కెగసి, ముహూర్త మాత్రంబునఁ గన్నులపండువుగా భీమమండలీపుణ్య క్షేత్రంబు గనుంగొంద మనుటయుఁ; బారాశర్యుండు సబహు మానంబుగా సమ్మతించిన. 47

వ్యాసాదు లాకసంబున నుండి భీమమండలంబు కనుంగొనుట

మ. పరమర్షుల్ భృతరోమహర్షులయి లోపాముద్రయుం దారు నం
బరమధ్యంబున నావహం బనుజగత్ప్రాణప్రవాహంబుపైఁ
బరిలంఘించిరి భుక్తిముక్తిరమణీప్రత్యగ్రలీలాస్పదం
వరసౌధం బగు భీమమండలము సర్వంబున్ విలోకింపఁగన్. 48

వ. ఇవ్విధంబున నావహాస్కంధగంధవాహప్రవాహమధ్యంబునఁ దపః ప్రభావావష్టంభంబున నిలిచి, కుంభసంభవుండు బాదరాయణున కిట్లనియె. 49

సీ. ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు
సప్తగోదావరజలము తేనె
బ్రహ్మసంవేద్యాదిబహుతీర్థములు రేకు
[1]లకరులు చారుదివ్యస్థలములు
నాళంబు లవణాబ్ధివేలావిభాగంబు
కళ్యాణభోగమోక్షములు తావి
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు
తే. గౌతమీసింధుకాంతేయకణ్వనదులుఁ
[2]దుల్యభాగయు నేలేరు దుమ్మికొనలు
భువనసంభావ్యమైన యీపుణ్యభూమి
యనఘ! సంసారతాపశాంత్యౌషధంబు. 50

సీ. సర్వంసహాకుఁ గాసెసమకట్టు పుట్టంబు
గగనంబునకుఁ [3]నల్లఁగలువసెజ్జ
[4]యవటంబు మేఘవాహనుగంధకరటికి
నభ్యవహార [5]మౌర్వాగ్నిశిఖకు
వంటిల్లు యామినీశ్వరకళామాళికిఁ
దరిచోటు నిఖిలబృందారకులకుఁ
గూటకచ్ఛపనాయకునకు నిశాంతంబు
మరుజనకునకును మనికిపట్టు
తే. ఘనతరోద్దండపాఠీనకమఠనక్ర
తిమితిమింగిలచక్రవిక్రమవిహార

1. లు గరులు. 2. తెల్లబావియు. 3. నెల్ల. 4. వాటంబు. 5. మౌనగ్నిశిఖకు.
6. మరుదుర్జనునికిమని మందపట్టు.

ఘుమఘుమారంభగంభీర ఘోషఘటిత
లటదిశాప్రతిశబ్దోపలబ్ధి యబ్ధి. 51

సీ. జనమేజయారబ్ధసర్పాధ్వరాహుత
చక్షుశ్శ్రవస్సహస్రములఁ [1]బోరి
బ్రహ్మాండమండలప్రాసాదసంభార
హరిమణిస్తంభసంహతులనంగ
జంభారిదోస్తంభదంభోళిఖండితాం
జనశైలశిఖరపుంజములఁ బెనఁగి
సంహారసమయఝంఝామారుతోద్ధూత
కాలాంబువాహసంఘముల గెలిచి

తే. యాడుచున్నవి తీంగల్లి యంబరమునఁ
జేయుచున్నవి త్రిభువనాశ్లేషకంబు
నబ్జనాభుని తూఁగుటుయ్యాలలు గంటె
వేనవేలు పయోరాశివీచిఘటలు. 52

శా. కాశిం జచ్చినయంతఁగాని పడయంగారాని కైవల్య మ
క్లేశంబై [2] సమవేద్యనాయకునిచే లీలాగతిం జేరు రా
రో! శీఘ్రంబున మర్త్యులార! యను నారూపంబున న్మ్రోయు నా
కాశాస్ఫాలనగౌతమీజలధిసంఘుస్థానకల్లోలముల్. 53

మ. అదె సంవేద్యము; కోటిపల్లి యదె; దక్షారామ మన్పట్టణం
బదె; యభ్రంకషసౌధకూటఘనహేలావాస ముచ్ఛాయసం
పద సొంపారెడు భీమలింగము మహాప్రాసాదభూమీధరం
బిదె; సప్తర్షినదీప్రవాహ మిదె; సంవీక్షింపు మేకాగ్రతన్. 54

---

1. బోలి. 2. క్లేశంబౌనటు.

సీ. అదె పట్టిసస్థాన మందుండు వీరభ
ద్రేశ్వరస్వామి యర్ధేందుమౌళి
యదె పుండరీకాద్రి యచట మార్కండేయు
నిలువేల్పు ముక్కంటి వెలసెఁ దొల్లి
యదె కుమారారామ మాహర్మ్యరేఖయ
చాళుక్యభీమేశుసదనవాటి
యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మేడ
హుంకారిణీదేవి యోలగంబు

తే. వాఁడె మాయింటివేల్పు పల్వలపురమునఁ
[1]గొప్పలింగంబు ఫణిరాజకుండలుండు
సప్తమునిసింధుసంగమేశ్వరుఁడు వాఁడె
కుండలాముఖ మదె మానికులవరేణ్య! 55

క. అని చూపి చెప్పి కుంభజుఁ
డినుఁ గనుఁగొని శుభముహూర్త మిదె యేతెంచెన్
మనము దిగవలయు ననుచును
మునిమండలి మ్రోల దిగిరి ముగురున్ ధరకున్. 56

వ. అనంతరంబ కుంభసంభవపులిసంభవులు [2]సంబరులఁ దొడిగికొని కదలి, కదళికారామంబుల రామణీయకంబును, నల్లసితబిల్వచిబిల్వవిటపంబుల పొల్పును, ద్రాక్షా రుద్రాక్ష ఖర్జూర కేసరసరఃపున్నాగనారంగంబుల రంగంబును, లవంగలు గలవలీవల్లీవల్లీమతల్లీవేల్లనంబుల యుల్లాసంబును, ఘోంటా కురంటక ఝాంటికా కంటకఫల కపిత్థ లోధ్ర జంబూ జంబీర పారిభద్ర భద్రదారు శాల్మలి గుల్మలీలాహేవాకంబు నుద్రేకంబును, గోమలతరతమాలమాలా

1. నుండులింగంబు. 2. సంజఫులం.

కార శాకోట విటపిమండంబుల మెండును, చెఱకుముఱికటంబును, బ్రాసంగుమిసిమియుఁ, జెంగల్వ తావి తేవయు, గుసుమవాటి మెసకంబును, నుభయపార్శ్వంబులఁ గలఘంటామార్గంబునుగా నెడనెడం గుసుమభారారంభ సంభారకుసుమగుచ్ఛచ్ఛాయా విభాతసంధ్యారాగంబును, [1] గందియందంబును, బెసరసిరియును, మినుమునలువును, గోధూమశ్యామాకవరగయును, [2] మాషపర్ణి సముస్మేషంబును, [3] నేపెయేపును, [4] సనంతిసన కేతనంబును, నువ్వుమవ్వంబును, కుళుత్థ శుద్ధార్థమానవృద్ధియుఁ, బ్రత్తిసంపత్తియు, బొబ్బరయుబ్బరంబును, నందసందర్భంబును, యవయావనాళప్రియంగు [5]జంతిజంతిలపరిస్ఫూర్తియుఁ, ద్రవ్విందలసందడియు, గంటెకొఱ్ఱునలచును, [6]గసగసలవయసును జెంగలించుజాంగలక్షేత్రంబులు నేత్రంబులకు నింపు సొంపు సంపాదింప, ననంతాంత రాంతరంబులు తరతరంబు తరళతరతరంగ రింఛోళి కాంచలంబులం జెంగుఁదం దువాళించుచు, నతిశిశిరసలిల శీకరనికరనిరతకరణపరిణతిం గ్రొవ్విరిపోఁక మోఁకల పూవుఁబాళల నెత్తావికిం దావలంబులై కేవలంబు ఫాలయు సప్తగోదావరసమీరణంబులు నాసికాపుటకుటీరంబులకుఁ గుటుంబకంబుగా మందమంద గమనంబున నహిమకరబింబం బంబరవీథీసౌధకూటంబున హాటక కలశభంగి నంగీకరించుకొలఁది, నభిజి ద్వేళ వేలావనోపకంఠకంఠాలంకారహారధామంబైన దక్షారామంబుఁ బ్రవేశించి రంత. 57

వ్యాసాదులు దక్షారామంబు ప్రవేశించుట

క. ఇటు కృష్ణద్వైపాయన
ఘటజన్ములు భీమనాయకస్వామిమహా

1. విభాసితసంధ్యారాగసరభసంబును. 2. మాషతోర 3. నేసె 4. ననంతి ననకేతనంబును. 5. కుళుజతిల. 6. గసగసలివయును.

కటకము ముక్తివధూటీ
కటకాభరణంబుఁ జొచ్చి కడువేడుకతోన్. 58

తే. కర్ణికారాంబికామహాకాళిగుడికి
నందముగ నూలువట్టిన యట్టిచాయ
సూర్యవీథికిఁ జనిరి సంశుద్ధమతులఁ
బశ్చిమద్వారమునకునై పరమమునులు. 59

వ. అప్పుడు ఘటోద్భవుం డమ్మహాస్థానంబు సత్యవతీ సూనునకుఁ జూపి వెండియు నిట్లనియె. 60

సీ. లీలావిలాసలాలితలోకహర్షంబు
గోమేధికాక్లృప్తగోపురంబు
గోపురస్థితజాతకుంభకుంభిశతంబు
దివ్యరత్ననిబద్ధదేవగృహము
దేవగేహాకీర్ణదివిజాప్సరశ్శ్రేణి
యఖిలవస్తుప్రపూర్ణాపణంబు
వివిధాపణస్వర్ణవేదికాధ్యాసిత
యక్షగంధర్వవిద్యాధరంబు
తే. శంఖభేరీమృదంగనిస్సాణపటహ
ఝల్లరీవేణువీణాదిశబ్దనివహ
కలకలోద్వేజితాశేషకల్మషంబు
నయనభాగ్యంబు దక్షిణానందవనము 61

సీ. ఘల్లుఘల్లని రత్నకంకణంబులు మ్రోయ
గంధవాహునియాలు కసవు నూడ్చు
లక్ష్మి కెంగేలిలీలారవిందమ్మునఁ
గలయంపి చిలికించుఁ గమ్మఁదేనె

తామ్రపర్ణియుఁ దాను దారకాపథగంగ
వలిముత్యముల రంగవల్లి దీర్చు
నధి[1]వాసనముసేయు యమునిశుద్ధాంతంబు
[2]ధూమోర్ణమహిసాక్షి ధూమఘుటిక

తే. సప్తపాతాళనాగేంద్రచంద్రముఖులు
ఫణమణిజ్యోత్స్న దివియగ్గంబము లగుదురు
సోమమకుటునిగారాబుజోటియైన
దక్షవాటికఁ బ్రతిమహోత్సవమునందు. 62

మ. ధనకోటీవినిబద్ధకేతనశతద్రాఘిష్ఠవైశ్యాలయం
బను వేలధ్వనితార్థదానవిధిఘంటారావవేశ్యాగృహం
బనిమేషాక్షినిరీక్షితేశ్వరమహేడ్యక్షోణిబృందారకం
బనుసంధ్యాగతలోకపాలకము దక్షారామ మభ్యున్నతిన్. 63

తే. మొగులు ముట్టిన సురసద్మమూర్ధవీథిఁ
గోటిపడగలఁ బొలుపారుఁ గూటకోటిఁ
బట్టణంబు నిజాంగుళీపల్లవముల
నెట్టుకొని పాపములఁ బాయఁ దట్టుకరణి. 64

సీ. ఎచ్చోటఁ దీర్థంబు [3] లేఁకారు జనుల కి
చ్ఛామాత్రభోగమోక్షప్రదములు
కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగానసరణి

1. అధివాసమును. 2. ధూపార్తి. యమునిభార్యపేరు ధూమోర్ణ. 3. లేఁకారు.

జంకించు [1] నెద్దాని శబలసౌధోపరి
ధ్వజపటంబులు దేవతాగృహముల
వసియుంతు రెద్దాన వాలఖిల్యాదులు
తపసు లష్టాశీతిదశశతములు

తే. నెద్ది యమరేంద్రపురలక్ష్మి కింత పెద్ద
యట్టి శ్రీదక్షవాటీమహాపురంబు
నద్భుతం బంది చూచిరి యాదిమునులు
సత్యవతినందనుండు కుంభసంభవుండు. 65

సీ. దక్షాధ్వరానలత్రయతీర్థ మొక్కటి
యోగాగ్ని [2]నెందేని నురిసె గౌరి
యఖిలేష్టసంసిద్ధి యంద్రు రెండవతీర్థ
మెందేని నుమ గాంచె నిష్టసిద్ధి
సోమేశ్వరం బంద్రు సొరిది మూఁడవతీర్థ
మెందేని నఘము లిట్టింకు లింకు
హైమవతం బందు రది నాలుగవతీర్థ
మెందేని హిమవంతుఁ డొందె వరము

తే. సప్తగోదావరంబు పంచమము తీర్థ
మఖిలశుభములు నెందేని నావహిల్లుఁ
బంచతీర్థంబు లివి యాడి పంచజనుఁడు
పాయుఁ బంచేంద్రియోద్భవపాతకంబు. 96

గీ. శిష్టమునిలోకవిబుధాభిసేవ్యమైన
యిమ్మహాతీర్థములశక్తి నేమి చెప్ప

---

1 ఝుంకించు నెదేవిశబలపంఖంబుల. 2 నెట్టేనినురిసె సౌరి.

వానిపైఁ [1]బాటి వెడలెడు వాయువేనిఁ
జీమకైనను గైవల్యసీమ [2]నొసఁగు. 67

వ. అని దక్షారామమాహాత్మ్యంబు వర్ణించుచుఁ బ్రదక్షిణక్రమంబున భీమేశ్వరుదివ్యమందిరంబు వలపలించి, సప్తగోదావరంబునకు డిగ్గి, కృతస్నానులై; రప్పుడు సాత్యవతేయుండు కుంభసంభవున కిట్లనియె. 68

తే. ద్వాదశక్షేత్రశివలింగదర్శనంబు
మొదలఁ జేయంగవలయుట ముఖ్యపక్ష
మానతీఁదగు నాకు నీ వానుపూర్వి
శంభులింగంబు లవి యెవ్వి కుంభజన్మ. 69

క. ఇటమున్న దక్షవాటీ
కటకంబునయందుఁ బెద్దకాలంబు వసిం
చుట దీర్ఘంబులు నీకున్
ఘటసంభవ! యాడినవియకావె తలంపన్ ? 70

వ. అనిన విని యగస్త్యుఁడు సాత్యవతేయున కిట్లనియె. 71

తే. పూర్వజన్మకృతంబైన పుణ్యరాశి
పాకదశఁ బొందు నెప్పు డప్పాటఁ గాని
సకలసంసారదురితనిస్తారమైన
శివకథాగోష్ఠి చెవులకుఁ [3]జవులు గాదు. 72

వ. అని పలికి సత్యవతీసూనునకుఁ గుమారవక్త్రంబునఁ దాను విన్న ప్రకారంబున మైత్రావరుణుండు ద్వాదశతీర్థమాహాత్మ్యంబు నిట్లని చెప్పం దొడంగె. 73

1. గాలినుత్క్రాంతివాయువైన 2. పొలఁతి. 3. జెలువుగాదు.

సీ. ఇంద్రేశతీర్థంబు ఋషిసమాకీర్ణంబు
సిద్ధేశ్వరము సర్వసిద్ధికరము
యోగీశతీర్థంబు యోగలక్ష్మీప్రదాయి
కాళేశ్వరము భక్తకల్పతరువు
శమనేశతీర్థంబు శాంతిదాంతివిధాయి
వీరభద్రేశంబు విశ్వమతము
బ్రహ్మేశతీర్థంబు బ్రహ్మర్షిసేవ్య మ
హైశ్వర్యదము [1]కపాలేశ్వరంబు
తే. కుక్కుటేశంబు కాశికిఁ గొంత వెలితి
[2]సోమనాథేశ్వరము ముక్తిసూచకంబు
శ్రీమహేశ్వరతీర్థంబు శివుని మెచ్చు
త్రిభువనాభ్యర్చితం బుమాతీర్థ మనఘ! 74

క. గూఢములు నిగూఢంబులు
గూఢాగూఢములు నగుచుఁ గోటులసంఖ్యల్.
గాఢమహేశ్వరభక్తిఁ బ్రౌ
రూఢిం దీర్థములు గలవు రుద్రునివాటిన్. 75

తే. గరుడగంధర్వయక్షకిన్నరులచేత
దివిజఖేచరదైత్యదానవులచేత
ద్వాదశక్షేత్రతీర్థమధ్యంబునందు
భక్తి శివలింగకోటి నిల్పంగఁబడియె. 76

క. ద్వాదశతీర్థకపరివే
షోదరమున భీమనాథుఁ డుజ్జ్వలతేజః

---

1. కపాలేశ్వరంబు. 2. సోమకాశేశ్వరము.

ప్రాదుర్భావుం డొప్పగు
నాదిత్యుఁడు పరిధినడుమ నమరెడుభంగిన్. 77

తే. ద్వాదశక్షేత్రవికచపత్త్రములతోడి
దక్షవాటిక యనెడి కెందమ్మివిరికి
సప్తగోదావరాంబునిర్ఝరము తేనె
నడుమ రాయంచ శ్రీభీమనాయకుండు. 78

తే. భైమ మీశానలింగం బపార తేజ
మక్షయం బప్రధృష్యం బనాదినిధన
మమ్మహాజ్యోతి రత్నదీపాంకురంబు
కనకగర్భాండభవనవిష్కంభమునకు. 79

చ. అమృతపయోనిధానమునయం దుదయించెఁ గళాసమృద్ధిఁ ద
[1]న్నమర సుధాకరుండు, నిజమారఁగఁ జూచిన దక్షవాటికా
రమణుఁడు భీమనాయకుఁడు రాజశిఖాభరణుండు; గానినాఁ
డమరమునీంద్రసంఘము కరాంబుజముల్ మొగుడంగ నేర్చునే? 80

తే. విమలపాథోధిఁ బుట్టిన యమృతమూర్తి
భీమనాథుఁడు మాస్వామి కేమి చోద్య
మహరహంబును బాదసేవానురక్త
భక్తజనలోకభవరోగభంజనంబు. 81

తే. భీమనాథుని త్రిభువనస్వామినాథుఁ
బార్వతీనాథుఁ [2]జంచత్కృపాసనాథు
దక్షవాటాధినాథు [3]వేదత్రయైక
నాథు నానాథుఁ గొలుతు శ్రీనాథునాథు. 82

1. దవ్వమర. 2. శశ్వత్. 3. దృఢా.

సీ. శివు భవానీభర్త భావసంభవవైరి
భవరోగభంజను ఫాలనయను
భోగప్రదుని భోగిభోగరాజవిభూషు
భూనభోబ్ధివ్యాప్తు భువనవంద్యు
భగవంతు భర్గుని భసితాంగరాగుని
భానుకోటి ప్రభాభాసమాను
భాగీరథీమాళి భగదృగ్విపాటను
భూరథాంగుని భద్రభూతిధరుని
తే. భామినీ సువిలాసార్ధవామభాగు
భక్తితోడ భజింపరో భవ్యమతులు
భావనాభాజుల కతండు ఫలము లొసఁగు
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు. 83

క. తేజితవిష్ణుశిలీముఖుఁ
దేజఃప్రదు దక్షవాటితీర్థైకమహా
రాజాధిరాజరాజును
రాజకళాధరు భజింపరారో విబుధుల్. 84

క. రారో ప్రియశుద్ధాంతవ
రారోహావహులు విబుధు లంబుజహంస
క్షీరామలదేహుని ద
క్షారామపురీనివాసు నభవుని గొలువన్. 85

ఉ. నందివినాయకాదిగణనాథులు గూడి [1]ధృతాస్త్రశస్త్రులై
యెందఱు పాలెముందురు మహీధరకన్యకు సావధానులై

1. దృఢా.

నందివినాయకాదిగణనాథులు గూడి [1]ధృతాస్త్రశస్త్రులై
యందఱు పాలెముందురు మహాప్రభుపీటికి దక్షవాటికిన్. 86

సీ. భానుమండలములు పండ్రెండు నుదయించి
[2]కలవాడి బిట్టెండ కాయకుండ
సంరంభమున నేడు ఝంఝానిలంబులు
వెగ్గలం[3] బగుద్రెమోఁత విసరకుండఁ
బుష్కలావర్తకంబులు లోనుగాఁగల
క్రొమ్మేఘములు వృష్టి గురియకుండఁ
బఱపి లంఘించి సప్తమహార్ణవంబులు
విన్నంది పెనువెల్లి విరియకుండ

తే. నాజ్ఞ వెట్టించుఁ బ్రమథనాయకులచేత
విశ్వపతియైన భీమేశ్వరేశ్వరుండు
దక్షవాటికి నాత్మశుద్ధాంతమునకు
నవహితస్వాంతుఁ డగుచుఁ గాలాంతవేళ. 87

* తే. భైరవుం డర్ధరాత్రంబు ప్రహరిదిరుగుఁ
బాయకుండును నడురేయి ప్రమథగణము
గవని కాఁపులవారు దిక్పాలవరులు
దక్షవాటికి భీమేశుధామమునకు. 88

---

1. దృఢా 2. కరపాళి. 3, వెగ్గలంబుగ.

* 87 వ పద్యముతరువాత నీక్రిందిపద్యము తాళపత్త్రప్రతిలో నధికముగఁ గాన వచ్చుచున్నది.

గీ. వేశ్య యనుమాట కొక్కింత వెలితిలేదు
భార్య యనుమాట కేమియుఁ బఱపులేదు
శక్తి యనుమాట కైవారసరణిఁ బొందు
వామదేవునియెడ దక్షవాటియందు.

వ. అని ప్రసంగించి శివలింగార్చనాపరాయణుండైన మైత్రావరుణుండు త్రిలింగవిషయమంగళాలంకారం బగు భీమేశ్వరమండలంబునఁ, బం ద్రెండు శివలింగస్థానంబులు వివరించువాఁడై యిట్లనియె. 89

తే. ఉత్సవంబుత్సవము దప్పకుండ సురలు
వత్తు రౌత్సుక్యమున దక్షవాటమునకు
శాంభవీశక్తి మర్త్యవేషంబు దాల్చి
భీమలింగంబు త్రిభువనస్వామిఁ గొలువ. 90

క. తాండవమాడుఁ గుమారశి
ఖండి మహోత్సవము వేళ గంభీరములై
డిండిమనిర్ఘోషంబులు
పండువుపండువున నుఱుముభంగి వహింపన్. 91

తే. మర్త్యభామలు విబుధభామలును గలిసి
యుత్సవములందు వర్తించుచున్నయపుడు
దక్షవాటంబువీట భేదంబు దెలియు
దృగ్నిమేషానిమేషప్రదీప్తివలన 92

శా. అర్కేందూపలరత్ననిర్మితమహాహర్మ్యాగ్రభాగంబులం
దార్కొన్ తారకమండలంబు గని ముగ్ధస్త్రీలు శేలప్పరిం
గర్కంధూపలసన్నిభం బయిన ముక్తాజాల మన్నంకచేఁ
దర్కింపం దిలకించి నవ్వుదురు గంధర్వాంగనాపల్లవుల్. 93

తే. దక్షమునిరాజునంతరుద్యానవనము
దక్షవాటంబు శివుని యుత్తమపురంబు
బహుళకైవల్యఫలధర్మపాదపంబు
దీనిఁ గాతురు చుట్టును దిరిగి సురలు. 94

తే. గౌరి యొక్కతె యాకాశగంగ యొకతె
కాశి యొక్కతె దక్షిణకాశి యొకతె
నలుగురును శంభునకు లోకనాయకునకు
రాణివాసంబు లనురాగరసముపేర్మి. 95

వ. ఒక్కసమయమ్మున మహేంద్రుండు దక్షారామమ్మున కేతెంచి
భీమమండలంబునందు. 96

కం. శోభనముహూర్తమున భుజ
గాభరణుఁ బ్రతిష్ఠచేసి యర్చించి మహా
వైభవ మొనర్చి పొందె మ
నోభిమతము విబుధనాథుఁ డధికస్ఫురణన్. 97

తే. దేవతాభర్త శంభుఁబ్రతిష్ఠఁజేసి
సురగణంబుల లోకపాలురను జూచి
యనియె మీరును భీమనాయకునిపీట
సిద్ధశివలింగములఁ బ్రతిష్ఠింపవలయు. 98

ఇంద్రుఁడు దేవతలకు శివలింగమాహాత్మ్యంబు చెప్పుట

సీ. శ్రీకంధరుని బ్రతిష్ఠించు నెవ్వఁడు వాఁడు
పాపియైనను శంభుపదము గాంచు
శివలింగపదయాత్ర శివలింగసంవీక్ష
శివలింగసంస్పృష్టి శివసమర్చ
నాకలోకాధిరాజ్యైకకారణము లౌ
నయమార సాధారణస్థలములఁ
గల్యాణభోగమోక్షనివాస మైనయీ
దక్షవాటీపురస్థానభూమిఁ

తే. జెప్ప నేఁటికి సకలసంసిద్ధిఁ గోరి
దక్షిణాంభోనిధానంబుతటమునందు
సంప్రతిష్ఠింపుఁ డీశానుఁ జంద్రమౌళి
విశ్వలోకాధినాథు నోవిబుధులార ! 99

తే. సిద్ధించు మీ కభీష్టము
సిద్ధ మిది యమర్త్యులార ! శీఘ్రమున జటా
రుద్ధశశి మహోపనిష
త్సిద్ధాంతరహస్యమును బ్రతిష్ఠింపుఁ డిఁకన్. 100

తే. దర్శనముకంటె మేలు సంస్పర్శనంబు
సంస్పృశించుటకంటె నర్చనము లెస్స
యర్చనముసేయుకంటె ననంతఫలద
మసితగళుని బ్రతిష్ఠించు టమరులార! 101

సీ. సకలలోకప్రపంచమును లింగమయంబు
త్రిజగంబు లింగప్రతిష్ఠితంబు
సంభవస్థితిలయస్థానంబు లింగంబు
లీనార్థగమకంబు లింగమనఁగ
లింగప్రసాదంబు లేక సిద్ధింపవు
భోగమోక్షంబు లేయోగములను
లింగాజ్ఞ వెలిగాఁగ లేశమాత్రంబును
సంచలింపదు పో తృణాంచలంబు

తే. మంటినైనను లింగంబు మలిచి కొలుఁడు
ఇసుకనైనను లింగంబు నేర్చి కొలుఁడు
పేఁడనైనను లింగంబుఁ బెట్టి కొలుఁడు
నీటనైనను లింగంబు నిలిపి కొలుఁడు. 102

వ. అని యుపన్యసించి యింద్రుండు తానును లోకపాలకులును దివిజులునుం దమతమపేర శివలింగంబులఁ బ్రతిష్ఠించిరి. 103

మ. హిమధామార్ధజటాకిరీటుఁ డభవుం డింద్రేశ్వరుం డింద్రుచే
నమరవ్రాతము తోడఁ గూడఁగఁ బ్రతిష్ఠాంతంబునం భక్తిసం
భ్రమతాత్పర్యసమగ్రుచేఁ గయికొనెం బాథోధివధ్వాపగా
విమలస్వర్ణసరోజపూజ హృదయావిర్భూతసంతుష్టి[1]మై 104

ఉ. ఆగమమంత్రతంత్రములు సాంగములై నడువంగ సర్వవి
ద్యాగురుఁడైన ప్రెగ్గడ బృహస్పతి తోడుగ వీతిహోత్రది
గ్భాగమునం బురందరుఁడు భక్తి ఘటించిన వాసవేశ్వరున్
భోగివిభూషణుం గొలుచుపుణ్యుల కబ్బును భోగమోక్షముల్. 105

తే. ఇంద్రుఁ డేఁటేఁట జాతర కేఁగుదెంచి
సప్తగోదావరమున సుస్నాతుఁ డగుచు
భుజగభూషణు నింద్రేశుఁ బూజసేయు
ధవళమందారతరుపుష్పదామములను. 106

క. ఇంద్రప్రతిష్ఠితుం డగు
నింద్రేశ్వరుఁ గొలువ నెవ్వఁ డేకాగ్రతమై
రుంద్రమతి సప్తసింధువు
నం ద్రిషవణమాడు నతఁడు నాకం బెక్కున్ 107

క. సకృదాలోకనమున మఱి
సకృదర్చన సకృదుపాస సకృదానతులన్
సకృదాలయప్రదక్షిణ
సకృజ్జపంబుల మహేంద్ర[2]శంభుఁడు మెచ్చున్. 108

1. సంతుష్టుఁడై. 2. చంద్రుఁడు.

తే. ఇంద్రపదభోగ మెవ్వఁడే నభిలషించు
నాతఁ డింద్రేశ్వరేశ్వరు నాలయమునఁ
బ్రణవపంచాక్షరీమంత్రపాఠనియతి
నమ్మహాఫల మొందుఁ దత్త్వార్థ మిదియ. 109

తే. స్నానదానాగ్నిహోత్రదీక్షావిధాన
మంత్రవాదములైన కర్మంబు లొకటి
కోటిగుణితంబు శ్రీదక్షవాటియందు
సప్తగోదావరేంద్రేశసవిధభూమి. 110

వ. అటమీఁద సిద్ధేశ్వరస్థానంబు సిద్ధలింగాధిష్ఠితంబు. ధర్మార్థకామ మోక్షపురుషార్థసంసిద్ధికై యాసిద్ధలింగంబు సిద్ధులచేతఁ బ్రతిష్ఠింపం బడి, సిద్ధసాధ్యగంధర్వగీర్వాణవిద్యాధరారాధ్యంబై యుండు; నాస్థానంబు దక్షయజ్ఞప్రాగ్వంశక్షేత్రంబు. 111

క. జపహోమదానయజ్ఞము
లుపవాసాదివ్రతంబు లొక్కొక్కటి కో
టిపరిమితంబులు సిద్ధే
శపదంబున సాధకులకు సత్యం బరయన్ 112

వ. మఱి యోగీశ్వరం బనుస్థానంబునందు యోగీశ్వరేశ్వరుండు సనక సనందనాదియోగీశ్వరులచేతం బ్రతిష్ఠితుం డని చెప్పంబడును. 113

ఆ. అది భవాబ్ధితరణి యది సాధకవ్రాత
కల్పవృక్ష మది జగత్ప్రసిద్ధ
మది యుపాసకులకు నణిమాదికైశ్వర్య
లాభమునకుఁ గరతలంబుపసిఁడి. 114

సీ. మంకణుండను మహామౌని యోగీశ్వర
శ్రీమహాదేవుని శివు భజించి
బ్రహ్మసాక్షాత్కారపర్యంతమైన ప్ర
బోధసంపద ముక్తిఫలము గాంచె
నొకమాఱు సప్తసింధూదకంబులఁ గ్రుంకి
నరుఁడు యోగీశ్వరేశ్వరునిగాంచ
నణిమాదికాష్టవిధైశ్వర్యసంసిద్ధిఁ
బొందు యోగీశు నర్ధేందు ధరుని

తే. సప్తగోదావరమునీట జలకమార్చి
పుష్పగంధాక్షతంబులఁ బూజచేసి
కలిభవం బైనకలుషంబు గాఁచి పుచ్చి
మర్త్యుఁ డొందును వేగం బమర్త్యపదవి. 115

వ. మఱియు యమేశ్వరలింగంబు యమప్రతిష్ఠితంబు; సకృద్దర్శనమాత్రం
బున మర్త్యుండు యమభయంబునుం బాయు; వెండియు. 116

సీ. యజ్ఞతటాకంబునందుఁ గ్రుంకులువెట్టి
బ్రహ్మర్షిపితృతృప్తిఁ బ్రస్తరించి
యమలింగసన్నిధి నష్టోత్తరసహస్ర
సంఖ్య మృత్యుంజయజపము చేసి
జపవిధానమునందు సరవి మృత్యుంజయు
నపమృత్యుభయశాంతి నర్థి నడుగ
నపమృత్యుదేవతాహంకారభవ మైన
సంత్రాస మొందఁడు సాధకుండు

తే. శ్రాద్ధపిండోదకాదిదానవిశ్రాణనముల
శ్రీయమేశ్వరతీర్థానఁ జేసి మనుజుఁ

డుద్ధరించును నరకకూపోదరముల
బెగ్గడిలు నేడుతరముల పితృగణముల 117

క. శ్రీకాళేశ్వరుసన్నిధి
నేకాంతము జపము వేల్మి యాగియు శ్రాద్ధం
బేకైకము కోటిగుణం
బై కలిగించును సమగ్రమైన ఫలంబుల్. 118

తే. వీరభద్రాది దేవతావీరగణము
శంభులింగంబు నిలిపెఁ బ్రశస్తవేళ
దక్షవాటిఁ దదాఖ్యసంస్థాపనమున
వీరభద్రేశుఁ డయ్యె నవ్వేల్పు ఱేఁడు. 119

క. శ్రీవీరభద్రలింగము
సేవించినమానవుండు చిరకాలమునం
గేవలగాణాపత్యమ
హావిభవము నొందు శివునియాస్థానమునన్. 120

తే. వీరభద్రేశ దేవతావిభునియాజ్ఞఁ
గలుగు ధర్మార్థకామమోక్షములు జనుల
కక్షయంబైన దక్షవాటాభిధాన
భోగమోక్షరమాజన్మభూమియందు. 121

తే. అగ్నిహోత్రంబు దాన మధ్యయనజపము
లాదియగు నిత్యనైమిత్తికాదివిధులు
బహుఫలంబుల నొసఁగు సద్భక్తియుక్తి
దక్షవాటిక వీరభద్రస్థలమున. 122

ఉ. యాగతటాకతీర్థమునయందును నంబుధిసార్వభౌమది
గ్భాగవిభూషణంబయినపద్మినియందును దీర్థమాడి ని
ష్ఠాగరిమంబునం ద్రిపురశాసను దక్షపురోపకంఠధా
త్రీగృహమేధిఁ గొల్వుఁడు ప్రతిష్ఠితభర్గుని వీరభద్రునిన్. 123

వ. తొల్లి బ్రహ్మాదులగు దేవతలు సురేంద్రవిహితవిభవుం డైన భీమనాథేశ్వరు దర్శించు వేడుకం జేసి, బ్రహ్మలోకంబుననుండి భోగమోక్షక్షేత్రంబైన దక్షారామంబునకు వచ్చి, సప్తగోదావరంబునఁ బంచతీర్థంబు లాడి, పండ్రెండు దివ్యలింగస్థానంబులు దర్శించి, యమృతమయస్వయంభూజ్యోతిర్లింగమూర్తి నిఖిలదేవతాచక్రవర్తి యగు భీమేశ్వరు దర్శించి, పరమానందకందళితస్వాంతులై యిట్లనిరి. 124

బ్రహ్మాదులు భీమేశ్వరు నభివర్ణించుట

శా. ఆహా! యింత మనోహరం బగునె దక్షారామ! మిప్పీటిలో
నీహారాంశుకళాకిరీటుఁడు భవానీభర్త దివ్యాప్సరో
వ్యూహాంబుల్ ప్రతిసంధ్యముం గొలువఁగా నున్నాఁడు గోదావరీ
వాహిన్యబ్ధిసమీరపానకలనావర్ధిష్ణు కేయూరుఁడై. 125

క. ముంగిటను సప్తసింధువు
చెంగటఁ గ్రతుసరసి నడుమ శ్రీభీమమహా
లింగము దక్షారామము
సంగతి నెన్నంగఁ బురము జగతిం గలదే? 126

తే. శివశివా! యెంతభాగ్యంబు చేసినారొ!
దక్షవాటీపురీ మహాస్థానజనులు
కన్నులారంగ [1]దర్శించుచున్నవారు
భీమనాథేశ్వరేశ్వరస్వామిమూర్తి. 127

1. వీక్షించు.

చ. అహహా! దయారసానుగత మైనమనంబున దక్షవాటికా
గృహపతి భీమనాయకుఁడు కీటపతంగసరీసృపాళికిన్
సహజ [1]జహత్సమీర మగుసంకటకాలము వీనులం దను
గ్రహ మొనరించునట్టె! మధురంబగు తారకమంత్రరాజమున్. 128

సీ. భీమనాథేశ్వర శ్రీమన్మహాలింగ
భాస్వత్పరబ్రహ్మభవనమునకుఁ
గల్పాంతసమయ [2]భీకరసాగరాద్ధత్య
భీతత్రిలోకమహాతరికిని
ద్వాదశక్షేత్రతీర్థపలాశమండల
వ్యాకోచనవపుండరీకమునకు
జంబూతరుద్వీపసర్వసర్వంసహా
పాటీరలేపనైపథ్యమునకు

గీ. శివకళత్రమునకు శివక్షేత్రమునకు
శివునిమూర్తికి శ్రీసదాశివునికీర్తి
కితరతీర్థంబు సరిపోల్ప నెట్లు వచ్చు?
దక్షవాటంబునకు మహాస్థానమునకు. 129

క. మంకణమహామునీశ్వర
సంకల్పవితీర్ణకల్పశాఖికి భువనా
లంకృతికి దక్షవాటికి
శంకరనటనటననాట్యశాలకు జేజే. 130

క. కాశీప్రతిబింబమునకుఁ
గాశీప్రతినిధికిఁ గాశికాప్రతికృతికిం

1. గళత్సమీర. 2. నా కాపుష్కలావర్తబృంహితాటోపానబీజమునకు.

గాశీప్రతిమకు దక్షిణ
కాశికి శ్రీదక్షవాటికటకంబునకున్. 131

క. మోక్షస్థానంబునకున్
దాక్షారామమున కమృతధామంబునకున్
దక్షాధ్వరక్రియోచిత
దీక్షాక్షేత్రమున కభవుదేవికి జేజే. 132

వ. అని నమస్కరించి శతానందుండు. 133

మ. శివలింగంబు ప్రతిష్ఠచేసి కణఁకన్ శ్రీసప్తగోదావరాం
బువులం జేసెను మంత్రపూర్వకముగాఁ బుణ్యాభిషేకంబు వై
భవముల్ పెక్కువిధంబులం జరిపె శ్రీబ్రహ్మేశ్వరుం డంబుజో
ద్భవవంద్యుం డది యాదిగాఁ గరుణమైఁ బాలించు భక్తావళిన్. 134

వ. అంత దేవసిద్ధసాధ్యవిద్యాధరగంధర్వోరగాదులును దమతమనామ
ధేయంబుల లింగంబులఁ బ్రతిష్ఠించిరి; తదనంతరంబ. 135

సీ. బ్రహ్మప్రతిష్ఠితు బాలేందుశేఖరుఁ
బురుహూతుఁ డతిభక్తిఁ బూజచేసె
నలువ యర్చించె నానాప్రకారంబుల
హరిహయస్థాపితుం డగుమహేశు
దక్షవాటికఁ జూచి దక్షప్రజాపతి
పొగడె నల్మోన[1]నల నంభోజభవుఁడు
ప్రణమిల్లె దక్షుఁడు భారతీభర్తకు
నాత్మప్రశంసకు [2]సలఁగి యలఁగి

1. నల్మోర్ల. 2. నణఁగిమదిని.

తే. వేల్పు లందఱుఁ దారును నిల్పినట్టి
శంభులింగంబులకు మ్రొక్కి చనిరి దివికి
సరసిజాసనుచే ననుజ్ఞాతు లగుచు
సత్యలోకంబునకు నర్థిఁ జనియె విధియు. 136

క. బ్రహ్మప్రతిష్ఠితుండగు
బ్రహ్మేశ్వరదేవుఁ గొలుచుభాగ్యాఢ్యులకున్
బ్రహ్మక్షత్రాదులకును
బ్రహ్మాచ్యుతశంభుభవనపదవులు గలుగున్. 137

క. అధ్యయనశ్రుతదానత
పోధ్యానసమాధిమంత్రపూజాదిమహా
విధ్యనుసంధానమున న
సాధ్యంబులు లేవు బ్రహ్మశంకరుపదవిన్. 138

వ. మఱియుఁ గపాలేశ్వరస్థానంబు.

ఉ. చిక్కని కాలభైరవునిచేతి విధాతృకపాలపాత్ర యే
చక్కటియందు జాఱిపడె సప్తనదీతటభీమభూమియం
దక్కడ నుద్భవించినశశాంకకిరీటుఁ గపాలి శంభు స
మ్యక్కృతిఁ గొల్చుమానవుల [1]నామటఁ జేరవు పాతకౌఘముల్. 139

ఆ. ఆకపాలమోచనాభిధానంబైన
పుణ్యతీర్థరాజమునను జలుపఁ
గడిఁదిఁ గోటిఫలము గాంచు నొక్కొక్కటి
దానహోమయజ్ఞతంత్రవిధులు. 140

చ. అట వరుణేశ్వరం బనఁగ నాదిఁ బ్రచేతసుచేత వాహినీ
తటమునఁ దొంటి నిల్పఁబడి దక్షమహేశకరారవిందసం

1. మానుగ.

ఘుటమునకున్ వరాటకమువోలె వెలింగెడు బాలతారకా
విటమకుటావతంసునకు విక్రమకారణమై తపోనిధీ! 141

తే. వరుణలింగంబునకుఁ దీర్ఘవారిధార
వేయిఘటముల నభిషేకవిధి యొనర్ప
వఱపుదోసంబు వాయంగ వాన గురియుఁ
గొండ్రలం బండు [1]నారంభకోటు లెల్ల 142

ఉ. కుక్కుటపక్షిసంఘము లకుంఠితభక్తిఁ బ్రదక్షిణంబు సమ్య
క్కృతిఁ జేసి యెవ్వనికృపాతిశయంబున మోక్షసత్పదం
బెక్క సమస్తలోకముల కెల్లఁ బ్రియుం దరుణేందుశేఖరుం
గుక్కుటనాథదేవు ఫణికుండలునిం గొలువుండు మానవుల్. 143

తే. ఒక్కపక్షంబు లెంతయు నుర్వి మోవ
గుడిఁ బ్రదక్షిణ మొనరించుకుక్కుటముల
కక్షయం బగుమోక్ష మేయయ్య యొసఁగె
నట్టిశివుఁ గుక్కుటేశ్వరు నాశ్రయింతు. 144

క. చరణాయుధేశ్వరేశ్వరు
శరణాగతకల్పతరువు సంపూర్ణమహా
కరుణావరుణాలయునిం
దరుణామృతకిరణధరుని దర్శింప[2]వలెన్. 145

క. కోణార్కక్షేత్రము వా
రాణశి కేదారతీర్థరాజము కుంభీ
కోణంబు కుక్కుటేశ
స్థాణుస్థానంబు మోక్షధామము లెందున్. 146

---

1, నారబ. 2. వనా.

తే. అచట దానంబు హోమ మధ్యయనవిధులు
శ్రాద్ధమును దేవతాసమర్చనము వ్రతము
లొక్కటొక్కటి కోటిగుణోపలబ్ధి
సంభవించును సతతంబు సాధకులకు. 147

వ. మఱియు సోమేశ్వరతీర్థంబు సర్వదేవతానమస్కృతంబు. 148

క. అమృతమయుఁడైన సోముఁడు
సమయంబున నేమహేశు సంస్థాపించెన్
విమలసుధాజ్యోతిర్లిం
గము సోమేశ్వరుని [1]నీలకంఠు భజింతున్. 149

సీ. సోమతీర్థమునందు సుస్నాన మొనరించి
శ్రీసోమశంభు భజించుధన్యుఁ
డిహజన్మమునయందు నేపాప మొనరించెఁ
బాప మెద్ది యొనర్చెఁ బ్రాగ్భవమున
నది యశేషంబును నాక్షణంబునఁ బాసి
దేహాంతమునఁ [2]గూడుఁ ద్రిపురహరుని
ద్యాగంబు భోగంబు దానంబు సత్యంబు
భాగ్యంబు కీర్తి సౌభాగ్యలక్ష్మి
తే. బుద్ధి దత్సేవ [3]నెంతయుఁ వృద్ధిఁబొందు
సతతధర్మంబు నిచ్చు నక్షయఫలంబు
తతఫలంబులు [4]పిత్రర్థదైవికములు
సత్య మిది సోమనాథప్రసాదమహిమ. 150

క. సురలును విద్యాధరులును
గరుడోరగకిన్నరులును గంధర్వులు కిం

1, గరళ. 2. గూడ్చు. 3. నత్యంత. 4. పిత్రార్థ.

పురుషులు యక్షులు సోమే
శ్వరదేవుని గొల్తు రధికవరభక్తి మెయిన్. 151

వ. మఱియు మాహేశ్వరతీర్థంబు సర్వదేవనమస్కృతంబు, మునిసిద్ధచా
రణవిద్యాధరులచేతం బ్రతిష్ఠితంబైనయది; అందు పితృపిండదానం
బేకవింశతికులంబునకుఁ దృప్తికరంబు. 152

తే. సప్తగోదావరం బనుసారతీర్థ
ముత్తమోత్తమ మందు మర్త్యుండు చేయు
శ్రాద్ధతిలతర్పణాదు లక్షయఫలంబు
తత్సదాసేవనము శివస్థానదంబు. 153

తే. దత్త మిష్టంబు హుత మధీతంబు నరుల
కచట నక్షయఫలము చేయంగఁ జాలు
శ్రాద్ధపిండప్రదానాదిసకలవిధులు
నందు ఫలియించు నగ్గయయందుఁబోలె. 154

క. మఱి రామేశ్వరతీర్థము
కఱకంఠున కాటపట్టు కామితఫలముల్
తఱుగని ధాన్యము లగుచును
నెఱయంగ ఫలించు నందు నిష్ఠయుఁ గలుగున్. 155

క. శ్రీరుద్రపాదయుగళీ
శ్రీరామేశ్వరసమీపసీమం బితృయ
జ్ఞారంభం బొనరింప న
పారఫలప్రాప్తి చెందు [1]శివాజనములకున్. 156

---

1. పంచజనులకున్.

తే. ప్రథితమగు సప్తగోదావరంబునకును
నభవునకు భీమనాథున కంతరమున
నేమి సుకృతంబు చేసిన నేకతంబ
వేయివిధముల ఫలియించు వేయునేల? 157

సీ. వినుము పారాశర్య! వేవేలమాటలఁ
బని యేమి? తీర్థముల్ పదియురెండు
నని చెప్పనేల? దక్షారామమండలిఁ
దీర్థంబు గానిప్రదేశ మెద్ది
సప్తగోదావరోత్సంగస్థలమునకుఁ
గాశి కేదార మక్షయవటంబు
తరముగా; వితరతీర్థమ్ములు సాటియె?
భోగమోక్షములకుఁ బుట్టినిల్లు

తే. రుద్రవాటిక భీమేశ్వరునినివాస
మందు రామేశ్వరస్థాన మభ్యధికము
రామతీర్థంబునందు సారంబు సాటి
ధర్మమర్మంబు రుద్రపాదస్థలంబు. 158

అగస్త్యుండు వ్యాసునకుఁ బంచతీర్థంబులు వివరించుట

వ. మఱియుఁ బంచతీర్థంబులు వివరించెద నవహితుండవై యాకర్ణింపుము. 159

చ. అహిపతికంకణుండు తనయల్లుఁడుగా మదిఁ గోరి నిష్ఠతోఁ
దుహినధరాధరేంద్రుఁడు చతుర్దశదివ్యమహాబ్దముల్ సుదు
స్సహముగఁ జేసె నయ్యెడఁ బ్రచండతపం బచట న్నివుం డను
గ్రహమున నుద్భవించె నని క్రచ్చుఱఁ బల్కుఁ బురాణసంహితల్. 160

క. అది యాదిగఁ దీర్థంబులు
పదియును రెండయిన తీర్థపాలీజాతం
బదియును నెక్కువయై యు
న్నది సప్తతటంబునందున న్మునివర్యా! 161

క. లంకించి యరుంధతిపతి
మంకణునకుఁ జెప్పె ననుఁగుమామకు గిరికిన్
సంకల్పసిద్ధిదుం డగు
శంకరుఁ డఖిలార్థిపారిజాతం బనుచున్. 162

క. గిరిసార్వభౌమకన్యా
కరగ్రహణసుమంగళైకకౌతుకసంప
త్పరిపూర్ణహృదయు శంకరుఁ
గరుణాకింకరుని నురగకంకణుఁ గొలుతున్. 163

క. నీహారభూధరేశ్వరు
నీహారమణీయమూర్తి నిందుకరహిమా
నీహారహీరకుముదసు
ధాహారసమానకాంతి నభివర్ణింతున్. 164

సీ. భూధరేశ్వరతీర్థమునఁ గృతస్నానుఁడై
భూధరేశ్వరుఁ గొల్చు బోధఘనుఁడు
నిత్యమంగళుఁడు నిర్నిద్రభద్రుండును
లక్ష్మీవిలాసైకలక్ష్మయుతుఁడు
నగుఁ; దీర్థములలోన నత్యుత్తమం బైన
తీర్థంబు భుక్తిముక్తిప్రదంబు
మంగళమంగళాత్మకము కల్యాణక
ల్యాణస్వరూపమా నాస్పదంబు

తే. ధరణిధరనాయకునకుఁ బ్రత్యక్షమైన
యవ్విరూపాక్షునగర మధ్యాహ్నవేళ
భోగఘంటాస్వనము విన్న భూజనులకు
నవల వినవచ్చు ముక్తికల్యాణఘంట. 165

మ. హిమవద్భూధరసార్వభౌమరవివిశ్వేశోపహారక్రియా
క్రమసంతాడితఘంటికాఘణఘణత్కారంబు విన్నట్టి యు
త్తమపుణ్యుండు వినండు ప్రాణపవనోత్క్రాంతివ్యథావేళ దు
ర్దమవైవస్వతవాహఘోరమహిషగ్రైవేయఘంటాధ్వనుల్. 166

తే. శ్రాద్ధపిండప్రదానాదిసకలవిధులు
నొక్కటొక్కటి కోటిగుణోదయమునఁ
దృప్తిఁ గల్పించు దివి పితృదేవతలకు
ధరణిధరరాజశంభుతీర్థంబునందు. 167

తే. సప్తగోదావరముఁ దెచ్చి సప్తమునులు
సప్తసప్తీందుశిఖివిలోచనుని నిలిపి
రమ్మహాశంభులింగ మభ్యర్చితులకుఁ
గామితార్థప్రదానైకకల్పకంబు. 168

క. ఒకమాటు జలక మార్చిన
నొకమా టొకపువ్వు మౌళి నునిచిన నొకమా
టకుటిలమతి గుడిఁ దిరిగిన
సకలేప్సితముల నతండు సంపాదించున్. 169

తే. భీమనాథేశ్వరుని పార్శ్వభూమియందుఁ
బంచశివలింగములకు నాస్పదము లైన

పంచతీర్థంబులను నాడుపంచజనులు
పాయుదురు పంచవిధమహాపాతకములు. 170

తే. అందు వాపితటాకకుల్యాదులందుఁ
దీర్థమాడ వివేకి బుద్ధిం దలంపఁ
బంచతీర్థంబు లందించుఁ బంచజనుల
కాత్మసలిలావగాహపుణ్యాతిశయము. 171

వ. అగస్త్యేశ్వరరామేశ్వరనాకులేశ్వరగణేశ్వరపాతాళభైరవేశ్వరు లను దేవతాపంచకంబుఁ బంచతీర్థంబుల దర్శించి మానవుఁడు, పంద్రెండు పుణ్యక్షేత్రంబులు దర్శించినఫలంబు లందు; మూలస్థానేశ్వరలింగం బాదిమూలం; బద్దివ్యలింగంబు దర్శించి భీమమండలంబునందు శివలింగస్థానంబు లెన్నిగల వన్నియు దర్శించినఫలంబు గైకొను వెండియు. 172

తే. సప్తగోదావరము భీమశంకరునిని
నాకులేశస్వయంభుఁ బినాకపాణి
రుద్రపాదంబులును సమారాధభక్తిఁ
దలఁతు రెవ్వారు వార పో ధన్యమతులు. 173

వ. అని దక్షారామమాహాత్మ్యంబును భీమలింగమహిమంబును సప్తగోదావరప్రశస్తియు ద్వాదశతీర్థప్రభావంబును బంచతీర్థప్రయోజనంబును వినిపించి కుంభసంభవుండు. 174

తే. భీమనాథుని త్రిభువనస్వామిఁ గొలువఁ
బోదమే యిప్డు మధ్యాహ్నభోగవేళ
నదె విజృంభించె నాట్యసౌధాంతరమున
నృత్యజగఝుంకృతమృదంగనిస్వనంబు. 175

వ. అనిపలికి యనంతరం బయ్యిరువురు రాజమార్గంబున. 176

అగస్త్యవ్యాసులు భీమేశ్వరాలయంబు ప్రవేశించుట

సీ. త్రిపురసంహారంబు దివిజనాయకభుజా
స్తంభదంభోళిసంస్తంభనంబు
గరళకూటమహాగ్ని కబళనాటోపంబు
దక్షాధ్వరక్రియాధ్వంసనంబు
మత్స్యలాంఛనదర్పమథనసంరంభంబు
దేవదారువనప్రదేశవిహృతి
నురులింగమూర్తివిస్ఫురణవిలాసంబు
గాత్యాయనీకరగ్రహణకేళి

తే. గండవేదండదానవఖండనంబు
దండపాణిజలంధరాంధకవధంబుఁ
బాడుగంధర్వపతులచే భరితమైన
మొగలివాకిలిఁ జొచ్చి రమ్మునివృషభులు. 177

సీ. పంచాగశుద్ధిగాఁ బరిఢవించుచు భృంగి
మతి నాడు నెందేని ప్రతిదినంబు
త్రిదశవర్గంబు ముప్పదిమూఁడుకోట్లును
నేకదేశమున నెందేని యుండుఁ
బలుకుఁబూఁబోఁడి యర్వాదినాల్గుకళలతో
విహరించు నెందేని విద్యచూపు
సాని యీశానిమై సవరించు నెందేని
మహితపింఛాలీల మరులు [1]పుట్ట

1. వీట

తే. నెద్ది కైలాసశిఖరికిఁ బెద్దయుద్ది
పాలమున్నీటి కెయ్యది ప్రసవభూమి
చంద్రలోకంబునకు నెద్ది సాటి యట్టి
భవునికల్యాణమణిమండపంబు గనిరి. 178

ఉ. దానికిఁ దూర్పుదిక్కున సుధాకరబింబసహస్రకోటి శో
భానిభకాంతితో గగనభాగము రాయుచు భీమనాయకే
శానమహాట్టహాసరుచిసంపదసొంపు వహించినట్టి శ్రీ
భానుజధారమండపము భవ్యమునీంద్రులు గాంచి రయ్యెడన్. 179

వ. అనంతరం బాబహిర్గేహాళీప్రదేశంబున. 180

తే. నిఖిలపరివారదేవతానివహమునకు
వందన మొనర్చి రుత్తరద్వారభూమి
[1]దండపాణీశశశికళామండనునకుఁ
జేసి రభివాదనంబులు సిద్ధమునులు. 181

ఉ. తండుభుజార్గళాకలితతప్తమహాకలధౌతఘంటికా
మండితవేత్రదండపరిమర్దనభీతివశాత్పలాయితా
ఖండలముఖ్యదైవతనికాయము సంయమిభాగధేయమున్
ఖండకుఁ దారు మోసల సుఖంబునఁ జొచ్చిరి శైవపుంగవుల్. 182

వ. ప్రవేశించి భక్తిశ్రద్ధానుపూర్వకంబుగా నంతర్భవనప్రదక్షిణంబు
సేయునప్పుడు తిరుచుట్టుమాలికయందు. 183

సీ. వణఁకుగుబ్బలిరాచవారికూరిమికన్య
భీమయ్యశుద్ధాంతభామఁ గొలిచి
కంధరంబుననుండి గంధసింధుర మైన
గుజ్జువేల్పుఁ గుమారగురుని గొలిచి

1. శశికళామండనునకును శంకరునకు.

కైవల్యనిధికి దుర్గామహాదేవికి
సర్వమంగళకు నంజలి ఘటించి
యాశాతటీపటీ [1]వ్యాటీకితకవేర
వటుకభైరవు నిష్టవరదుఁ జూచి
తే. నలువ సేవించి యిందిరానాథుఁ గాంచి
యితరపరివారదేవతా[2]ప్రతతి కెల్ల
నేటికోళ్లిచ్చి యెక్కి రమ్మేటిమునులు
మృదునిహాటకశైలంబు మీఁది నిలువు. 184

శా. సందర్శించిరి భీమనాథుఁ ద్రిజగత్సమ్మోహనాకారు స
ర్ధేందూత్తంసుని దక్షిణాబ్ధిలహరీహేలావిహారక్రమా
స్పందాయాత [3]సుగంధవాహపరిషత్సానాతిరేకస్ఫుర
త్తుందిస్వాంగకదందశూకకటకాస్తోకేష్టబాహార్గళున్. 185

క. దృష్టించి భక్తిపరతను
సాష్టాంగం బెఱఁగి యమ్మహాదేవుని నా
శిష్టమును బూజించిరి
యష్టాపదనిర్మితంబు లగు కుసుమములన్. 186

ఉ. కేవలభక్తిసంపదలు గీలుకొనన్ హృదయాంబుజంబులన్
దేవరకుం గృపానిధికి దేవశిఖామణి కర్థి సప్తగో
దావరవాహినీకనకతామరసంబులఁ బూజచేసె మై
త్రావరుణుండు దానును బరాశరసూనుఁడు గూడి వేడుకన్. 187

వ. అప్పుడు పారాశర్యుండు పెన్నిధానంబు గన్నపేదయుం బోలె పర
మానందంబునం బొంది కుంభసంభవుం జూచి మునీంద్రా! నీప్రసా

1. పటలీశాటికాకటు 2. వితతి.

దంబున భీమమండలం బవలోకించితి; ద్వాదశక్షేత్రతీర్థంబులు చూచితిఁ; బంచతీర్థంబు లాడితి; దక్షారామంబు గంటి; భీమేశ్వరు దర్శించితి; ధన్యుండ నైతి; నింక నీవు పత్నీసహితంబుగా నేవలన నైన నుండి తపంబు సేయుము. నేనును విశ్వనాథరచితావమాన ఖేదంబువాయ నీస్వామిని సేవించెద; నని పలికి సముచితప్రకారం బున నమ్మహాత్ముని వీడుకొలిపి యనంతరంబ శిష్యులుం దానును. 188

వ్యాసుండు భీమేశ్వరార్చనంబు సలుపుట

సీ. పంచతీర్థములాడి భవలింగసన్నిధిఁ
ప్రాసాదపంచాక్షరము జపించి
సారిది నల్దిక్కుల సోమేశ్వరములందు
భక్తిఁ బ్రదక్షిణం బాచరించి
కుక్కుటేశ్వర కేళకూళి నుద్భవమైన
మణికర్ణిక నొనర్చి మజ్జనంబు
నోంకారపురిఁ ద్రికూటోపరిస్థితులైన
హరిహరబ్రహ్మల నభినుతించి

తే. తుల్యగోదావరీనదిఁ దోయనిధిని
సప్తగోదావరంబున స్నానమాడి
యాచరించు శివార్చనం బనుదినంబు
దక్షవాటిక నుండి సత్యవతిసుతుఁడు. 189

క. భీమేశ్వరమహిమంబున
నామోదముతోడ నోలలాడుచు నుండున్
భీమేశ్వరచరణారుణ
తామరసంబులకు సంతతముఁ బ్రణమిల్లున్. 190

సీ. మాతృగర్భాగార జాతఖేదము వాయ
హరునిగర్భాగార మాశ్రయించుఁ
బరమేశ్వరార్చనాపరత నించుక తన్ను
నత్యంతధన్యుఁగా నాత్మఁ దలఁచు
హర్షించి హర శివ త్ర్యంబకాచలగర్భ
భవ యంచు రోమాంచపటలిఁ దాల్చుఁ
గరతాళకలన శంకరగీతములు పాడు
లజ్జాభిమానంబు లుజ్జగించి
తే. భీమ భీమేశ్వరేశ్వర భీమనాథ
దక్షవాటీపురాధ్యక్ష దర్పకారి
సప్తగోదావరోత్సంగ జయ మహేశ
నన్ను రక్షింపు మనుచు విన్నపముసేయు. 191

క. బాలోన్మత్తపిశాచద
శాలంబనమునఁ జరించు నంగడివీథిన్
వ్రీడాశూన్యతఁ గంఠే
కాలునిపాదములమీఁదఁ గలుగు విరాళిన్. 192

సీ. పరిరంభ మొనరించు బాహాద్వయంబున
దేవదేవుని సుధాదివ్యమూర్తిఁ
దాఁకించుకొను జటాస్తబకంబు విరియంగఁ
బానవట్టముతోడ ఫాలతలము
గురుదక్షపురితోడఁగూడఁ బట్టణమున
కంగప్రదక్షిణం బాచరించుఁ
బాతాళభైరవప్రముఖ నానాదిశా
పరివార దేవతాప్రతతిఁ దెలఁచుఁ

తే. గాశికాపట్టణద్రోహిఁ గావు మభవ!
విశ్వపతిదూషితుని బ్రోవు విశ్వనాథ!
కల్ల చేసితి రక్షింపు కాలకంఠ!
యనుచుఁ బ్రార్థించు భీమనాయకునిఁ దపసి. 193

సీ. అఘముల కొండు ప్రాయశ్చిత్తములు లేవు
నిన్నుఁ జూచుటకంటె నీలకంఠ!
నీమండలంబున నిఖిలజంతువులకుఁ
దారకం బల్భ్రాంతిదశను దోఁచుఁ
గలియుగంబునయందుఁ గడుదుర్లభంబులు
భవదీయదర్శనస్పర్శనములు
నీదక్షవాటికానిలయంబునం దుండు
జనులకు భోగమోక్షములు వలఁతి

తే. శిష్యులును నేను మిమ్ముఁ గొల్చెదము భక్తి
విశ్వపతికోపమునఁ గాశి వెడలి వచ్చి
తరసి రక్షింపు మమ్ము దయార్ద్రహృదయ!
శాంత! భీమేశ్వరేశ్వరస్వామి! నాథ! 194

వ. అని మఱియుఁ గృష్ణద్వైపాయనుండు. 195

వ్యా సు లీ శ్వ రు ను తి ం చు ట

సీ. దేవదేవునకు నాదికి నాది యగువాని
కంబికాపతికి దక్షాధ్వరారి
కహితపురత్రయాధ్యక్షసంహారునకు
హరిలోచనాంబుజాభ్యర్చితునకు

బ్రహ్మాది దేవతోపాస్యసన్మూర్తికి
సమృతమూర్తికిని స్వయంభువునకు
నిగమార్థవిద్యోపనిషదంగనామౌళి
చుంబిత శ్రీచరణాంబుజునకు

తే. భోగమోక్షంబు లతిపాపబుద్ధులకును
కరుణ నొసఁగెడు ప్రత్యక్షకల్పశాఖి
[1]గరుడగంధర్వయక్షసిద్ధాదిదివ్య
వంద్యునకు మ్రొక్కెదను భక్తవత్సలునకు. 196

సీ. శ్రీభీమనాయక శివనామధేయంబు
చింతింప నేర్చిన జిహ్వ జిహ్వ
దక్షవాటీపురాధ్యక్ష మోహనమూర్తి
చూడంగ నేర్చిన చూపు చూపు
దక్షిణాంబుధితటస్థాయిపావనకీర్తి
చే నింప నేర్చిన చెవులు చెవులు,
తారకబ్రహ్మవిద్యాదాతయాదల
విరులు పూన్పఁగ నేర్చు కరము కరము

తే. ధవళకర శేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁ దిరుగంగ నేర్చిన యడుగు లడుగు
లంబికానాయక ధ్యానహర్ష జలధి
మధ్యమునఁ దేలియాడెడి మనసు మనసు. 197

ఉ. మాటలు పెక్కు లేటికిని మందరభూధరమంథనక్రియా
పాటలఘూర్ణమానజలభారమహోదధికాలకూటసం
ఘాటకృపీటసంభవశిఖావికటస్ఫుటవిస్ఫులింగవి
స్ఫోటపవిత్రసద్భువనభూతభయాపహు నాశ్రయించెదన్. 198

స్రగ్ధర—

కాక్షింభర్యంబు దీర్పం గడుపున కిడుదుం గాలసంప్రాప్తభిక్షు
స్వీక్షింతుం భోధభక్తి న్విషయముల మది న్నిస్పృహత్వంబుదాల్తున్
దక్షారామాధినాథున్ ధవళవరకరోత్తంసజూటావిటంకు
స్వీక్షింతున్భీమనాథుంద్రిభువననమితు న్నేత్రముల్ తృప్తిపొందన్.199

శా. అష్టాశీతిసహస్రసంయమిజనవ్యాకీర్ణతీరద్వయీ
జుష్టోదంచిత సప్తసింధుసలిలస్రోతోవగాహక్రియా
తుష్టస్వాంతుఁడనై భజింతుఁ గరుణాదుగ్ధాబ్ధి భీమేశ్వరున్
దృష్టాదృష్టఫలప్రదానవిభవాధిష్ఠానచేతస్కునిన్. 200

ఉత్సాహము—

యక్షసిద్ధసాధ్యఖేవిహారగరుడకిన్నరా
ధ్యక్షమణికిరీటకోటితరుణకిరణమంజరీ
ప్రేక్షణీయచరణకమలు భీమనాథదేవునిన్
దక్షవాటికాపురైకధాము నాశ్రయించెదన్. 201

ఉత్సాహము—

నిష్ఠతో భజింతు భీమునిన్ భుజంగహారునిన్
దిష్ఠుని ప్రవీంద్రసంప్రతిష్ఠునిం గరిష్ఠు భూ
యిష్ఠు దక్షవాటికాస్థలీశు దేవతాకుల
జ్యేష్ఠుని న్వసిష్ఠముఖ్యశిష్టమునిజనార్చితున్. 202

లయగ్రాహి—

నే మమున మ్రొక్కెదను హేమగిరిచాపునకు
సామజజలంధరముఖామరవిరోధి
గ్రామమదహారి కభిరామశుభనిర్మలసు
ధామయశరీరునకుఁ గామితవితీర్ణ

శ్రీమహిమశాలికి జరామరణదోషపరి
శామకనిజాంఘ్రియుగళీమతికి దక్షా
రామపురధామమునకుఁ గోమలజటామకుట
ధామహిమధామునకు భీమునకు భక్తిన్. 203

సీ. కొలుతు సద్యోజాతుఁ గోమలైందవతనుఁ
బెద్దగుబ్బలిరాజుపెండ్లికొడుకు
సేవింతు శ్రీవామదేవు మహాదేవు
నేడులోకంబులు నేలు జేనిఁ
దెలఁతుఁ దత్పురుషు నిందీవరవినీల
చారుకంధరుని బశ్యల్లలాటుఁ
బ్రణుతింతు నీశాను ఫాలనేత్రానల
జ్వాలాసమాలీఢశంబరారి.
తే. సర్గసంసారశూన్యుని సంస్తుతింతు
సర్గసంసారహేతువు సంస్మరింతు
సర్గసంసారరూపుని సంశ్రయింతు
నభవు భీమేశ్వరేశ్వరు నభిలషింతు. 204

సీ. ఎవ్వనియాజ్ఞ నీరేడులోకంబులు
వర్తించు నట్టిదేవరకుఁ గాక
గ్రహతారకములు నిక్కముగ నెవ్వనియాజ్ఞ
వర్తిల్లు నట్టిదేవరకుఁ గాక
మనువులు పదునాల్గురును యదాజ్ఞాశక్తి
వర్తింతు రట్టిదేవరకుఁగాక
భువనపాలకులు యద్భ్రూభలతాజ్ఞాయుక్తి
వర్తింతు రట్టిదేవరకుఁ గాక

తే. ధూర్జటికిఁగాక భీమనాథునకుఁ గాక
నిఖలకారుణ్యకల్యాణనిధికిఁ గాక
యన్యదైవంబులకు నేల యధికభక్తి
సంఘటింతుఁ గరాంబుజాంజలిపుటంబు. 205

క. క్షమియింపు భీమనాయక!
కమలభవాద్యమరరాజకాంచనమకుటీ
సముదయమణిఘృణి రేఖా
కమనీయపదాంబుజోపకంఠోద్దేశా! 206

క. కావుము దాక్షారామపు
రీవల్లభ! భీమనాథ! త్రిజగదధీశా!
కైవల్యభోగలక్ష్మీ
ప్రావీణ్యప్రదకటాక్ష! భక్తాధీనా! 207

క. కృప గల్గి భీమనాయక?
యపరాధము సైపు తండ్రి వాదో కావో?
కృప గల్గి సుతుఁడు చేసిన
యపరాధము తండ్రి సైఁచు టర్హంబె కదా! 228

వ. అని ప్రార్థించి భక్త్యావేశంబున గద్గదస్వరకంఠుండును బాష్పాకుల లోచనుండును రోమాంచ పటలకంచుకితనిఖిలావయవుండునై వెం డియును. 209

సీ. గరళకూటవినీలకంఠాయ శంభవే
మదనాంతకా యోంనమశ్శివాయ
కాద్రవేయాధిపగ్రైవేయభూషాయ
మధుభిత్సఖా యోంనమశ్శివాయ

కుంభినీధరసుతాకుచకుంభపరిరంభ
మహాలోలుపా యోంనమశ్శివాయ
వేదాదినిశ్శేషవిద్యావధూమౌళి
మణికలాపా యోంనమశ్శివాయ

తే. గంధదంతావళజలంధరాంతకాది
విబుధపరిపంథివాహినీనిబిడవర్గ
బంధఘోరాంధకారసంభారకిరణ
మాలినే శాశ్వతా యోంనమశ్శివాయ. 210

వ. ఓం జయ! జయ! దేవదేవ! గంధర్వసిద్ధవిద్యాధరచారణకిన్నరకింపురుషులహంపూర్వికాసంఫుల్లపుటంబులగుచేతస్సంపుటంబులఁ బుటపుటనగు భక్తివిశేషంబుల శేషాహికటకభూషావిశేషాభిరామంబు లగు మీ కోమల శ్రీపాదకిసలయంబుల ఘుసృణమణికోటీరకోటీవిటంక సందానితమందారమాలికామకరందబిందుధారాధోరణీప్రవాహంబులనహరహంబు నభిషేకింతురు; కంఠేకాలా! మీకంఠమూలంబునం గలువదండకైవడిం గనుపట్టు కరాళకాలకూటవిషమషీకళంక పంకచ్ఛాయాచ్ఛటాగుళుచ్ఛంబులవలన నిఖిలలోకసంరక్షణంబు నిగమవ్యాఖ్యాతంబు; మహానటా! మీజటాజూటపటలంబున డిగిన వియద్గంగానిర్ఝరస్రోతశ్శిలాకానికాయంబులఁ ద్రిలోకీకంఠోపకంఠంబులు తారహారవల్లీమతల్లిభంగి నంగీకరించు; శంకరా! నీవు సంకర్షణరుద్రావతారంబునఁ బాతాళగోళంబు వెడలి విషదహనవిస్ఫులింగవికటదంష్ట్రాటంకకిటకిటత్కారఘోరంబును జిహ్మాలంబును నగు వదనగహ్వరంబునఁ బుండరీకభవాండపిండంబు లొండొండ యణంగఁ గమిచి మ్రింగుదు; ధూర్జటీ! విలయపర్జన్యగర్జాడంబరంబును విడంబించు కహాకహాట్టహాసంబునన్ బిట్టు ధట్టించి యవష్టంభ సంభారదుర్వార

గర్వారంభసముజ్జృంభితుండగు జంభారిభుజార్గళావిజృంభణంబు హస్త
ధృతదంభోళితోడ సంస్తంభించితి; ధనదసఖా! నిఖిలకకుబవధివల
యంబులఁ గలయఁ గనత్కనకనఖశిలాకానికాయచ్ఛాయాదాయా
దంబు లగు సముజ్జ్వలజ్వాలాజాలంబులు విజృంభింప ననలస్తంభ
దివ్యలింగాకారంబున నావిర్భవించి [1]నీవు భూభవనచక్రవాళపర్యంతం
బాక్రమించి పెరిగినప్పుడు విరించి రాయంచయుఁ గైటభారి కిటియును
నై యెగసి యుడిగియును దుద మొదలుఁ దెలియరైరి; రుద్రా! నీవు
భద్రదేవదారుద్రుమవాటవీవాటియందు దిసమొల దూబలఱదిండి
మిండజంగంబవై ఋషులపుణ్యాంగనల యీలువు లపాంగరంగస్థలీ
లాస్యలంపటంబులగు కటాక్షవీక్షణంబుల హరించుచు భిక్షాటన
క్రీడను నటించితి; చండీశ్వరా! నీవు మేరుకోదండంబునఁ బుండరీ
కాక్షకాండంబు దొడిగి కుండలిజ్యావల్లరీఝల్లరీఝంకారంబునఁ
బంకరుహభవాండంబు[2]చిటిగిల నిశాటపుటభేదనంబు లొక్కయేటున
ఛటచ్ఛట నేసితివి; నీలలోహితా! యహరహోవధిసంధ్యాసమ
యారంభంబుల నుద్దేశదినావసానంబుల సానందంబుగాఁ బరిఢవించు
జగఝ్ఝంకారంబైన యారభటితాండవసముద్దండపాదభ్రమణవిభ్ర
మంబునఁ ద్రిభువన[3]దృక్కరంభంబు గావించితి; సర్వజ్ఞా! నిర్వి
కల్పంబు నిరస్తసమస్తోపాధికంబును సత్య[4]జ్ఞానానందంబునకు నికేత
నంబును నగు నిష్కలంకస్వరూపంబును వేదానువచనశాంతిదాంతి
క్షాంతిశ్రవణనిదిధ్యాసనాదు లగు సాధనంబుల నిర్ణిరోధనిరవగాఢ
నిరవబోధకత్వావిభాగంబునం దక్షీభవించి ముముక్షువులు లాభ
లక్ష్యంబును నభీక్షణంబును నభీప్సితంబును ననుభవింతురు. భర్గా!
భార్గవభృగ్వాంగిరసప్రధాననానామునిసమూహవిహితచరితాఘమర్ష
ణస్నానానాహ్నికౌఘయు నిజజలావగాహోపహానిఖిలాఘయు
జాహ్నవీసపత్నియు నగు గోదావరీమహానది నీకుం గేళీవిహారం బగు

1. నిలువు. 2. చిటగిల్ల. 3. భీకరంబు. 4. నానందంబగు.

కేళాకూళి; నిటలనయనా! గిటగిటని నడుగునడుగు నడుఁకు నడుములు వెణఁదలగు తెలికన్నులును నెఱికురులును వలుదకుచములును గలిగి ననవిల్తునకుఁ బసగలపసిండిమెఱుంగుములుకు లనం గలికిచిలుకల కొలుకులగు బిసరుహదళనయనలు ముసురుకొని బలిసి నిలిచి కొలువఁ బ్రతిసంక్రమణవారోత్సవాదులయందుఁ బేరోలగం బనధరింతువు ; శర్వా! నీవు శర్వరీసార్వభౌము నొక్కహజ్జన [1]గుజ్జుఱుక మట్టితివి ; బిసరుహభవుని కిసలయోష్ఠినాసికాతిలప్రసూనంబు నఖశిఖరాగ్రంబున మొదలంటం జిదిమితి ; వృషభధ్వజా! నీవు పూషుం డను పేరి రవిపండ్లు రాలఁగొట్టితి; యీశ్వరా! నీవు వైశ్వానరుని సప్తజిహ్వాపల్లవంబులు పెల్లగిల గిల్లితి; విరూపాక్షా! నీవు దక్షప్రజాపతికంఠంబున మేషంబుతల నిల్పితి; మృగవ్యాధా! నీ వధ్వరమృగంబు మస్తకంబు నభస్తలంబున వ్రేలఁగట్టితి ; ముక్కంటీ! నీకు మ్రొక్కెదను ; శివా! నీకు సేవాంజలి; భవా! నీ కభివాదనంబు; పాండురాంగా! నీకు దండంబు; రాజశేఖరా! నీకు జేజే; హరా! నీకు జోహారు; గిరీశా! నీకు వరివస్య ; యష్టమూర్తీ! నీకుఁ బ్రతిష్ఠ; యీశానా! నీకు దాస్యంబు; త్రిపురహరా! నీ కుపాసన; మృడా! నీకు శరణు; మృత్యుంజయా! నీకుఁ బ్రపత్తి; ప్రమథాధిపా! నీకు నారాధనంబు; పినాకీ! నీకు నమస్కారంబు; కైలాసనిలయా! నీకుఁ [2]గొలువు; పశ్యల్లలాటా! నీకు నేటికోళ్లు; గౌరీమనోహరా! నీకు నమస్కారంబు; జయ జయ జలంధరాంతకా! గంధసింధురాది దనుజకంధరాపీఠధమనీగళితరక్తధారాభిషిక్త ప్రచండఖండపరశు భిండివాల శూల ప్రముఖ బహువిధప్రహరణపరంపరాభీలమహాకారా! జయజయ! జగత్సం

1. గుజ్జురూపంబున.

18

భారకుంభకల్పనాకుంభ కారా! కుంభీనసభూషణ! భీషణభూతప్రేత పిశాచ శాకినీడాకినీప్రౌఢపరివారా! జయజయ! వియద్వాయుధరణీ తరణిశీతభాను బృహద్భాను సలిలయజమానమూర్తి కల్పితాష్టభేద ప్రపంచిత విశ్వప్రపంచ! పంచవదనపంచాక్షరీమూలమంత్రకారణ పాంచభౌతికవ్యవహారా! నిర్మలజ్యోతిర్లింగమయ మంగళాకారా! జయజయ! సప్తపాతాళభువనవిష్కంభ నిర్భేదనసమాసాదితావి ర్భావ! భావజసంహారా! సర్వమంగళాకుచకలశపాళీ కేళీతూలికా కారమకరికాముద్రికాభీమముద్రితోరఃప్రదేశ! మహేశ! జయజయ! భక్తభావనాసులభ! స్వభావనాతీత పావనాకార ధావళ్యవిగ్రహా! శ్రీమన్మహాదేవ! దేవతారాధ్య! దక్షవాటీపురాధ్యక్షా! ఆపద్ధ్వాంత దివాకరా! పరమదయాకరా! జయజయ శ్రీభీమేశ్వరా! నమస్తే నమస్తే నమః. 212

మ. అనుచుం దాండవ మాడుచుండె శివభక్త్యావేశలీలార్భటి
న్మునిశార్దూలము దక్షవాటినడుమ న్లోలజ్జటాభారుఁడై
వినిపించె న్నశరీరభారతి నభోవీథీవిటంకంబున
న్నిను రక్షించెను భీమనాయకుఁడు కానిమ్మా! సుఖంబుండుమీ. 213

తే. కాచె నీతప్పు కల్మాషకంధరుండు
శిశిరకరశేఖరుండు రక్షించె నిన్ను
భీమనాథుని త్రిభువనస్వామిఁ గొలుము
కార్యసంసిద్ధిఁ బొందెదు కానివేయ! 214

వ. అని యివ్విధంబున నశరీరవాణి పలికిన విని యయ్యంతర్వాణి శర్వాణీవల్లభుం దలంచి పునఃపునఃప్రణామంబులు సేసి నితాంత సంతోషతరంగితాంతరంగుండై. 215

సీ. పైల! దక్షారామపతి భీమనాథుండు
మనపాలికల్ప[1]కక్ష్మాజ సుమ్యె
నోసుమంతుఁడ! దక్షిణోద్యానవాటికా
నిలయుండు మనపాలిఫలము సువ్వె
జైమినీ! దేవతాసార్వభౌముఁడు విహా
పాక్షుండు ప్రత్యక్షమయ్యెఁ జువ్వె
దేవల! సప్తగోదావరీతీరైక
వాసుండు మనవంక వ్రాలెఁ జువ్వె

తే. భారతాదిబహుగ్రంథపారవశ్య
యోయి! జనమేజయుండ! యీయుక్షగమనుఁ
డంబికాభర్త యఖిలకల్యాణములును
మనకుఁ గృపసేయఁగలఁడు సమ్మదముతోడ. 216

వ. ఇంకఁ గృతార్థులమైతి మని శిష్యవర్గంబునుం దానును దక్షారామం
బున నభిరామంబైన పరమజ్ఞానానందసుఖం బనుభవించుచుండె. 217

క. శ్రీరామాయణమును ద
క్షారామాయణముఁ గలిమలాపహములు స
త్సారమతులు వాల్మీకికిఁ
బారాశర్యునకు వినుతిపాత్రము లయ్యెన్. 218

వ. అని చెప్పిన విని యభినందించుటయు భీమేశ్వరమాహాత్మ్యంబు విను
వేడుకం బరమేశ్వరుం డుద్భవించినవిధంబును సప్తఋషులు సప్త
గోదావరంబుఁ దెచ్చినవిధంబును నాస్వామిని బ్రతిష్ఠచేసినభంగియు
నెఱింగింపవే యని ప్రార్థించిన. 219

1. కల్పవృక్షంబుసువ్వె.

శా. గాంధర్వోపనిషన్మతంగ! రసవత్కావ్యానుసారానుధా
రంధర్యాపరభోజరాజ! రమణీప్రద్యుమ్న! దోర్వీర్యగ
ర్వాంధారాతివరూధినీపరివృఢప్రాణానిలాహారవా
తాంధఃక్రూరకృపాణ! రాజహితకార్యారంభపారంగతా! 220

క. దక్షారామవధూటీ
వక్షోరుహమృగమదాదివాంఛితవిలస
ద్వక్షఃకవాట! బాంధవ
రక్షావిధివజ్రపంజర! కృపాజలధీ 221

పంచచామరము.

అభంగవీరవిక్రమార్క! యాజిగాండివాయుధా!
ప్రభాతకాలభానుసన్నిభప్రభావిభాస్వరా!
యిభద్విడుగ్రవిక్రమా! సమిద్ధనర్తనభ్రమ
న్నభస్సరిత్పయఃపృషద్గణాచ్ఛవిస్ఫురద్యశా! 222

గద్య:— ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర
సుకవిజన విధేయ శ్రీనాధనామధేయ ప్రణీతంబైన
భీమేశ్వరపురాణం బను మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.

# శ్రీ భీమేశ్వర పురాణము

## చతుర్థాశ్వాసము

శ్రీధామ! యశేషదిశా
సౌధాగ్రస్ఫటికకుంభసంభారకళా
సాధీయస్మితకీర్తిబు
ధాధార! యరేటి యన్న యామాత్యమణీ! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె 2

గీ. బాదరాయణునకుఁ గుంభభవుఁడు చెప్పి
నట్టి యాత్రాక్రమం బిది యనఘులార!
యమరముని నారదుఁడు మునీంద్రాదులకును
నర్థిఁ జెప్పినపరిపాటి యది వినుండు. 3

వ. మీర లడిగిన యర్థంబు పర్యాయక్రమంబున వినిపించెద. 4

తే. ఏఁయె వారాణసికి బాదరాయణుండు
శిష్యులును దాను గైవల్యసిద్ధిఁ గోరి
మనముఁ బోదముగా కంచు మనసు వేడ్క
నరిగి రభ్యర్హితులు వసిష్ఠాదిమునులు. 5

క. యాత్రా [1]జిగమిషఁ బుణ్య
క్షేత్రంబులమీఁద దీర్ఘసేవాపరులై
మైత్రావరుణబృహస్ప
త్యత్రిభరద్వాజముఖ్యు లగుమునిబుషభుల్. 6

1. జిగీష.

ఉ. కాశికి నేఁగుదెంచి మణికర్ణికయందుఁ బ్రయాగయందు నా
కాశనదీప్రవాహమునఁ గాయము దొప్పఁగఁదోఁచి శంభు వి
శ్వేశు శశాంకశేఖరు ననేకవిధంబులఁ గొల్చి సంతత
క్లేశవినాశహేతువునఁ గేవలతాసుఖ మిచ్చుఁ గోరుచున్. 7

క. కేవల [1]తాయకరంబును
భావలతావాటిమలయపవనాగమమై
[2] కేవలతాలీలావతి
కేవలతాకాశి మరగు కృతమతి మనసా.

వ. అని కాశీనగరంబునందుఁ గైవల్యాపేక్షఁ బెద్దగాలం బుం...
యించి, సాత్యవతేయు వెదకి, యెచ్చటం గానక.

శా. కాశీస్థాననివాసుల న్యతుల భిక్షావృత్తులం గాంచి "పా
రాశర్యుం డెటఁ బోయె" నంచు నడుగన్ "బ్రజ్ఞావిహీనాత్మకుం
డాశార్యుం డెటఁ బోయెనో యెఱుఁగమయ్యా!" మీరు పోపొండు వి
శ్వేశద్రోహి నెఱుంగ నేమిపని ? వాఁ డెచ్చోటికిం బోవునో ! 10

వ. అని సాత్యవతేయుండు చేసిన యపరాధంబు తేటపడం జెప్పిన. 11

తే. కూడు పెట్టక యేన్నాళ్లు కుతిలపఱచి
గాసిసేయుట యిది తప్పుగాదె తనకు ?
నెదురు[3] లేదు లేల కోపించె నిందుధరుఁడు ?
అకట ! [4]గ్రుడ్డెఱ్ఱి బాదరాయణునిమీఁద. 12

క. ద్వైపాయనముని వెడలం
ద్రోపించిన కోపగాఁడు ధూర్జటి యీకా

---

1. తాయక్కఋషిములు. 2. యీవలతాత్పర్యమువిడి. 3. నెదురుగందు రి.
4. గొడ్డెఱ్ఱి,

శ్రీపతి మనలను ననుకం
పాపరుఁడై యిచట నేల బ్రతుకఁగనిచ్చున్. 13

వ. కృష్ణద్వైపాయనుతోఁడిద లోకంబు గాక యనుచు నమ్మునిలోకంబు కాశికానగరంబు వెలువడి శాఖోపశాఖల నతనిచొప్పు పట్టుకొని దక్షారామంబు ప్రవేశించి. 14

తే. తీర్థయాత్రాక్రమంబులు తెలియలేక
నారదుండు నానాపురాణజ్ఞుఁ డగుట
నతనిఁ బూజించి యందఱు నడిగి రప్పు
డత్రిజమదగ్ని భృగువసిష్ఠాదిమునులు. 15

మత్తకోకిలము—
నీ వెఱుంగని తీర్థము ల్ధరణీతలంబున లేవు స
ద్భావ మొప్పఁగఁ జెప్పు దైవతతాపసోత్తమ! తీర్థయా
త్రావిధానము దక్షవాటికథాక్రమంబును సప్తగో
దావరప్రథిమంబు భీమసదాశివోద్భవలీలయున్. 16

వ. అని యడిగిన నారదుం డిట్లనియె. 17

తే. అఖిలతీర్థోత్తమోత్తమం బనఘులార!
పావనంబైన సప్తగోదావరంబు
తనకుఁ దాన మహానదీతటమునందు
నెలమి నున్నాఁడు భీమేశ్వరేశ్వరుండు. 18

తే. సప్తగోదావరంబు నిర్ఝర మనఁగ
భీమనాథేశ్వరస్వామి వేలు పనఁగ
ధర్మపరులార! శబ్దభేదంబు గాని
యర్థభేదంబు లేదు పదార్థసరణి. 19

తే. విమలమతి సప్తగోదావరమునఁ గ్రుంకి
సప్తసప్తిప్రతిష్ఠఁ బ్రసన్నుఁడైన
భీమనాథేశ్వరేశ్వరస్వామిఁ జూచు
మనుజులకుఁ బాయు సప్తజన్మములయఘము. 20

వ. సప్తగోదావరస్నానమంత్రద్వయశ్లోకములు. 21

శ్లో. సప్తగోదావరమ్ తీర్థమ్ సర్వతీర్థోత్తమోత్తమమ్
అత్ర సన్నిహితో రుద్రో భీమనాథేశ్వరేశ్వరః. 22

శ్లో. నమస్తే భీమనాథాయ సప్తగోదావరాంభసే
పాపేంధనాగ్నయే తుభ్యం నిమజ్జామి హర త్వయి. 23

ఉ. ఆతతభక్తిభావమున నాదియుగంబున సప్తసంయము
ల్గౌతమముఖ్యు [1]లైందవకళాధరు భీమయదేవు లోకవి
ఖ్యాతిఁ బ్రతిష్ఠచేసి [2]సతతార్చజలార్థము తోడితెచ్చి ర
స్వీతసమస్తతీర్థ మయి విశ్రుతి కెక్కిన సప్తసింధువున్. 24

మ. తనతీరంబును బాయకున్నఁ దనపాథఃపూరముల్ గ్రోలినం
దనవీచీతతిఁ దేలినం దనమరుద్వ్రాతంబు సేవించినం
దనుఁ గీర్తించిన లోకపావనునిగా ధన్యాత్ముఁగాఁ బుణ్యుఁగా
నొనరించున్ నరు సప్తసింధువది యంహోభంజనప్రౌఢిమన్. 25

క. చూడుం డాస్వాదింపుం
డాడుఁడు భీమేశ్వరేశ్వరాకృతిఁ దటిసీ
చూడారత్నము జడధి
క్రోడాభరణంబు సప్తగోదావరమున్. 26

1. ఇందుశకలా 2. యభిషేక.

144(A)



70 స్తంభముల సోమవార మండపము



అష్టభైరవులతో శ్రీకాలభైరవ స్వామివారు

144(13)



శ్రీ శంకర నారాయణస్వామివారు



నందీశ్వరుడు

సీ. పాతాళ శ్రీకాలభైరవస్వామికి
నందికి నభివాదనం బొనర్చి
నాకులేశ్వర దేవునకుఁ దాండవాకార
గణనాయకునకును బ్రణుతిచేసి
కొమరసామిని విష్ణుఁ గొల్చి విరూపాక్ష
నాగేంద్రులకు వందనంబు నడిపి
నీహారగిరినందినికి మహాలింగంబు
భీమనాథేశ్వరస్వామి కెరఁగి

తే. మర్త్యుఁ డేకాదశేంద్రియమదవికార
సంభృతములై యనన్యైకసాధ్యములయి
జన్మజన్మాంతరంబులఁ జాగుచుండు
కల్మషంబులఁ బాయుఁ దక్షిణమునంద. 27

శా. జ్ఞానాజ్ఞానకృతంబులైన యఘముల్ సర్వంబు నొక్కుత్తున
న్మాను న్మావనకోటి కుద్ధురగతి న్సప్తాపగాతీరసం
స్థానావాసుని రామనాథుని జటా[1]ఝూటాటవీవాటికా
స్థానాధిష్ఠిత[2]దుగ్ధకంధిభవముగ్ధస్నిగ్ధకీర్తిద్యుతిన్. 28

తే. ద్వాదశక్షేత్రశివలింగదర్శనమున
నెట్టి సుకృతంబు సిద్ధించు నట్టిసుకృత
మాక్షణంబున సిద్ధించు దక్షవాటి
రామనాథేశుఁ గన్నులారంగఁ గనిన. 29

తే. ద్వాదశక్షేత్రతీర్థయాత్రాభివృద్ధి
నిర్జితేంద్రియులై సేయ నేర్చిరేని

1. జూటాలుశృంగాటికా. 2. దుర్గకంఠనవ.

పాపములు చేసినట్టి నిర్భాగ్యులైన
డాయఁ బోవరు జమునిపట్టణము[1]గవను. 30

ఉ. దక్షిణకాశికాతుహినధామకిరీటునిదిక్కు సీమగా
దక్షపురంబునందు బహుధామముల న్శివలింగము ల్సహ
స్రాక్షహుతాశనాదివివిధామరముఖ్యప్రతిష్ఠితంబులై
లక్షలసంఖ్య లున్నవి యలక్ష్యము లయ్యును గానవచ్చియున్. 31

సీ. వలవ దగ్నిష్టోమవాజపేయాదుల
ధూమపానముచేసి దుఃఖపడఁగ
తీర్థసేవార్థమై దేశాంతరంబులు
గాలు చేడ్పడఁ దన కేల తిరుగ?
నశ్వగోమహిషరూప్యసువర్ణవస్త్రంబు
లెన్ని వెచ్చించిన నేమి ఫలము?
సంతతంబును గృచ్ఛ్రచాంద్రాయణాదుల
వనటుచు[2]నుంట యెవ్వారికి మెచ్చు?
తే. దూరమున నుండి తలఁచిన దురితహారుని
జేరి కొలిచిన సకలార్థసిద్ధికరుని
నంతిమావస్థ మోక్షదీక్షైకగురుని
భీమనాథేశ్వరేశ్వరస్వామిఁ గొలుఁడు. 32

సీ. ఏఁ గొమ్ముటేనుఁగ నేవిహంగంబను
నేస్తబ్ధరోమంబ నేను గొఱియ
నేను బకంబను నేను గర్కటకంబ
నేనచ్ఛభల్లంబ నేను గుక్క

1. గవిని. 2. వనరుచు.

నేను మండూకంబ నేను గించులికంబ
నేను గీటంబ నే వానరంబ
నే శుకకీటంబ నేఁ బుండరీకంబ
నే ఖంజరీటంబ నేను దోమ

తే. నేను మానిసి ము న్నంచు నేకతమున
[1] నొండొరులతోడఁ జెప్పుకొం డ్రుబుచుకొనుచుఁ
దారకబ్రహ్మమణి పేటి దక్షవాటి
సంభవించిన ప్రత్యగ్రచంద్రధరులు. 33

తే. అఖిలతీర్థప్రదేశంబు లడవు లి ట్లు
యజ్ఞవాటిక వల్లకాఁ డనువిభేద
మించుకయు లేదు భీమనాథేశభూమి
జంతువులు శంభు లగుదురు చచ్చినపుడు. 34

శా. సాక్షాద్దక్షిణకాశికానగరి దక్షస్థాన మవ్వీటిలో
మోక్షార్థాక్షరదీక్ష నక్షయసుఖంబుం బ్రాణికి న్సత్కృపా
వీక్షా పక్ష్మలితానురాగుఁ డగుచున్ విశ్వేశుచందంబునన్
బ్రత్యక్షుం డీశుఁడు భీమనాథుఁ డొసఁగుం బ్రాణావసానంబునన్. 35

శా. శ్రీభీమేశ్వరపాదపీఠవిలుఠచ్ఛ్రీసప్తగోదావర
వ్యాభుగ్నోర్మిపరంపరా ఘుమఘుమ ప్రారంభకోలాహల
క్షోభోద్వేజితపాతకౌఘము జగచ్చూడావతంసంబు ల
క్ష్మీభద్రాసన మొప్పు దక్షనగరీక్షేత్రంబు ధాత్రీస్థలిన్. 36

వ. అని నారదుండు చెప్పిన విని తపోధనులు భీమనాథుమాహాత్మ్యంబు నకు దక్షారామప్రభావంబునకు సప్తగోదావరమహిమంబునకు విస్మయం బందియు, దర్శించియు నమస్కరించియు ధన్యులైన యా

1. తోడుతఁ జెప్పుకొందురుబుసు. 2. పక్షసితానురాగుఁడు.

త్మారాము లమ్మహారామంబునం జరియించువారును నగుచు సత్య
వతీసుతుం గాంచి దక్షారామాయణుండైన బాదరాయణునివలన
నప్పుణ్యస్థానంబున మఱియుం గలయ శేషవిశేషంబు లెఱింగి. 37

చ. అటఁ జని యొక్కచోటఁ గమలాసనబంధము పూని వాహినీ
తటమున బిల్వకాననలతాగృహమధ్యమునందు నాసికా
పుటశిఖరాగ్రదృష్టి యగుపుణ్యుని గాంచిరి మానిపుంగవుల్
ఘటమున నుద్భవించిన యగస్త్య యశోనిధి నిల్వలాంతకున్. 38

వ. తదనంతరంబ యతనితో సల్లాపంబుల నపనయించి, తీర్థమాహాత్మ్యం
బడిగిన నతం డిట్లనియె. 39

అగస్త్యుఁడు తీర్థమాహాత్మ్యంబు సెప్పుట

సీ. జహ్నుకన్యాతీరసన్నివేశమునకు
దక్షిణాంభోరాశితటము సాటి
కమనీయమణికర్ణికాప్రవాహమునకు
సప్తగోదావరజలము సాటి
కటకరక్షకుఁడైన కాలభైరవునకుఁ
బ్రకటపాతాళభైరవుఁడు సాటి
విశ్వాధిపతియైన విశ్వనాయకునకు
భీమనాథేశ్వరస్వామి సాటి

తే. మోక్షవిభవంబునకు సాటి మోక్షలక్ష్మి
భోగమహిమంబునకు సాటి భోగమహిమ
వారణాసికి శ్రీదక్షవాటమునకుఁ
దారతమ్యంబు చర్చింప ధర్మ మగునె? 40

తే. తరమె వర్ణింప సప్తగోదావరంబు
సలిలకల్లోలశిఖరహస్తంబు లెత్తి
పాతకంబుల జంకించు బహువిధముల
ఘుమఘుమారంభహుంకారఘోష మెసఁగ. 41

వ. అని కుంభసంభవుండు చెప్పిన విని యమ్మాహాత్మ్య మీడ్కొని నగర ప్రదక్షిణపూర్వకంబుగా భీమేశ్వరు దర్శించి కృతార్థులై యొక్క రమ్యస్థలంబున నమ్మహామునులు గూర్చుండిరి; యనంతరంబ. 42

ఉ. ఆమునిమండలంబునకు నంజలిబంధముతోఁ బ్రదక్షిణ
ప్రామనమస్కృతుల్ నడిపి గారవ మారఁగ మంకణుండు ఋ
క్సామయజుర్విశారదుఁడు శైవపురాణకథారహస్య గో
ష్ఠీముదితాంతరంగుఁడు ప్రసిద్ధుఁడు భక్తి దలిర్ప నిట్లనున్. 43

సీ. పరమపుణ్యుఁడ నైతి భాగ్యవంతుఁడ నైతి
ధన్యుండ నైతి నాతపసు పండెఁ
దీర్థంబు లన్నియుఁ దిరిగి చూడఁగఁ జాల
నొక్కజన్మమున నీయుర్విలోన
దిగ్దేశముల సర్వతీర్థంబులను నాడి
తీర్థభూతత్వప్రతిష్ఠఁ గన్న
మిమ్ముందఱను గంటి మీకృపాబలమున
నేను తీర్థమ నైతి నింత నిజము

తే. భీమనాథమాహాత్మ్యంబు పెంపు వినఁగ
వేడ్క యగుచుండు నాకు నీవేళయందుఁ
బ్రార్థనము చేసి వేఁడెద భవ్యులార!
యానతీఁదగు నాకు మీలోన నొకఁడు. 44

వ. అనిన విని యందఱు వసిష్ఠమహామునిం బ్రార్థించిన, సకలమునిజనా నుమతంబునఁ గుంభసంభవుని నియోగంబున నప్పుడు మైత్రావరు ణుండు మంకణున కిట్లనియె. 45

కం. భీమమగు గరళకూటము
[1]భూమిని గగనమున [2] దిశలఁ బొడసూపినచో
భీమగతిఁ బ్రమింగెఁ గావున
భీమేశ్వరుఁ డయ్యె నితఁడు బిరుదాంకమునన్. 46

వ. అనిన విని మంకణుండు పంకజాసనసంభవునితో "మునీంద్రా! దక్షవాటికాధీశ్వరుండు కాలకూటంబు నెబ్భంగి నుపసంహరించె; నక్కథాక్రమంబు పరిపాటిం దేటపడ నా కెఱింగింపవే" యనుటయు, నతం డిట్లని చెప్పం దొణంగెఁ! దొల్లి జలంధ రాంధక మహిషా

క్షీ ర సా గ ర మ థ న క థా ప్రా రం భ ము

సుర బిడాలాక్ష ధూమ్రాక్ష గంధసింధురాసుర విద్యున్మాలి తారక బలి బాణ పౌలోమ నివాతకవచ కాలకేయాదులగు రాక్షసులును, పాకశాసన పావక పరేతరాజ పలలాశి ప్రచేతస పవన పౌలస్త్య పశుపతి ప్రధానులగు వేల్పులునుం దమలోన దాయాదసంబంధం బునం బొడమిన వైరానుబంధంబునం బరస్పరవిజిగీషులై రోషంబున నెదురు వేలంబులు పెట్టి కట్టుపకాసులై ప్రతిఘటించి, బెట్టయి నెట్టు కొని యున్న సమయంబున 47

సీ. దివ్యాయుధములైదు [3]ధృతచేతనంబులై
శత్రుసంహారంబు సంస్తుతింపఁ
బులుఁగు ఱేఁడు కరాబ్జములు రెండు మొగిడించి
భ్రూలతాదేశంబుపోలుపు నరయ

1. భూమియు 2. గగనమును. 3. ధృతి.

సౌఖశాయనికులై సనకాదియోగీంద్రు
లనురాగవీక్షణం బభిలషింప
నూరురంభాస్తంభయుగళంబుపై నుంచి
లక్ష్మి శ్రీపాదపల్లవము లొత్తఁ

తే. పన్నగాధీశభోగతల్పంబుమీఁదఁ
దత్ఫణారత్నదీప్తి మైతళుకుఁ జూపఁ
బాలమున్నీటిలో నిద్రమేలుకొన్న
హరికిఁ బొడచూప నేతెంచె హరిహయుండు. 48

వ. ఇట్లు చనుదెంచి. 49

తే. ఒంటి నేతెంచి మంతనంబుండి నిలిచి
చక్రధరుతోడ హితకార్యచర్చ చేసి
యేఁగె దేవేంద్రుఁ డిరుచెవి నెఱుఁగకుండ
సిద్ధసంకల్పుఁడై యాత్మశిబిరమునకు. 50

వ. తదనంతరం బాశ్రీమన్నారాయణుండు. 51

క. ఓ వెఱ్ఱులార! యేఁటికి
నీఁ వెడఁగువిచారములు సహింపఁగ రాదా?
యేవారికైన మేలా
చావు లతర్కితము లుగ్రసంగ్రామములన్? 52

తే. కుడిచి కూర్చుండి మీ రేల కొఱఁతయైన
కుమ్ములాడెద? రోయన్నదమ్ములార!
గొఱ్ఱె క్రొవ్వియు సెలగట్టె గొఱికినట్లు
కటకటా! మీవివేకంబు గాడుపడఁగ. 53

ఉ. భద్రము మీకుఁ గావలె నపారముగా ; సురదైత్యులార! యీ
విద్రవ ముజ్జగింపుఁడు వివేకము పాకము దప్పకుండఁగా
భద్రసువర్ణపీఠికలపైఁ గొలువుండి త్రిలోకరాజ్య మ
చ్ఛిద్రముగాఁగ నేలుట విశేషమొ ? చచ్చుట తా విశేషమో ? 54

వ. అది గావున సుధాపానంబున జరామరణంబు లుజ్జగించి సుఖం బను
భవింపుఁడు ; క్షీరసముద్రమథనంబునం గాని సుధారసంబు సంభవిం
పదు గావున. 55

శా. క్షీరాంభోధి మథింపఁగా వలయు నక్షీణప్రతాపప్రభా
వారంభంబున నాదికచ్ఛపము మూలాధారకుండంబుగా
సారోదారము మందరాచలము చంచన్మంథదండంబుగా
గారామార రసాతలాధిపతి దృక్కర్ణుండు సూత్రంబుగన్. 56

ఆ. అనిన శౌరిపల్కు విని సమ్మతించి యా
దేవతలును బూర్వదేవతలును
నమృతమథనమునకు నారంభ మొనరించి
రుల్లమునఁ బ్రమోద ముప్పతిల్ల. 57

శా. బాహాస్తంభచతుష్టయంబున మురప్రధ్వంసి లంఘించి యు
త్సాహంబొప్పఁగ నెత్తె మందరమహీధ్రం బుద్ధతిం గూటసం
దోహంబుల్ ద్రుహిణాండకర్పరము నున్మూలింప దిక్సీమలం
గ్రాహింపం బతియాళునిష్ఠురమహాగండోపలధ్వానముల్. 58

సీ. కపటకచ్ఛపమైన కైటభాంతకువీపు
కొమరు మీఱిన చుట్టకుదురు గాఁగ
నారసాతలమూలమైన మందరమహా
ధరణీధరంబు మంథానకముగ

దండశూకాన్వవాయధ్యక్షుండు వాసుకి
 శతపరిగ్రహణసూత్రంబు గాఁగ
నానామహాప్రవహాదులగు మారుతంబులు
 తగులఁ గట్టిన యాఁకత్రాళ్లుగాఁగ
తే. బలిపురోగములైన దైత్యపరివృఢులును
దివిజనాయకుఁ డాదిగా దేవతలును
దరిచి రంభోధి ఘుమఘుమధ్వానరవము
భువనగోళంబు దిక్కులుఁ జెవుడుపడఁగ. 59

వ. ఇవ్విధంబున సురాసురవ్యూహంబు లుత్సాహంబులు మదంబులు ముదంబులు శౌర్యంబులు ధైర్యంబులు క్రౌర్యంబులు వీర్యంబులు హుంకారంబులు హుంకారంబు లుల్లాసంబులు ప్రహాసంబులు బలంబులు చలంబులు జవంబులు రవంబులు నదల్పులు విదల్పులు వీఁకులు తాఁకులు జూఁకలు కూఁకలు మూఁకలు వీఁకలు తెంపులు సగింపులు నింపులు సొంపులు పెంపులు గుంపులు పసవులు మురువులు గెలయ మెఱయ, బాహావష్టంభవిజృంభణంబునఁ దరణరంబు తరువం దరువఁ దటిత్రాడు పాపజేని నొడలిమలకలు పురులు విడి, తరులు వడి దిద్దిరం దిరుగు మందరగిరికందరాఘాతంబులం గలగుండువడి, నరిమకరతిమింగిలమత్స్యకచ్ఛపఘులీకుళీరంబులు సవ్యాపసవ్యయాతాయాత పరిభ్రమణంబులచేత విచేతనావస్థఁ బరిభ్రమించి యంతర్మగ్నంబులయిన పక్షక్షోణీధరంబులు తెక్కలు ముడుచుకొని గ్రుంగియణంగి [1]తీరంబుల నొదుగ దుగ్ధార్ణవంబు ఘూర్ణమానం బయ్యె; నప్పుడు భుజంగపుంగవవదననాసానిష్ఠ్యూత నిష్ఠుర విషనిశ్వాసపవనధారాసంధుక్షణంబున నభిష్యందజ్వాల

1. తరంబుల.

సంబు ప్రజ్వలించెనో యన, భుగభుగధ్వనితోడం గూడి సుడిగొన
నెగయు క్రొంబొగలవెంబడి విస్ఫులింగంబు లాస్ఫోటించి, దిక్కులం
జూఱుపుచ్చం జిచ్చు పెచ్చుపెరిగి, కోమలతమాలపల్లవంబులయుల్లా
సంబు నుల్లసంబాడు నల్లనినాలుకలు విషం బుమియుచుం గమియుచు,
భృంగసకాశంబును, నీలజీమూతసన్నిభంబును, గల్పాంతమయవహ్ని
కల్పంబును, గాలమృత్యుప్రతిమంబును, యుగాంతాగ్నివర్చసంబునునై
ఛటచ్ఛటాశబ్దంబులతో ననహ్యావిషజిహ్వాలకలాపంబులు బ్రహ్మాం
డకర్పరంబు నప్పళింప నిప్పులు చెదరి చదలు దరికొల్పు నుల్కా
పాతంబులుం బోలె దిక్కులం జురజుర స్రుక్కి లావెక్క సప్తపాతా
ళభువనచక్రవాళంబు పురపురం బొక్క వెక్కసంబయి కోలాహలా
భీలంబయి హాలాహలం బుద్భవించిన. 60

సీ. పంకజప్రభువుఁ డబ్రహ్మణ్య మొనరించెఁ
దాళసన్నిభ భుజాస్తంభ మెత్తి
తరిత్రాడు విడిచి బృందారకాసురకోటి
పంచబంగాళమై పాఱిపోయె
హాహానినాదకోలాహలోత్తాలమై
త్రైలోక్యమును భీతిఁ దల్లడిల్లెఁ
గనకవర్ణుండైన కైటభాసురవైరి
పొగచూరి నల్లనై బొగ్గుపడియెఁ
తే. బెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె దిక్కు
లురలెఁ బాతాళభువనంబు లుదిలె నభము
మేటిధాటీజనితకాలకూటవిషము
చిచ్చు విడువడి యంతంత పెచ్చుపెరుగ. 61

వ. అప్పుడు మిసిమింతుఁడుం గాక పయోధిప్రాంతంబున దక్షవాటంబున
హాటకసింహాసనాసీనుం డయిన లలాటలోచను భవబంధమోచను,

సోమశేఖరుని శరణంబు సొచ్చి హరివిరించిపురందరాది బృందారకు లిట్లనిరి. 62

చ. అభయము పార్వతీశ ! యభయంబు మహేశ ! శశాంకశేఖరా !
యభయము శూలపాణి ! యభయంబు మదాంధకకృతాంతమర్దనా !
యభయము ఫాలనేత్ర ! యభయంబు కృపామయ దివ్యమానసా !
యభయము భీమనాథ! యభయం బభయం బభయంబు శంకరా! 63

తే. అని భయభ్రాంతు లగుచు శక్రాదిసురులు
బలిపురోగములగు దైత్యపరివృఢులును
శరణు చొచ్చిన నభయహస్తంబు సాచి
వెఱవ కుండుఁడు మీ రని విశ్వవిభుఁడు. 64

శివుఁడు హాలాహలము మ్రింగుట

మ. పటుహుంకారమహాట్టహాసకలనం బాతాళభూస్వర్గసం
కటసన్నాహసముద్భవం బగున యాకాకోలకోలాగ్ని ధూ
ర్జటిహస్తాబ్జమునందుఁ గైకొనియె నాజ్వాలాకులజ్వాళ మ
ప్పటివేళ న్మదభృంగ మయ్యె శశిభృత్పాణ్యబ్జమధ్యంబునన్. 65

క. కటుక మగు విషము విషధర
కటకంబగు కేలఁ బూని కౌతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు రస
ఘుటికయునుం బోలె శివుఁడు గుటుకున మ్రింగెన్. 66

క. అపుడు హిమాచలకన్యక
యుపగూహన మాచరించునో యపుడుఁ జుట్టం
ద్రిపురాంతకుకంఠంబునఁ
దపనీయచ్ఛాయ నొప్పు తనదోర్వల్లిన్. 67

ఉ. చుట్టి బిగించి పట్టి పురసూదన! యీగరళాగ్నిఁ గంధరా
ఘట్టమునందు నిల్పు; మిదిగాక దిగంబడనిచ్చితేని లోఁ
బట్టున నున్నలోకముల భస్మముసేయు వెలార్చితేని వె
ల్పట్టున నున్నలోకముల భస్మముసేయు నిజంబు చెప్పితిన్. 68

వ. అనుటయు. 69

శా. శంభుం డంబికపల్కు గైకొని జగత్సంరక్షణార్థంబు సం
స్తంభించె న్నిజకంఠగోళమున విశ్వక్షోభసంత్రాససం
రంభారంభవిజృంభణోద్భటకళారౌద్రంబుఁ గాకోలమున్.
జంభారాతిమణిప్రకల్పిత [1]విభూషానిర్విశేషంబుగన్. 70

వ. అప్పుడు మహాదేవుని దేవత లిట్లని స్తుతియించిరి. 71

దేవత లీశ్వరుని స్తుతించుట

సీ. సచరాచరంబైన జగము రక్షించితి
హాలాహలాచలం బారగించి
శరణాగతత్రాణపరతంత్రభావంబు
నిఖిలలోకేశ్వర! నీకె యొప్పు
భువనైకరక్షణవ్యవహారచిహ్నాకు
గుఱుతయ్యె నీకంఠకోణచిహ్న
త్రైలోక్యభీమంబు కాలకూటము మ్రింగి
కైకొంటి భీమాఖ్యఁ గాలకంఠ!
తే. యఖిలదిక్పాలకులును నీయాజ్ఞవారు
నీదునిశ్వాసపవనంబు నిగమరాశి
యమరకులసార్వభౌమ! లోకాభిరామ!
దక్షవాటీపురీకేళిధామ! భీమ! 72

1. విశేషా.

తే. దేవదేవ! మహాదేవ! దివిజవంద్య!
సర్వలోకైకరక్షణచతుర! శర్వ!
హాలహాలకూటసంపర్క! నీలకంఠ!
మ్రొక్కెదము దేవికిని నీకు ముదముతోడ. 73

మ. బహిరంతస్స్థితలోకరక్షణకళాపారీణ శైలాత్మజన్
బహిరంతస్స్థితలోకరక్షణకళాపారీణుని న్దేవరన్
మహనీయస్థిరసత్కృపాగుణనిధానంబైన దాక్షాయణి
న్మహనీయస్థిరసత్కృపానిధి నిను న్వర్ణింతు మే మీశ్వరా! 74

తే. సంహరించితి భువనశోషకము విషము
నభయ మిచ్చితి రక్షించి తఖిలజగము
శాంతమయ్యె నరిష్ట మిష్టంబు ప్రబలె
దక్షిణాబ్ధితటావనిధామ! భీమ! 75

క. ధరణియు గగనము దిక్కులు
దరికొని మండెనువిషాగ్నిఁ దక్షణమాత్రం
గరమున ధరించి మ్రింగితి
నిరుపమధృతి నీక యొప్పు నీలగ్రీవా! 76

ఉ. ఆయతసత్కృపామహిమ హాలహలాగ్నిభయంబు నీమహా
పాయముచేతఁ బాపితివి; ప్రాల్గలవాఁడవు; దక్షవాటికా
నాయక! భీమలింగ! శమనం బొనరించితి గాక యింతకుం
గోయిలవన్నెఁ జెంది, మఱిఁ గొక్కెరవంకర వోవె లోకముల్. 77

క. లోకత్రయైకసంర
క్షాకల్పన మాచరింప సదృశులు వేల్పుల్
నీ కితరులు లేఁ; రధికులు
లేకుండుట చెప్పనేల? లేఖాధ్యక్షా! 78

తే. మమ్ము రక్షించి తని యేల మాటిమాటి
కభినుతింపంగ దక్షవాటాధినాథ!
తల్లిదండ్రులు రక్షింపఁ దలఁప కుండె
ప్రజల భీమేశ! బహువిధోపద్రవముల? 79

సీ. శ్రీభీమనాయకా! శివ! మమ్ము రక్షింపు
విశ్వైకనాథ! దేవియును నీవు
శ్రీనీలకంధరా! శేషాహిభూషణ!
మమ్ము రక్షింపు మమ్మయును నీవు
రక్షింపు మమ్ము శ్రీదక్షవాటీశ్వరా!
వేదాంతవేద్య దేవియును నీవు
దక్షిణాంబుధితటీధామ నిర్జితకామ
మమ్ము రక్షింపు మమ్మయును నీవు
తే. వేడ్క రక్షింపు దేవ! దేవియును నీవు
ప్రతిభ రక్షింపు గిరిశ! యంబయును నీవు
దుగ్ధపాథోధిభవవినిర్ధూమధామ
కాలకూటాగ్ని సంహారకారి! యభవ! 80

క. శరణము భజింతు మభవుని
శరణము భజియింతు మర్ధచంద్రాభరణున్
శరణము భజింతు మీశుని
శరణము భజియింతు మద్రిజావల్లభునిన్. 81

తే. సిరియు వాణియు మొదలైన సురపురంధ్రు
లబ్జుఁ గడుపును జల్లఁగా నభిలషించి
నియమమునఁ గొల్తు రెవ్వని నిత్యకలన
నట్టి భీమేశు నినుఁ గొల్తు మహరహంబు. 82

సీ. విశ్వంబు సృజియించు విధి; మహేంద్రుఁడు గాను
వివిధాధ్వరముల హావిర్విభాగ
మగ్ని యాహుతి మోవు నమరసంఘమునకుఁ
బాపపుణ్యంబు లేర్పఱచు యముఁడు
ప్రత్యవాయములచే బ్రతుకు రాక్షసతతి
వర్షించు పర్జన్యవరుణమూర్తి
గ్రహచక్రవాళంబు గాలి యెప్పుడు మోచుఁ
గొంద్రు సంతృప్తి లగ్గునఁ బితరులు
తే. నవనిధానములును యక్షనాథుఁ డేలు
నాసదాశివుఁ డీశానుఁడై తనర్చుఁ
బరగు నెవనాజ్ఞ నింద్రియప్రతతి నడుచు
నట్టిభీమేశ్వరుఁడు మాకు నభయ మొసఁగు. 83

సీ. వరుణుఁ డెవ్వనియాజ్ఞ వారాశిఁ బాలించు
గాలి యెవ్వనియాజ్ఞఁ గంపమొందు
నవనిధానములు చింతారత్నసురభులు
యక్షరా జెవ్వనియాజ్ఞ నేలు
నెవ్వనియాజ్ఞ నర్కేందుగ్రహంబులు
చదలమార్గంబున సంచరించు
శైలకాననవార్ధిసహితమౌ నీధాత్రి
నహినాథుఁ డెవ్వనియాజ్ఞఁ దాల్చు
తే. నట్టి భీమేశు వేదవేదాంతవేద్యు
సర్వకేయూరు దేవతాసార్వభౌము
సప్తగోదావరోత్సంగసన్నివిష్టు
నాశ్రయింతుము నిన్నుఁ జంద్రార్ధమౌళి! 84

వ. దేవదేవ! మహాదేవ! సదాశివా! యీశ! యీశాన తత్పురుష యఘోర సద్యోజాత వామదేవాఖ్యాన పంచవదనమూర్తి విశేష! ప్రకృతిప్రధానకారణ! మీకు సాష్టాంగనమస్కారంబు. 85

క. నీమహిమార్ణవమునకును
సీమాంతము గలదె? రాజశేఖర! దక్షా
రామపురధామ! శంకర!
భీమేశ్వర! నీలకంఠ! పేశలకరుణా! 86

వ. అని యనేకప్రకారంబుల బృందారకదైత్యులు తన్నుఁ బ్రస్తుతింపఁ గాలకూటంబు హరించిన పంచాననుం డగు భీమేశ్వరుండు హరివిరించి పురందరాదుల నాలోకించి యిట్లనియె. 87

శివునియాజ్ఞను సురాసురులు విఘ్నేశుని బూజించి
పాల్కడలి తరియించి చంద్రాదులఁ బడయుట

తే. మనము విఘ్నేశు సేవింప మఱచినార
మతని సేవింపకున్న నేలా ఫలించు?
నఖిలకార్యంబులును నవశ్యము ఫలించు
[1]నర్థిఁ గార్యార్థ మిభవక్త్రు ననుసరింప. 88

మ. అని యంభోధితటోపకంఠమున దక్షారామమధ్యంబునన్
ఘనునిం దాండవవిఘ్ననాయకు మహాకాయు న్సముత్తప్తకాం
చనసంకాశు ననేకరత్నఖచితస్వర్ణాగ్రసింహాసనం
బునఁ గూర్చుండఁగఁబెట్టి భక్తిపరతం బూజించి రవ్వ్రగులై. 89

సీ. జలకమార్చి బలారి సప్తగోదావర
సలిలధారాహేమకలశసమితిఁ
గర్పూరకస్తూరికాగంధసారంబు
నలఁదె వైవస్వతుం డంగకములఁ

1. సమిత.

బ్రన్నగా [1]జడగొన్న బ్రహ్మసూత్రంబులఁ
బసపుఁగాన్చి యర్చించెఁ బద్మభవుఁడు
పారిజాతకతరు ప్రసవమాల్యంబులు
వక్షస్థలంబున వైచె శౌరి

తే. ధూమకేతుండు మహిసాక్షిధూప మిచ్చెఁ
బూన్చె యక్షాధిపతి మణిభూషణముల
సంధకాసురుఁ డిడియె దూర్వాంకురములు
వీచెఁ బవనుండు కుంచియ విఘ్నపతికి. 90

వ. అనంతరంబ మోదక కాపూప పాయస ఘృత క్షీర శర్కరా సూప జంబూ కపిత్థ చూత ఖర్జూర కదళీ నారికేళఫల పుండ్రేక్షు సమన్వితంబుగా మహోపహారంబులఁ గల్పించి, వేల్పులుఁ బ్రావేల్పులును ననల్పభావనాశేషంబుల నశేషవిధంబుల మూషకవాహనునకుఁ బ్రదక్షిణంబులు ప్రణామంబులుం జేసి వలగొని క్రమ్మఱ పయోనిధిమథనంబునకుఁ బ్రారంభించిన. 91

తే. [2] మందరాచలమంథానమథ్యమాన
దుగ్ధపాథోధి [3] జలసముద్భూతమయ్యె ;
బాలశశిరేఖ యసురులు వేలుపులును
నిచ్చి రవ్వస్తు వర్థి భీమేశ్వరునకు. 92

వ. వెండియుఁ దరువందరువఁ గల్పతరువును, నప్సరస్సతులును, గౌస్తుభమాణిక్యంబును, నుచ్చైశ్శ్రవం బనుహయంబును, నైరావతం బను ధవళగజంబును నాదిగా సకలకామదంబులు సర్వమంగళాస్పదంబులు నిఖిలభువనమోహనంబులు నైన పదార్థంబు లుద్భవించెఁ; దదనంతరంబ. 93

1. జెనగొన్న. 2. మందరామందరసముసమర్థమాన. 3. లో॰

క. తరతరము దరువఁదరువం
దరియం బుదయంబునొందె ధన్వంతరి సా
గరమునఁ గడు గరగరనై
కరమునఁ గర మమరునమృతకలశముఁ దానున్. 94

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబుతోఁ
బుట్టెఁ దెల్లని తమ్మిపువ్వుమొగ్గ
విరిసె నొయ్యొయ్యన వేలావనీవాటి
పవమానకోమలాస్ఫాలనమున
వాసించె నఖిలదిగ్వలయంబు మధురవి
స్తారకేసరధూళిసౌరభములు
నంభోజమధ్యంబునం దుద్భవంబొందె
మహితకాంతిచ్ఛటామండలంబు
తే. నందు మణికర్ణికాగ్రసింహాసనమున
లక్ష్మి యుదయించె; హస్తపల్లవమునందుఁ
బసిఁడిపూదండఁ బూరించి పద్మనయను
నర్థి వరియించె లీలాస్వయంవరమున. 95

దేవాసురు లమృతమునకై పోరుటయు
శ్రీమన్నారాయణుండు దేవారుల వంచించుటయును

ఉ. అంతులు మీఱి మిక్కిలిగ నాఁగతనంబున దొమ్మిచేసి దు
ర్దాంతపరాక్రమోన్నతులు దానవదైత్యులు వేల్పువెజ్జు ధ
న్వంతరిచేతిదుగ్ధమయవార్ధిసుధారసపూర్ణకుంభమున్
సంతనకట్టి పుచ్చుకొని చయ్యన నేఁగిరి నిర్విశంకతన్. 96

వ. అప్పుడు. 97

క. నారాయణుండు మాయా
నారీరూపమునఁ గపటనాటకలీలా
పారాయణత హరించె సు
రారులచే నమృతకలశ మాసమయమునన్. 98

చ. అమృతము గోలుపోయి విబుధారులు గంధగజాసురాంధక
ప్రముఖులు మోములందు [1]వెనుఁబాటు దలిర్పఁగఁ గూడియున్న చో
నమరఁగ నప్డు శేను గగనాగ్రమునం జనుదెంచి వారికిన్
బ్రమదముతోడ నిట్లనుచుఁ బల్కితి వాక్పరిపాటి యొప్పఁగన్. 99

నారదోక్తి నసురు లీశ్వరుని బూజించి వరంబులు వడసి లోకముల బాధించుట

శా. రక్షోనాయకులార! నిర్జరవరవ్రాతంబుచేత న్సుధా
భిక్షాపాత్రము వోయె నంచు మదిలో బెగ్గిల్లఁగా నేఁటికిన్?
రక్షార్థంబు భజింపరాదె యభవుం ద్రైలోక్యకుక్షింభరున్
దక్షారామపురాధినాథుని సుధాధామార్ధచూడామణిన్. 100

క. అనుచు న్నే నిటు పల్కిన
విని యందఱు భీమనాథు విశ్వేశ్వరునిన్
ఘనభక్తి దక్షమునిరా
డ్వనమధ్యమునందుఁ గొల్చి [2]వర్ధితబలులై. 101

మ. త్రిపురావాసులతోడఁ గూడి కడిమిన్ దేవాహితు ల్లోకముల్
తపియింపఁగఁ దపంబుచేసిరి [3]దృఢస్థైర్యంబు పాటించి పా
శుపతాచారనిరూఢి నందఱును సంశుద్ధాంతరంగంబులం
దుపమాతీతుని భీమనాయకుని నాద్యు న్శంభు సేవించుచున్. 102

1. వినఁబాటు. 2. వందిత. 3. గృహస్థత్వంబు.

సీ. అరుణోదయంబున నాకాశవాహినీ
హేమాంబుజంబుల నిందుధరుని
మిహిరోదయంబున మహిసాక్షిగుగ్గులు
ధూపదీపంబుల దురితహరుని
సంగవంబున గంధసారకుంకుమచంద్ర
జంబాలమునఁ [1]బుష్పబాణహరుని
మధ్యాహ్నమునఁ బక్వమధురాన్నపాయసా
పూపాజ్యదధిఫలంబులఁ ద్రిణేత్రుఁ

తే. జరమసంధ్యాగమంబునఁ బటహ శంఖ
ఝల్లరీ మడ్డు డమరు ఝర్ఝరుల మ్రోఁత
నర్ధరాత్రంబులందు వీణారవముల
హరునిఁ బూజింతు రతిభక్తి నసురవరులు. 103

శా. పంచబ్రహ్మషడంగమంత్రములనుం బ్రాసాదపంచాక్షరిం
బంచాస్యు న్బహుబిల్వపత్త్రముల నభ్యర్చింతు రవ్వ్యగత
న్నంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకు న్వర్ణింతు రేకాగ్రతన్
జంచద్వేదపురాణమంత్రముల నిష్ఠాయుక్తి నక్తంచరుల్. 104

వ. ఇవ్విధంబున నిష్టార్థప్రదుండైన యమ్మహాదేవుఁ శ్రీభీమనాథు సేవించి యద్దేవునిప్రసాదంబున ననశ్వరంబును నతూర్జితంబును ననాధారణంబును నగు నైశ్వర్యంబునుం బొంది. 105

తే. అప్పుడు గర్వించి నిర్జించి రఖిలజనుల
నిర్జరుల బాధపెట్టిరి నిరపరాధ

1. పుష్పచాపమథను.

మప్రతీకమహాప్రతాపాతిరేక
నిర్విశంకావలేపులై పూర్వసురులు. 106

బ్రహ్మవిష్ణ్వాదులు శివునికి మొఱపెట్టుట

సీ. వజ్రహస్తునిచేతివజ్రాయుధము జాగ
దుద్దిస్తి [1]పాడఱి మొద్దువాఱె
నతితీక్ష్ణతరమైన యాశుశుక్షణి తేజ
మింగాలతేజమై యింకిపోయెఁ
జండభీషణమైన జముగదాదండంబు
బిరుసంతయును బాసి బెండుపడియెఁ
బాథోధివల్లభుపాశవల్లిమతల్లి
దర్పంబు దిగఁద్రావి త్రాడువడియె
తే. గాలిఁ దూలెను ధనపతిఘనత యణఁగె
గ్రహములకు నిగ్రహము పుట్టెఁ గాలవశతఁ
గాలకేయాదిరాక్షసగణము లెల్ల
భీమలింగంబు కృపఁ బెచ్చుపెరుగునప్పుడు. 107

వ. అప్పుడు హరివిరించులు నక్తంచరులచేతఁ బంచకరపాట్లుపడి యంతఃకరణంబులఁ జింతించి రాయంచనుం గాంచనవర్ణగరుడుం జలంబుగ పులుఁగుఱేని నెక్కి దక్షిణజలధిపంచ దక్షారామంబున నధివసించి సనుంచుంగొండయల్లుని బంచబాణవిరోధిని డాయం జనుదెంచి షడక్షరీపంచబ్రహ్మమంత్రంబుల మంత్రోచ్చారణ పూర్వకంబుగ సాష్టాంగదండప్రణామంబు లాచరించి ప్రపంచరక్షణార్థంబుగా నిట్లని స్తుతియించిరి. 108

1. పారాడి.

సీ. అవధారు దేవ! దక్షారామవల్లభ!
సప్తగోదావరోత్సంగనిలయ!
కాలకూటానలజ్వాలానలముఁ బాపి
మమ్ము రక్షించిన మహితకరుణ!
భీమేశ్వరేశ్వరస్వామి! మహాదేవ!
త్రిపురదైత్యులబాధ దీలుపడితి
మత్యంతదుఃఖము లనుభవించితిమి య
నాథులమైతి మనాథనాథ!

తే. మొదల దేవారులను గాచి, పిదప సురలఁ
గాచి, పిమ్మట నసురులఁ గాచినాఁడ;
వింక మముఁ గావు వరుస భోగీంద్రకటక!
నీ వెఱుంగవె ధర్మంబు? నీలకంఠ! 109

తే. చటులతరకాలకూటాగ్ని[1]సంజిహీర్షఁ
బాల్కడలినట్టనడుమ సంప్రభవమైన
యమృతలింగంబవగు నిన్ను నాశ్రయింతు
మభవ! భీమేశ! దక్షవాటాధినాథ! 110

క. ప్రణవోత్తమాంగమణిభూ
షణ! గగనమణీందువహ్నిచక్షుస్త్రితయా!
ఫణికటక! జితమనోభవ!
యణిమాది విశేషదా! పరాశ్రయచరణా! 111

ఉత్సాహ—
నీలకంఠ! భక్తలోకనిధి! భవాబ్ధితారణా!
ఫాలభాగ[3]దృక్కృపీటభవశిఖాహతస్మరా!

---

1. సంజహీర్ష. 2. ఫణి. 3. మత్కృపీట.

శూలపాణి! మమ్ముఁ గరుణఁ జూడు త్రిపురదానవుల్
జాలిబెట్టుచున్నవా రసహ్యవిక్రమోద్ధతిన్. 112

సీ. అర్కేందుహవ్యవాహనలోచనత్రయా!
త్రిపురదైత్యులబాధ నపనయింపు
మంబికాహృదయాంబుజాకరకలహంస!
త్రిపురదైత్యులబాధ నపనయింపు
నిత్యనిర్మల! శుద్ధ! నిరవద్య! నిర్ద్వంద్వ!
త్రిపురదైత్యులబాధ నపనయింపు
దీప్తదీప్తాయుధస్థిరమహాదోర్దండ!
త్రిపురదైత్యులబాధ నపనయింపు
తే. డమరు పట్టిస పరశు ఖడ్గ త్రిశూల
చాప ఖట్వాంగధర! నీవె శరణు మాకు
నన్యథా శరణంబు లే దభవ! భీమ!
యపనయింపుము త్రిపురాసురారిబాధ. 113

క. ముక్త! విశుద్ధ! నిరంజన!
ముక్తప్రియ! నిత్య! యష్టమూర్తి! ప్రతాపో
ద్రిక్తత్రినగరపరివృఢ
నక్తంచరబాధ మాన్పు నాగాభరణా! 114

క. ధగ్ధస్మరాంగ! శంకర!
ముగ్ధేందుకళాకలాపమూర్ధాయన! సు
స్నిగ్ధవిధాతృకపాల
స్రగ్ధారి ఘటింపు త్రిపురసంహారంబున్. 115

క. అద్వయ! సత్య! క్షరాక్షర!
సద్వంద్య! యనాదినిధన! సర్వేశ్వర! కృ

ష్ణద్వైపాయనశుకముఖ
విద్వన్నుత! సంహరింపవే త్రిపురంబుల్? 116

క. సర్వేశ్వర! సర్వాత్మక!
[1]శర్వ! సదాశివ! మహేశ! శాశ్వత! రుద్రా
సర్వజ్ఞ! భీమనాయక!
గర్వాంధుల సణఁపు త్రిపురకర్బురపతులన్. 117

సీ. ప్రణతార్తిహార! దేవ! పరమేశ! దక్షవా
టాధీశ! యభవ! మా కభయ మిమ్ము.[2]
మంత్రోపనిషదర్థ! మన్మథాంతక! గంధ
సింధురాసురవైరి! సేమ మిమ్ము
భక్తవత్సల! శూలపాణి! దక్షిణవార్ధి
వేలాతటీవాస విజయ మిమ్ము
సంసారమాయానుషంగ శాశ్వతతమ
స్కంధమార్తాండ! యైశ్వర్య మిమ్ము
తే. సద్య రక్షింపు వామదేవాద్య ప్రోవు
జయజయాఘోరతత్పురుష! జయ మొసఁగు
భద మీశాన! సేయుము ప్రబలులైన
త్రిపురదైత్యులగర్వంబు ధిక్కరింపు. 118

శా. త్రైలోక్యంబు భుజాప్రతాపమున నిర్వక్రంబుగా నేలుచున్
హేలాహుంకృతిఁ గామగత్రినగరీహృద్యప్రచారంబులన్

---

1. శర్వభవానీశ శరణు జగదాధారా. సర్వంబు దామె యనుచును, గర్వించిరి యసురులెల్ల గౌరీరమణా! 2. దానవసంఘు మేతత్క్షణంబునఁ ద్రుంతుననుచును మాకిప్పు డభయ మిమ్ము. మమ్ములఁ గృపఁజూడు మన్మథాంతకగంధసింధురాసురవైరి సేమ మిమ్ము.

వాలాయంబున మమ్ము వెట్టిగొనుచు న్వర్తించుచున్నారు మీ
రాలస్యం బొనరించినన్ బ్రతుక శక్యం బెట్లు మాకెల్లకున్. 119

క. లోకంబులు త్రిపురాసురు
లేకచ్ఛత్రంబుగాఁగ నేలఁగ నున్నా
రో కాలకంఠ! యింకిటు
మాకాపులు గావు; ధర్మమార్గము [1] దలఁగెన్ 120

మ. అభయం బిందుకళాకిరీట! శివదా! యామ్నాయచూడామణీ!
యిభరాట్చర్మపటీకటీర! యభవా! యీశాన! మృత్యో! గిరి
ప్రభవామానసపద్మపద్మహిత! యబ్రహ్మణ్య మాలింపు; మా
కభిమానచ్యుతి పాటిలెం ద్రిపురదైత్యగ్రామణీశ్రేణిచేన్. 121

క. కరుణింపు దక్షవాటీ
పురనాయక! భీమలింగ! [2]భోగివిభూషా!
[3]గరళవిషదహనభయమును
బురదనుజభయంబు సరియ భువనంబులకున్. 122

ఈశ్వరుఁడు త్రిపురాసురుల నిర్జించుట

వ. అని యీప్రకారంబున బ్రహ్మవిష్ణువులు పురందరపురోగము లగు బృందారకులతోడం గూడి యభినందించినఁ బరమానందంబునం బొంది యబ్భువనగోప్త సప్తపాతాళభువనగర్భగోళంబునందుండి యావిర్భవంబు నొందిన దివ్యస్వయంభూ జ్యోతిర్లింగమూర్తి భీమేశ్వరుండు, నిర్వికల్పంబును నిరస్తసమస్తోపాధికంబును నైన నిష్కళంకస్వరూపంబు విడిచి యారకూటపాటలంబై [4]కుసుంభచ్ఛాయను హెచ్చుగుంగాంశుజటాపటలంబును, బాండురపుండరీకముకుళ

1. గలకె. 2 భోగిభూష [illegible]. 3. భరణ. 4. కుసుంభిచ్ఛాయ నగు.

డుండుభంబు లను శంక నంకురింపంజేయంజాలు [1]నృకరంకమాల్యం బును, జిఱునవ్వుజిగి మెఱుంగిడిన చెక్కుటద్దంబుల నీడచూచు నిద్దంపునాగకుండలంబులును, గ్రొత్తయఱసంజకెంజాయ రంజిలు కాఱుమొగులు కైవడిఁ జిలుపచిలుపని నెత్తురులఁ జొత్తిల్లిన పచ్చి యేనికతోలుపచ్చడంబును, [2]గంఠకోణంబునఁ గంఠోత్కంఠభువన భవనరక్షణదాక్షిణ్యలక్షణకస్తూరికాలేపనైపథ్యంబునుంబోని కాల కూటవిషమషీకంఠంబును, సాయాహ్నసమయసంఫుల్లమల్లికాకుసు మసముల్లాసంబు నుల్లసంబాడు తెల్లనిమేనును, మొఱకుఁదనంబున నేతెంచిన కఱకువిల్తుని జూఱఁబుచ్చినదై చిగురుతేలన నుప్ప తిల్లుచు మినుకుమినుకుమను నులివేఁడిచూపువలనఁ గోపాటోపావా ర్యహవ్యవాహనాడంబరంబగు లలాటలోచనజ్వలనంబు ప్రజ్వలించి, నికటజటాటవీవాటంబు నాస్ఫోటించునో యని యవధరించినచందం బున నందంబగు మందాకినీసలిలపూరసంభరితంబైన శాతకుంభ కుంభంబునుం బోని కిరీటకటాహంబును, చంద్రఖండంబులు మూఁగి నభంగి నంగీకరించిన యకించనశశాంకరేఖాలంకారంబును, జెంగ లువతెక్కడాలు చక్కనేలిన కేలియంగుటంబునం జవవత్ఖురపుటం బుల మోపి నింగికి నెగయ [3]జంగచాఁచు లీలాకురంగశాబకంబును గనుపట్టు సర్వకళారూపంబు ధరియించి సర్వమంగళాకుచకలశలేప నానైపుణ్యకుంకుమాంగరాగవాసనాసనాథంబును, గరళకూటపావ కోత్పత్తినిరస్తమణికులప్రశస్తంబును నైన శ్రీహస్తంబు విస్తరించి యభయంబు ప్రసాదించి, సజలజలధరధ్వానగంభీరోదారంబైన కంఠ స్వనంబున నిట్లని యానతిచ్చె. 123

మ. అరవిందాసనతార్క్ష్యవాహనసహస్రాక్షాదిబృందారకుల్
చిరకాలంబును బడ్డపాట్లు మదిలోఁ జింతించుచున్నాఁడ ని

---

1. బ్రహ్మకపాల. 2. కంఠకోణంబున — అధికము 3. నంజచాఁచు.

ర్భరదర్పోద్ధతులం బురాసురుల నే భంజించెదన్ మీరునుం
బరిపాటి న్ననుఁ గొల్చి రండు సమరప్రారంభసన్నద్ధులై. 124

ఆ. అని ముహూర్తమాత్ర మద్దేవతాచక్ర
వర్తి దక్షవాటివల్లభుండు
మనమునందుఁ దలఁచె మదనాంధకారాతి
శత్రునగరవిజయసాధనంబు. 125

వ. అనంతరంబ తదభిజ్ఞానప్రభావమహామహిమంబునఁ దదాజ్ఞాతిశయంబున. 126

సీ. జలరాశిమేఖలావలయంబు రథ మయ్యె
రవియుఁ జందురుఁడుఁ జక్రంబు లైరి
శారదాజీవితేశ్వరుఁడు సారథి యయ్యె
శ్రుతులు నాలుగును వారువము లయ్యెఁ
బ్రణవమంత్రైకాక్షరము ప్రతోదం బయ్యెఁ
దారకావీథి పతాక యయ్యె
రత్నసానుధరాధరము ధనుర్లత యయ్యె
నాగప్రధానుండు నారి యయ్యె

తే. గంధవాహంబు లేమను గఱులు గాఁగ
విలయకాలానలజ్వాల ములికి గాఁగ
లచ్చిచనుదోయికుంకుమ బచ్చనయుగఁ
బాలమున్నీటియల్లుండు బాణ మయ్యె. 127

వ. ఇవ్విధంబున సకలసాధనంబులు సన్నిహితంబులైనక్షణంబ దక్షారామంబున నయనాభిరాముండు భీమేశ్వరుండు త్రిపురవిజయార్థంబు దివ్యస్యందనం బెక్కె నప్పుడు. 128

సీ. సరిబ్రాహ్మి మొదలైన సప్తమాతృకలు ద
 గ్గూడ సేసలు చల్లె గోగులమ్మ
పసిఁడివేత్రము పట్టి పాతాళభైరవుం
 డందంద సందడి నపనయించె.
దివ్యదుందుభినాదదీర్ఘగర్జితముతోఁ
 గురిసె మిన్నుననుండి కుసుమవృష్టి
జయజయధ్వని దేవసంయమీశ్వరకోటి
 సంఘటించెఁ గరాంబుజంబు నొసలఁ
తే. త్రిపురసంహార మొనరింప దీక్ష చేసి
భీమనాథేశ్వరేశ్వరస్వామి శివుఁడు
దక్షవాటీవిభుఁడు మేరుధనువు వట్టి
యోచి పంటవలంతి తే రెక్కునపుడు. 129

సీ. [1]కమ్మిఁ జాఁగిన నూత్నకలధౌతమునుబోలెఁ
 జక్కంగ నిక్కి మైసొక్కు మానె
నంతరాంతరములం దస్థిబృందంబులు
 పెళపెళ మనియెడు గిలుకు లెసఁగెఁ
బగిలి బీటలువాటి తగడెత్తెఁ గుబుసంబు
 తోరంపు [2]వెల్లని తొరకలట్లు
మహనీయతరఫణామండలంబులు లేఁత
 చిగురుటాకులచాయ జేగురించె
తే. హాటకాద్రిధనుర్దండకూటకోటి
వంచి బాహావలేపదుర్వారలీలఁ

1. కమ్మినూకిన. 2. వెల్లల్లితునక.

గాలకంఠుఁడు త్రిపురసంక్షయ మొనర్ప
నెక్కువెట్టినయప్పుడు భోగీశ్వరునకు. 130

క. ముక్కంటి మేరుచాపం
బెక్కిడి సారించెఁ బన్నగేంద్రగుణంబున్
మక్కువ హిమగిరికన్యక
క్రిక్కిఱిసిన కుచము లలము కేలుందమ్మిన్. 131

క. తాటించి నిటలనయనుఁడు
హాటకగిరిచాపవల్లి నహిశింజిని నా
స్ఫోటించెఁ దత్కఠోరమ
హాటంకృతి కమలజాండ మటు పగులంగన్. 132

మ. గిరిశస్థూలభుజాపరీతవిభవక్రీడాసమాస్ఫాలిత
స్థిరబాణాసనగూఢపాద్గుణలతాదీర్ఘోగ్రఘోషంబునన్
ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె నం
బరముం దిక్కులు వ్రయ్యలయ్యెఁ బగిలెం బ్రహ్మాండభాండంబులున్.

క. మృడుఁడు కనకాద్రిచాపము
గుడుసువడం దివియఁ గూడి కుశలప్రశ్నం
బడిగిరి యొండొరులను గని
కడకొమ్ముల నున్న యదితికద్రువతనయుల్. 134

క. తగ నిండ ఫాలనయనుఁడు
నగచాపము దిగిచినపుడు నాగేంద్రుం డ
బ్బిగువున మొగంబు లదరుటఁ
బొగ లెగయఁగ విషము భుగులుభుగులునఁ గ్రక్కెన్. 135

క. విషధరపరివృఢనాసా
సుషిరవినిశ్వాసపవనచూత్కారరస
ద్విషవహ్ని జ్వాలంబులు
వృషభధ్వజుచేతికొండవింట జనించెన్. 136

క. శ్రీకంఠకఠినభుజపరి
ఘాకృష్టసువర్ణగిరిశరాసనమౌర్వీ
కాకోదరముఖసంభవ
కాకోలానలము ముజ్జగము దరికొనియెన్. 137

క. కటకాముఖహస్తంబున
నిటలాక్షుఁడు కొండవిల్లు నెవ్వడిఁ దివియన్.
ఘుటియిల్లె నురగరాజ
స్ఫుటహాలాహలకృపీటభవకీల లటన్. 138

వ. ఇవ్విధంబున భీమనాథుండు త్రిపురదమనారంభసంరంభంబున శాతకుంభకుంభినీధరకోదండం బుద్దండభుజాదండచండిమంబున గుడుసువడం దిగిచిన తత్సమాకృష్టిభారంబున భుజంగపుంగవుండు వేయుపడగలనువిషంబుగ్రకట్దృక్కర్ణవదననాసారంధ్రసముదీర్ణసంభవంబయిన యక్కాలకూటవిషంబు కృపీటభవజిహ్వాకలాపంబులు గ్రోయుచుఁ దోయధిమథనంబున సంభవించిన హాలాహలంబునుంబోలెఁ బ్రజ్వరిల్లి సముజ్జ్వలజ్వాలాజాలంబులఁ ద్రైలోక్యంబు నాక్రమింపం దొణంగినం దెగనుడిపి, ఖట్వాంగపాణి యుత్తమాంగంబు జాడించి, గంగాంభఃప్రవాహనిర్ఝరవారిపూరంబులు చల్లియు, వామలోచనహిమధామకిరణవ్రాతంబులం బ్రోక్షించియు, నమ్మహోపద్రవం బుపశమింపంజేసి, దుర్గాసహాయుండును విఘ్నరాజప్రసాదోపలబ్ధిసంభావితుండును నై విషమలక్ష్యంబు లయిన త్రిపురంబులు వీక్షించి,

వెండియు నాదినారాయణునిం బురాణపురుషుని బురుషోత్తము ననాదినిధనుని బాణంబుచేసి యరిం బోసి పాశుపతాస్త్రమంత్రకంబుగా నభిమంత్రించి, యాకర్ణాంతంబుగాఁ దిగిచి, లలాటేక్షణ జ్వాలాజాలంబు మునుముట్ట నిగుడించి బిట్టు హుంకరించి, యట్టహాసంబుచేసి యేసిన నమ్మహాస్త్రంబు. 139

సీ. కరపల్లవంబులు కబళించుఁ; గబళించి
ప్రబలనితంబభారముల వ్రాలుఁ
జెక్కుటద్దములపైఁ జెరలాడుఁ; జెరలాడి
శ్రవణావతంసమంజరులు ముట్టు
వలిచన్నుఁగవలపైఁ బొలపాడుఁ; బొలపాడి
నాభిరంధ్రములపై నటనసేయు
వేణీభరములపై విహరించు; విహరించి
బింబాధరములపై బిత్తరించు

తే. నభవకరముక్తనారాయణాస్త్రవహ్ని
కాముకునికోమలాంతసంగంబుపగిదిఁ
దెగువ మీఱంగఁ ద్రిపురదైతేయరాజ
సదనశుద్ధాంతభామినీజనములందు 140

క. లోహమయదైత్యనగరీ
గేహంబులు హరశరాగ్నికీలాజ్వాలా
దాహమునఁ గరఁగి మూఁడు స
మూహములై పెద్ద[1]పెద్దముద్దలు నయ్యెన్. 141

వ. అంత. 142

---

1. పెద్దపూఁదెముద్దియలయ్యెన్.

సీ. భస్మరేణువులయ్యెఁ బ్రాసాదగోపుర
ప్రాకారకుట్టిమప్రాంగణములు
మసిబూడిదయ్యె నిర్మలకేలిదీర్ఘికా
కమలినీకల్హారకైరవములు
దగ్ధమయ్యెను సమస్తప్రశస్తమహాస
భాభ్యంతరాంతఃపురాంగణములు
ధూళయ్యె మారుతోద్ధూతపుష్పపరాగ
వాసనాదిశలగు వనచయములు

తే. కాలకంఠభుజాదండగర్భభార
కుండలీకృతమేరుకోదండపరిధి
వలయనిష్ఠ్యూతకైటభధ్వంసిబాణ
దహనసంధానమునఁ బురత్రయమునందు. 143

క. ఫాలేక్షణాస్త్రవహ్ని
జ్వాలాజాలముల నసురవరనగరంబుల్
కాలిన వప్పుడు కాలక
కాలాంతకలింగ మొకఁడు కడు నొప్పారెన్. 144

తే. ఆది లింగోద్భవమునాఁటియభవుభంగి
నింగి మోచిన యాశంభులింగమూర్తి
భీమశరవహ్ని పురములఁ బ్రేల్చునపుడు
నగ్నిసెగ దాఁక కేమియు నడలకుండె. 145

మ. అసురాధీశసమర్పితంబులగు లీలారామకల్పద్రుమ
ప్రసవంబు ల్కసుగందవయ్యె విలసత్పాటీరగోరోచనా
ఘుసృణాలేపనపంకితాకలనమై గుంఫించె నారాయణా
స్త్రసముజ్జృంభణ భీమలింగమునకున్ దైతేయరాట్స్వామికిన్. 146

వ. ఇవ్విధంబున నున్నఁ జూచి భీమేశ్వరుండు ఋక్సామయజురథర్వణ వేదపారాయణతురంగకంబును, రవిశశాంకరథాంగకంబును, కమల భవసారథికంబును, నగు విశ్వరథం బెక్కి భుజంగమరాజశింజినీకం బయిన కాంచనధరాధరధనుర్దండంబును బుండరీకాక్షుబాణంబును సంధించి పురత్రయంబుల దహించి విజయలక్ష్మిఁ బరిగ్రహించి, విశ్వావసుప్రధాననానాగంధర్వజేగీయమాన భుజాపదానుండై ప్ర మోదాతిశయంబున. 147

శా. ఆడెం దాండవ మార్భటీపటహలీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడా[1]ఘూట కరోటికోటరకుటీకోటీలుఠచ్ఛింధువీ
చీడోలాపటలీపరిస్ఫుటతరస్ఫీతధ్వనిప్రౌఢిమన్. 148

వ. ఇట్లు త్రిపురవిజయానంతరంబునం గృతాంతదమనుండు వెండియు 149

చ. డమరుకడిండిమప్రకరఠంకృతియుం గఠినాట్టహాసవి
భ్రమమును దాండవారభటిపాటవమున్ ఘటియిల్ల మాతృకా
సముదయభూతభైరవపిశాచనిశాచరడాకినీగణ
ప్రమథసమూహము ల్పొగడ, భర్గుఁడు సంతసమందె నెంతయున్.150

వ. అనంతరం బాయంబికావల్లభుండు జాంబూనదశైలకోదండ మెక్కు డించి, యథాస్థానంబున నునిచి, నారియగుపాపఱేని విశ్వంభరా భరణంబునకు నియోగించి, క్షీరాంభోరాశితూణీరంబున [2]లక్ష్మీ కుచకుంభపీఠంబున వైకుంఠబాణంబు చేర్చి, వేల్పుల వీడ్కొలిపి, బ్రహ్మను సత్యలోకంబున కనిపి, వేదంబులఁ దననిట్టూర్పుగాడ్పుల లోనం గలిపి, చంద్రసూర్యులం గాలంబు గడుప నియోగించి, కృత

1. ఘూతకఠోరకోటకరుటీ. 2. లక్ష్మీకుచకుంభపీఠంబున (అధికము)

కృత్యుండై త్రిపురదైతేయుల కులదైవతంబైన యద్దివ్యలింగంబును పంచబ్రహ్మ పంచాక్షరీ పంచతత్త్వ పంచభూత మయంబగుటం జేసి, పంచఖండంబులుగా ఖండించి కృష్ణవేణీమహానదీతీరంబున ధరణాలకోట యనుగ్రామంబున నమరేశ్వరునిచేతం బ్రతిష్ఠితం బగుటంజేసి, యమరలింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీతీరంబున దక్షిణకూలంబున గుణపూఁడి యనుగ్రామంబున సోమునిచేతఁ బ్రతిష్ఠితంబగుటంజేసి సోమలింగం బనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును, [1]బాలకోల నను గ్రామంబున శ్రీరామచంద్రునిచేఁ బ్రతిష్ఠితంబగుటంజేసి రామలింగంబునాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును, చాళుక్యవంశరాజధానియగు చాళుక్యభీమవర నామకగ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి కుమారభీమలింగంబనఁ బ్రఖ్యాతినొందిన భీమారామంబును, మొదలిమామయగు దక్షప్రజాపతియునికిపట్టైన యారామంబగుట దక్షారామంబున శివసన్నిధానంబై దా నుండునట్టుగా, నీప్రకారంబున భోగమోక్షప్రదంబులైన పంచారామంబులను బ్రతిష్ఠ నొందించి, తానును దక్షవాటంబున మున్నిటితటంబున విశుద్ధస్ఫటికసంకాశంబును త్రిదశలోకభామినీవిలోచనచ్ఛాయాగుళుచ్ఛాచ్ఛజ్యోత్స్నాభిషేకయుక్తాగంబగు భీమేశ్వరలింగంబునం దధివసించె; నిది త్రిపురవిజయోపాఖ్యానంబు. దీని వినినను బఠించిన వ్రాసినఁ బ్రశ్నచేసిన బోధించిన వారికి సకలపాతకనివర్తనంబై భుక్తిముక్తులు గలుగును; సకలకల్యాణకరం బనిన విని. 151

ఉ. అప్పుడు సప్తదివ్యమును లంచితభక్తిరసప్రయుక్తులై
చప్పటతాళము ల్మొరయ సంస్తుతిపూర్వముగాఁగ నాడుచున్

---

1. బాలకోట.

ముప్పిరిగొన్న మోదమున మ్రొక్కుచుఁ మైఁ బులకాంకురావళుల్
కుప్పలుగా భజించిరి యకుంఠితభావన భీమలింగమున్. 152

సీ. ఆఖండపంచకం బాఖండలాదిక
విబుధమండలనిషేవితము చంద్ర
మార్తాండశతకోటిమహనీయ తేజంబు
కుండలిగ్రామణికుండలంబు
పుండరీకత్వక్ప్రకాండాతిమండిత
కటిమండలంబు శ్రీఖండఘటిత
పాండురబ్రహ్మకపాలసంపుటము బ్ర
హ్మాండకోటిస్ఫురదమృతపిండ

తే. మభవ మద్వయ మాద్యం బనాదినిధన
మప్రమేయం బజేయంబు నప్రధృష్య
మఖిల వేదాంత వేద్య మత్యంతభక్తి
భావనాయుక్తిగలవారిపాలిసురభి 153

శా. ఎంచం బెక్కువిశేషము ల్ధరణిలో నింపారుచున్నట్టి శ్రీ
పంచారామములందు దక్షిణమహాపాథోధితీరంబునన్
బంచబ్రహ్మమయామృతప్రకటశుంభద్దివ్యలింగాకృతిన్
మంచుంగుబ్బలియల్లుఁ డొప్పెసఁగు భీమస్వామి యుద్దాముఁడై 154

శ్లో. కాశీక్షేత్రమృతో జీవీ పునర్జన్మ శివాకృతిః
చిత్రం దక్షపురీజీవీ న జన్మ స శివాకృతిః ॥

శ్లో. మత్తో నాస్త్యపరం దైవం న దేవీ గిరిజాసమా
దక్షారామా త్పరం క్షేత్రం న భూతో న భవిష్యతి॥

శ్లో. రథ్యాంతరే మూత్రపురీషమధ్యే
చండాలవేశ్మ న్యథవా శ్మశానే ।

క్షుత్త్రయతోస్మి ప్రకృత్త్రయతోస్మి
దక్షస్య పుర్యార్ధపురం తముక్తః॥

వ. అట్టి దివ్యక్షేత్రమునందు. 155

క. ఆలింగమూర్తి శశ్వ
జ్జ్వాలామాలాకరాళసందీప్తం బై
యాలోకింపంబడినం
దేలిరి యానందజలధి దివ్యమునీంద్రుల్. 156

తే. సస్మితంబైన మదనశాసనునిముఖము
చూచి యానందమునఁ బొంది సురలు మునులు
రాక్షసకృతావరోధసంరంభ మింకఁ
దమకు లేదని తెలిసిరి తత్త్వబుద్ధి. 157

శా. కారాగారనిబద్ధలైన దివిషత్కాంతాజనుల్ వారికిం
గారామైనతనూజులున్ పతులు దుఃఖం బాఱ గోదావరీ
వారిం దీర్థము లాడి కాంచిరి జగద్వంద్యున్ బురారాతి ద
క్షారామాధిపు భీమనాయకుఁ ద్రిలోకాహ్లాదసంధాయకున్. 158

వ. తదనంతరంబ భారద్వాజాదిమహామునులు శివున కర్ఘ్య పాద్యాచమ
నియార్థంబు భీమనాథమహాదేవునిసమీపంబున గోదావరీవాహినిం
బ్రవహింపఁజేయువారై ప్రారంభించి. 159

సీ. పంచభూతమయంబు పరమపంచబ్రహ్మ
తత్త్వతేజస్సముద్భాసితంబు
పంచాక్షరీమహాపరమంత్రమూలంబు
శాశ్వతం బజరం బనశ్వరంబు

భైమేశ్వరంబు శోభన మాదిమధ్యాంత
శూన్యంబు సకలంబు శుద్ధబుద్ధ
మనవద్య మచ్ఛేద్య మక్షోభ్య మఖిలది
గ్దేశకాలాపరిక్షీణ మనఘ
తే. మంబరము మోచియున్న లింగంబు చూచి
సంప్రతిష్ఠ యొనర్పంగ సమ్మతించి
కాల మీక్షించి తగినలగ్నంబు చూచి
సకలసంభారనిచయంబు సంగ్రహించి. 160

తే. గౌతమీగంగఁ బాపి యిక్కడకు నొక్క
సిద్ధవాహినిఁ బ్రవహింపఁజేసి కాని
లింగసంస్థాపనంబు గల్పింప మనుచుఁ
బరమసంయమము లేడ్వురుఁ బ్రతినవట్టి. 161

సీ. ఆలగ్నవేళకు నమృతదివ్యస్వయం
భూమహాలింగైకమూర్తియైన
శ్రీభీమనాథుని శీతాంశుశేఖరు
నభిషేక మొనరింప నభిలషించి
కదలి సప్తర్షులు గౌతమాదులు శిష్య
సహితంబు కడుభక్తిసంభ్రమమున
దక్షవాటీపురస్థానంబునం దుండి
యేఁగి యంతంతఁ గట్టెదురఁ గనిరి
తే. గౌతమీగంగ నాలోలఘనతరంగఁ
గేలిడోలావిహారసంక్రీడమాన
చక్రవాకబకక్రౌంచసారసాళి
హంసకారండవాదిమాద్యద్విహంగ. 162

క. గౌతమకన్యాతటినిం
 బ్రీతిం బయఃపాన మాచరించినమనుజ
 వ్రాత [1]మొనర్పదు మరలన్
 మాతృపయోధరపయఃకణాస్వాదనమున్. 163

వ. అని మునీంద్రులు తమలోన వెండియు నొండొరులం గనుంగొని. 164

తే. కంటిరే ఘోరపాతకౌఘముల నెల్లఁ
 గడిమిఁ జంకించుచున్నది గంగ యిప్పుడు
 వీచికాహస్తవిన్యాసవిభ్రమముల
 ఘుమఘుమధ్వానహుంకారఘోష మెసఁగ. 165

తే. యక్షగంధర్వసిద్ధవిద్యాధరోర
 గామరవ్రాతభరితాభ యప్రతీప
 పృథివి యెల్లను రక్షించు పేరఁటాలు
 మమ్ము రక్షించు గోదావరమ్మ యిప్పుడు. 166

తే. అమృతమైన పయోధార నహరహంబు
 సృష్టిఁ గలజంతుకోట్ల రక్షింతు వీవు
 జనని వౌటకు నేమి సంశయము చెపుమ
 గౌతమీగంగ! యాలోలఘనతరంగ! 167

క. త్రైలోక్యవరద పావన
 నాళీకాసనకరాబ్జనవమణికుండీ
 కూలంకషసలిలామృత!
 పాలింపు గిరీశజాయ! పర్వతతనయా! 168

క. గోదావరి! గోదావరి!
 గోదావరి! యంచుఁ బల్కుగుణవంతులకున్

1. వ్రాతము వెండియొనర్పదు.

గోదావరితల్లీ ! సం
పాదింతుగదమ్మ నీవు, భవ్యశుభంబుల్. 169

క. కంబు శశి రజత శుక్తి వి
డంబిసితచ్ఛాయఁ గలితడంబరములు నీ
యంబువు లమృతోపమరుచు
లంబా! మా కొసఁగుఁగాత మభ్యుదయంబుల్. 170

శా. ఆపాతాళగభీరనీరకు సుధాహారామలచ్ఛాయకున్
ద్వీపాలంకృతికి న్మహేంద్రనగరీనిశ్రేణికాయష్టికిన్
దా[1]పాపాయవిధావిహర్త్రికి మహా[2]దన్వద్దృఢాలింగన
వ్యాపారప్రతిపన్నసౌఖ్యకును [3]సాష్టాంగంబు గంగమ్మకున్. 171

శా. రంభోరూకరశాతకుంభఘటధారాపూరణప్రక్రియా
గంభీర[4]స్వనసాంద్రభిన్నకరిరాడ్గండూషనిర్భిన్నకున్
సంభావించి నమస్కరింతుము త్రిసంధ్యంబు న్ముదంబొప్ప నీ
కంభోజాసనకుండికాంబుజవనీహంసాభ ! గోదావరీ ! 172

క. గౌతమికిన్ బంచమహా
పాతకపటలాంధకారపాటనవిధిరా
డ్గౌతమికి నమస్కారం
బాతతమతిఁ జేయుదము ప్రయత్నం బెసఁగన్. 173

వ. అని ప్రార్థించి యిట్లనిరి. 174

సీ. విచ్చేయమమ్మ; శ్రీవృషభవాహనశిరః[5]
సామజకటమదాసారధార !
పయనంబుగావమ్మ ; భర్గజటాటవీ
కుటజశాఖాశిఖాకోరకంబ !

1. పోపాయు. 2. దన్వా. 3. నమస్కారంబు. 4. క్వణ. 5. ధర.

రావమ్మ; యాదిమబ్రహ్మదోఃపల్లవ
స్థితకమండులు పుణ్యతీర్థజలమ!
లేవమ్మ; విశ్వంభరావధూటీకంఠ
తారమౌక్తికహారదామకంబ!

తే. తెరలతో వీచికలతోడఁ దరులతోడ
విమలడిండీరఖండతండములతోడ
మురువు తీవియు నామోదమును జవంబు
వడువు నొప్పంగ గంగమ్మ! నడువవమ్మ! 175

మ. అదె మాస్వామి సుధారసోద్భవుఁడు దక్షారామభీమేశుఁ డ
భ్యుదయంబంది ప్రతిష్ఠఁ గైకొనెడు నంభోరాశితీరంబునం
బదమా! షట్పదమాలికాపరిలసత్పాథోధునీసంపదా
స్పదనానాసలిలప్రవాహలహరీసంభార! గోదావరీ! 176

తే. సోమశేఖరుండు భీమేశ్వరస్వామి
తివిరినాఁడు సంప్రతిష్ఠఁ బొంద
వేళ దప్పకుండ విచ్చేయఁగా రాదె
త్ర్యంబకాద్రిసరసిధామలక్ష్మి! 177

మ. అని మెప్పించి మహర్షులేడ్వురును నత్యాశ్చర్య మొప్పన్ బ్రభా
వనిరూఢిం గొనివచ్చి; రంధ్రవసుధావక్షోజహారావళిన్
[1] మునిబృందారకసేవ్యమానసలిలన్ గోదావరీవాహినిన్
వెనుక న్ముందఱఁ బార్శ్వదేశముల [2]నన్వేష్టించి సేవించుచున్. 178

వ. అప్పుడు ప్రతిష్ఠావలోకంబునకు లోకపాల గంధర్వ యక్ష సిద్ధసాధ్య విద్యాధ రోరగామరసహితుండై దేవేంద్రుం డంబరమార్గంబున ఋషుల ననుసరించి యేతెంచుచుండ నాసమయంబున. 179

---

1. మును. 2. నావేశించి. 3. సంరంభమెసఁగ.

తే. ఒక్కనదిపొంత గార్హస్థ్యయుక్తమైన
పుణ్యతప మాచరించుచుఁ బుణ్యజనులు
తారు బంధులుఁ దామరతంప రగుచుఁ
గూడి యుండంగ నెంతయు గాడు చేసి. 180

తే. ఋషులవెంబడి [1]సరభసం బెగసి వచ్చు
తటిని నమ్రతోవ వనములోఁ దపముచేయు
దైత్యమునుల పుణ్యాశ్రమస్థలము సొచ్చి
వఱద గొనిపోయె నిండుసర్వస్వములును. 181

శా. ప్రాగ్వంశంబులు సృక్స్రువంబులును యూపస్తంభపంక్తుల్ హవి
ర్భుగ్వేదీనిలయంబులున్ వఱదలోఁ బోవంగ దేవార్చనా
స్రగ్వాసోఘటికా కమండలుబ్రుసీసంఘాతముం దేలిపో
వాగ్వాదం బొనరించి రప్పుడు మునివ్రాతంబులుం దానవుల్. 182

క. ఆకాశదివ్యమునులును
నాకౌకఃప్రత్యనీకనాయకమునులున్
వాకాటులకుం జొచ్చిరి
పాకంబులు దప్పినట్టి పటురోషములన్ 183

తే. శిఖలు వీడఁగ ముఖములు జేగురింపఁ
గటము లదరంగ నొకవిఢిఁ గాటులాడి
యొండొరులమీఁద శాపంబు లుగ్గడించి
హస్తములయందు సలిలంబు లందుకొనిరి. 184

వ. ఇట్లందుకొని దానవులు సప్తర్షిసమానీతమైన యవ్వాహిని శుష్కతోయ యయ్యెడు మనియును, మునులు దానవులకు సమా

1. సంరంభమెసఁగ.

శ్రయంబైనయప్పుణ్యవాహిని యపూజ్యమై యస్పృశ్య యయ్యెడు
మనియును, శపియించి రప్పుడు. 185

తుల్యభాగయుత్పత్తిక్రమము

తే. అసురులకు నాశ్రయంబైన యాస్రవంతి
తుల్యభాగాహ్వయుండు దైత్యుండు దేరఁ
బూర్వమున గౌతమీగంగఁ బుట్టి వచ్చె
నందు రితిహాసతత్త్వజ్ఞులైనబుధులు. 186

వ. తుల్యభాగుం డనుదైత్యుండు పరమార్థతత్త్వజ్ఞుండై పక్షపాతంబులేక
సురాసురులకు మాధ్యస్థ్యంబున వివాదంబులు తీర్చుచుండుటకు
సమర్థుండగుట నద్దానవుండు తుల్యభాగాహ్వయుం డనం బరగుట
నన్వర్థనామధేయుండు. 187

క. ఆతుల్యభాగుపేరను
నాతటినికిఁ దుల్యభాగ యనునామము ప్ర
ఖ్యాతి వడసె నవ్వాహిని
గౌతమకన్యకకుఁ గూర్మికన్యక మొదలన్. 188

సీ. ఆతుల్యభాగమహామునీంద్రుఁడు ప్రీతి
మునిదానవశ్రేణిమ్రోల నిలిచి
వరుసతో వాదించి యిరుదెరంగులవారి
వారించి కోపంబు వలదు మీకు
శపియింపఁ దగునయ్య సర్వసర్వంసహా
భువనపావనలైన పుణ్యనదులఁ
గ్రమ్మఱింపుఁడు శాపగరళాక్షరంబులు
క్రోధంబు లేల తపోధనులకు ?

తే. అనుటయును వార లామాట లాదరించి
క్రమ్మఱుపరాదు పలు కమోఘమ్ము మాకు
నీవు నిప్పుడు చెప్పినపలుకు నూఁది
వేఱుచందాన హితవు గావింతు మింక. 189

వ. అని రాక్షసులు సప్తసింధువునకు నంతఃప్రవాహంబును, మునులు తుల్యభాగకు నుత్తరాయణదక్షిణాయనపుణ్యకాలంబులను, సూర్యచంద్రగ్రహణంబులను, ప్రతిభానువాసరంబునను దర్శపౌర్ణమాసీప్రభృతిమహాపర్వకాలంబులను, సంక్రమణంబులు మొదలైన విశేషకాలంబులను, స్నాన దాన జప తపో హోమ శ్రాద్ధ దేవార్చనావిధానంబు లక్షయఫలంబు లగునట్టుగాను, బలిసమేతంబుగా సతికి రజస్వలత్వాద్యంతరాయంబులేక యథశ్నయనబ్రహ్మచర్యోపవాసనియమంబులతో భానువాసరచతుష్టయంబు స్నానంబు సిద్ధించిన సంతానప్రాప్తి యానట్టుగాను వరంబు ప్రసాదించిరి తదనంతరంబ. 190

మ. కెలన న్మందఱ సిద్ధకింపురుషులుం గీర్వాణులు న్సాగసాధ్యులు విద్యాధరకిన్నరేంద్రులు సముద్భాషింప దివ్యాప్సరోలలనాబృందము లాడ దానవులు పిల్లంగ్రోళ్ళు పట్టంగ బొబ్బలు నార్పుల్ పటుసింహనాదములు నుత్పాదిల్ల ధాత్రీస్థలిన్. 191

చ. మలఁగి మలంగి భీమపతిమందిరమండలసిద్ధభూమికిన్.
తొలఁగి తొలంగి యుచ్చలితతోయతరంగపరంపరోద్ధతిన్
జెలఁగి చెలంగి యారభటిశీర్ణ ధరాధరధాతురేణులం
గలఁగి కలంగి పాఱె వడి గౌతమకన్యక దక్షవాటికిన్. 192

తే. దేవదుందుభు లుడువీథి దీటుకొలుప
నమరు లందంద పుష్పవర్షములు గురియ

మునిజనంబులు జయజయధ్వను లొనర్ప
దక్షవాటంబు చొచ్చె గౌతమతనూజ. 193

వ. ఇవ్విధంబున గోదావరీపుణ్యవాహినిం గొనివచ్చి సప్తఋషులు పరమ
హర్షోత్కర్షంబున. 194

శ్రీ భీమనాథేశ్వరుఁడు తనకుఁ దాన ప్రతిష్ఠితుండగుట

తే. తారు దలఁచిన శుభవేళ దప్పకుండ
సంప్రతిష్ఠితుఁడై సమర్చనము గొన్న
యమృతలింగంబు భీమనాయకుని జూచి
చాల విస్మయ మందిరి సప్తమునులు 195

వ. ఇట్లాశ్చర్యంబునుం బొంది 196

ఉ. తారు వినిశ్చయించిన ప్రధానముహూర్తము దప్పకుండఁ గా
మారి ప్రతిష్ఠఁబొందుటకు నాత్మల సంతసము ల్వహించి, యె
వ్వారొకొ! మమ్ముఁ గైకొనక వారక మే మొనరింపనున్న సం
స్కారము తార చేసి రెడసందున నంచుఁ గలంగి యెంతయున్. 197

తే. రోషసంరంభములును సంతోషములును
హృదయములఁ బిక్కటిల నున్న ఋషులకడకు
నంతరిక్షంబునందుండి యతిరయమున
భానుమంతుండు భక్తిసంభ్రమము లెసఁగ. 198

వ. వచ్చి యభివాదనంబుసేసి, ముకుళితకరకమలుండై కమలమిత్రుం
డమ్మహామునుల కిట్లనియె. 199

చ. పరమమునీంద్రులార! మిముఁ బ్రార్థనసేయుచు విన్నవించెదన్
గరుణ దలిర్ప మీచనవుఁ గైకొని నన్ను ననుగ్రహింపుఁడీ

తెరువున మీకు నంకిలులు దీర్పఁగఁ గాలవిలంబమైనఁ దా
హారుఁడు ప్రతిష్ఠితుండు నగునప్పుడు నే నటు పూజచేసితిన్. 200

క. మీ రొనరించుప్రతిష్ఠా
ప్రారంభము నాకుఁ జేయ నలవియె శ్రీద
క్షారామవిభుఁడు జగదా
ధారుఁడు గైకొనియెఁ దనకుఁ దాన ప్రతిష్ఠన్. 201

క. మే లెట్టి దట్టిశోభన
కాలము సరిగడిచెనేని కాదని కంఠే
కాలుఁడు కారుణ్యసము
న్మీలితమతిఁ దనకుఁ దాన నిలువంబడియెన్. 202

మ. తనకుం దాన ప్రతిష్ఠితుండయిన యీదక్షాధ్వరధ్వంసి నే
మును పూజించితిఁ; బిమ్మట న్హరియు నంభోజాతగర్భుండునుం
గని కైసేసిరి; యంతమీఁద సురలున్ గంధర్వులుం జేరి య
ర్చనముల్ సేసిరి; మీరుఁ జేయుఁడు తగ న్సమ్యక్సమారాధనల్.

తే. అనిన సంయములును గాలయాపనమునఁ
జంద్రశేఖరుసంప్రతిష్ఠాపనంబు
తమకు సిద్ధింపకునికి సంతాపమొందఁ
బలికె నాకాశవాణి విస్పష్టఫణితి. 204

ఉ. ఓ పరమర్షులార! కరుణోదధి యిందువతంసుఁ డాత్మసం
స్థాపితుఁడయ్యె, మీ దెసఁ బ్రసాదముపేర్మి భవత్ప్రయత్నసం
స్థాపితుఁడై నవాఁడ; యిది సత్యము; మీరు మనంబులోన సం
తాపము బొందకుండుఁడు ప్రధానము భక్తియ కాదె యిమ్మహిన్.

తే. అల్పమే మీరు చేసినయట్టిభక్తి ?
యభవమూర్ధాభిషేకార్థ మధికభక్తిఁ
దెచ్చితిరి గౌతమీమహాదివ్యతటినిఁ
బాదపీఠోపకంఠభూభాగమునకు. 206

మ. అభిమానించిన మీర లేడ్వురుఁ బ్రతిష్ఠారంభకాలంబునం
దభిషేకించిన తిగ్మభానుఁడును నేకార్థ [1]క్రియారంభవా
ద్యభుతాధ్యక్షత నెంచ మీర లెనమండ్రు న్శిల్పినా రంబికా
విభునిన్ సత్యమ నేను చెప్పితి నభోవీథీవిటంకంబునన్. 207

తే. మీర లెనమండ్రు భుజగేంద్రహారునొద్ద
భక్తిఁ బూజింపఁ బెట్టుఁడు పాశుపతుల
వారిపే రష్టమూర్తులు గారవమున
వారుగాక నసర్షు లెవ్వారలైన. 208

తే. అష్టమూర్తివిశిష్టాన్వయప్రసూతుఁ
డర్షుఁ డేపాటివాఁడైన నభవు నంట
వేదశాస్త్రపురాణసంవేదియైన
నితరుఁ డర్షుండు గాఁడు భీమేశు నంట. 209

వ. అని యాకాశవాణి మీరలును సూర్యుండును సషు లని యుద్దేశించి పల్కిన విని హర్షంబునొంది మహర్షులు నభోమణి నభినందించి యతండును దామును హేమకుంభంబుల సప్తగోదావర ప్రవాహంబుపూరంబులు దెచ్చి యయ్యభవు నభిషేకించి పూజించిరి ; సప్తర్షిసమానీత గావున నమ్మహానదికి సప్తగోదావరాహ్వాయంబు సంభవించె ; నని చెప్పుటయు శ్రీభీమేశ్వరమహాదేవుమాహాత్మ్యంబు

1. కార్థక్రియన్మించువాం, డుభవార్చారతి నెంచ.

విన వేడుకయయ్యెడు; నయ్యీశ్వరానుపుణ్యకథావిధానంబు వినిపిం
పవే యనుటయు. 210

మ. అవనీభారధురీణ! రీణరిపుసైన్యాదీశ! ధీశక్తివై
భవలీలాజితకావ్య! కావ్యరచనాపారీణతావాస! వా
సవభోగప్రతిమాన! మానవినయాచారార్థసంభార! భా
రవిసంకాశ! మహాకవీంద్రపరిషత్ప్రస్తూయమానోదయా! 211

క. కాశ్యపగోత్రపవిత్ర! య
వశ్యాయధరాధరోద్భవాధిపభక్తా!
వేశ్యాకటాక్షదీక్షా
వశ్యవిలాసాపహసితవాసవతనయా! 212

మాలిని—

కమలభవవధూటీకంఠకల్హారమాలా
సముదితమధుధారాసారభాసారలక్ష్మీ
సమధికరుచిసంపత్సారసాస్వతశ్రీ
హిమితసుకవిరాజీడ్ధృత్సరోజాతజాతా! 213

గద్య — ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజన
విధేయ సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన
శ్రీభీమేశ్వరపురాణం బను మహాప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.

---

# శ్రీ భీమేశ్వర పురాణము

## పంచమాశ్వాసము

శ్రీవత్సలాంఛనోపమ!
భావభవాకార మంత్రిపరమేశ్వర! పా
రావారనిభగభీరా!
దేవాధిప సుప్రసన్న దేవయయన్నా! 1

వ. అక్కథకుండు శౌనికాదిమహర్షుల కిట్లనియె. 2

తే. ధర్మపారాయణుండు మైత్రావరుణుఁడు
వెండియును నిట్టు లని చెప్పె విశదఫణితి
గాఢసమ్మోదభవనేత్రకంకణునకు
మంకణున కాత్మధృతభోగికంకణునకు. 3

వ. అనంతరం బావిష్వంతుం డాత్మప్రతిష్ఠితంబైన యద్దివ్యలింగంబు
నందు శివసన్నిధానంబు సేయఁ దలంచి. 4

సూర్యుండు కైలాసమున కరిగి శివుని దక్షారామమునకుఁ దోడితెచ్చుట.

సీ. ద్యోస్థలీనక్షత్రధూళిపాళీకేళి
చుళికితస్వర్ణదీజలచరములు
వైజయంతీపటవ్యాక్షేపసంభూత
మారుతోద్ధూతేందుమండలములు
సింహికాసుతకంఠసీమాపునర్దండ
చక్రధారావ్యథాప్రక్రమములు
రథరథ్యనిశ్వాసరంహస్సముద్భ్రాంత
గగనగంగాతరంగచ్ఛటములు

తే. నైన ప్రస్థానవేగంబు లతిశయిల్ల
నభ్రఘంటాపథంబున నరుగువాఁడు
గతికి నొకమూర్తిఁ జాలించి కదలి చనియె
శీఘ్రమున ద్వాదశాత్ముండు శివునిగిరికి. 5

ఉ. భాసురయక్షనాథదిగుపాంతకలాపవిలాసమైన కై
లాసముచక్కటిం జదల లాఘవమొప్ప రథంబు డిగ్గి వి
శ్వాసపురస్సరంబుగ దివాకరుఁ డిందుకళాకిరీటునా
వాసము జేరవచ్చి తలవాకిట వారితుఁ డయ్యె నందిచేన్. 6

వ. ఇట్లు పం బడి 7

తే. విపులశాఖాశిఖామంత్రవితతి నిసుఁడు
సంస్తుతించెను నందికేశ్వరుని బ్రీతి
బ్రహ్మవిష్ణుపురందరప్రముఖులైన
వేల్పులును నట్ల పొగడ రావృషభరాజు. 8

వ. ఇట్లు పొగడినఁ బ్రసన్నుండై నందికేశ్వరుండు గొనిపోవం బోయి, కోపకుటిలనిటలతటఘటిత భీషణభ్రుకుటిభంగాభంగముఖముఖర భయంకర భృంగి భృంగిరిట హుంకృతిభయమాన విబుధసంతానానుసంధానంబులైన కక్ష్యాంతరంబులు ప్రవేశించి, ముందట వేదవేదాంతవిద్యావందితచరణారవిందుండును, జండకిరణశశిమండలప్రభావిభాసమానఫణామణిగణాభిరామ కుండలితకుండలిపతికుండలాలంకారమండితగండస్థలుండును,ప్రళయకాలదహనదగ్ధ భువనభవనభస్మాలేపధవళితదేహుండును, నఖండబ్రహ్మాండభాండశతకోటి విలయ కాలమృతశతధృతిరుండమాలికాభూషణుండును నైయున్న నప్పుడా ప్రదీప్రంబుగాఁ గొన్నిసచరాచరబ్రహ్మపారాయణంబులు పఠియించునవి

1. వేల్పుతుటువుఁలుతను బొగడవేగ నరిగి.

యును, గొన్ని ఋగ్వేదంబు గుణియించునవియును, గొన్ని యజు రామ్నాయం బామ్రేడించునవియును, గొన్ని సామవేదంబు చదువునవియును, గొన్ని యథర్వణవేదం [1]బాధ్యానం బొనరించునవియును, సంస్తుతిచునవియును, నట్టహాసంబు సేయునవియును నైన యావిధిశిరంబులచేతం గ్రుచ్చినదండ పుండరీకముకుళమండితడుండుభంబునుంబోలెఁ బ్రకాశింపఁ గంఠకోణంబునఁ గంఠికోపరినీలంబునుం బోని కాలకూటంబున సంఘటిల్లు భ్రాంతిసంతమసంబున ఖద్యోతంబులునుంబోలె విద్యోతించు కంకణాశీవిషవిషానల విస్ఫులింగంబుల వలన దుర్నిరీక్ష్యుండగుచు, వికటజటాటవీజూటకుహరవిహరమాణ స్నిగ్ధపరిముగ్ధతరలహరిపవనపూరితంబులైన యాపీడవిధిశిరఃకరోటి కందరాక్రోడంబులఁ బాటిల్లుఘుమఘుమాఘోషంబు భీషణభూషా భుజంగంబుల నిద్రాముద్రాగ్రంథి నిగ్రహింపఁ గెంజెడముడి బిగియించి, నెట్టియంబు చుట్టిన జగజెట్టిపాపఱేని యాదలమాణిక్యంబుల తురంగలి మెఱుంగులు వెనువెంట మింటి దాఁకను జరిగి ధగద్ధగ నిగనిగ వెలుఁగుటంజేసి, యప్పు డప్పాడ యనల స్తంభంబున నావిర్భవించినభంగి నంగీకరించుచు, నగ్రగరళపరిమళాఘ్రాణంబులంజేసి మూర్ఛిల్లినవిధంబున నిరంతరధ్యాన స్తిమితలోచనులై యుభయపార్శ్వంబుల సనకసనందనసనత్సుజాతాది యోగీశ్వరులు పరివేష్టింప శేఖరశశాంకునకుఁ గ్రొత్తగాఁ గాళరాత్రికళత్రంబును గల్పించినట్లు పొలసిన పచ్చియేనికతోలుపచ్చడంబు జంగాళంబుగావైచికొని,చరణభూషణ శేషాహిశిఖామణిప్రతిబింబితాంబరుం డగుటంజేసి, ఘోరవిషవితరణ మహాపరాధక్షమకై పయోధివచ్చి పాదంబులపయిం బడినభావంబు భజియింప, ధారాజలబిందుదంతురంబునుంబోని వారణాసురకుంభ కూటవిదారణంబున హత్తిన ముత్తియంబులతోడఁ జాలనాభీలంబగు

---

1. బధ్యాపనం 2. దుండుభంజనుం.

త్రిశూలంబు కేలం గీలుకొల్పి, కఠినశమన [1]శిరస్త్రాడనంబునం గట్టిన శ్రీపాదారవిందంబునం దాపించిన బిరుదకటకంబున ఘటియింపం బడి వెలుంగు యాదఃపతిమేదోమృతంబుజిడ్డున గడ్డుకొనిన పూషాదిత్యపలువరుసయంతింబున నుప్పతిల్లు త్రుళ్లు మెఱుంగులు పెల్లుగ నుల్లసిల్ల విలసిల్లుచు, విశ్వజగదుత్పత్తిగుప్తివిపత్తికారియగు పురారిం గనుంగొని, జయజయ శబ్దపూర్వకంబుగా సంస్తుతి యొనర్చి, ముకుళితకరారవిందుండై. 9

తే. బ్రహ్మవిష్ణుమహేంద్రాదిపరివృఢునకు
నద్రిరాజన్యకన్యాసమన్వితునకుఁ
బ్రమథగణభూతబేతాళపరివృతునకు
హరున కినుఁడు నమస్కార మాచరించె. 10

వ. ఇట్లు ప్రణామానంతరంబున భాస్వంతుండు గౌరీకాంతునకు నిజాగమన ప్రయోజనం బెఱింగించిన. 11

ఆ. ఇనునితోడి చెలిమి నిభరాజవదనుండు
విన్నపంబుచేసె విశ్వపతికి
నమృతమథనవేళ నావిర్భవుండైన
భుజగహారిఁ జూడఁ బోద మనుచు. 12

సీ. విఘ్నాధినాథుండు విన్నవించినమీఁదఁ
బర్వతాత్మజ విన్నపంబు సేసెఁ
బర్వతాత్మజ విన్నపంబొనరించిన
వెనుకఁ గ్రౌంచఘ్నుండు విన్నవించెఁ

1. శిరస్ఫాలనంబున.

క్రౌంచఘ్నుఁ డటు విన్నవించినయ త్తఱి
మఱి విన్నవించెను మాతృగణము
బ్రాహ్మ్యాదిమాతృవర్గము విన్నవించిన
వెండియు భూతము ల్విన్నవించె

తే. నిందుధరునకుఁ గైలాసమందిరునకు
నభవ! విచ్చేయు రవికిఁ బ్రియంబుగాఁగ
నమృతవారాసి నుదయించి యాంధ్రభూమి
దక్షపురి నున్న యాదివ్యతనువుఁ జూడ. 13

వ. అని యిట్లు విన్నవించిన విఘ్నేశ్వరునిమీఁది యనుగ్రహంబునను భవానిమీఁది కూర్మిని, గుమారునిమీఁది ప్రేమానుబంధంబునను, బ్రాహ్మ్యాదిమాతృగణంబుల మీఁదిప్రీతిని, భూతంబులమీఁది యాదరాతిశయంబునను, భాస్వంతునిమీఁది సంతోషంబునను, మధ్యమలోకగమనోద్యుక్తుండై హరివిరించులం జూచి, మహాదేవుం డిట్లనియె. 14

మహాదేవుఁడు ప్రమథగణసమేతుఁడై దక్షారామమునకుఁ బోవుట

మ. కలవా రందఱు దక్షవాటిగమనోత్కంఠాసముత్సాహదో
హలులై నారు సహస్రభానుఁడును నభ్యర్థించుచున్నాఁడు మం
గళదివ్యామృతలింగదర్శనమునుం గర్తవ్య మాంధ్రక్షమా
స్థలికిం బోదమె [1]యూసుపోకకు వినోదంబు ల్పరీక్షింపఁగన్. 15

తే. పాయ కొకచోటఁ జదికిలఁబడఁగ నుండ
నైన ఫల మేమి? యటు వినోదార్థ మరిగి
సంచరింతముగాక యీజలజహితుని
ధర్మ మార్జిత్యమును బొంద దక్షపురిని. 16

1. యూరపోక.

వ. అని యానతిచ్చి యాక్షణంబ.

క. చాటింపఁ బంచెఁ జంద్రకి
రీటుఁడు కైలాసనగపురీవీథుల ఘుం
టాటంకృతితో దక్షుని
వాటికిఁ బయనంబు ప్రమథవరులకు ననుచున్.

వ. అప్పుడు భవాని భవుసన్నిధిఁ జేతులు మొగిచి యిట్లని విన్నవించె.

తే. పుట్టినిలుగాన నాకు నెప్పుడును బ్రేమ
దక్షవాటికమీఁద నెంతయు ఘనంబు
సన్నిధానంబుసేయు మోచంద్రమౌళి!
యమ్మహాపురి భీమలింగంబుమీఁద.

తే. ఉత్తరంబునఁ గాశీపురోత్తమంబు
మోక్షలక్ష్మికి నెబ్భంగి మూల మయ్యె
దక్షిణంబున నాభంగి దక్షవాటి
మూల మాగావుతన్ భోగమోక్షములకు.

తే. కుంటికుదుపు లశక్తులు కుష్ఠరోగు
లంధులును వృద్ధులును బాలు రాదిగాఁగ
గాశి కరుగంగలేని బికాసు లెల్ల
మోక్షమును బొందుదురుగాక దక్షవాటి.

మ. కలిదోషంబున నిష్ఠురాత్మకులునున్ గామాంధులున్ బాపక
ర్ములు నజ్ఞానదవాగ్నిదగ్ధులును నై ప్రోద్యన్మహాఘోరరవా
వలిఁ గూలంగల దుష్టమానసులకు న్వారాణసీతుల్యమై
కలుగుంగావుత ముక్తి దక్షపురి నీకారుణ్యసంభావనన్.

తే. సర్వలోకంబులకును మోక్షదుఁడవైన
నీవు సన్నిహితుండవై నిల్చినపుడు
దక్షిణాపథకాశి శ్రీదక్షవాటి
భువనమాన్యంబు [1]నది నాకుఁ బుట్టినిల్లు. 24

వ. అని విన్నవించిన యనంతరంబ యంబికావల్లభుండు మందరాచల కూటంబునం బోల్చి సంస్మృతిమాత్రంబునం బొడచూపి నిల్చిన వృషభంబు నెక్కి, యథోచితంబుగా నమందానందంబున గిరిరాజ నందన వెనుకదెస నిరియం గౌఁగిలించుకొనియుండఁ దమతమవాహ నంబుల నారోహణంబుచేసి, బ్రహ్మాదులు పరివేష్టించి చనుదేర, సం శితవ్రతులైన యక్షసురసిద్ధసాధ్యులు ముందటంగెలన బలిసి యేతేర, హృద్యంబులగు గద్యపద్యంబులు తుంబురునారదాదులుపఠింప, వేద ఘోషంబులు జయజయశబ్దంబులు వేణువీణాకాహళాదిపంచ మహా వాద్యనాదంబులు కుంజరబృంహితంబులు తురంగహేషితంబులు చె లంగ, మూషకారూఢుండై వినాయకుఁడు మున్నాడి నడువ, సుబ్రహ్మ ణ్యుండు మయూరవాహనుండై గదిసి కొలువ, వసురుద్రాదిత్యులు దుర్గావీరభద్రభైరవులు నంతరాంతరంబులఁ జండీశ్వరాద్యసంఖ్యాత ప్రమథగణంబులు బలిసి కొలువ కైలాసభవనమునుండి యక్షీణ విభవంబున దక్షారామంబు డాయం జనుదెంచునపుడు. 25

తే. పొగడి రందు నికుంభకుంభోదరులును
బెరసి భద్రమహాకాళిభృంగిరిటులు
పాయు బగళంబు తొలఁగు విచ్చేయుఁ డనుచుఁ
బార్శ్వములయందు మిగుల నార్భటులు సేయ. 26

వ. అంత నీలకంఠుఁడు పురోపకంఠమునకు విచ్చేయునప్పుడు. 27

1. మాన్యంబకద.

ఆ. విషమకఠిననిమ్నవీథీవిటంకంబు
లంతరాంతరముల నరసి యరసి
యక్షకర్దమమున యక్షేశ్వరాదులు
సవరచేసి రధికసంభ్రమమునఁ. 28

క. ఘుసృణప్రసూనరసమునఁ
బసపుంజూర్ణమునఁ జంద్రపాంసులముక్తా
విసరముల సుర లొనర్పిరి
పసగా శంఖాబ్జముఖ్యబహుచిత్రంబుల్. 29

వ. వెండియు సువర్ణారవిందసందానిత సుందరమందారమాలికాభిరామంబును సంస్తంభితశాతకుంభదండమండితధ్వజోపశోభితంబును నానావిపణిమార్గన్యస్త సంఘటితమాణిక్యమయూఖరేఖాకిమ్మీరిత దశదిశాముఖంబును, వరవిశేషవిభవలక్ష్మీధామంబును నగుదక్షారామంబుఁ బ్రవేశించునప్పుడు. 30

శివుఁడు దక్షారామంబు ప్రవేశించుట

ఉ. అక్షతగంధపుష్పఫలహారిహిరణ్మయపాత్రహస్తలై
దక్షపురీవిలాసినులు తామరసాయతలోచన ల్సహ
స్రాక్షుఁడు భీమలింగమున కర్పణచేసిన యచ్చర [1]ల్విరూ
పాక్షునెదుర్కొనం జనిరి యందియ లంఘ్రుల ఘల్లుఘల్లనన్. 31

తే. భావహావవిలాసవిభ్రమము లమరఁ
జంద్రశేఖరునగరి యచ్చరలపిండు
తగ సమర్పించె నయ్యాదిదంపతులకు
రత్నదీపాంకురముల నీరాజనములు. 32

---

1. అప్సరల్. 2. లలిత.

శైలతనూజతోడుగఁ బ్రసాదగుణంబున మాటిమాటికిన్
మేలములాడుచున్ నిజసమీపమునన్ గుహమాతృభద్రశుం
డాలముఖప్రధానగణనాథులు గొల్వఁగ భారతీశల
క్ష్మీలలనేశ్వరు ల్గదిసి చెప్పెడు విన్నప మాలకించుచున్. 33

భూమి దక్షిణపాథోధిపుణ్యసీమ
ప్రజలు చేసిన భాగ్యవైభవసమృద్ధి
శ్రీమహాదేవుకరుణానిరీక్షణంబు
గౌరిముఖరాజలక్ష్మియుఁ గానఁబడియె. 34

సంతోషించిరి దక్షిణాపథజను ల్సాక్షాద్విరూపాక్షునిం
గాంతాసంయుతు నందివాహు శశిరేఖాజూటకోటీరు వే
దాంతాభ్యర్చితపాదపంకజుని దక్షారామమధ్యంబునం
దంతస్సంభృతసౌఖ్యుఁ గంటి మిదె కన్నారంగ నం చెంతయున్. 35

నాగేంద్రకర్ణకుండలు
నాగేంద్రత్వక్కటీరు నగరాజసుతా
సౌగంధ్యకలితదక్షిణ
భాగుం గనుఁగొంటి మిట్టి భాగ్యము గలదే! 36

అని సమస్తజనంబులు నభినుతింప
నల్లనల్లన వేంచేసె నంధకారి
దక్షవాటిక ఘంటాపథంబునందు
హరిశతానందశక్రాదిసురులు గొలువ. 37

ఇట్లు భీమేశ్వరసదనాంతరంబుం బ్రవేశించి. 38

గారవించెను విధి శిరఃకంపమునను
నాదరించెఁ బ్రియోక్తుల నబ్జనాభు

మించుమందస్మితమున మన్నించె శ్రస
హారుఁడు గరుణించె సురలఁ గటాక్షదృష్టి. 39

చ. సకలదిశాముఖంబులు ప్రసన్నము లయ్యెఁ బ్రదక్షిణార్చిమై
యకలుషలీలఁ గైకొనియె హవ్యవహుం డు హవిర్విభాగముం
బ్రకటితసౌఖ్యకారి యయి పాయక వీచె సమీరణంబు త్ర్యం
బకుఁ డట భీమనాయకునిమందిరమధ్యముఁ జొచ్చునత్తఱిన్. 40

సీ. గంగాజలాపూర్ణగాంగేయమణికుంభ
హస్తాబ్జములఁ గొంద అప్సరసలు
ఫలపుష్పకిసలయప్రచురపాత్రవిశేష
హస్తాబ్జములఁ గొంద అప్సరసలు
నిర్మలానేకమాణిక్యనీరాజన
హస్తాబ్జములఁ గొంద అప్సరసలు
లాజాక్షతాదికల్యాణవస్తువ్రాత
హస్తాబ్జములఁ గొంద అప్సరసలు
తే. నాటపాటల మ్రొక్కుల నభినుతులను
నర్థి సేవించి రొకకొంద అప్సరసలు
నపుడు రెండవకైలాస మనఁగ నొప్పె
నభవుఁ డేతేర భీమనాయకునినగరు. 41

వ. మఱియు ననేకప్రకారంబుల దివ్యాంగనారచితోపచారంబు లంగీక
రించుచు, నాంగీరసదత్తశోభనలగ్నంబున మునులయాశీర్వాదం
బులు చెలంగ నందివాహనంబు డిగ్గి నిజభుజావలంబనావతీర్ణ యగు
నపర్ణహస్తాబ్జంబు కరపల్లవంబున నవలంబించి, ముందట జలధరవా
హుఁడు వేత్రహస్తుండై సందడి నెడఁ గలుగ జడియ మార్గశీర్షశ

చతుర్దశియందు రోహిణీనక్షత్రంబున సిద్ధయోగంబున యోగీశ్వ రేశ్వరుండు. 42

తే. దాఁటెఁ బ్రాసాదగేహాళి దర్పకారి
ధరణిధరరాజపుత్రి కై దండ యొసఁగ
నమ్మహాదేవికుచమండలమ్ము సోఁకి
యంగకంబులఁ బులకంబు లంకురింప. 43

వ. అప్పుడు. 44

ఉ. తా మును చేసినాఁడ నొకత ప్పని చిత్తములోఁ దలంచునో ?
యే మనునో తనుం గనిన నీశ్వరుఁ ? డంచు భయంబుతోన యా
స్వామికి [1]నర్చనం బొసఁగె శంబరశత్రుఁడు దక్షవాటికా
ధామవిలాసదీర్ఘికలఁ దన్పుగఁ బూచినహల్లకంబులన్. 45

తే. మును కటాక్షైకవీక్షణాంభోరుహముల
నర్చనము లిచ్చి రఖిలలోకాధిపునకు
శివుని బూజించి రప్సరస్త్రీలు పిదప
హస్తపంకజపుష్పోపహారములను. 46

తే. కామమును లోభమును ముక్తికాంతయందు
మోహమదములు బాలకముగ్ధలందు
నధికపాపాత్ములం దధర్మాత్ములందుఁ
గ్రోధమాత్సర్యములు జనకోటి కొదవె. 47

వ. అనంతరం బాశివుం డభ్యంతరమందిరంబునఁ బ్రవేశించి హరివిరించి ప్రముఖబృందారకులచేత మధుపర్కాద్యుపచారంబులు గైకొని కక్ష్యాంతరంబులు గడిచి గర్భగృహమండపంబునందు నూత్నరత్న

1. దర్శనం.

స్వరూపంబైన శ్రీభీమనాథమహాదేవస్వయంభూజ్యోతిస్సుధామయ మహాలింగంబు నాగమోక్తప్రకారంబుల నర్చించి, యాపాదమస్తకంబు తద్రూపంబు ముహూర్తమాత్రంబు చింతించి. 48

శ్రీకంఠుఁడు దక్షారామభీమేశుతో నైక్యతం బొరయుట

శా. కైలాసాచలకేలిమందిరుఁడు శ్రీకంఠుండు సోత్కంఠుఁడై
ప్రాలేయాచలరాజకన్యకయుఁ దా బ్రహ్మాదిదేవవ్రజం
బాలోకింపఁగ నైక్యతం బొరసె దక్షారామభీమేశుతోఁ
ద్రైలోక్యంబును దివ్యలింగశివతాదాత్మ్యంబు వర్ణింపఁగన్. 49

సీ. అవ్యయం బనవద్య మాద్య మచ్యుత మజం
బవ్యక్త మప్రమేయం బనంగఁ
బరగి కైలాసభూధరసమాగతమైన
తేజంబుతోఁ గూడి తేజరిల్లె
దక్షవాటీపురాధ్యక్షభీమేశ్వర
శ్రీస్వయంభూదివ్యసిద్ధలింగ
మమృతపాథోధిమధ్యాంతస్సముద్భూత
మమలపరంజ్యోతిరాదికంబు

తే. [1]భువనవిజయంబు కైవల్యభోగదాయి
యఖిలకల్యాణకారి విశ్వాద్భుతంబు
పూజగొనియెను మురభిదంబుజభవాది
దేవతాకోటిచే సంప్రతిష్ఠఁ బొంది. 50

వ. బ్రాహ్మీప్రధానసప్తమాతృకలును, నందిమహాకాళాది ప్రమథగణంబులును, హరివిరించిప్రముఖబృందారకులును, బురందరాదిలోకపాల

1. భువన బీజంబు.

కులును, వసురుద్రాదిత్యమరుద్విశ్వేదేవాశ్వినీదేవతలును సిద్ధసాధ్యులును విద్యాధరోరగులును గ్రహనక్షత్రతారకంబులును,పితృగణంబులును మూర్తంబులును నమూర్తంబులు నగుచరాచరంబు లన్నియు నానారత్నగంధపుష్పధూపదీపనైవేద్యాదులు సమర్పించి, ప్రదక్షిణంబు లాచరించి, నమస్కరించి స్తుతించిరి; తదనంతరంబ వెండియు.

లక్ష్మ్యాదులు శ్రీ భీమేశుని స్తుతించుట

క. సిరి వాణి గౌరిసతి య
ప్సరస లరుంధతి యహల్య శచి మొదలగు స
త్పరమపతివ్రత లర్చిం
చిరి దక్షారామనిలయు శ్రీభీమేశున్. 52

వ. ఇట్లు పూజచేసి, పరమపతివ్రతలు ముకుళితకరారవిందలై శ్రీ దక్షవాటీపురాధ్యక్ష! భీమేశ్వర! భీమనాథ! భీమశంకర! భీమలింగ! మహాదివ్యలింగ! యవాఙ్మానసగోచర! సనకసనందనసనత్కుమారసనత్సుజాతాది యోగీంద్రులు నపారంబైన నీమహిమంబు గొనియాడనేరరు; అటుగావున మిమ్ము స్తోత్రంబుసేయ మాబోంట్ల తరంబె? నిర్గుణుండవు, సగుణుండవు, గుణాతీతుండవు, గుణాఢ్యుండవు, నీవొక్కగుణంబున బ్రహ్మవై సృజియింతువు. ఒక్కగుణంబున విష్ణుండవై పాలింతువు. ఒక్కగుణంబున రుద్రుండవై సంహరింతువు. సర్వభూతాంతరాత్మభావనా! పరమపావనా! నీవు చంద్రసూర్యాత్మదీధితివై యహోరాత్రస్వరూపంబున వర్తింతువు. పృథివ్యాపస్తేజోవాయురాకాశాది పంచభూతాత్మక జీవాత్మక స్వరూపంబున వర్తింతువు. సర్వభూతాత్మప్రవిష్టుండవు. సర్వేంద్రియగుణాధారా! సర్వేంద్రియవివర్జిత! సర్వసర్వాత్మకరూపంబున సర్వంబు ననుభవింతువు; సర్వశక్త్యాత్మక! సర్వభూతగుహాశయ!'

యని నమోనమశ్శబ్దంబులతోడ నిన్ను శ్రుతులు సంస్తుతించు. శుద్ధుండవు బుద్ధుండవు. సుఖివి, సదానందుండవు. సదాముక్తుండవు. మముబోఁటి కామిను లల్పబుద్ధులు, మిమ్ముఁ బ్రస్తుతింపఁ గలవారలా? క్షమియింపు, క్షమియింపుము. రక్షింపు, రక్షింపుము. అగోచరచరిత్రా! యగోచరబలాబల! మహర్షి యోగీంద్రులకు దుర్లభుండవు. సంసారివి, అసంసారివి. భవుండవు, అభవుండవు. మంగళుండవు, అమంగళుండవు. భుజంగభూషణా! నిన్ను నీవ యెఱుంగుదువు. సర్వాతీతుండవు, తాపసప్రియుండవు, తపోలభ్యుండవు. నిజకర్మనిష్ఠులైన కర్మఠులు నిన్ను భజియింతురు. నీకుఁ బ్రణామంబులు సేయుదురు. జ్ఞానంబుననొండె నజ్ఞానంబుననొండె నీమహిమార్ణవంబున మునింగి, దరిచేరం దెరు వెఱుంగక నీవే తక్క నితఃపరం బెఱుంగక మాయాత్మశుద్ధికొఱకుఁ దోఁచినట్లు వర్ణించెదము గాని శక్తి గలిగి కాదు. దేవదేవా! మహాదేవా! దేవతాసార్వభౌమా! దేవాధిదేవ! దేవదేవేశా! మహాలింగ! తపోవిశేషంబునఁ బర్వతాత్మజ నీదేహంబున సగపాలు గొనియె. నీదేవికి నమస్కారంబు. నీకు దండప్రణామంబు; కటాక్షింపు మని ప్రార్థించిరి; తదనంతరంబ, ఓసర్వమంగళా! భువనేశ్వరీ! సర్వమంగళదాయినీ! నీకు మ్రొక్కెదము. మమ్ము రక్షింపు మని మహాదేవికిం గేలుదోయి నొసలిపయిం గీలించి, యోమహాదేవ! మహానుభావ! శశాంకశేఖర! "నమస్తే, నమస్తే, నమః" అని యనేకప్రకారంబుల స్తుతియించిన. 53

చ. వికటజటాకుడుంగమున వెన్నెలతేని ధరించి వీనులం
బ్రకటితనాగకుండలభరంబులు వ్రేలఁగ సుప్రసన్నుఁడై
వికవిక నవ్వుచున్ గరము వేడుకతోఁ బొడచూపె భీమనా
యకుఁడు మహాపతివ్రతల కంబికతోఁ గరుణాగుణంబునన్. 54

తే. ఇట్లు ప్రాదుర్భవించి సర్వేశ్వరుండు
వరము లెన్నని యాపతివ్రతల కొసఁగి
యంత నంతర్హితుండయ్యె నఖిలసురులు
గానఁగానంగ భీమలింగంబునందు. 55

వ. అప్పుడు సమీపవర్తియగు బృహస్పతికి దివస్పతి యిట్లనియె. 56

దివస్పతి బృహస్పతిని దానములఁగూర్చి యడుగుట

క. దాతృత్వము దానంబును
దాతవ్యం బనఁగ నెద్ది? ధర్మవిధిజ్ఞా!
దాతవ్యం బెయ్యెది వి
ఖ్యాతము భవ్యానుజన్మ? యానతి యీవే. 57

క. దేవతలకు బ్రాహ్మణులకు
నీవలయుపదార్థ మెద్ది? యెఱిఁగింపఁదగున్
జీవా! బహుదాతవ్యలు
గావున రాజులకుఁ దెలియఁగా దగవగుఁ బో! 58

వ. అనిన విని వాస్తోష్పతికి గీష్పతి యిట్లనియె. 59

భూదానమహిమ

క. పురుహూత! భూమిదానము
పరమము దానములయందు బహువస్తుతతుల్
ధరణీతలమునయందు న
విరళములై [1] యెపుడు [2] నుద్భవించుటకతనన్. 60

క. సర్వపదార్థాశయ మగు
నుర్వి మహీసురుల కిచ్చు నుత్తముల కగున్

1. నెళంబై. 2. యపుడు సంభవించుట.

సర్వప్రదానఫలమును
గీర్వాణాధీశ! యేటికి [1]స్సంశయముల్. 61

చ. రజతము కాంచనంబు నవరత్నములు న్వనము ల్తటాకము
ల్గజతురగాదిజంతువులు గంధము పువ్వులుఁ బండ్లు దేనియల్
ద్విజునకు వేలువేలు గడువేడుక నిచ్చుటకంటెఁ బ్రీతిఁ ద
త్ప్రజననకారణంబగు ధరాస్థల మిచ్చుట యిచ్చు టన్నియుఞ్. 62

తే. ధరణి సర్వగుణోపేత ధాన్యజనని
సస్యశాలిని నెవ్వాఁడు శాంతబుద్ధిఁ
బాత్రమున కిచ్చు నతనికి ధాత్రి యుండు
నంతకాలంబు సకలసౌఖ్యములు గలుగు. 63

సీ. కృతదక్షిణంబు లగ్నిష్టోమములు పెక్కు
యజనించునట్టి పుణ్యాత్ములకును
జ్ఞానదయాసత్యసంతతవిజితేంద్రి
యత్వము ల్గురు దేవతార్చనములు
మొదలుగాఁ గలపుణ్యములు సేయుధన్యుల
కధికుండు భూప్రదుం డండ్రు బుధులు
పరమపాతివ్రత్యపరిపాటి పాటించు
తరుణికంటె మహీప్రదాత పెద్ద

తే. వాఁ డనూనగోత్రుండును వాఁడు ఘనుఁడు
వాఁడు పుణ్యగరిష్ఠుండు వాఁడు బుధుఁడు
వాఁడు విశ్రాంతిమంతుండు వాఁడు దాత
యెవ్వఁడే వేదవిప్రున కిచ్చు ధరణి. 64

1. కీసంశయముల్.

తే. కాలమృత్యువు వెసఁ ద్రోలి కఱవ వెఱచు
నహిమగోచియు నెండ గాయంగ నణఁగు
నగ్ని శంకించు నెఱమంట లప్పళింప
భూమిదానం బొనర్చినపుణ్యాతముని. 65

క. స్వామిహిత మొప్పఁగను
సంగ్రామమునను శరపరంపరలు పయిఁ గురియం
గా మృతిఁ బొందినశూరుఁడు
భూమీదాతకుఁ బ్రభావమునఁ గట్టువడున్. 66

తే. అయిదు తరముల పూర్వుల నవుల మీఁద
నందఱను గాచు నూర్ధ్వలోకాలయములఁ
గమియఁ బండినవివిధసస్యములతోడి
యవనిదానంబు చేయుపుణ్యాత్ముకుండు. 67

క. అనుములు గోధూమంబులు
మినుములు శనగలును బండుమేదిని భూదే
వున కిచ్చు నెవ్వఁ డతనికి
ననపాయ స్వర్గసౌఖ్యమబ్బు మహేంద్రా! 68

ఉ. హాటకపీఠికాధవళహర్మ్యమదావళశంఖకాహళీ
ఘోటసితాతపత్త్రములు క్రొత్తమెఱుంగులు వోనిభామినుల్
మేటిధనంబు వస్త్రములు మేదినియీఁగికి నెంచి చూచినం
సాటికి రావు గాన నిది సత్ఫల మభ్రమునాధవాహనా! 69

తే. శ్వే[1]తపక్షంబులోపలఁ బెరుగు నెట్లు
దినదినంబును సీహారదీప్తిదీప్తి

---

1. శుక్ల.

నవ్విధంబునఁ బెరుగు నిత్యాభివృద్ధిఁ
బంటపంటకు భూదానభర్తఫలము. 70

తే. పాతకము చేసి యైనను బరితపించి
ధరణిదానంబు చేసినధన్యుఁ డడఁచు
నయ్యఘము దథ్యమిది నిర్జరాధినాథ!
కుబుసమూడ్చెడి మేటి[1]నాగులునుబోలె. 71

తే. ఒకఁడు హయమేధ మొనరించు నొక్కరుండు
భూమిదానం బొనర్చు నీపురుషులందుఁ
దారతమ్యంబు లేదండ్రు తత్త్వవిదులు
ధర్మములు రెండు నొక్కవిధంబ కాన. 72

ఉ. కాంచనకింకిణీయుతము కామగమంబును దేవతాప్సర
శ్చంచలలోచనానికరసంకులముం బ్రమదావహంబునై
మించినదివ్యయానమున మీఁదిజగంబులఁ గ్రీడసల్పు ని
ర్వంచన భూమిదాతయగువాఁడు పురందర! పెక్కువర్షముల్. 73

క. భూమికి సరియగు వస్తువు
భూమికి సరియైన విధియు భూమీదాన
స్వామికి సరియగు పుణ్యుఁడు
లేమికి సందియ మొకింత లేదు మహేంద్రా! 74

తే. భూమిదానంబె దాన మంభోదగమన!
సూనృతమె సారధర్మంబు సురవరేణ్య!
యనృతమే పాతకంబు సహస్రనయన!
తెలియఁజెప్పితి నీకు సందియము వలదు. 75

1. మోదినాగులు.

దివస్పతి శ్రీభీమేశ్వరునకు భీమమండలం బిచ్చుట

వ. అనిన విని దివస్పతి బృహస్పతిం బూజించి యతనియుపదేశంబున భక్తిశ్రద్ధాతాత్పర్యవిశ్వాసంబులు మనంబునం బెనంగొన భూమీమండలంబు ససస్యంబును, సోద్యానంబును, సకూపంబును, సతటాకంబును, సపద్మాకరంబును, సదక్షిణంబును, సశాస్త్రోక్తంబునుగా ధారాపురస్సరంబుగా శ్రీ భీమేశ్వర శ్రీమన్మహాదేవునకు సమర్పించి యామహీసన్నివేశంబునకు భీమమండలం బనునామంబు గల్పించె; నది యెట్లనిన. 76

ఉ. అంబుధిమేర తూర్పునకు, నబ్ధియ సీమ మటు యామ్యదిగ్విభా
గంబునకుం బ్రతీచికిని గౌతమి సీమ, యుదీచికిం బ్రమా
ణంబు త్రియోజనంబు సురనాథుఁడు దక్షిణకాశి భీమలిం
గంబున కేకభోగముగఁ గట్టడచేసె వసుంధరాస్థలిన్. 77

తే. తుల్యభాగాతరంగిణితోడఁ గూడఁ
గణ్వవాహినితోఁగూడఁ గనకరత్న
దివ్యపరిధానసహితంబు దేవభర్త
ధరణి భీమేశ్వరున కిచ్చె ధారవోసి. 78

తే. దాత త్రైలోక్యభర్త వృద్ధశ్రవుండు
దేయ మంభోధిగౌతమీతీరభూమి
త్రిపురవిధ్వంసనుండు ప్రతిగ్రహీత
యింత యొప్పునె పరికింప నీసమృద్ధి. 79

వ. ఇవ్విధంబునఁ బాకశాసనుండు పురశాసనుం డగు శ్రీభీమేశ్వర శ్రీమన్మహాదేవునకు [1] నంగరంగభోగవైభవవినోదార్థంబుగా గజాశ్వదాస

1. అంగరాగాది.

దాసీగాణిక్యమాణిక్యగోధేనుసహితంబుగా భీమమండలంబు దక్ష
రామసమేతంబుగా సమర్పించి చాతుర్వర్ణ్యంబును రప్పించి
యిట్లనియె. 8(

సీ. ఓమహాజనులార! భీమమండలమహా
గ్రామఖండికభట్టికాద్రజైక
వాస్తవ్యులార! విశ్వాసపూర్వకముగా
సావధానమనస్కులై వినుండు
ప్రాగ్దిశకును యామ్యపశ్చిమంబులకును
నంభోధిగౌతము లవధిచిహ్న
లుత్తరంబున మూఁడుయోజనంబులతుద
పొలిమేర యిది చక్రవలయరేఖ
తే. యీమహాక్షేత్ర మేను సర్వేశ్వరునకు
నిందుధరునకు దక్షవాటీశ్వరునకు
నిచ్చితిని ధారవోసి భీమేశ్వరునకు
నాసుధాకరతారకాహస్కరముగ. 8[illegible]

ఆ. ఏలుకొండ్రు మీరలే పురాంతకునకుఁ
బృథివియీఁగి బిడ్డబిడ్డతరము
బ్రతుకుఁ డాశ్రయించి ఫణిరాజకుండలు
భీమనాథదేవు భూమిజనులు. 8:

వ. అని యీప్రకారంబునఁ దెల్పుడుసేయుచు. 8.

చ. సురపతి మార్గశీర్షమున శుద్ధచతుర్దశినాఁడు రోహిణిం
బొరసినసిద్ధయోగమున భూతలమిచ్చెఁ బయోధిగౌతముల్
గరుసుగఁ దుల్యభాగయును గండ్రెడు లోనుగ దక్షవాటికా
వరునకు భీమనాథునకు వారవధూత్రిశతీద్వయంబుతోన్. 8[illegible]

వ. ఇట్లిచ్చి ధర్మశాసనంబు వ్రాయించె; నది యెట్లనిన. 85

ఉ. ఇప్పటిభూమిపాలురును నింకిట రాఁగలభూమిపాలురున్
దప్పకుఁ డయ్య! మత్ప్రవిహితస్థిరభూతలదానధర్మ మె
ల్లప్పుడు; మీకు నయ్యెడుఁ జిరాయువు భాగ్యము వైభవంబు చే
నొప్పగుసుప్రతాపము సుఖోన్నతి గంధగజాదిలక్ష్మియున్. 86

వ. అని వెండియు. 87

సీ. కట్టించెఁ బట్టణక్ష్మావిభాగము పైఁడిఁ
గల్పించె వప్రంబు గాంచనమున
మలిపించె బంగారమున దేవగృహములు
కూర్పించె నట్టిండ్లు కుందనమున
నిర్మించెఁ బ్రాసాదనివహంబు గనకానఁ
బాటించె గవఁకులు హాటకమున
రచియించెఁ గార్తస్వరమున గోపురములు
గీలించెఁ గేలిదీర్ఘికలు భూరి
తే. నాఁటె మందారతరువులు తోఁటలందు
వలఁతిసురభులఁ గీలారములకు నిచ్చెఁ
బోసె సిద్ధరసంబులు పుష్కరిణులఁ
గణఁక నింద్రుండు దక్షిణకాశియందు. 88

తే. ఏకభోగంబుగాఁగ నేలేఱు గరుసు
గడలిసీమయు గౌతమీగంగ [1]మేర
కప్పురపుఁగ్రోవి కాశ్మీరఖండ మవధి
యేలె విశ్వకుటుంబి భీమేశ్వరుండు. 89

1. యవధి

మ. సరిసామంతుఁడు శ్రీకుమారవనికాచాళుక్యభీమేశ్వరే.
శ్వరదేవుం డుపకంఠబాంధవుఁడు శ్రీసంవేద్యరాడ్భైరవుం
[1]డిరువుం బొర్వును [2]గొప్పులింగము మృకండేశుండుగా నేలె ని
ద్ధరణీమండలి భీమనాథుఁడు నిరాతంకప్రతాపోద్ధతిన్. 90

తే. కట్టెఁ బట్టంబు యువరాజు గజముఖునకు
రాణివాసంబు తుహినాద్రిరాజతనయ
కూర్మిసైన్యాధినాథుండు కొమరసామి
యిలకుఁ బతియైన దక్షవాటీశ్వరునకు. 91

శా. శ్రీకంఠుండు త్రిలింగభూవలయమున్ శ్రీభీమనాథేశ్వరుం
డేకచ్ఛత్రముగా సమస్తభువనాధీశుండు పాలింపఁగాఁ
బాకోన్ముద్రిత మాధవీవిచికిలప్రత్యగ్రసౌరభ్యల
క్ష్మీకంబైన వసంతకాల ముదయించెన్ సౌఖ్యసంధాయియై. 92

వ సం త ర్తు వ ర్ణ న ము

తే. సకలదైవతమండలసార్వభౌము
దక్షిణాపథకాశికాధవునిఁ గొల్వఁ
గుసుమవిసరంబు గానుకఁ గొంచు వచ్చె
నఖిలఋతుచక్రవర్తి మధ్వాగమంబు. 93

తే. కమిచె సురపొన్న వనలక్ష్మికబరిమీఁద
[3]సంతరించిన ముత్యాలజల్లివోలెఁ
బూచె సంపెంగ లారామభూమియందుఁ
గుసుమనారాచు[4]చిచ్చుఱకోలవోలె. 94

శా. హేమంతావధిసంప్రబోధగురువుల్ హృజ్జాత తేజోగ్నిధా
య్యామంత్రాక్షరము ల్పటీరగిరివన్యామంద వాతూలముల్

1. ఇరవంబొప్పున 2. పల్వలేశుఁడు 3. యవధరించిన 4. చిచ్చుల.

వేమాఱుం గలశీతనూభవవధూవేణీభరాంతఃప్రసూ
నామోదగ్రహయాళువు ల్వొలసె దక్షారామమధ్యంబునన్. 95

చ. దిగదిగఁ జేరవచ్చి రతిదేవి యపాయముఁ బొందకున్నకై
తగవున రత్నకుండలకదంబకముం దను వేఁడి పుచ్చుకోఁ
దెగువ మనోభవుండు తియతియ్యని సింగిణివింటికొప్పునం
దగిలిచె దక్షవాటివనితాచికురంబులఁ బోలుశింజినిన్. 96

తే. పాంథనివహంబుపాలి యుత్పాతకారి
ధూమకేతువుఁ బోలి పెన్దోఁటనడుమ
విరిసెఁ గ్రొవ్వారినాగకేసరపుఁబువ్వు
మీఁదిధూమంబుభంగిఁ దుమ్మెదలు వెడలె. 97

శా. సందుగ్ధార్ణవ చంద్రమండల శిఖిజ్వాలా తటిద్వల్లరీ
కందర్పేక్షుశరాస నాచ్యుతతనూ గంధర్వవంశోద్భవల్
హిందోళంబునఁ బాడి రచ్చరలు భీమేశుం ద్రిలోకాధిపున్
మందారద్రుమవాటియందు సుమనోమైరేయము ల్గ్రోలుచున్. 98

మ. అలికోలాహలసంభ్రమంబును శుకవ్యాజృంభము న్శారికా
కులసల్లాపములు న్విహారవిపినక్షోణీవిభాగంబునం
గలపుంస్కోకిలకంఠ కోమలకుహూకారప్రపంచంబుతోఁ
దలఁపించె న్రతికాంతమూలరథినీ ధాటీసమారంభమున్. 99

వ. మఱియును దత్సమయంబున భువనోత్సంగమంగళాలంకారంబైన దక్షారామంబునఁ బరిసరారామంబులయందుఁ బరమ పరిపాకభిదుర ఫలాపీడదాడిమీక్రోడనీడాక్రీడచ్ఛిక్రోడ యూథంబును, బరినమ్రమతా మచూడచూడాతామ్ర కిసలయామ్రేడితమదనసామ్రాజ్య పూజ్యంబును, నవకుసుమమధుపానహర్షితపుష్పతరుపుష్పితలావణ్యా విశేషం

బును, వనదేవతాతాళవృంతాయమాన దళనిచయరోచనామేచక మోచారణ్యంబును, బరిసరావనిరుహనివహావకులపనసవిస్రంస్యమాన శీధురసధునీజంబాలజాలవనవిభాగంబును, మదచపలచంచరీక చక్రచరణతాడన చంచలచంపకదాడిమీప్రసవమంజరీరజఃపుంజసముత్పుంజ నికుంజంబును, గంధసారగిరి గంధవాహప్రవాహలహరికావిహార బహుళీభూతనూతనక్రముకకుహాళీ గర్భనిర్భరామోదమేదురంబును నగుచు జగదాహ్లాదంబు సంపాదించుచు, విజృంభించిన. 100

సీ. కర్పూరకస్తూరికలఁ గోట నిర్మించి
కుంకుమద్రవమునఁ గొమ్మఁ దీర్చి
యగురుజంబాలంబునందు [1]నడ్వలిఁ జేసి
పన్నీరువెల్లువఁ బరిఖఁ దార్చి[2]
పవడంపుఁజివురులఁ గవకు లుత్పాదించి
తమ్మిరేకుల భోరుతలుపు లెత్తి
రత్నాంకురంబుల రంగవల్లి రచించి
పట్టుపుట్టంబులఁ బడగ లెత్తి
తే. లలితశృంగారరచన నలంకరించి
విబుధగంధర్వ లామనివేళలందు
భీమనాథునినగరియారామరేఖఁ
బూజచేసిరి సహకారభూరుహముల. 101

క. కిసలయరసజిఘ్రక్షా
వ్యసనాకులపికకుహూభవత్పంచమమై
కుసుమసమయావతారము
త్ర[3]సమింగము జగము ముంచె రాగాంబునిధిన్. 102

---

1. ఛెందడి. 2. ధాల్చి. 3. రసఘుంచెను జగము ఛంగరాగాంబునిధిన్.

ఉ. జాదుర జాదు రంచు మృదుచర్చరగీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకములఁ జంద్రిక కాయఁగ దక్షవాటికా
వేదులమీఁదటన్ గనకవీణలు మీఁటుచుఁ బాడి రచ్చరల్
మోద మెలర్పఁగా భువనమోహనవిగ్రహు భీమనాథునిన్. 103

చ. అనువగు కౌనుఁదీఁగ లసియాడఁ బయోధరము ల్వణంకఁగాఁ
గనకమరాళ కీర కలకంఠ మయూర రథాధిరూఢలై
వనితలు భీమనాయకుని వారక యేసిరి కమ్మఁదేనియల్
చినుకు పసిండిలేఁ[1]జెఱకుసింగిణివిండ్లను బుష్పబాణముల్. 104

వ. తదనంతరంబ. 105

ఉ. చంచలనేత్ర హేమరథసౌధశిరోగృహకూటకోటిపైఁ
గాంచనపత్త్రపద్మమునఁ గర్ణికమధ్యమునందు నిల్చి ని
ర్వంచన నేసె ; నంత పరిన ర్తనచిత్రవిలాసలీల న
ర్తించుచుఁ బుష్పబాణముల దేవశిఖామణి భీమనాథునిన్. 106

తే. ఆజ్ఞ వాటించెఁ గేలివిహారములకు
భీమనాథుండు దేవతాగ్రామణులకు
గంధకర్పూరకస్తూరికాప్రశస్త
వస్తుకోటులు నొసగె నవారితముగ. 107

వ. అప్పు డప్పురంబున నంగనాజనంబులు. 108

మ. జిలుగుం జెంద్రికవన్నెచేలలును గాశ్మీరాంగరాగంబులు
న్వలిముత్యంబులభూషణంబులును భాస్వత్కేతకీపత్త్రికా
విలసద్వేణులుఁ జొక్కమై మెఱయఁగా వేల్పుంజకోరేక్షణల్
లలి భీమేశ్వరు రాజశేఖరుని గొల్వన్ వచ్చి రొక్కుమ్మడిన్. 109

---

1. లేఁజిగురు.

శా. బీజాపూరఫలేక్షు [1]చాపమణికుంభీమేచకేందీవరాం
భోజంబుల్ సముయోచితంబులుగ శభుం జేరెఁ గుంభస్థలీ
రాజార్ధాభరణంబు దక్షనగరీరామాసముత్తుంగ వ
క్షోజద్వంద్వశిఖాంకురస్ఫురణ గైకో విఘ్నరా జర్మిలిన్. 110

తే. సానికూఁతుల పల్లవోష్ఠములఁ బోలు
దాసనపుఁబువ్వుదండఁ గంధర ధరించి
పసిఁడిము[2]జ్జుటకోమ్ము చేపట్టి వచ్చె
భవుని గొలువంగఁ బాతాళభైరవుండు. 111

చ. మగఁటిమిఁ [3]జంద్రుడుగుజ్జురస మంటినవామపదాంబుజంబుపై
నిగళమునా సురాసురవినిర్జితమౌ బిరుదందె ఘల్లనం
బొగడలుఁ బొండుమల్లియలు పొన్నలు పావడజొల్లియంబునన్
నిగిడిచి వీరభద్రుఁడు చనె న్నశివమాళిసమీపభూమికిన్. 112

వ. అప్పుడు బ్రహ్మాదిదేవతలును నింద్రాద్యష్టదిక్పాలకులును నంది భృంగిరిటి కుంభ నికుంభ కుంభోదర చండీశ్వర మహాకాళప్రముఖులగు నసంఖ్యాతప్రమథులును, సురగరుడోరగ కిన్నరగంధర్వసిద్ధసాధ్య విద్యాధర రాక్షసులును భూతబేతాళ శాకినీడాకినీ గణంబులును సమయోచితాలంకారంబులఁ గైసేసి వృషభకేతనునిం[4]గాంచియుండి రంత. 113

శా. ప్రీత్యుత్ఫుల్లసఫాలనేత్రుఁ డగు శ్రీభీమేశ్వరస్వామి ని
ష్ప్రత్యూహం బగు సౌహృదంబున హరిబ్రహ్మాదులన్ భూతతా
ప్రత్యుద్బోధన సంజ్ఞచేసి కనుగిర్పం జూగె గంగోదకా
హత్యాక్షేపహృతిప్రపంచములు దక్షారామధ్యంబునన్. 114

1. చారు. 2. బుజ్జట 3. జంద్ర 4. గొలిచి.

సీ. హేరాళముగఁ జల్లె నెలనాఁగ యొక్కర్తు
కుంభోదరునిమీఁదఁ గుసుమరజము
గుటిలకుంతల భృంగిరిటిమోమునం దోర్తు
తాఁకించె నోలగందంపుఁ బసుపు
వక్షంబు లక్షించి వైచె గంధపుటుండ
వీరభద్రుని నొక్కనీరజాక్షి
చెవిలోనఁ బాఱంగఁ జిమ్మె గొజ్జఁగినీటఁ
గాలభైరవు నొక్కకలువకంటి
తే. కొమ్మ యొక్కత యందందఁ గొమరసామి
యాదలలయందు జవ్వాదియసలు గిలెపెఁ
బునుఁగు మణికుంభమున నించి పోసె నొక్క
పొలఁతి విఘ్నేశ్వరునికుండబొజ్జమీఁద. 115

ఉ. నేతుల నూనెలం బసుపునీరునఁ గుంకుమచెందిరంబుల
న్నూతనగంధసారములనుం బొనరించిరి కేలితంత్రముల్
కౌతుకమొప్ప దక్షవనికాపురవీథుల భూతకోటితో
మాతృక గోఁగు నూకసతి [2]మండమదేవియు ఘట్టతల్లియున్. 116

వ. అంత. 117

తే. మాళవీదేవి శ్రీభద్రకాళిమీఁదఁ
బరిమళముతోడి చిఱుబంతిపసుపుఁ జల్లె
గొజుకుప్పెలఁ గస్తూరికాజలంబు
కర్ణికారాంబపై నించెఁ గర్ణమోటి. 118

ఉ. ఘట్టత[3]రోద్ధతిం గరముఖంబునఁ బీలిచి గౌతమీనదిం
బుట్టినసత్ప్రవాహజలపూరము ద్రుస్సననూఁదుచుం బురీ

---

1. నొసల. 2. మండలిదేవియు ఘంటతల్లియున్. 3. తరూ.

ఘట్టమున న్మధూత్సవవిహారము సల్పెను గౌరిదేవితో
ల్పట్టి గణేశ్వరుండు సురభామిను లోలమునం దొడుంగఁగన్. 119

మ. ప్రమదం బింపెసలార మేనకయు రంభామంజుఘోషాతిలో
త్తమలున్ వెండియు నల్గు [1]రప్సరసలుం దారాధిపోత్తంసునిన్
భ్రమయం జల్లిరి గంధసారముననుం బన్నీటఁ గాశ్మీరపం
కమున న్సంకుమదంబునం బునుగునం గర్పూరఖండంబులన్. 120

తే. అచ్యుతునిమీఁదఁ జల్లె దుగ్ధాబ్ధికన్య
భారతీదేవి పద్మజుపైనఁ జల్లె
శచి మహేంద్రుని జల్లె వసంతకేళి
గంధకర్పూరకస్తూరికాజలంబు. 121

మ. అగురుం గుంకుమధూళియుం దిమిరసంధ్యారాగసంస్పర్శముం
గగనాభోగము [2]సాంధ్యకాల మనఁగాఁ గాన్పింప, నాభంగికిం
దగియెం జుక్కలువోలెఁ దాండవగణాధ్యక్షుండు తుండంబున
న్నెగయం జల్లిన సప్తసింధుజలవేణీబిందు సందోహముల్. 122

వ. అట్టియెడ మున్ను కిన్నరులు చల్లినఁ బెల్లునెఱసిన ఘుసృణకుసుమ
కేసరధూళీపాళియు, విద్యాధరసందోహంబులు రువ్వినం జిందిన
మవ్వంపుఁజెందిరంబును మచ్చరించి విచ్చలవిడి హెచ్చుగా నచ్చ
రలు చిమ్మినఁ గమ్మకుసుంభాంభఃపూరంబును, నంగనాజనంబు
లపై సుడిసి తడిసి యార్ద్రాంగరాగశీకరాసారవాహినియగు గంధ
వాహప్రవాహంబును, ధారాళకరాళరక్త చందనాంబుసంసిక్తవసుం
ధరాభాగంబును, గలయం గెంపుపెంపు సంపాదింప సకాండసంధ్య
నావహించిన నం దుచితవ్యవహారయోగ్యంబులై పొడచూపిన

1. గల్గున. 2. మునవా.

యంధకారంబునుంబోలెగంధర్వకరవికీర్యమాణకస్తూరికారేణువిసరంబులవలనను, గుసమగుస్తూరికాసాంధ్యరాగాంధకారంబులకుఁ దోడై పొడచూప నేతెంచుచుక్కలచక్కఁదనంబునకుందోఁబుట్టైనయలహపనపాణిపల్లవవిక్షిప్తంబులైన పచ్చకప్పురంపుఁబలుకులును జెదరలంబోదరకపోలానిలంబులవలన రోలంబనికురుంబంబులు నెగయుటయును, పరస్పర సంసర్గార్థవశంబున వశంబులు సముద్ధతి నిగిడించు పసిండితమ్మిమొగడలు మెండు మండుటయునుం గా మూర్తంబగుమకరకేతన భుజప్రతాప దావానలంబు చటచ్ఛటాశబ్దంబుల చాడ్పునఁ జెలంగుచున్న యక్షకర్దమప్రక్షిప్తలాక్షాకరండ సంఘట్టనస్వనంబులవలనను, దొట్టి తొట్టి యెడనెడ మడువులుగట్టిన సజ్జకపు గొజ్జంగినీటియందుఁ బ్రతిబింబించు నప్సరఃకాంతల వదనారవిందంబులలోపలం బడి తేలియాడు వాడనిచేమంతిబంతులవమువునై కొలంకులచందంబు నొంద, బువ్వాన కరిగెడు కొదమతుమ్మెదకదుపులను గదిరి తొరఁగు గుహ్యకమండలీకృత పుండ్రేక్షుకోదండపృష్ఠనిష్ఠ్యూతనూతన కువలయాస్త్రంబులవలనను, నిశాటకరహాటముఖనఖసముల్లిఖితంబైన సంకుమదపంకంబువలనను, నలుదెసలనంతంత జాఱిపడియున్న కమలమృణాల కాండంబులవలనను, [1]పరంజలు పదిలంబుగా నమర్చిన కేదారంబు తెరంగు దోఁచుటకు నీడై చతురహాలికుండు జల్లు పరువపుమరువంపు మొలకల చెలువునం బెల్లు దళ్లు ప్రమథగణవిభ్రష్ట విమలహారయష్టి ముక్తాఫలంబులవలనను వసం[2]తోత్సవారంభంబు త్రిభువనదృక్ప్రియతమం బయ్యె; 123
నయ్యవసరంబున.

తే. బహుళకస్తూరికామేఘపటలమునకు
శీకరాసార మయ్యె గొజ్జంగినీరు

1. వరంబును 2. వసంతర్త్వారంభంబు.

వలుదవడగంట్లు నయ్యో నవ్వర్ష మునకుఁ
గామినులు చల్లు కర్పూరఖండవితతి 124

వ. ఇవ్విధంబున వసంతోత్సవం బవధరించి, భీమేశ్వరుండు హరిబ్రహ్మాది దేవతలకు నింద్రాద్యష్టదిక్పాలకులకు, నరకిన్నరకింపురుష సిద్ధ సాధ్య గంధర్వ యక్ష రాక్షస గణంబులకు భృంగిరిటి కుంభ నికుంభ కుంభోదర వీరభద్ర కుమార విఘ్నేశ్వర నంది మహాకాళ పాతాళ భైరవ కాలభైరవాది ప్రఖ్యాతప్రముఖులకు బ్రాహ్మ్యాదిమాతృ వర్గంబులకు శక్తిచతుష్టయంబునకు, శ్రీమహాలక్ష్మి సరస్వతీ శచీ దేవీ ప్రభృతి పరమపతివ్రతాతిలకంబులకు నప్సరస్త్రీలకు సముచిత ప్రకారంబులఁ గట్నంబు లిప్పించి, దివ్యశ్రీ స్వయంభూజ్యోతిర్లింగ మూర్తి శక్తిసహితంబు పరమానందంబునం బొందె; ననంతరంబు సప్తర్షులు గంగాజలసప్తగోదావరీ జలంబుల నభిషేకించి పూజించి భీమలింగంబు నిట్లని ప్రత్యేకంబు ప్రత్యేకంబుస్తుతియించిరి. 125

సప్తముని స్తోత్రము

తే. వేయుముఖములు గలకాద్రవేయవిభుఁడు
నెఱియ శక్తుండు గాఁడట నిన్నుఁ బొగడ
నేకముఖమునఁ బొగడంగ నెట్లు నేర్తు
నిన్ను శ్రీదక్షవా[1]టీశ! నీలకంఠ! 126

క. మిహిరక[2]రంబులఁ దారా
గ్రహనక్షత్రముల వచ్చు గణుతింప; భవ
న్మహిమార్ణవగుణరత్నము
లహికంకణ! యెవరికైన నలవియె పొగడన్? 127

1. వాటికా. 2. లవంబుల.

తే. అధిక మైనతపంబు మూల్యంబు గాఁగ
నర్ధదేహంబు గౌరికి నమ్మ[1]కొన్న
జాణదేవర! నిను నాత్మ సంస్తుతింతు
దక్షిణాపథకాశికాధామ! భీమ! 128

క. ఎవ్వని కిరీటమునకుం
బువ్వై కడు నొప్పు నన్నభోవాహిని లే
జవ్వనపుఁదుహినరుచితో
నవ్వేలుపు భీమనాథు నభివర్ణింతున్. 129

క. అర్ధకపాలము కేలను
నర్ధనిశాసార్వభౌముఁ డౌదల నె[2]డమన్
అర్ధాంగలక్ష్మి[3] గౌరియు
వర్ధిల్లఁగ నొప్పు భక్తవత్సలుఁ గొలుతున్. 130

క. సాధారణమతి సహజత
పోధనుగాఁ దలఁచి రతివిభుం డెవ్వనిదృ
క్క్రోధాగ్నికి నింధన మగు
నాధూర్జటి నహరహంబు నభివర్ణింతున్. 131

క. అస్తంగమితసురద్విషు
హస్తన్యస్తత్రిశూలు నంతర్విధి సం
విస్తృత[illegible]నోదయుఁ
గస్తూ[illegible]ప్రశసిలకంఠుం దలఁతున్. 132

తే. విశ్వ[illegible] శాశ్వతునకు విశ్వేశ్వరునకు
విశ్వరూపాత్మకునకు మహేశ్వరునకు

1. నలము. 2. నెదపై. 3. గౌరిలక్ష్మియు.

శ్రీస్వయంభూమహాసుధాస్నిగ్ధలింగ
భీమనాథేశ్వరునకు నర్పింతు మనసు. 133

తే. భీమ! భీమేశ్వరేశ్వర! భీమనాథ!
భవ! భవారణ్యపావక! భవ్యమూర్తి!
భర్గ ఫాలాక్ష! భసితాంగ! ఫణివిభూష!
శిఖిశిఖాభాసమాన! భజింతు నిన్ను. 134

తే. శర్వు శర్వేశ్వరేశ్వరు సర్వవంద్యు
శర్వు సర్వప్రదాయకు సర్వధాత
శర్వు సర్వంసహామహీచక్రధరుని
శర్వు వర్ణింతు దేవతాసార్వభౌము. 135

శా. వేదాతీతుని వేదవేద్యుని శివున్ వేదాంతవేద్యు న్భవున్
వేదాంతోపనిషద్రహస్యముఁ జతుర్వేదీవిహారాలయున్
వేదాంగాదిపురాణముఖ్యవిలస[1]ద్విద్యాగమప్రక్రియా
వేది న్నిన్ను భజింతు నెమ్మనమున న్విశ్వేశ! భీమేశ్వరా! 136

క. కామేశ్వరు నీశ్వరునిం
గామితఫలదానకల్పకముఁ గామరిపున్
గామాతీతుని దేవ
గ్రామణి నిను నాశ్రయింతు గౌరీరమణా! 137

క. ఆనందజ్యోతిని బర
మానందానందమూర్తి నవ్యయుని ద్రిలో
కానందామృతదాయిమ
హానందుని వృషభవాహు నభివర్ణింతున్ 138

1. ద్వైద్యా.

సీ. ఓమహాలింగంబ! యోమహాదేవుండ!
యోమహాత్ముండ! దేవ! యోమహేశ!
యోమహాసంపత్ప్రయోగదీక్షాదక్ష!
యోమహాపాపేంధనౌఘదహన!
నీమూర్తిసంస్మృతి నీనామసంస్మృతి
నీకథాశ్రవణంబు నిఖిలదురిత
యూథాంధకారసూర్యోదయం బఖిలక
ల్యాణనికాయసంప్రాప్తిహేతు

తే. వంబికాకుచకుంభద్వయాంగరాగ
పరిమళాసారవాసితబాహుమధ్య!
దక్షిణాపథకాశికాంతర్విహార!
గిరిశ! శ్రీభీమనాథ! రక్షింపు మమ్ము. 139

వ. అని సప్తర్షులు సంస్తుతించిరి; తదనంతరంబ, యరుంధతీదేవియు హంసవాహన పశసఖిచండికాపరిచారికాసముదయంబును, ననేక ప్రకారంబులఁ బ్రశంసించి, యథాశక్తిం బూజించిరి. 140

క. ఈసప్తమునిస్తోత్రము
వ్రాసినఁ జదివినను వినిన వర్ణించినఁ గై
లాసపతి దక్షవాటిని
వాసుఁడు జనులకు నభీష్టవరము లొసంగున్. 141

[illegible] మంకణుండు మునీంద్రా! సదాశివుమాహాత్మ్యం బింకను నా కె[illegible]గింపవే? యని యడుగుటయు, వసిష్ఠమునీంద్రుం డిట్లనియె.

తే. కల్పవృక్షం బదేఁటికిఁ? గామధేను
సముదయం బేల? యిష్టార్థసంపదలకు



తూర్పు గోపురము



పశ్చిమ గోపురము

224(B)

నిశ్చయంబుగ మనసులో నిల్చె నేని
చాలదా! మర్త్య రక్షింప శంభుభక్తి. 143

తే. శంభుపదభక్తులకు వినాశంబు లేదు
కదియ వీశానభక్తులఁ గల్మషములు
నాదియందుఁ బ్రతిజ్ఞగా నానతిచ్చెఁ
జంద్రచూడుండు నిజభక్తజనముఁగూర్చి. 144

సీ. భోగీంద్రభూషణు భూతిదిగ్ధాంగుని
నాభీలశూలాయుధాగ్రహస్తుఁ
గాకోలవిషనీలకంధరాభాగుని
గజచర్మపరిధానకటివిభాగుఁ
దాండవాడంబరోద్దండ దివ్యాకారు
నజవిష్ణువిబుధాధిపాభివంద్యు
గంగాతరంగ సంకలితోత్తమాంగుని
త్రైలోక్యరక్షాప్రదానదక్షు

తే. నీశు సాకారు నొండె నొండే విభూతి
పతి నిరాకారుగాఁ జూచి బహువిధములఁ
బూజసేయంగ నేర్చినపుణ్యమతులు
వారు శివభక్తు లందు రివ్వసుధలోన. 145

క. శివధనము ముచ్చిలించిన
శివధన మన్యాయవృత్తిఁ జెడిపోవంగాఁ
దవులక యుపేక్ష సేసిన
శివభక్తిద్రోహ మంద్రు శివభక్తివిదుల్.

గీ. శివునికై భిక్షచేసి యార్జించినట్టి
ద్రవ్య మావంతయేనియుఁ దా స్పృశింప

కభవునకు నెవ్వఁ డొనరించు నర్పణంబు
వాఁడు శివభక్తముఖ్యుండు వసుధలోన. 147

. మాటలు వేయును నేఁటికి
హాటకధాన్యాది శివపదార్థములయెడం
జేటున కోర్వమి తుదిఁ బరి
పాటించిన శంభుభక్తిపథము మునీంద్రా! 148

. మహనీయసంప్రీతి మద్భక్తజనముల
నాదరించుచు నుండునతఁ డొకండు
ఫలములుఁ బక్వాన్నములు మాకు సర్పింప
కనుభవింపక యుండునతఁ డొకండు
పంచాక్షరీమంత్రపాఠంబు నిత్యంబు
నాచరించుచు నుండునతఁ డొకండు
ననుఁ బ్రస్తుతించు నానాపురాణంబులు
సతత మావర్తించునతఁ డొకండు

తే. శిలలఁ గాష్ఠంబులను మృత్తికలను నిసుక
లింగముల లెస్సఁగాగఁ గల్పించి భక్తి
నర్చనము సేయునతఁ డొకం డనుచుఁ జెప్పు
శివుఁడు భక్తవిమర్శన చేయునపుడు. 149

. అదియునుంగాక రాగద్వేషఝషసంకులంబును, గామక్రోధలోభ
మోహమద[illegible]ాత్సర్య మహాగ్రాహబహుళంబును, పుణ్యపాపతో
[illegible]ాహంబును నైన యీసంసారమహాంభోరాశియందుఁ
[illegible]ములైన జంతువులు మునుంగుచుఁ దేలుచుం గొంత
[illegible]గొంతతడవు దుఃఖంబును ననుభవించుచు నుందురు;
[illegible]క్తి యుత్పన్నంబై యుండు. 150

తే. అతివిశుద్ధాత్మ! చతురంఘ్రిఁ గృతయుగమునఁ
త్రేతఁ బాదత్రయమున వర్తించుచుండి
ద్వాపరంబునయందుఁ బాదముల రెంట
వెలయు శివభక్తి యొకకాలఁ గలియుగమున. 15

తే. కలియుగంబున ధర్మంబు కఱవు గాన
నందు ధర్మంబుఁ జేసినయతఁడు ఘనుఁడు
ని[1]ండువేసవి మరుభూమి నిర్మలముగఁ
జేర్మి సలిలాన్నసత్రంబు వెట్టినట్లు. 15

వ. అని మఱియు నొకప్రశ్నంబు చెప్పెద; పూర్వకాలంబున. 15

తే. అభవు నొకనాఁడు ప్రార్థించి యడిగె గౌరి
కలియుగంబున శివభక్తి గ్రాఁగిపోవు
నఖిలలోకహితంబుగా నానతిమ్ము
భక్తివిజ్ఞాన యోగంబు ఫాలనయన! 15

వ. అని భవాని విన్నవించిన మహేశ్వరుండు. 15

గౌరికి మహేశ్వరుండు భక్తివిజ్ఞానయోగంబు చెప్పుట

తే. అడుగవలసిన యర్థంబ యడిగి తీవు
గ్రాఁగియుండెడు శివభక్తి కలియుగమునఁ
బాపకర్ముఁడు కాని యెప్పాట లేఁడు
పుణ్యకర్ముఁడు; వికసితాంభోజనయన! 1

సీ. ఎప్పుడు కలియుగం బేతెంచుఁ గ్రమవృత్తిఁ
బాపంబు లన్నియుఁ బ్రబలుచుండుఁ
బాపంబు లోకభంగిఁ బ్రక్షయంబొందిన
నామీఁద దృఢభక్తి నాఁటుకొనును.

1. నిర్జలంబైనమరుభూమి.

నామీఁద దృఢభక్తి నాఁటుకొన్నప్పుడు
ధర్మంబు వర్తించుఁ దరతరంబు
ధర్మంబు వృద్ధిఁబొందఁగఁ జిత్తమునఁ బుట్టు
లింగార్చనావిధి మంగళంబు

తే. అంతట విభూతి నలఁదంగ నాసపుట్టు
నంతమీఁదటఁ గల్గు రుద్రాక్షకలన
పాశుపత మటమీఁదను బదిలపడును
ముక్తిలతికకు నది గదా! మూల[1]మరయ. 157

వ. మఱియు నొక్కటి చెప్పెద. సదాచారనిరతులైన బ్రహ్మక్షత్రియ వైశ్యులును, త్రైవర్ణ్య[2]శుశ్రూషాపరులై సత్యవాదులైన శూద్రులును బతివ్రతలైన పుణ్యస్త్రీలును, నాత్మదర్శనంబునకు నధికారులు; విశేషించి. 158

తే. రాగవైషమ్యములు లేక ప్రజ్ఞఁ[3]దగిలి
మనములోన విరక్తి యెవ్వనికిఁ గలుగు
వాఁడె యధికారి బ్రహ్మకైవల్యమునకు
వీఁడు వాఁడని కులశుద్ధి వెదుకవలదు. 159

సీ. బహుజన్మసంశుద్ధి భాగ్యసంపదఁగాని
యోగవిద్యాశక్తి నూన దాత్మ
యోగసామగ్రికి నుచితసాధనములు
వాయుమార్గ విశుద్ధవర్తనములు
నాడీపరంపరాక్రోడ వాయు[4]జవంబు
బలముచేతస్థిరతిభాగ్యమునకుఁ
తనయాజ్ఞ చేసి వర్తించెనే
పట్టనఁగఁజాల వింద్రియములు,

తనయాజ్ఞ ప్రజ్ఞక. 3. గలిగి 4. జయంబు
ప్రజ్ఞక.

తే. యమనియమములు [1]నాసనప్రాణనియతి
ధ్యానమును ధారణంబుఁ బ్రత్యాహృతంబు
నన సమాధియుఁనాఁగ నష్టాంగకలన
బ్రహ్మయోగంబు విలసిల్లుఁ బద్మనేత్ర 160

తే. దేవి! సద్గురునాథోపదిష్టసరణి
మనుజుఁ డష్టాంగయోగంబు ననువుపఱిచి
యంత నద్వైతభక్తిఁ గృతార్థుఁ డగుచు
నన్నుఁ గని ఘోరభవబంధనంబుఁ బాయు 161

వ. రజ్జుజ్ఞానంబున సర్పభ్రాంతి నివృత్తియగుచందంబున యోగంబున నన్ను నాత్మం గనుకారణంబున నవిద్యానివృత్తి యగు; ననినఁ గృతాంజలియై త్రిపురహర! యోగం బెయ్యది? బ్రహ్మజ్ఞానం బెయ్యది? యానతీవే యనుటయు. 162

తే. శమము దమము తపంబును శ్రద్ధ తాల్మి
మఱి సమాధాన మనఁగ నిర్మలవివేక
సాధనము లాఱు దెఱువులు సంఘటిల్లు
మోక్షమున కండ్రు నిగమార్థమూలవిదులు

తే. బలిమిమై నింద్రియంబులఁ బట్టితెచ్చు
నది సుమీ యిందువదన! ప్రత్యాహరణము
సర్వసంసారదుఃఖప్రశాంతిహేతు
వేకచిత్తప్రకారంబు నిదియ సూవె. 164

వ. ధ్యానంబులు సాకారనిరాకారంబులు ద్వివిధంబులు సూవె. 165

తే. నిర్గుణుని నిత్యశుద్ధుని నిర్వికారు
నాత్మఁ గనుట నిరాకార మనఁగఁ బరగు

---

1. ఆసనమలిదళతయు.

శేషనది చంద్రరేఖాదిచిహ్నధారి
ననుఁ దలంచుట సాకార మనఁగ వెలయు. 166

క. గురుఁడే యభవుఁ డభవుఁడే
గురుఁడని యభవునకు గురునకును భేద మొకం
బరికింపని శిష్యునకే
గురుఁడ నభవుఁడ నయి వానికోర్కులు దీర్తున్. 167

తే. రాజసము మాని శిష్యుండు ప్రకటభక్తి
గురుని గొలువంగఁదగు రాజుఁ గొలిచినట్లు
వినయమొప్పంగ నిశ్శోకవృత్తిసౌఖ్య
నిభృతుఁ డందుఁ ద్రివర్గంబు నీరజాక్షి ! 168

తే. సర్వభూతములందును సమతఁ బూని
సత్త్వవిదుఁ డయి యెవ్వాఁడు సంచరించు
నతఁడు శివభక్తుఁ డాతని నాదరింతు
నెట్టివేళలయందుఁ బూర్ణేందువదన ! 169

సీ. పాపంబు పుణ్యంబు పాథః ప్రపూరంబు
దుర్వారమైనట్టి దుఃఖ మడుసు
కాంతాదిసుఖము సైకతవేదికాస్థలి
కందర్పవికృతులు కరడములును
ప్రాణభయంబు నక్రకుళీరనివహము
చ్చేతోవికారముల్ క్షితిధరములు
బహుళ దారిద్ర్యంబు బడబాగ్నిపిండంబు
విషయాభిలాషంబు విషము గాఁగ

తే. సమధికంబైన సంసారజలధియందు
మునుఁగుచును దేలుచును గడ ముట్టఁబడని

జనులకెల్లను మత్పాదనరసిజములు
తెప్ప[1]యై యుద్ధరించు నిందీవరాక్షి. 170

క. కామ క్రోధావేశ
వ్యామోహాదులు నిజాన్వయాచారంబుల్
వైముఖ్యము నొందించుచుఁ
బామరసంసారజలధిఁ బడుదురు కుమతుల్. 171

క. సుఖములు దుఃఖంబులుగా
సుఖములుగా దుఃఖములను జూతురు గుమతుల్
సుఖదుఃఖసమతఁ జూచిన
నఖిలభవాంభోధిఁ గడుతు రంబుజవదనా! 172

సీ. మనసు గామక్రోధ మదలోభముల కిచ్చి
సడలింతు రన్వయాచారసరణి
నన్వయాచారంబు లట్లు మాసిచనంగ
వర్తింతు రన్యాయవర్తనమున
నన్యాయవర్తనం బది కారణముగాఁగఁ
బడి మునుంగుదు రుగ్రభవపయోధి
భవపయోధిలోనఁ బడియుండి కాంతురు
నరకకూపమున నున్మజ్జనంబు
తే. నిరయమునఁ బెద్దకాలంబు నికృతిఁబొంది
యిలకు వచ్చి జనింతురు హీనజాతి
హీనజాతి జనించి పాపానువృత్తిఁ
బ్రాపు[2]లగుచుందురఁట యధఃపాతమునను. 173

---

1. తెప్ప యాశ్రమములకు. 2. బ్రాపులగు

తే. ఎట్టిహీనాత్మ నకునైన నేన శరణ
మెట్టిపుణ్యాత్మునకునైన నేన దిక్కు
నన్ను వర్ణింపమేలు మానవుల కెందు
సత్య మిది నమ్ము హిమధామచారువదన ! 174

వ. అనిన విని భవానియద్దాని నెఱింగి భవార్ణవంబువలన నిర్ముక్తులై పురాతనయోగీంద్రులు సనకసనందన సనత్కుమార సనత్సుజాతాదులు నిశ్శ్రేయసంబునొంది ; రమ్మహాజ్ఞానంబు సవిస్తరంబుగ నానతిమ్మనిన నమ్మహాదేవుం డిట్లనియె. 175

మాలిని – శమదమపరినిష్ఠా సర్వభూతానుకంపా
సమనిగమనివృత్తిజ్ఞానవృత్తిప్రశాంతుల్
కమలదళనిభాక్షీ ! కల్గినం గల్గునయ్యు
త్తమునకుఁ జిరకాలస్థాయికైవల్యలక్ష్మీల్. 176

తే. చిత్తమునఁ దుష్టియును నతుష్టియును లేక
యొడలిలో నన్యగృహమందు నున్నభంగి
నిస్పృహుండయి యుండంగ నేర్చెనేని
యతఁడు ముక్తుండు పద్మపత్త్రాయతాక్షి. 177

తే. అవని గగ నాగ్ని వాయు జలాదులైన
ప్రకృతిసంభూతముల వికారములఁ బాసి
యన్నిహామూర్తిఁ బొడగాన నొప్పునేని
య[1]తఁడు ముక్తుండు సుమ్ము హైమాద్రితనయ ! 178

వ. నిత్యానిత్యావివేకుండును, నేషణాత్రయవిరహితుండును, సమాధి

---

1. కతఁడు.

షట్కసంపన్నుండును, నంత రరిషడ్వర్గ వివర్జితుండును, నగువాఁడు ముముక్షుండు. 179

తే. తత్పదార్థంబు పరమాత్మ తలిరుబోణి
త్వంపదార్థంబు జీవుండు తలఁచి చూడఁ
దత్త్వ మారయ వేద సూత్రంబులోని
యర్థ మది చిత్తమందున [1]నవధరింపు. 180

తే. ప్రత్యభిజ్ఞాన మనియెడి ప్రత్యయమున
విశ్రుతంబైన యాత్మ భావింపవలయుఁ
బెద్దకాలంబునకుఁ గన్న ప్రియవయస్యు
నానవాల్పట్టి తెలిసినయట్లుపోలె. 181

ఆ. త్రాడు చూచి భ్రాంతి దందశూకం బని
యాత్మవలనఁ దె[2]లిసినట్లుపోలె
వేదశాస్త్రజనితవిజ్ఞానబలమునఁ
దెలివి వడసి యాత్మఁ దెలియవలయు. 182

వ. నిత్యంబు సర్వగతంబు కూటస్థం బేకంబు దోషవర్జితంబు భ్రాంతి వశంబున భిన్నంబై తోఁచు. ఘటాకాశంబు మహాకాశంబు భిన్నంబు గానేర్చునే? జీవేశ్వరులకు భేదం బెక్కడిది? పృథివ్యాప స్తేజో వాయురాకాశంబులు శబ్దస్పర్శరూపరసగంధంబులు [illegible] సారప్రపంచంబు, లేను సదా సాక్షిస్వరూపకుండ నైన జీవుండ నని సమాధినిష్ఠులైన పెద్దలు తెలిసికొని పరమనిర్వృతి ననుభవింతురు.

1. వలవరింపు. 2. దలఁచి. 3. వడని.

సీ. ప్రణవాత్మ వర్ణరూపస్వర్శనామూర్తి
ప్రణవంబు మూఁడక్షరములు గలది
యది పరబ్రహ్మ మేకాక్షరంబున నొప్పు
నది ఋగ్యజుస్సామమందు నిలిచె
ననులోమకము లుదాత్తాది స్వరములు కా
లంబులు వర్ణత్రయంబు లవియు
వర్ణత్రయంబు సర్వంబు నంతర్భావ
మొందుట యది యేమి సందియంబు

తే. గతి నకార ముకార మకారములును
నా[1]దిమాయల జీవాత్మ నాఁటుకొల్పి
జీవు నీశ్వరబుద్ధి భజింపవలయు
ధృతి దఱుగనీక యెప్పుడు మతి వివేకి. 184

సీ. చైతన్య మెప్పుడు సర్వంబు దానయై
విలసిల్లుచుండు నవ్వేళఁగాని
విశ్వభూతములను వీక్షించుఁ దనయందుఁ
బరిపాటి నెప్పు డప్పాటఁగాని
సకలభూతములకు సంతసంబును బొంది
యెపుడు వర్తించుఁ దా నపుడుగాని
యఖిలలోకములకు నధ్యక్షుఁడై కను
నధ్యక్షుఁ డెప్పు డయ్యదనఁగాని.

తే. తన్ను ఁ గేవల మాత్మగాఁ దలఁచి యిష్ట
మతిశయము దృఢముగఁ జూచునపుడుగాని
జన్మదుఃఖజరావ్యాధిశాంతికరము
బ్రహ్మవిజ్ఞాన మూరక పట్టువడదు. 185

---

1. నాత్మ.

తే. జ్ఞానసంపదఁ గాని మోక్షంబు లేదు
కర్మశతమున నేని యో నిర్మలాత్మ!
జ్ఞాన మనఁగ వేందాతవిజ్ఞాన మబల!
యితరవిజ్ఞాన మజ్ఞాన మెంచి చూడ. 1

క. జ్ఞానాభ్యాసం బల్పం
బైన మహాపాతకముల హరియించును గం
జానన! దీపం బించుక
యైనను హరియించుఁగాదె యంధతమంబున్. 1

తే. వహ్నిసందీప్తమై మహావనమునందు
సరసనీరసతరుల భస్మంబు సేయు
బ్రహ్మవిజ్ఞానమును నట్ల ప్రజ్వరిల్లి
శుభము నశుభము నొకటిగా సుడిసి కాల్చు.

తే. జలజపత్త్రంబు తనమీఁదఁ జల్లియున్న
యుదకబిందులతోఁగూడ కున్నయట్లు
బ్రహ్మవిజ్ఞాని తనమీఁదఁ బడినయట్టి
విషయమలమునఁ బడకుండు విమలచరిత!

తే. భక్షితంబైనవిష[1]మెట్లు కుక్షి నఱుగు
విమలమణిమూలమంత్రౌషధములచేత
ననుభవించినవిషయంబు లట్ల యఱుగు
బ్రహ్మవిజ్ఞానమునఁ జేసి పరమమునికి.

శా. పూవుంబోణి! విశా[2]లలక్ష్మిఁ గనుచుం బుష్పంబు మూర్కొం
ణావాద్యంబులు వించు నిష్టమధురాన్నం బర్థి సేవించుచు

1. మెల్ల. 2. విలాస.

న్వావేభంగుల నిల్చు చున్నడచుచు న్నిద్రించుచో నీశ్వరా!.
నీవే కర్తవుసుమ్మటన్నఁ బురుషు న్వేధింప వేదోషముల్. 191

తే. జ్ఞానవైరాగ్యసంపన్నుఁ డైనపెద్ద
నెఱుఁగలేక యపహసించు నెవ్వఁడైన
వాఁడు గాల్పంగబడుఁ దీవ్రవహ్నిశిఖల
రౌరవాదిక ఘోరనా రకములందు. 192

సీ. సజ్జనుండైన దుర్జనుఁడైన మూర్ఖైనఁ
బండితుఁడైన నాతండె ఘనుఁడు
నిరపేక్షుఁ డాతండు నిర్వైరుఁ డాతండు
సమదృష్టియాతండు శాంతుఁ డతఁడు
రాజిల జనులచేఁ బూజగైకొనుమాడ్కి-
నతఁడు దేవతలచే నర్చఁ గాంచు
నతనిపాదాబ్జంబు లంటినభూభాగ
మఖిలతీర్థములకు నభ్యధికము

తే. వానిజన్మంబు జన్మ మవ్వాఁడు సుకృతి
వాఁడు ద్రొక్కిన యిల్లిల్లు వాఁడు దైవ
మేకొఱంతయు లేకుండు నింతి వి[1]నుము
బ్రహ్మవిజ్ఞానమయశీలి భాగ్యశాలి. 193

తే. ఎవ్వనింటికి బ్రహ్మజ్ఞుఁ డేఁగుదెంచుఁ
బ్రియము గారుణ్యమును గల్గి భిక్ష గొనఁగ
వానిఁ బితృదేవతలు హర్షవైభవమునఁ
బొగడుదురు •కేళిన ర్తనాభోగకముగ. 194

1. యెఱుఁగు.

క. అనుభవ పర్యంతమె
వ్వనిచిత్తము తత్త్వవీథి వర్తించు మహా
త్ముని నాతనిఁ బొడఁగనుస
జ్జనులకు నాక్షణమ కిల్బిషంబు లడంగున్. 195

తే. అ[1]న్వయము పావనంబు కృతార్థుఁడతఁడు.
పుణ్యవతి వార్ధివేష్టిత భూతధాత్రిఁ
జెలఁగి యోలాడు నెవ్వని చిత్తవృత్తి
సచ్చిదానందమయసుధాసాగరమున. 196

తే. శ్రద్ధ గురుభక్తి విశ్వాససౌష్ఠవంబు
జరిగెనేఁ గల్గు వేదాంతసంగ్రహంబు
జరుగదా లేదు సత్యంబు సత్య మిదియు
బహువిధోక్తులఁబనయించు బ్రహ్మ మిదియు. 197

వ. ఈయర్థంబులు దేవతాగురువిశ్వాసంబులు గలవారికిఁగాని ప్రకాశింప వని భవానికి భవుఁ డుపదేశించె నని, మంకణునకు వసిష్ఠుండు చెప్పె నని, శౌనకాదిమహామునులకు సూతుండు వివరించె. 198

శా. ఆకల్పస్థిరధర్మ వైభవ దిశాహర్మ్యాగ్ర సంస్థాపితా
స్తోకస్ఫాటికకుంభవిభ్రమధురాశుంభద్య శోమండలా!
రాకాచంద్రమసోవిరాజనవభద్రా! వీరభద్రేశ్వర
క్ష్మాకాంతాగ్రజ వేమభూధవ కృపాసంవర్ధితప్రాభవా! 199

క. లింగనమంత్రిసహోదర!
గంగాధరదివ్యచరణకమలనివాసా!
భంగాపరతంత్ర సమి
ద్రంగార్జున! యిందుధరధరాధరధీరా!

మాలిని—

రవినిభశుభ తేజా! రామమాంబాతనూజా!
దివిజగురుచరిత్రా! దేవయామాత్యపుత్రా!
భువనభవనకీర్తీ! పుష్పకోదండమూర్తీ!
ప్రవిమలగుణసంగా! రాయవేశ్యాభుజంగా!

గద్య :—ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజన విధేయ సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన శ్రీభీమేశ్వర పురాణంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

---

# శ్రీ భీమేశ్వరపురాణము

## షష్ఠాశ్వాసము

శ్రీమహితదక్షవాటీ
భీమేశ్వరపాదపద్మ పీఠాతిరసా
సామర్థ్యసంప్రవృద్ధమ
హామహిమా! బెండపూఁడి యన్నామాత్యా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లని చెప్పం దొణంగె. 2

సీ. వినుము సద్యోముక్తివిభవైకకారణం
బామ్నాయవిద్యారహస్యపథము
దక్షవాటీమహాస్థానమాహాత్మ్యంబు
వెండియుఁ బరిపాటి విస్తరింతు
నాదిలోకేశ్వరి యఖిలతత్త్వేశ్వరి
భోగమోక్షఫలానుభూతిధాత్రి
సంపూర్ణ విజ్ఞానశాలిని కల్యాణి
శైలేంద్రతనయ హస్తములు మొగిచి
తే. పశుపతికి నిట్లు లని విన్నపంబు సేసె
దేవదేవ! జగన్నా! థదివిజవంద్య!
దేవతిర్యఙ్మనుష్యాదిదీనసంస్థ!
యభవ! కృప నాదు విన్నపం బవధరింపు* 3

* ఇట నీక్రింది పద్యము వ్రాతప్రతిలో నధికముగాఁ గానవచ్చుచున్నది.
సూక్ష్మయవ్యయని రవద్య యఘోరరూప (చోద్య?)
భక్తి దండప్రణామంబు పరిఢవించి
కరయుగము మోడ్చి ఫాలభాగమునఁ జేర్చి
ఖేఁదుకొనియెద విను మొక్క విన్నపంబు.

వ. సద్యోముక్తిదం బెయ్యది ? పుణ్యస్థానం బెయ్యది ? యానతిం డను
టయు, జగద్ధితార్థంబుగా నావృషభధ్వజుండు భవాని నభినందించి
యిట్లని యానతిచ్చె. 4

క. సద్యోముక్తికరంబును
సద్యస్సౌఖ్యప్రదంబు సద్యోదురిత
ప్రోద్యమభంగకరంబును
సద్యస్సకలార్థసిద్ధిసంపాదియునై. 5

సీ. దర్శనమాత్రనే దైవతగ్రామణి
జనులకు భోగమోక్షము లొసంగు
నమృతాబ్ధిమధ్యంబునందు నేవేల్పు తాఁ
దుర్వి లింగాకృతి నుదయమొందె
మార్తాండుచే సప్తమౌనిముఖ్యులచేఁ బ్ర
తిష్ఠ గైకొనియె నేదివ్యమూర్తి
యప్సర[1]స్త్రీకటాక్షావలోకన కళా
పాథేయ మెవనికిఁ బ్రాఘుణికము

తే. విశ్వపతిభీమనాథనాథేశ్వరుండు
శివుఁ డతండు వసించు నాక్షేత్రసీమ
నట్టి శ్రీదక్షవాటీ [2]మహాపురంబు
భుక్తిముక్తికి రెంటికిఁ బుట్టినిల్లు. 6

వ. తొల్లి కృతయుగంబున నమ్మహాస్థానంబున సంశితవ్రతులును, త్రికా
లవిహితాచరితస్నానులును, భస్మోద్ధూళితసర్వాంగులును, రుద్రా
క్షమాలికాభరణులును, జటావల్కలధారులును, శంభులింగార్చనా

1. శ్రీ. 2. పురంబునందు

పరాయణులును, నగు మహామునులు పెద్దకాలంబు ఘోరతపంబు సేసిన, నత్తపోధనుల యుత్తమతపంబునకుఁ జిత్తంబునఁ బ్రసాదంబు వహించి మంకణసంకల్ప కల్పవృక్షంబగు నయ్యహి కంకణుండు ప్రత్యక్షంబైన నద్దక్షవాటికాధ్యక్షుని సాక్షాత్కారంబు వీక్షించి పరమర్షులు హర్షోత్కర్షంబు నంది, యందంద దండప్రణామంబు లాచరించి, హస్తారవిందంబులు మొగిడ్చి యిట్లనిరి. 7

గీ. ఓ సదాశివ! యోదేవ! యోమహాత్మ!
యోవిరూపాక్ష! యోమహాదేవ! [1]కరుణ
వరము గృపసేయుమీ దక్షవాటమునకు
మ్రొక్కెదము మేము మీపదాంభోజములకు. 8

క. సద్యోభోగశ్రీయును
సద్యఃకైవల్యవిభవ సౌలభ్యంబు
న్విద్యాసముద్యమంబు న
విద్యా[2]నాశంబు దక్షుపీటికి వలయున్. 9

చ. అనఁగఁ బ్రహృష్టచిత్తుఁ డయి యర్ధశశాంకకిరీటుఁ డప్పు డి
ట్లను దగ నూర్ధ్వరేతసుల కమ్మునిముఖ్యులకు న్విశుద్ధవ
ర్తనులకు నిచ్చితి న్వరము దక్షునిపీటికి దక్షవాటికి
న్ననుపమరత్నపేటికి మనఃప్రమదావహవస్తుకోటికిన్. 10

గీ. ఎల్లకాలంబు నుండెద నిచట నేను
మొదలిమామామ యారామపదమునందు
వెండిగుబ్బలిపై వేడ్క వీడుకొల్పి
మేరునగరాజుపైఁ జాల మెచ్చు వదలి. 11

1. యభవ. 2. భ్యాసంబు.

సీ. అగ్రజుం డైనను నంత్యజుం డైనను
బూఁబోఁడి యైనను బురుషుఁ డైనఁ
బరమమూర్ఖుం డైనఁ బం[1]డితుం డైనను
దారిద్ర్యగుండైన ధనికుఁ డైన
బలవంతుఁ డైనను బలహీనుఁ డైనను
బ్రాయంపువాఁ డైనఁ బం[2]గు వైన
నాస్తికుం డైనను నన్నృతవాదియు నైనఁ
బరగ గార్దభ మైనఁ బంది యైనఁ

తే. గీటకంబైన బకమైనఁ గ్రిమియునైనఁ
బాదపంబైనఁ దృణమైనఁ బ్రాణరహిత
మై రహిని దక్షవనచతుర్ద్వారసీమఁ
బొందుఁ గైవల్యకల్యాణభోగలక్ష్మి. 12

ఉ. ప్రాణవియోగవేళ నరపక్షిమృగాళికి దక్షవాటికా
క్షోణిని దారకంబుఁ బురసూదనుఁ డానతియిచ్చుచుండఁగం
బాణిబిసప్రసూనములఁ బయ్యెద నొయ్యన వీచుచుండు శ
ర్వాణి త్రిలోకమాత బలవన్మరణశ్రమభారశాంతికిన్. 13

తే. తూర్పుదిశకును లవణపాథోధి సీమ
దక్షిణమునకు వృద్ధగౌతమియ సీమ
పడమటికి రాజమాహేంద్రపట్టణంబు
య్యమ్నపతిదిక్కునకు సీమ తుల్యభాగ. 14

వ. ఈక్రమంబున సీమావిభాగంబులేర్పడిన భీమమండలంబు భుక్తిముక్తి
ప్రదంబు. వహ్నిసంయోగంబున శుష్కకాష్ఠంబులు హారణంబైనచం
దంబున దర్శనమాత్రంబునఁ బాపౌఘంబును నది భస్మీభావంబునుం

---

1. పతితుఁడైన. 2. ప్రగ్గుఁడైన.

బొందింపఁ జాలును. ప్రాణవియోగకాలంబున జంతుకోటికిం గాల కంధరుండు తారకబ్రహ్మవిద్యారహస్యార్థం బుపదేశించును. కాని మాత్రంబైన ధనంబును బిడికెఁడు ధాన్యంబైన నిచ్చుదాతకు ననంత ఫలంబు చెందు. శ్రద్ధాసమన్వితంబుగా శివయోగికిం బెట్టిన భోజనం బును,నిచ్చిన వస్త్రంబును,భవబంధవిధ్వంసనంబులు.జపహోమదాన తపోధ్యాన సమాధియోగంబులు గలుగు పుణ్యులకుం గొలఁది లేదు. హిమవత్పర్వతంబునఁ గోటివర్షంబులు తపంబుచేసినఫలంబు ఘటికా ర్థోపవాసమాత్రంబునను, వారణాసియందుఁ గోటిబ్రాహ్మణులకు భోజనంబుపెట్టిన ఫలంబు భిక్షునకు నొక్కభిక్ష యిడినమాత్రంబునఁ, గురుక్షేత్రంబున సూర్య గ్రహణ కాలంబునం దులాపురుషదానంబు చేసినఫలంబు నొక్క భూసురాతిథి యభ్యాగతి శివయోగులకుఁ బెట్టిన భోజనమాత్రంబునను,దక్షవాటికా పుణ్యక్షేత్రంబున సంభవించు.15

తే. భీమలింగంబు త్రిభువనస్వామి యెపుడు
సన్నిధానంబుగైకొని యున్నకతనఁ
దీర్థములలోన నుత్తమతీర్థ మయ్యె
దక్షిణానందవనవాటి దక్షవాటి. 16

తే. ఘనత శివగంగయును రుద్రగంగ యనఁగఁ
గూపములు రెండు దక్షవాటీపురమున
మొదలియది పాపముల నెల్ల నుదుకఁ జాలు
నొకటి పితృదేవతలఁ దృప్తి నునుప నోపు. 17

ఆ. అని వరంబు లిచ్చి యంతర్హితుం డయ్యె
నిందుమౌళి ఋషుల కెట్టయెదుట
వార లొంనమశ్శివాయ యంచుఁ బఠించి
రొక్కమొగిని దిశలు పిక్కటిల్ల. 18

సీ. పంచాక్షరీ మంత్రపారాయణంబులు
పఠియించుచును స్పష్ట[1]ఫణితితోడ
నెచ్చటి కేఁగితో యెఱుఁగక యున్నార
మెచటికి విచ్చేయ కిచట నుండు
మనుచుఁ బ్రార్థింపఁగ నాఁగాక యని పల్కి
ఋషులు చూడఁగఁజూడ నిందుధరుఁడు
భీమనాథేశ్వరు కామితార్థప్రదు
కామితదివ్యలింగంబుఁ జొచ్చె
తే. మెఱుఁగు మెఱచినపగిదిని మెఱయ దీప్తి
నద్భుతంబును బొందిరి యపుడు వారు
గౌరి యిది భీమలింగంబు గౌరవంబు
దక్షవాటీపురీమహాస్థానమునను. 19

వ. అనంతరం బమ్మునీశ్వరులు నియమశ్రద్ధాతాత్పర్యంబు లొప్ప సప్తర్షి
సమానీతయగు గోదావరిఁ గనుంగొని పరమానందంబున. 20

శ్లో. దేవి శంభో ర్జటాజూటనివాసిని శివప్రియే
లోకరక్షణకార్యార్థ ముద్భూతాయై నమోస్తు తే 21

శ్లో. ఏకేనైవ స్వరూపేణ భీమనాథస్య సన్నిధౌ
సదా సన్నిహితా స్యత్ర గోదావరి నమోస్తు తే. 22

క. అని సంస్తుతించి యందఱు
మునిగణములు మంకణముని మునుకొని వికచ
త్కనకారవిందసౌరభ
ఖనియగు నయ్యేటినీటఁ గౌతుక మొప్పన్. 23

---

1. దేవ.

తే. అఖిలకాలంబు నొకప్రవాహంబుతోడ
భీమలింగంబు సేవించి బెరసి ప్రేమ
యొరసి మది నుబ్బి పాతాళ మొరసి హోరి
సప్తసింధువు మున్నీటి సంక్రమించె. 24

తే. భీమలింగంబు ప్రోల గాంభీర్యసలిల
పూర మగుచుండు నేకాలమును సమృద్ధిఁ
దనిపి తగఁ బాఱుచుండు నిత్యమ్ము ఘన ము
దారజలనిధి సప్తగోదావరంబు. 25

ఉ. ఏట మునింగి లేచి పరమేశ్వరమందిర సౌధవాటికా
హాటకకుంభమున్ గని షడక్షరమంత్రము జిహ్వఁ గూర్చి వా[1]
చాటత సత్యతత్త్వుఁ డగుశాంభవయోగివరేణ్యుఁ డేల జం
జాటపు సంసృతిం బొరలి చచ్చుచుఁ బుట్టుచు నుండుఁ బార్వతీ! 26

చ. కొడుకులు నీవు నేఁ బ్రమథకోటి విరించి సరోజలోచనుం
డుడుగణరాజ ఖేచర మహోరగకిన్నర సిద్ధసాధ్యు లె
ప్పుడుఁ గొలువంగ వైభవము పొంపిరివోవఁగ దక్షవాటి నుం
డెడుశివు భీమనాయకుఁ దటిన్యవతంసు భజింప మేలగున్. 27

క. సప్తాశ్వసంప్రతిష్ఠుని
సప్తమునీశ్వరప్రధానసంస్థితు నంత
ర్గుప్తస్వరూపుఁ ద్రిభువన
గోప్తను భీమేశ్వరేశుఁ గొలువుము తరుణీ! 28

వ. భీమనాథమహాస్థానంబు సర్వకామార్థ సాధకంబు. సంవత్సరంబును గొలువ ముక్తిప్రదాయకంబు. సూర్యుండు మేషరాశియందుఁ జిత్తానక్షత్రంబున వసియించియుండు చైత్రమాసంబున సప్త గోదావరంబునఁ బ్రాతస్స్నానంబు చేసి యథాశక్తి విప్రులకుఁ దగిన

1. నిశ్చాటు యథార్థతత్త్వుఁడగు.

దానంబు లొసఁగి భీమనాథుండ నగునాకు నమస్కారాభిషేక పూజా నైవేద్యంబులాచరించి, నరుండు నక్తభోజి యయ్యును, నట్లే భానుండు వృషభరాశియందు విశాఖానక్షత్రంబు నాశ్రయించియుండు వైశాఖ మాసంబునను, ప్రభాకరుండు మిథునంబునందు జ్యేష్ఠానక్షత్రంబు నందు నిలిచియుండు జ్యేష్ఠమాసంబునను, రవి కర్కాటకంబున భగదైవతంబైన[1] నక్షత్రంబున నాషాఢ మాసంబునఁ గూడి యుండఁగను, శ్రావణమాసంబున శ్రవణ నక్షత్రంబున సింహరాసియందు మార్తాండుఁడు నిలిచియుండఁగను, భాద్రపదమాసంబునఁ బూర్వాభాద్రా నక్షత్రంబునఁ గన్యారాశియందు భానుండుండఁగను, నాశ్వయుజమాసమున నశ్వినీనక్షత్రంబునందుఁ దులారాసియందుఁ జిత్రభానుండు నిలిచియుండఁగను, గార్తిక మాసంబునఁ గృత్తికానక్షత్రంబున వృశ్చికరాశిని సూర్యుం డుండఁగను, మార్గశీర్షమాసంబున ధనూరాసియందు మృగశిరానక్షత్రంబున నభోమణి యుండఁగను, బుష్యమాసంబునఁ బుష్యమీ నక్షత్రంబున మకరరాశియందు లోకబాంధవుఁ డుండఁగను, మాఘమాసంబున మఘానక్షత్రంబునఁ గుంభరాశియందు మిహిరుం డుండగను, ఫాల్గునమాసంబున నుత్తరానక్షత్రంబున మీనరాశినిం దినకరుం డుండఁగను బూర్వోక్తప్రకారంబున శైవవ్రతాచారంబులు నడిపినమనుజుండు పాతకంబులవలన విముక్తుం డగును. వెండియు యజ్ఞతీర్థంబను తటాకంబు, సకలతీర్థరాజంబు. 29

సీ. మేషరాశిస్థుఁడై మిహిరుఁ డుండఁగఁ బర్వ
తిథిస్నాతుఁ డగుచుఁ దత్తీర్థమందుఁ
దనయథాశక్తిఁ గాంచనము విప్రుల కిచ్చి
పాతకంబులఁ బాయుఁ బంచజనుఁడు

1. తారయైన.

వృషభంబునం దట్ల వెండిమార్తాండుండు
మిథునరాశిం దగ మెచ్చు మీఱు
స్థితిఁ గర్కటకరాశిఁ గృతసప్తగోదావ
రాభిషేకుఁడు దోష మపనయించుఁ

తే. దప్పు కాషాఢసితచతుర్దశిని సింహ
కన్యలను సూర్యసంగమకాలమునను
జన్మతారలయందున సంధులందు
యజ్ఞకుండపయస్స్నాన మఘహరంబు. 30

తే. భానుమంతుండు తులమీఁదఁ బవ్వళింప
యజ్ఞకుండతటాకంబునందుఁ గ్రుంకి
బ్రహ్మహత్యాదులైన పాపనిచయములఁ
బంచబంగాళముగఁదోలుఁ బంచజనుఁడు. 31

క. ఆదిత్యుఁడు వృశ్చికమునఁ
బాదం బిడినట్టివేళఁ బావనతిథి సూ
ర్యోదయమున యజ్ఞతటా
కోదకమునఁ గ్రుంకి మనుజుఁ డోడుచు నఘంబుల్. 32

తే. ఇనుఁడు కోదండరాశియం దెక్కి యుండ
రుద్రనక్షత్రమునను మర్త్యుండు నియతి
యజ్ఞకుండపయస్స్నాన మాచరించి
సృ[1]ష్టిఁ బోఁద్రోలు పాతకశ్రేణి నెల్ల 33

తే. మకరరాశిస్థుఁడై భానుమంతుఁ డుండఁ
బుష్యనక్షత్రమునఁ బ్రొద్దు పొడుచునపుడు

1. సృష్టిలో

భానువాసరమున యజ్ఞభద్రసరసిఁ
గ్రుంకి పాతకచయముల పొంక మణఁచు. 34

క. మాఘమునఁ గుంభరాశి ని
దాఘద్యుతి యుండ సప్తతాపసవాహి
న్యోఘమున మునుఁగు నరుఁ డఖి
లాఘవిఘటితుఁ డగుచుండు హావఘోఘిన్. 35

తే. ఫాల్గునంబున నుత్తరా[1]భాద్రయందు
మీనరాశిని సూర్యుండు మెలఁగుచుండ
సప్తగోదావరాభిషేచనము సేయఁ
బాతకవ్రాతముల నెల్ల భంగపఱచు. 36

మ. ప్రతివేళం దగ మర్త్యుఁ డీక్రియఁ జరింపం బాడి యంగీకృత
వ్రతుఁడై దక్షిణకాశియందు బహుళస్వర్గాపవర్గార్థమై
శితికంఠప్రియమందిరం బయిన యీ[2]క్షేత్రంబునం దెచ్చటన్
మృతుఁడై యున్న నరుండు పొందు గమికర్మీభూత కైవల్యమున్. 37

క. కనకం బణుమాత్రంబై
నను దక్షారామనగరనైకటిక మహా
ముని సింధువుదరి దానం
బొనరించుట మేరుదాన మున్విం దలఁపన్. 38

తే. వర్తనం బెల్ల శంభుసేవావ్రతంబు
మాటలెల్లఁ బంచాక్షరీమంత్రరాశి
భోగమోక్షనివాసైకభూమి యైన
దక్షపురి నున్నజనుల కోతలిరుబోణి. 39

---

1. ఫల్గునినిని 2. సుక్షేత్ర

వ. దాక్షారామ మాహాత్మ్యంబ వాఙ్మానసగోచరంబు. భీమనాథ మహాదేవదివ్యశ్రీపాదపద్మసేవావ్రతంబువలన నెట్టిపాపకర్ముండును భోగమోక్షపదవీసామ్రాజ్యపట్టాభిషేక మహాదివ్యపదవి నొందు. సర్వశాస్త్రసిద్ధాంతమతాంతరంబులకు సమ్మతం బైన యిమ్మహాస్థానం బేకవటీభూతంబు; సద్యోముక్తిప్రదంబు; సద్యః పరిజ్ఞాన సదనంబు; సద్యఃకళాసమృద్ధిపదంబై యుండు నని దయార్ద్రమాన సుండై వృషభధ్వజుం డాదేవి నుద్దేశించి, పార్వతీ! నీ వడిగిన యర్థంబు సర్వంబు సమర్థించితి; చిత్తంబున నవధానంబు సేయు మనినం బతికిఁ గరంబులు మొగిడ్చి మ్రొక్కి, భవాని హర్షోత్కర్షంబు నొందె. నీరహస్యం బేనును గురుముఖంబున నెఱిఁగి ప్రసంగ వశంబునం బ్రహ్మవేదులగు మీకు నుపదేశించితి. 40

శా. సద్యోముక్తి పదంబు దక్షనగరీస్థానంబు విశ్వేశ్వరుం
డాద్యుం డవ్వయుఁ డానతిచ్చె; నిది వేదార్థంబు సద్యోవిము
క్త్యుద్యోగం బనుపేక్ష్యమైన నదిసుం డొండొక్కతీర్థంబు పు
ష్పోద్యానం బనఁ గాలమందుఁగడుప న్యోగ్యంబు భావింపఁగన్. 41

వ. మఱియు భీమలింగమాహాత్మ్యంబు భవకలుషనాశనంబు. బ్రహ్మ విష్ణుపురందరాదులకుఁ గల్పకోటి శతంబులనైన వచియింప నలవి గాదు. ఐనను నానేర్చువిధంబున నింక వర్ణించెద. 42

తే. భువనములు మూఁటియందును బొబ్బ[1] లిడుచు
నంతదాఁక నె యితరతీర్థాదు లెల్ల
నపుడు భేదంబు లేదని రవనిమీఁద
దక్షవాటీపురీభీమధామమహిమ. 43

---

1. [illegible]విడుచు.

సీ. దక్షుండు[1]పొట్టేలితల ధరించిన యప్డు
భారతిముక్కు గోల్పడినయపుడు
పూషార్కువదనంబు బోసివోయిన యప్డు
విష్ణునిచక్రంబు విఱిగినపుడు
అగ్నినాలుక లేడు నొడుమాసినయప్పు
డుడురాజు[2]పొట్టగు జ్జుఱికినపుడు
జన్నంపుటిఱ్ఱిమస్తకము ద్రెళ్ళినయప్డు
వడి దక్షుతల చిచ్చువడినయపుడు

తే. ప్రాణభయమున ముక్తి సంభ్రమము మెఱయ
నమ్మహోత్పాతకాలంబునందు మునులు
దైత్యగంధర్వసిద్ధ విద్యాధరులును
నేమమునఁ గొల్తు రెవ్వాని నెమ్మనమున. 44

సీ. దుగ్ధాబ్ధి మంథనోద్భూత హాలా హల
[3]జ్వాలన మేచకకంఠ! శరణుశరణు
గిరిచాపనిష్ఠ్యూతహరిశిలీముఖదగ్ధ
పురగోపురాట్టాల! శరణు శరణు
సింధురాంధజలంధ రాంధక వ్యాఘ్రాది
సురకంటకధ్వంస! శరణు శరణు
విలయసంధ్యాకాల వికటతాండవకేళి
జర్జరబ్రహ్మాండ! శరణుశరణు

తే. శరణు ఖేచర దేవతాసార్వభౌమ!
శరణు త్రైలోక్యసతతరక్షాధురీణ!

1. పొట్టిఱ్ఱి 2. పొట్టి. 3. జ్వాల.

శరణు దక్షిణకాశికాస్థాననిలయ!
శరణు భీమేశ! శంకర! శరణు శరణు. 45

క. హర! సర్గస్థితినాశన
కర! సంసారా²బ్ధితరణ ఘనతరచరణాం
బురుహప్లవ! రక్షింపుము
శరణాగతు లైనమమ్ముఁ జంద్రాభరణా! 46

క. అపరాధశతము లోఁగొను
మపరిమితకృపావిధేయ! యార్తశరణ్యా!
త్రపుసీకుసుమాభరణా!
కపర్ది! జటాజూటకోటిఘటితశశాంకా! 47

తే. సుప్రకాశుండ వగుము విశ్వప్రకాశ!
శర్వ! సర్వేశ! త్రిపురభంజన! గిరీశ!
యనుచు నందంద యందఱు నభినుతింప
నచట భీమేశ్వరేశ్వరుం డభవుఁడపుడు. 48

ఉ. సన్నిధిచేసి వారలకు శాక్వర³కేతుఁడు సుప్రసన్నుఁడై
యెన్నిక కెక్కఁగా వరము లిచ్చె ననేకము లింతనుండి నా
మన్నన దక్షవాటిక సమస్తమహీవలయంబులోన నా
పన్నగరాజరాజపదభాజన మయ్యెడు నెల్లకాలమున్. 49

క. ఈదక్షారామమునకు
మేదినిఁ గల తీర్థకోటి మిగులక యుండున్
మేదురకరుణాగరిమను
సాదరముగ ఖచరసిద్ధజనహితబుద్ధిన్. 50

1. సంసారాబ్జచంద్ర. 2. శాక్కర.

తే. దక్షుఁ గీర్తించి యాచంద్రతారకంబు
దక్షవాటిక సకలతీర్థంబులందు
నుత్తమంబుగ వర మిచ్చి యుందు మిచట
నేర్పుగను నేరికిని ముందు నేను నుమయు. 51

సీ. యజ్ఞకుండంబునయందుఁ దీర్థం బాడుఁ
బాయ కెవ్వండు నాభక్తుఁ డతఁడు
గ్రుంకు తేపులు సప్తగోదావరంబునఁ
బాయ కెవ్వండు నాభక్తుఁ డతఁడు
ద్వాదశక్షేత్ర యాత్రావిధాన మొనర్చుఁ
బాయ కెవ్వండు నాభక్తుఁ డతఁడు
దక్షవాటీమహాస్థానంబునం దుండుఁ
బాయ కెవ్వండు నాభక్తుఁ డతఁడు

తే. తెరవు నడిచెడువారికి నిరవుచేసి
ధాన్యములు నెయ్యి నూనె వస్త్రములు లవణ
మాదిగాఁ గల యాత్రాపదార్థసమితిఁ
బాయ కెవ్వండు పెట్టు నాభక్తుఁ డతఁడు. 52

క. మాటలు వేయియు నేఁటికిఁ
జాటించె న్నివుడు వేడ్క జగములలో ము
న్నీటిదరి దక్షవాటికి
సాటిగఁ దీర్థములు లేవు సత్యము సుండీ! 53

తే. బ్రహ్మవిద్వాంసులకు పాశుపతయతులకుఁ
బెట్టు ధనధాన్యవస్త్రాన్నభిక్ష మెవ్వఁ
డక్షయగుణంబుగాఁగ నీ దక్షవాటి
వాని కలవడు నిజము కైవల్యపదవి. 54

తే. చప్పరం బొండె గుడి యొండె జవిక యొండె
గలుమరం బొండె నిల్లొండె గట్టిపెట్టి
బ్రహ్మయోగీశ్వరుని నుంచు భక్తి నెవ్వఁ
డతఁడు మాన్యుండు పూజ్యుండు నతులితముగ. 55

వ. తొల్లి జలంధరగంధగజపుండరీకాంధకాసురాదులగు మహాదైత్యులు భువనత్రయం బాక్రమించిన, శక్రుండు భయభ్రాంతుండై, దేవగణ దేవముని సిద్ధసాధ్య విద్యాధరోరగ గరుడగంధర్వ కిన్నరకింపురు షాదులం గూర్చుకొని బ్రహ్మకు విన్నవించిన, విరించియు వారిం దోడ్కొని పాలమున్నీటిలో ఫణిరాజతల్పంబుపైఁ బవ్వళించిన పాంచ జన్యధరునకు విన్నపంబుచేసి సంస్తుతించినఁ గైటభారి హాటకగర్భుని విన్నపంబవధరించి, చింతాభరంబున నొక్కింతదడ వూరకుండి, పుండరీకాసనుం జూచి యిట్లనియె. 56

తే. వీరభద్రుండు చక్రంబు విరిచి దక్ష
యాగముననాఁడు భక్షించె నాగ్రహమునఁ
జెఱుకు శర్కరపాకంబు చేసినట్టి
చక్కిలముఁబోలె ఛటఛటా శబ్దమొప్ప. 57

ఉ. కోపముచిచ్చునం బడిన కూరిమితల్లిబుణంబు దీఱ ను
ద్దీపతరాగ్రహంబునను దేవతలం గడు భంగపెట్టఁగా
నేపున నేను మార్కొని పయిం బరతెంచినయంతమాత్రలో
ఝూ పరమేశ్వరా! యనుచుఁ జక్రము మ్రింగిన నోహటించితిన్. 58

తే. తెగువ దక్షునికంఠంబు ద్రెవ్వ నేసి
వ్రేల్చెఁ దల నధ్వరాగ్నిని వీరభద్రుఁ

డాప్రజాపతి మెడపైని నాక్షణంబ
నగుచుఁ [1]బొట్టేలితల దెచ్చి నాటుకొలిపె. 59

వ. అప్పు డవ్వీరభద్రుని తేజోవిశేషంబును గనుఁగొనఁ గన్నులు మిఱు
మిట్టుగొన నెఱచఱచి, వెలుంగు డించి తొలంగితి; నాట
నుండియు. 60

శా. పట్టం గయిదువు లేక విన్ననవు నాబాహార్గళు ల్బాఁడుఁడా!
యిట్టుం గాక సురేంద్ర! బాధపడి మీ రిబ్భంగి దుఃఖింపఁగాఁ
గట్టా! హో! యిటు మిన్నకుండుదురె? శీఘ్రం బిప్డు భీమేశ్వరున్
ముట్టం గొల్చెదఁ జక్రలాభమునకై ముగ్ధేందుచూడామణిన్. 61

అని పలికి నళినసంభవేంద్రాదులగు నిర్జరులతోడం గూడి సరోరుహా
క్షుండు దక్షారామంబునకు వచ్చి, శివగంగాకూపంబునఁ ద్రిషవణ
స్నానంబు చేసి, భస్మోద్ధూళితగాత్రుండును ద్రిపుండ్రాంకితమస్తకుం
డును రుద్రాక్షమాలికాధరుండును జటావల్కలసంయుతుండును నై
నిత్యంబును సహస్రపద్మంబులఁ బూజ గావించుచు, భీమనాథేశ్వ
రేశ్వరు సేవించుచుండె; నంతఁ గొంతకాలంబునకు. 62

క. ఈభంగి వేయిదమ్ముల
నాభుజగాభరణు నెప్పుడర్చనసేయన్
శ్రీభీమేశుండు కమల
నాభుని మన మరయ నొక్కనలినము డాఁచెన్. 63

సీ. తొంబనూఱును దొంబది తొమ్మిదియును
జలజములు పూజచేసెను శార్ఙ్గపాణి
వేయిటికి నొక్కపద్మంబు వెలితియైన
నహహ? నియమంబునకు భంగ మయ్యె ననుచు. 64

---

1. పొట్టేలు.

చ. కటకకలాపసంఘటితకమ్ర [1]మణిద్యుతిపాటవంబునన్
జిటికినవ్రేలిగోరఁ గొని చిఱ్ఱునఁ దీ[2]సినలోచనంబు
ప్రస్ఫుటకమలంబు వేగ హరి పూన్చెఁ దటుక్కున దక్షవాటికా
కటకవిలాసినీవిటశిఖామణికి న్హరిణాంకమౌళికిన్.

క. కైటభవిరోధి భక్తిర
సాటోపం బెసఁగ వనరుహా[3]వళినియతిం
బాటించి భీమనాథుని
హాటకపదపీఠి లోచనాబ్జము పెట్టెన్.

మ. నిడువాలుం గుడికన్ను పాదములపైఁ నేమంబుతోఁ బెట్ట న
ప్పుడు ప్రత్యక్షము పొంది నీలగళుఁ డంభోజాక్షునిం జూచి నేఁ
గడు హర్షించితి నిచ్చెద న్వరము వేఁ గైకొమ్మనా నమ్రుఁడై
యడిగె న్శౌరి జగత్త్రయోద్ధరణలీలావక్రమున్ జక్రమున్.

తే. భీమనాథుండు త్రిభువనస్వామి యిచ్చె
నస్త్రకులదైవ మన నొప్పు నాయుధంబు
హరికి నట మున్న యిచ్చెఁ జంద్రార్ధమౌళి
వికచపద్మోపమంబైన వెడఁదకన్ను.

వ. ఇవ్విధంబున శ్రీభీమనాథమహాదేవునివలనం జగద్విజయం బ
చక్రాయుధంబు వడసి, కోటిసహస్రమార్తాండమండల తేజఃప్ర
ప్రభావభాసమానంబైన యారథాంగంబున మున్ను చెప్పం
విబుధవిరోధుల ఖండించి, యింద్రాదిప్రముఖనిఖిలబర్హిర్ముఖ
తంబునకుఁ జేతఃప్రమోదం బాపాదించె; నిది యమ్మహాదేవ
మహిమంబు.

---

1. కమ్రమణిక 2. దీసెను 3. వనరుహాలోకనముద్ఘాటించి.

క. శివగంగాజలముల నా
ప్లవనం బొనరించినట్టి పరమాత్ములు త
ద్దివసమున భీమనాథుని
నవలోకింపంగఁ గలుగు నభిమతసిద్ధుల్. 70

తే. మదనవిధ్వంసితిరుచుట్టుమాలెయందు
దక్షిణపుదిక్కునందు మాధవుని గాంచి
రహిని వేడుక విఘ్నాధిరాజుఁ జూచి
మనుజుఁ డిష్టార్థసిద్ధిసంపదల నొందు. 71

తే. అష్టమీభానువాసరంబందు నొండె
నొండెనేని చతుర్దశి నిండుభక్తిఁ
బూజ గావించి యెవ్వఁడే భూమి నున్న
దుర్గ సేవింప దురితంబు దొలఁగు నండ్రు. 72

క. తాండవభవువీక్షణమున
ఖండేందుశిఖావతంసు గట్టెదుటుగఁ దా
నుండెడు గౌరిని మంచుం
గొండసుతం బూజసేయఁ గోర్కులు [1]నిండున్. 73

సీ. భూర్భువస్స్వర్లోకములు మూఁడు భేదించి
బ్రహ్మాండభాండకర్పరము దాఁకఁ
బెరిగి దిక్చక్రంబు పిక్కటిల్లఁగఁ బట్టి
బలిసి కుప్పసముతోఁ బాముఁబోలె

1. నిగుడున్.

నిరవకాశంబుగా నిత్యసన్నిహితంబు
నురు[1] లింగమూర్తితో నుబ్బి యుబ్బి
భీమనాథుండు మహాభీమాద్భుతప్రౌఢి
బహువిరాడ్రూప విభ్రాజియైన

తే. భయమునుం బొంది దేవత ప్రస్తుతించి
యయ్య! నీరూప మింతింత యనఁగ రాదు
ఏది మొద? లేది కడపల? యేది మధ్య?
మెట్టు నినుఁ బూజసేయుదు మిందఱమును. 74

వ. అనినం గరుణాసామ్రాజ్యపట్టాభిషిక్తుం డగు నాజగజెట్టి వేల్పు బ్రహ్మాండగోళంబునకు మిక్కుటంబుగాఁ బెరిగిన దేహంబుఁ బొట్టిచేసి, తిరుచుట్టుమాలెలోన గౌరీజనార్దన రుద్ర కేశవ వినాయక దుర్గా తాండవేశ్వర నృత్యభైరవు లను దేవతాసప్తకంబు పరివేష్టింప, సకల లోకానంద కరపరదారగమన పాపహరేశ్వరులు నైఋతిభాగంబున నధివసింప, నంతర్గర్భగృహంబులోపల మాణిక్యాదేవీసహితుండై, సలిలనిధి వృద్ధగంగా [2]కాంతేయీసరి త్తుల్యభాగా హేలానదీ సప్తగోదావరమాతృకాపరివృతమండలంబున మధ్యమలోకభాగధే యంబును, విబుధగంధర్వ పతాకావేదియుఁ, బరిసరోద్యానవాటికా సరసకాసారకతోరకుహాళీపాళికా కుసుమధూళీమధూళికా సార భాసారసంవాసిత దశదిశాముఖంబును, మఖకుండితటాకసముద్దండ పుండరీకషండమకరందబిందుగంధూషావ్యగ్ర సమ్ముదగ్ర మధుప మండలాహంకార ఝుంకారకోలాహల కరంబిత మకరధ్వజ భుజా దండమండలీకృత కుసుమకోదండ శింజినీటంకారంబును, నాఖండ లాది దిక్పాలకభరిత కలితగోపురప్రాంగణంబును, బాదుకాఖడ్గ

1. నుడు. 2. కౌశికీ.

ఘుటికా రసరసాయన మూలికాంజనాకర్షణాదృశ్యాది విద్యాసిద్ధి క్షేత్రంబును, నత్ర్యాత్రేయాగస్త్య హారితాంబరీ షాసిత భార్గవ పరాశర పారాశర్య మాండవ్య మార్కండేయ మౌద్గల్య మంకణ శౌనక శాండిల్య మందపాల వత్స వసిష్ఠ వాధూలస వాలఖిల్య కౌండిన్య కాశ్యప కణ్వ గాలవ గాధి గార్గ్య ప్రముఖవాలఖిల్యాద్యష్టాశీతిసహస్రసంయమిసమాకీర్ణంబును, గర్ణికారాబింకాకరకమలపుట ఘటిత కనత్కనకమణిమయ డమరుక ఢమఢమధ్వాన పర్జన్యగర్జా సముజ్జృంభిత గుహాశిఖండితాండవంబును, మార్కండేశ్వర కుండలా ముఖసంవేద్యాంత ర్వేది చాళుక్యభీమేశ్వర ప్రధాన నానావిధ శాఖోప శాఖాఖతీర్థ సంబాధసంభరితంబును నై, యఖిలభువనభవనాభిరామం బైన దక్షారామంబును గైలాసమేరుమందరంబులకంటెను గాంచీ చిదంబర కాళహస్తి కాశీ శ్రీశైలాది మహాస్థానంబులకంటెను, సేతు కేదారంబులకంటెను నతిశయంబుగాఁ జేసి, నాక్షేత్రంబును మరగి, గరళకూటకృపీటభవజ్వాలావష్టంభంబు సంస్తంభించి, త్రిపురదైతేయ మదవతీగండభాగ మకరికాపత్త్ర భంగంబులు దొలంగించి, భీమలింగంబు సర్వమంగళాదేవియుం దానును లోకరక్షణార్థంబుగా నధిష్ఠించియుండును. 75

తే. దేవదర్శనమాత్ర సంధిల్లు భుక్తి
కొందఱకు దక్షవాటికాక్షోణియందు
దేవదర్శనమాత్ర సంధిల్లు ముక్తి
కొందఱకు దక్షవాటికాక్షోణియందు. 76

తే. గీతవాదిత్రనృత్యంబు కేవలంబు
శంభునకు సర్వకాలంబు సంభవింప
నప్సరస్త్రీల నర్పించె నాఱునూఱు
బాలలను యువతుల జంభభంజనుండు. 77

శా. ఆవంశంబున సానికూఁతులను దివ్యస్త్రీలు దుగ్ధాబ్ధి మ
ధ్యావిర్భూతలు మీనకేతనునిపుష్పాస్త్రంబు లెక్కాలమున్
సేవాదక్షతఁ గొల్తు రిందుధరునిన్ శ్రీదక్షవాటీశ్వరున్
గైవల్యాధిపు భీమనాథుని లసత్కారుణ్యపాథోనిధిన్. 78

వ. మఱియు మహనీయ దేవ గంధర్వాప్సరోవేశ్యాజాతి సంజాతకాంతా చికురతిమి రాంగసుమంగళవిభావరీ లలాటశశికళావిలాస ద్వితీయ భ్రూలతాలాసికా లాస్యలలితరంగభూమియు, నయనశంబరానుబంధ నవకందర్పపతాకయు, నధరబంధూకకుసుమయు, వికాసవిభ్రమ శరద్వేలాకంబు, కమనీయకంఠయు, బిబ్బోకసరదంబుధర వేణియు, బృథులతాచక్రవాకయుఁ, గరపల్లవస్ఫురణపర్యాయవల్లీమతల్లీపన్నగ పరిషత్తునుం బోలెఁ, బ్రకటితవిలాసమన్మథలీలయుం బోలె రతిసుఖ సంపత్సంపాదన లంపటకుముదినియుం బోలె రాజానుకూలదర్శన కేశ భరంబునఁ గృష్ణవదన వచోమనోహరవశంబున మంజుఘోష,మధ్యం బున మందోదరి, యూరుయుగళంబున రంభ, కనకభూషణధారణం బున రుక్మిణి, సురతకళాకౌశలంబున దక్షిణ, తనువున భద్ర, పుష్పాస్త్రుద్వితీయజన్మభూమి కారుణ్యవతి తారుణ్యవతి కాంతిమతి కమనీయవతి వినయవతి విభ్రమవతి విజ్ఞానవతి ప్రతాపవతి భూషణవతి భూషణ మరీచిజాలాకారవిగ్రహ యగుట విద్యుద్దండంబువలనను, బ్రసవపరి మళహారిణియగుటం బారిజాతకోరకంబులవలనను, నిశ్వాసామోద కారిణియగుట మలయమారుతంబువలనను, నిఖిలేంద్రియామోద కారిణియగుట నటనామృతంబువలనను, మాధుర్యజన్మభూమియగుట నిక్షుకాండంబువలనను బ్రభవించెనో యనఁ బ్రశంసాస్పదంబై యుండు; నవ్వంశంబునం దిందుముఖుల, యాననచంద్రమండలంబులం బులం దభ్యర్ణరోహిణీపాశశృంఖలోద్వృత్తినింబోలె లాంఛనహారి ణంబు ప్రవేశింప వెఱచు; నాచంచలాక్షుల దృగంచలస్ఫురణంబు

లించువిలుకానికిం బంచబాణంబులు; పువ్వులగుట నవ్వుటాలమాట యప్పణంతుల లలాటకస్ఫూరతిలకంబు దర్పకునకు ధవళాతపత్రంబు శశాంకబింబం బనుట బొంకు. ఆ పువుబోణుల కటివంకకనుబొమలె యంగజునకు సింగిణివిం, డ్లల్లచెఱకువి ల్లనుట కల్ల; యత్తొయ్యలుల నెత్తావి యూర్పుగాడ్పులె పుష్పబాణునకుఁ బ్రాణసఖులు. చందనాచలసమీరణంబు సఖుం డనుట యకారణచిత్తప్రత్యావహంబు. అది గావున నుత్తమనాయికా నాయకగర్భజనితలైన యా సానులు సానురాగంబున నీశానుని భీమేశ్వరుని ఘుసృణముకుళితాపాంగంబులు,కుంచితాకుంచితభ్రూలతంబులు, విస్మయోత్పాదనతానకంబులు, ప్రసన్నంబులు, ప్రేమరసపూర్ణత్రపావృతారంభంబులు, నవలలితంబులు, పులకావలికారణంబులు, భావజగర్భితంబులు, వికస్వరంబులు, విస్మృతనిమేషంబులు, నైనవీక్షణంబులఁ దదీయలావణ్యపూరం బాస్వాదించువిధంబు నభిలషించుట దెల్పుచందంబున, హృదయంబు నాకర్షించుచాడ్పునఁ జామరవ్యజనవీటికాకరండ పాదుకాముకురదీపికాసంగీత నాట్యాద్యుపచారసేవావిశేషంబుల ప్రతిసంధ్యంబును బల్యంకికాసేవాబహిర్విజయాది భోగావసరసమయంబుల సేవించుచుండుదురు. 79

తే. దక్షవాటీపురీచతుర్ద్వారములను
భీమమండలి కాపుణ్యభూమియందు
శంభులింగప్రతిష్ఠలు సంఘటించి
యెల్లవేల్పులు ప్రార్థించి రిందుధరుని. 80

వ. ప్రార్థించి శ్రీభీమేశ్వర మహాదేవునివలన నాత్మప్రతిష్ఠితశంభులింగంబులకును వరంబు లడిగిన నవ్విరూపాక్షుండు వారు కోరినట్లు భుక్తిముక్తిప్రదానసామర్థ్యంబులు సర్వలింగంబులకుఁ గలుగ ననుగ్రహించి, 81

తే. సప్తసింధువునకు భీమశంకరునకు
నడుమ నింద్రేశ్వరము పాపనాశనంబు
దృష్టిమాత్రన భుక్తిముక్తిప్రదంబు
దేవలోకాధిపతిసంప్రతిష్ఠితంబు. 82

క. భీమయదేవుని దక్షిణ
భూమీభాగమున యజ్ఞపురుషేశ్వరది
వ్యామృతలింగము భోగ
శ్రీముక్తివిభూతిదాయి సేవకతతికిన్. 83

ఆ. అగ్నికుండ మనఁగ నచ్చోట నున్నది
ధాత్రి భుక్తిముక్తి ధాతృనీవి
దానఁ దీర్థమాడి తర్పణ మొనరింపఁ
బితరు లూర్ధ్వలోకగతులు గంద్రు. 84

తే. కృత్తికాతారకంబులఁ గీలుకొన్న
దినమునం దగ్నికుండికాతీర్థ మాడి
శంభు నగ్నీశ్వరుని జూచుసజ్జనులకు
లలితకరతలధాత్రీఫలంబు ముక్తి. 85

సీ. అగ్నీశ్వరునిమ్రోల నగ్నికుండిక కూప
తటదేశమున నుండు దక్షకుండి
యది సర్వపాపౌఘ మ[1]డఁప ఝంఝానిలం
బాకూపమునకు యామ్యంబునందు

1. మదియ.

దాక్షాయణీదేవి త్రైలోక్యజనయిత్రి
　　చలికొండరాచూలి వెలసియుండు
దక్షకుండమునఁ దీర్థం బాడి యర్థితో
　　దాక్షాయణీదేవి దక్షపుత్రి

తే. నసితపక్షాష్టమీతిథియందు నొండె
మఱి చతుర్దశియందొండె మహితబుద్ధి
చేసి దండప్రణామంబు సేసి నరుఁడు
గాంచు మోక్షంబు ప్రాణనిర్గమనమందు. 86

వ. ఆయుత్తరంబున వీరభద్రప్రతిష్ఠితంబు చెంగట నిరృతిలింగంబు. భీమనాథేశ్వరునకుఁ బడమట వరుణప్రతిష్ఠితంబగు వరుణలింగంబు. వరుణకుండంబునఁ దీర్థం బాడి వరుణనక్షత్రంబున వరుణేశ్వరదేవుని దర్శించిన నరుండు భవబంధనంబులం బాయును. భీమేశ్వరు వాయవ్య దిగ్భాగంబున వాయుప్రతిష్ఠితం బగు వాయులింగం బుండు. వాయు కుండంబునఁ దీర్థంబాడి, వాయులింగంబును సందర్శించిన నరుండు మోక్షలక్ష్మిం గూడు. సోమేశ్వరలింగంబు సోమప్రతిష్ఠితంబు. సోమనక్షత్రంబున సోమకుండంబునఁ దీర్థం బాడి సోమేశ్వరదేవుని దర్శించిన నరుండు భుక్తిముక్తిసంసిద్ధిం బొందు. 87

తే. బాదరాయణుఁ డత్యంత పరమనిష్ఠ
సప్తసింధుసమీపదేశంబునందుఁ
దపము గావించి శంభుసంస్థాపనంబు
చేసె నత్యంతభక్తివిశేష మమర. 88

క. పంచాక్షర మంత్రమును జ
పించుచు సత్యవతిసుతుఁడు పెద్దయుఁ గాలం

బంచితయోగసమాధి భ
జించెం దా సంప్రతిష్ఠ సేసినశంభున్. 89

వ. ఒక్కనాఁ డమ్మహాదేవుండు త్రిగుణమూర్తు లగు బ్రహ్మవిష్ణుమహే
శానులచే సముపాస్యుం డగుచు, బాదరాయణునకుఁ బ్రత్యక్షుఁ
డగుటయు. 90

మ. కురిసెం బువ్వులవాన మత్తమధులిట్కోలాహలాన్వీతమై
విరిసెం దిక్కులు మందమందగతుల న్వీచె న్నభస్వంతుఁడున్
మొరసె న్దుందుభు లొక్కయుమ్మడి నభోమూర్ధావకాశంబునం
బొరసె న్సమ్మద మెల్లలోకముల కప్పుణ్యాహకాలంబునన్. 91

క. ఆడిరి యచ్చరలేమలు
పాడిరి గంధర్వపతులు పరమమునీంద్రుల్
గూడిరి బహువిధములఁ గొని
యాడిరి యందంద నద్భుతావహభంగిన్. 92

క. కొందఱు తాండవ మాడిరి
కొందఱు పరిహాసకేళిఁ గొ[1]ఱలిరి మఱియుం
గొందఱు బాహాయుద్ధం
బందంద ఘటించి రమ్మహాసంఘమునన్. 93

వ. అప్పరమేశ్వరుండు కూడిన యశేషమునులను సర్వయోగీశ్వరులను
సర్వదేవతల నుద్దేశించి, యిట్లని యానతిచ్చె. 94

క. ఈయున్నవార లందఱు
నాయానతి వినుఁడు నెమ్మనంబులలోనం
బాయం బెట్టుఁడు సంశయ
మీయర్థము వేదములకు నెక్కుడు సుండీ! 95

తే. అరుగఁ డెబ్బంగి సభమున కాభరణము
భువనముల కెల్ల నాభంగి భూషణంబు
దక్షవాటీపురము భోగమోక్షవిభవ
పావనం బందు విశ్వాసపరులు గండ్రు. 96

క. త్రిభువనములయందును మా
కభిమతములు పెక్కులైన నారామములం
దభిమాన మింత సేయము
విభవాస్పద మైన దక్షపీటిం బోలెన్. 97

తే. వినుఁడు సత్యంబు సత్యంబు వెండి సత్య
మాత్మలోన విచారించి యానతిత్తు
దక్షవాటంబుకంటెఁ దీర్థంబు నిఖిల
మేదినీమండలంబున లేదు లేదు. 98

తే. వాఁడిగోర్గాండ్రఁ గన్నులు దోడివైన
నడుగు లడిదంబుచేతఁ జక్కడఁచివైన
నొండుకడ కేఁగుటలు మాని యుండవలయుఁ
దక్కుమాటలు దక్షవాటంబునందు. 99

క. తిష్ఠన్మాత్రునకైన వ
సిష్ఠప్రతిమానుఁడైన శిష్టునకైనన్
నిష్ఠాత్మ గలిగెనేనియు
నిష్ఠాకాలంబు ముక్తి నియతం బచటన్. 100

ఆ. బ్రహ్మహత్య మద్యపానంబు గురుతల్ప
గమన మాదిగాఁగఁ గలుగునట్టి
పాతకంబు లిపుడె పాయు మానవులకు
దక్షవాటి భీమదర్శనమున. 101

వ. అని యిట్లర్ధేందుమౌళి యానతిచ్చి యంతర్ధానంబుచేసె; తదనంతరంబ హరివిరించిపురందరాదు లగుబృందారకులును, సనకసనందన సనత్కుమార సనత్సుజాతు లగుబ్రహ్మయోగీశ్వరులును, మార్కండేయ మందపాల మౌద్గల్య మాండవ్య మంకణాదులగు మహామునులును, బాదరాయణు నభినందించుచు నిజస్థానంబులకుం జనిరి. 102

సీ. సప్తగోదావరస్నానంబు రామనా
థావలోకనము పిత్రర్చనంబు
రామగయాపితృశ్రాద్ధంబు గౌరీజ
నార్దన రుద్రసన్నామజపము
పరగ మహాదివ్యభావనానార్చనా
భవనప్రదక్షిణప్రక్రమంబు
పంచాక్షరీమంత్రపారాయణజపంబు
పాశుపతాచార పరమనియతి

తే. సమయ మిది సర్వదేవతాసార్వభౌము
భక్తిముక్తిప్రదాయకు భువనభర్త
భీమనాథేశ్వరేశ్వర స్వామిఁ గొలుచు
భక్తులకు నెల్ల నాగమపద్ధతి యిది. 103

మ. పరదారేశ్వర కుంభసంభవవిభుల్ ప్రాగ్దిగ్విభాగంబులం
బురవిధ్వంసికి దూరదేశమునఁ దాభోగంబున న్నైఋదా
[1]వరుణద్వారమునన్ మహామహిమచే వాయవ్యదిక్సీమ ను
ద్ధరత న్వాయుశివుండు నుండ్రు మిగులం దాత్పర్యశ్రద్ధాళితిన్. 104

1. వరుణాధీశ్వరతన్.

సీ. దక్షవాటీమహాస్థానంబులో లేని
యమరు లేస్థానంబునందు లేరు
దక్షవాటీమహాస్థానంబులో లేని
యర్థ మేస్థానంబునందు లేదు
దక్షవాటీమహాస్థానంబులో లేని
యమృత మేస్థానంబునందు లేదు
దక్షవాటీమహాస్థానంబులో లేని
యజ్ఞ మేస్థానంబునందు లేదు

తే. దక్షవాటిక సకలతీర్థముల కిరవు
దక్షవాటిక సకలవిద్యలకు గరిడి
దక్షవాటిక విభవంబు తానకంబు
దక్షవాటిక శివుని యంతఃపురంబు. 10

వ. ఇట్టి మహామహిమంబుగల దక్షారామంబు నధివసింతము. భీమ
మండలంబు దర్శింతము. సప్తగోదావరమ్మున నాడుదము. వృ
ద్ధగంగాజలంబులం దేలుదము. తుల్యభాగాతోయంబుల మున
గుదము. కణ్వవాహిని నవగాహింతము. కౌంతేయంబు
నోలలాడుదము. లవణపయోనిధి గంగా సంగమంబు
దభిషేకింతము. అని హర్షోత్కర్షంబున రోమహర్షణత
యుండు సూత్యాహసంభవుండు నిఖిలపురాణవ్యాఖ్యానవైశ
సమేతుండైన సూతుండు పల్కిన విని నైమిశారణ్యపుణ్యక్షేత్ర
బున ద్వాదశవార్షికపరిమితంబైన సత్రయాగంబునం గూడి
శౌనకాదిమహామునులు యజ్ఞావసానసమయంబున శ్రీమన్మహ
దేవుని సందర్శింపం జనిరి. ఇది పంచాశత్ఖండ మండితంబును సనత్కు
మారసంహితాది బహుసంహితాసంధానంబును నైనస్కాం

# మనసు ఫౌండేషన్
## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RF HOIB 451 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 6/10/23 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 403 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 2, 17, 154, 157, 267 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hema |
| స్కాన్ చేసినది | Chaithanya |
| పరీక్ష చేసినది | MOUNIKA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |